# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 11 సంచిక : 10 హైదరాబాద్ 147 అక్టోబర్ 2013 పేజీలు : 68 రు. 15

- నిర్భయ తీర్పు - మరణశిక్షే పరిష్కారమా?
- ముజఫర్ నగర్ మతకల్లోలాలు
- కొత్త భూసేకరణ బిల్లు ఎవరికోసం?
- భూసంస్కరణల బిల్లు ముసాయిదా
- ఆంధ్రప్రదేశ్ నదీజలాల పంపిణీ
- తెలంగాణ - సమైక్యాంధ్ర
- సిరియాపై అమెరికా దమననీతి

## ఆర్ ఎస్ రావు స్మారక ఉపన్యాసం, సదస్సు

అరుదైన ప్రజామేధావి, మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రవేత్త అమరుడు ఆర్ ఎస్ రావు సంస్మరణలో ప్రతి సంవత్సరం స్మారక ఉపన్యాసం, స్మారక సదస్సు ఏర్పాటు చేయాలని నిర్ణయించి 2012 నవంబర్ 10-11లలో మొదటి ఉపన్యాసం, సదస్సు జరిపిన సంగతి పాఠకులకు తెలుసు. ఈ స్మారకోపన్యాసం, సదస్సులు సాధారణంగా ఆర్ ఎస్ రావుకు ఆసక్తి ఉండిన, ప్రజా ఉద్యమాల అవగాహనలను వ్యక్తీకరించగలిగిన అంశాల మీద ఉంటాయి. ఆ వరుసలోనే 2013 నవంబర్ 9 శనివారం సాయంత్రం స్మారక ఉపన్యాసం, నవంబర్ 10 ఆదివారం ఉదయం నుంచి సాయంత్రం వరకు సదస్సు ఉంటాయి. గత సంవత్సరం 'కూడలిలో ఉన్నత విద్యారంగం – ప్రత్యామ్నాయల అన్వేషణ' అనే అంశం మీద స్మారకోపన్యాసం, 'సమాజ పరివర్తన' అనే అంశం మీద స్మారక సదస్సు ఏర్పాటయ్యాయి. ఈ సంవత్సరం స్మారక ఉపన్యాసానికీ, సదస్సుకూ ఇతివృత్తంగా 'సమాజ సాహిత్య సంబంధాలు' అనే అంశం ఉంటుంది.

హైదరాబాద్‌లో 2013 నవంబర్ 9 శనివారం సాయంత్రం ఆర్ ఎస్ రావు రెండవ స్మారకోపన్యాసంగా, సాహిత్యంలో సమాజ చలనపు ప్రతిఫలనం అనే విషయం మీద విప్లవకవి వరవరరావు ప్రసంగిస్తారు. ఆ మర్నాడు సమాజ చలనం – సాహిత్యంలో ప్రతిఫలనం అనే విషయం మీద డా. ముదునూరి భారతి ప్రాతిపదిక పత్రంతో ప్రారంభమయ్యే సదస్సులో సమాజ చలనాన్ని సాహిత్యంలో ఎలా పట్టుకున్నాను అనే విషయం మీద అల్లం రాజయ్య, నల్లూరి రుక్మిణి తమ అనుభవాలను పంచుకుంటారు. సాహిత్యంలో సమాజ ప్రతిఫలనం మీద పంకజ్ దత్, షోమా సేన్, స్వాధీన్ పట్టనాయక్, సరోజ్ మహంతి, కాత్యాయనీ విద్మహే, డి సుబ్రహ్మణ్యం, పాణి, కె వి కూర్మనాథ్, యాటెల్లి రామచంద్రం, డి వి రామకృష్ణారావు, ఎన్ వేణుగోపాల్ పత్రాలు సమర్పిస్తారు.

అందరూ ఆహ్వానితులే.

– ఆర్ ఎస్ రావు మిత్రులు

ISSN 2231-6892

147

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

అక్టోబర్ 2013
సంపుటి : 11
సంచిక : 10

| వ్యవస్థాపక సంపాదకులు: | సంపాదకులు: | కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్: | కంపోజింగ్: | సబ్ ఎడిటర్ : | ఆఫీస్ అసిస్టెంట్ : |
|---|---|---|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | వై. రామచంద్రం | సి. రాజశేఖర్ | ఎ. మల్లేశ్ | ఎస్. వెంకటేష్ |

## లోపలి పేజీల్లో...



### అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత



ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం ఆర్థిక స్థితి గురించిన విజ్ఞప్తికి ప్రతిస్పందనగా యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్ ప్రొఫెసర్లు కె. లక్ష్మినారాయణ, ఎన్. పురేంద్రప్రసాద్, జి. సుదర్శన్, ఆర్. విజయ్, టి. రామకృష్ణ, ఎ. రఘురామరాజు, వి. రాజగోపాల్, సి. రాఘవరెడ్డి, ఆర్.వి. రమణమూర్తి, కె.సి. సూరి, బి. చంద్రశేఖర రావులు రు. 32,500 ఆర్థిక సహాయం అందించారు. 'ఇపిడబ్ల్యు, ఫ్రాంటియర్ లాంటి సామాజిక పత్రికల పోలికలతో వస్తున్న వీక్షణం పత్రికను పదికాలాల పాటు కాపాడుకోవాల'నే బాధ్యతతో వీక్షణం శ్రేయోభిలాషి ఒకరు రు. 10,000 ఆర్థిక సహాయం అందించారు. ఆర్థిక సహాయం అందజేసిన వారందరికీ కృతజ్ఞతలు**

సూర్యకుమారి అనే పాఠకురాలు 'శ్రమ శక్తి ఉపయోగపు విలువ' వ్యాసం గురించి ఒక ప్రశ్న అడిగారు (ఆగస్టు 'వీక్షణం'లో). శ్రామికులకూ, పెట్టుబడిదారుడికీ ఉండే సంబంధంలో 'అమ్మడం – కొనడం' అనే మాటలూ, శ్రమశక్తిని 'సరుకు' అనడమూ, వదిలి వేయాలంటే, ఆ మాటలకు బదులు ఏం మాటలు వాడాలి? – అని అడిగారు. యజమానీ శ్రామిక సంబంధాన్ని స్పష్టంగా చెప్పే మాటల కోసం ఆలోచించాలి. ఇప్పటిదాకా కార్మికుల వైపు నుంచి 'అమ్మడం' అంటున్నదాన్ని 'శ్రమ చేయడం' అనవచ్చు. యజమాని వైపు నించి 'కొనడం' అంటున్నదాన్ని 'కార్మిక శ్రమించే పోషణ ఇవ్వడం' అనవచ్చు. దీన్ని క్లుప్తంగా, 'పోషణ' అనీ, 'జీతం' అనీ, అనవచ్చు. ఈ పోషణ, యజమాని శ్రమతో మారకం అయ్యేది కాకపోయినా, కార్మికుడి శ్రమలో నుంచి ఎంత భాగాన్ని 'జీతం' పేరుతో ఇవ్వాలో నిర్ణయించేది యజమానే. ఆ భాగాన్ని ఇవ్వగా కూడా పెట్టుబడిదారుడికి (యజమానికి) 'అదనపు విలువ' మిగులుతుంది. యజమానీ శ్రామిక సంబంధంలో, 'అమ్మడం–కొనడం' మాటలు ఇప్పటిదాకా అలవాటైపోయి ఉన్నాయి. పోనీ, ఆ మాటల్ని అలాగే ఉంచుకోవాలంటే, 'అవి, అమ్మడంగా, కొనడంగా, కనపడతాయి గానీ, అవి ఆ రకం విషయాలు కానే కావు' అని చాలా స్పష్టంగా చెప్పే వాక్యాలు కూడా ఉండాలి. విద్యార్థులకూ, కార్మికులకూ, నేర్పేటప్పుడు, 'అమ్మడం–కొనడం' మాటల వల్ల ఎలాంటి సమస్య వస్తుందో కూడా వివరించాలి. మార్క్స్ వాడిన మాటలకు అలవాటుపడ్డాం కాబట్టి వాటిని ఉంచుకుంటూనే వాటి వల్ల వచ్చే సమస్యని వివరించాలి. శ్రమ శక్తిని, 'సరుకు' అనడం మానేసి, 'శ్రమ శక్తి' అంటే సరిపోతుంది.

*– **రంగనాయకమ్మ**, హైదరాబాద్*

వీక్షణం సెప్టెంబర్ సంచికలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు – ప్రతిస్పందనలపై వచ్చిన వి. హనుమంతరావు వ్యాసం చదివిన తరువాత నా స్పందన రాయకుండా ఉండలేకపోతున్నాను. వారి దృష్టిలో తెలంగాణ ఉద్యమం ఒక ఉద్యమమే కాదని, తెలంగాణలోని ఏ గ్రామానికి వెళ్లినా అక్కడి ప్రజలకూ, రైతులకూ, రైతుకూలీలకూ ఉద్యమ ఆవశ్యకత గురించి తెలియదనే భావాన్ని వ్యక్తం చేశారు. తరువాత కెసిఆర్‌కు మంత్రి పదవి ఇస్తే విభజన సమస్య వచ్చేది కాదు కదా! ఉద్యమం వచ్చేదా? అన్నారు. 1956లో తెలంగాణ విలీనం సందర్భంగా కొన్ని హామీలు, వాగ్దానాలు, షరతులతో కూడిన ఒప్పందం మీద విలీనం జరిగింది. అప్పటి నుండే ఒప్పందాలు, రక్షణలు అమలు జరగకుండా అన్నింటిని ఉల్లంఘించి తెలంగాణకు అన్ని రంగాలలో అన్యాయం జరగడం వల్లనే తెలంగాణవాదులు అనేక సందర్భాలలో విజ్ఞప్తులు, నిరసనలు, ఆందోళనలు చేసినప్పటికీ అప్పటి పాలకులు ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు కోసం 1969లోనే 'జై తెలంగాణ' ఉద్యమం జరిగిన విషయం వారికి తెలిసి కూడ తెలియనట్టు, తెలంగాణ ఉద్యమ చరిత్రను కప్పిపుచ్చే ప్రయత్నం చేయవద్దని కోరుతున్నాను.

రెండవ అంశం తెలంగాణ ప్రాంత ప్రజలు ఆందోళనలకు వినియోగించిన శక్తిని అభివృద్ధికి వినియోగిస్తే కొంత అభివృద్ధి జరిగి ఉండేదని సెలవిచ్చారు. తెలంగాణ ప్రాంతానికి దక్కవలసిన న్యాయబద్ధమైన, చట్టబద్ధమైన, రాజ్యాంగబద్ధమైన హక్కులు దక్కకుండా చేసి, ఇక్కడి వనరులను (నీళ్లు, నిదులు, ఖనిజాలు) తరలించుకుపోయి, ఉద్యోగ, ఉపాధి అవకాశాలు కొల్లగొట్టి, పరిపాలన అధికారం లేకుండా చేసినంక అభివృద్ధి ఎలా జరుగుతుందో వారి విజ్ఞతకే తెలియాలి.

ఇప్పుడు సమైక్యాంధ్ర పేరిట జరుగుతున్న ఉద్యమం కేవలం పదమూడు సీమాంధ్ర జిల్లాల్లోని కొద్ది మంది రాజకీయ నాయకుల, పిడికెడు మంది పెట్టుబడిదారుల నుండి పుట్టిన కృత్రిమ ఉద్యమం తప్ప, నిజమైన ఉద్యమం కాదు. దీనిని భూతద్దంలో చూపిస్తున్న సీమాంధ్ర మీడియాకు, మేధావులకు తెలంగాణ ప్రజల అవసరాలు, ఆశయాలు, ఆకాంక్షలు అర్థంకాకపోవడం వారి సంకుచిత, స్వార్థ మనస్తత్వానికి నిదర్శనం. ఎన్. వేణుగోపాల్ వ్యాసం చాల అవగాహన కలిగించేదిగా, అభినందించేదిగా ఉంది. తెలంగాణ ప్రజల ఉద్యమ ఫలితంగా, కొన్ని వందల మంది అమరుల త్యాగంవల్ల జూలై 30న సిడబ్ల్యుసి తీర్మానం చేసి తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకై ప్రకటన చేసి, రాష్ట్ర ఏర్పాటు చర్యలు తీసుకొమ్మని కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది. కాని ఇప్పటి వరకు కూడా ప్రకటనకే పరిమితం అయింది. ప్రక్రియ ప్రారంభించకుండా కేబినెట్ నోట్ తయారు చేయకుండా ఉంది. పార్లమెంట్ బిల్లు ప్రవేశపెట్టి నెగ్గితేనే రాష్ట్రపతి ఆమోదం జరిగి రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ పూర్తి అవుతుంది. కాని ఈ చర్యలు చేపట్టకుండా కాంగ్రెస్‌పార్టీ, కేంద్ర ప్రభుత్వం కాలయాపన చేస్తున్నందువల్లనే అటు సీమాంధ్రుల ఆందోళనలు, ఇటు తెలంగాణ బిడ్డల బలిదానాలు జరుగుతున్నాయి. ఇవన్ని ఆగాలంటే రాష్ట్ర ప్రభుత్వంతో సంబంధం లేకుండా కేంద్ర ప్రభుత్వం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును త్వరగా పూర్తి చేయాల్సిన అవసరం ఎంతైన ఉంది.

*– **బొరెడ్డి మధుసూదన్‌రెడ్డి**, సిద్దిపేట*

వీక్షణం సెప్టెంబర్ సంచికలో ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న సమైక్యాంధ్ర ఉద్యమం గురించి గాని, ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం గురించి రచయితలు యథార్థంగాను, నిజాయితీగాను రాశారు. 60 సంవత్సరాలు ప్రజలు సమైక్యంగానే జీవించారు కదా! అక్కడ గాని ఇక్కడ గాని ఈ ఇరు ప్రాంతాల ప్రజలకు ఒరిగిందేమిటి? చేతికి చిప్ప తప్ప. తెలంగాణ పాలకులు గాని, ఆంధ్రా పాలకులు గాని ఏనాడైనా సమన్యాయంగా పాలించారా! లేదని చెప్పవచ్చు. ప్రాంతీయ అసమానతలు బాగా పెంచేశారు. హైదరాబాదు కేంద్రంలోనే అన్ని వనరులను కేంద్రీకరించి దోపిడీ పెట్టుబడిదారీ వర్గానికి లాభాలార్జించి పెట్టినారనేది యథార్థమే కదా! ఎక్కువగా లబ్ధిపొందింది ఆంధ్రా పెట్టుబడిదారులే అనేది ఎవరూ కాదనలేని నిజం. ఇరువైపుల వారు తమ ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి ఉద్యమాలు లేవదీశారు. సామాన్య ప్రజలను బలి పసువులు చేస్తున్నారు. దోపిడీ పాలక వర్గాలవారు తమ స్వార్థ ప్రయోజనాలనే ప్రజలందరి ప్రయోజనాలుగా చిత్రీకరిస్తూ ప్రజల్ని ఎలా దగా చేస్తున్నారో నేటి అనుభవం చెపుతుంది. కేంద్ర కాంగ్రెస్ ఏనాడు కూడా ఈ సమస్యను చిత్తశుద్ధితో పరిశీలించిన పాపాన పోలేదు. వారి ఎన్నికల ఎత్తుగడలో భాగంగానే ఈ సమస్యను నాన్చుతూ వస్తున్నారనేది ఇప్పటికి ఈ సంక్షోభాన్ని బట్టి బాగా తెలుసుకోవచ్చు. ఈ సమస్య మీద రాసిన రచయితలంతా బాగా శ్రద్ధపెట్టి రాసినారు. కానీ ప్రజలు తెలుసుకొనేదెప్పుడా అనేది నా సంశయం. ప్రజల్ని మోసం చేయడంలో పాలక వర్గ పార్టీలు బాగాపోటీ పడుతున్నాయి. ఒకరిని మించి మరొకరు దగాకోరుతనంగా ప్రజలను వంచిస్తున్నారు. తమ వెంట పడేటట్లు ప్రజల్ని టక్కరి మాటలతో తమ ఉద్యమాల వెంట ఈడ్చుకొని పోతున్నారనేది నేడు యథార్థంగా రుజువు అవుతోంది. వీరి నిజస్వరూపాన్ని తెలియ చెప్పడమే ప్రజాస్వామిక వాదుల నేటి కర్తవ్యం. వీథుల్లోకొచ్చి ఉద్యమాలు చేసేది ప్రజలు. వాటి ఫలితాల్ని పొందడంలో ఈ పాలకులు అమిత నేర్పరులు. ప్రపంచంలోకెల్లా ఇండియాలోని బూర్జువా వర్గం మహాతెలివైనది. అందునా ఆంధ్రా బూర్జువా వర్గం మరింత తెలివైనది అనవచ్చు. రూపాయి పతనానికి కారణాలేంటో ఎ. నర్సింహారెడ్డి స్పష్టంగానూ, వివరంగానూ రాశారు. 'కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానం తర్వాత' అనే సంపాదకీయం చాలా ప్రాధాన్యమైనదిగా భావిస్తున్నాను. ఈ రచయితలకు నా కృతజ్ఞతలు.

*– **కడియాల సుబ్బనాచారి**,*
*ఆయుర్వేద వైద్యులు, దుత్తలూరు.*

రంగనాయకమ్మగారు 'గడ్డం పెంచుకున్నాడు, చేపలు తినవచ్చన్నాడు గనుక మార్క్స్‌కు మార్క్సిజం తెలియదు' అని రాశారని ఎస్.జనార్దన్ జూలై వీక్షణంలో రాశారు. దానికి జవాబుగా నేను ఆగస్టు సంచికలో ఆమె అలా ఎక్కడా రాయలేదన్నాను. సెప్టెంబర్ వీక్షణంలో జనార్దన్ తన మాటల్ని సమర్థించుకుంటూ,

*(మిగతా 62వ పేజీలో...)*

# న్యాయ భావనతో ఆందోళన విరమించాలి

వీక్షణం

చిరకాలం బండిని లాగిన ఎద్దు ఎప్పుడూ మూపు మీద కాడి ఉన్నట్టుగానే భావిస్తుందని ఫ్రెంచిలో ఒక నుడికారం ఉంది. వాస్తవం కాకపోయినా, ఊహాజనితంగా ఏర్పడే ఆ అభిప్రాయాన్ని డెజావూ అంటారు. ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజకీయ, సామాజిక పరిణామాలను చూస్తుంటే తెలుగు సమాజం ఇవాళ డెజావూ స్థితిలో ఉన్నదనిపిస్తున్నది.

తెలంగాణ ప్రాంతంలో నాలుగు సంవత్సరాల నిరంతర ఆందోళనల తర్వాత, సమస్య పరిష్కారానికి ఒక అడుగు పడిందనిపించిన స్థితిలో, కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో ప్రారంభమైన ఆందోళన రెండు నెలలుగా సాగుతున్నది. తెలంగాణ సమస్యను పరిష్కరిస్తామని పది సంవత్సరాలుగా నమ్మబలుకుతున్న కాంగ్రెస్ పార్టీ తన వంచనా శిల్పాన్ని మరొకసారి రుజువు చేసుకుంటున్నది. అత్యున్నత వర్కింగ్ కమిటీ తీర్మానం తర్వాత ఎనిమిది వారాలు గడిచినా దాన్ని అమలుచేసే దిశలో కనీస చర్యలు కూడ జరగలేదు. కాంగ్రెస్ నాయకులు ఎప్పటికెయ్యది ప్రస్తుతంబొ అన్నట్టు పూటకోమాట, రోజుకోమాట మాట్లాడుతున్నారు. ఆరు దశాబ్దాల తెలంగాణ ప్రజల ఆకాంక్షలను నెరవేర్చడానికి గాని, తెలంగాణ ఏర్పడితే తమకేమి జరుగుతుందో అని కోస్తా, రాయలసీమ ప్రజలలో ఉన్న నిజమైన సందేహాలనూ, నాయకులు కల్పించిన భయాలనూ తీర్చడానికి గాని కాంగ్రెస్ ఎటువంటి ప్రయత్నమూ చేయడం లేదు.

మరొక పక్క అసలు తెలంగాణ సమస్యకు పరిష్కారమే వద్దనే దిశగా కోస్తాంధ్ర, రాయలసీమలలోని అన్ని రాజకీయ పార్టీల నాయకత్వాలు మాట్లాడుతున్నాయి. 'మా సమస్యలు పరిష్కరించండి, మాకు న్యాయం చేయండి' అని అడిగే, ఆందోళన చేసే హక్కు ఎవరికైనా ఉంటుంది గాని, 'అవతలివాళ్ల సమస్యలు పరిష్కరించకండి, వారికి న్యాయం చేయకండి' అనే అసాధారణ ఆందోళన నడుపుతున్న కోస్తా, రాయలసీమ నాయకుల విజ్ఞతను చూసి ఆశ్చర్యపోక తప్పదు. అమాయకంగా, అబద్ధాలతో ప్రభావితులై, తప్పుడు భావజాలంతో ఆ నాయకుల వెనుక నడుస్తున్న ప్రజలు కూడ ఉన్నారు. కాని ఇంతకాలం గడిచిన తర్వాతనైనా, తెలుగుజాతి శతాబ్దాలుగా ప్రదర్శించిన ఉజ్వల చైతన్యపు వారసత్వాన్ని కొనసాగించడానికైనా ఒక్కసారి ఆగి, ఏమి జరిగిందో, జరుగుతున్నదో సమీక్షించుకోవలసి ఉంది. జరిగిన పొరపాట్లను సరిదిద్దుకోవలసి ఉంది. ప్రజల మధ్య విద్వేషం లేని, శాంతి సామరస్యాలతో సాగే మైత్రిని పునర్నిర్మించుకోవలసి ఉంది.

ఒక పాలనా ప్రాంతం ఎన్ని పాలనా ప్రాంతాలుగా విభజనకు గురైనా ఆ ప్రాంత ప్రజలకు జరగబోయే నష్టం ఏమీ ఉండదు. నిజానికి అటువంటి వికేంద్రీకరణ వల్ల ప్రజలకు అధికారం మరింత చేరువ అయి, అధికారవర్గాన్ని నిలదీసేందుకు, వనరుల పారదర్శక పంపిణీ జరగడానికి అవకాశం వస్తుంది. ప్రజాస్వామ్యం పరిఢవిల్లడానికి వికేంద్రీకరణ ఒక ముఖ్యమైన మార్గం. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు ఆకాంక్షలో ఈ వికేంద్రీకరణ అంశంతో పాటు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటు నాటినుంచి రాష్ట్ర పాలకవర్గాలు సాగించిన అక్రమాలు, వాగ్దానాల ఉల్లంఘనలు, న్యాయమైన వాటా అందకుండా చేసిన కుట్రలు, సాంస్కృతిక వివక్ష వంటి కారణాలెన్నో ఉన్నాయి. తెలంగాణ కోరినది విభజన కాదు, విలీనం రద్దు. ఆ కోరిక కూడ విలీన షరతులు అమలు కాలేదు గనుక తలెత్తినదే.

తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు ఆకాంక్ష చరిత్ర అలా ఉంచినా, ఆ ఆలోచనలు, ఉద్యమం పద్దెనిమిది సంవత్సరాలుగా ఉన్నాయి. పన్నెండు సంవత్సరాలుగా ఒక రాజకీయ పక్షం పనిచేస్తున్నది. పది సంవత్సరాలుగా అది ఎన్నికల నినాదంగా కూడ ఉన్నది. అన్ని రాజకీయ పక్షాలు దాన్ని ఆమోదించాయి. ఎన్నో అఖిలపక్ష సమావేశాలు ఆ ఆకాంక్షను పరిష్కరించమని కోరాయి. కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజానీకంలో తెలంగాణ ఆకాంక్ష పట్ల వ్యతిరేకత ఉండి ఉంటే అది ఈ పద్దెనిమిది సంవత్సరాలలో, కనీసం గత పది సంవత్సరాల ఎన్నికల రాజకీయాలలో వ్యక్తమయ్యేదే. ఆ ప్రజలలో లేని దురభిప్రాయాలను, తెలంగాణ ఏర్పడితే తమ భవిష్యత్తుకు ఏదో పెను ప్రమాదం జరగబోతుందనే అబద్ధాన్ని రాజకీయ పక్షాలు ప్రచారం చేస్తున్నాయి. ఆ అబద్ధాలతోనే అమాయక ప్రజలను వీధుల్లోకి తెస్తున్నాయి. విద్యా ఉద్యోగ అవకాశాలు, జలవనరుల పంపిణీ, హైదరాబాదుపై హక్కు వంటి సమస్యలమీద ప్రజలను రెచ్చగొడుతున్నాయి. సమన్యాయం, ప్రజల కోరిక వంటి సమర్థనీయమైన మాటలను వక్రీకరించి తమ కుతర్కానికి వాడుకుంటున్నాయి. సమైక్య రాష్ట్రంలో పాలకులు తెలంగాణ ప్రాంతానికి ఇచ్చిన వాగ్దానాలను నెరవేర్చకపోవడం వల్లనే సమస్య తలెత్తిందని, జరిగిన తప్పులకు ఎప్పటికైనా పరిహారం తప్పదని ఒప్పుకోవలసిన పాలకవర్గాలు తమ తప్పులకు ప్రజలను బలి చేస్తున్నాయి. తెలంగాణకు సమన్యాయాన్నీ, న్యాయమైన వాటాను ఇవ్వడంలో వైఫల్యం వల్లనే సమస్య తలెత్తిందని చెప్పవలసిన పాలకవర్గాలు ఇప్పుడు కోస్తా, రాయలసీమ ప్రజలను రెచ్చగొట్టడానికి సమన్యాయ భావనను వక్రీకరించి వాడుకుంటున్నాయి. ప్రజల కోరిక మేరకే తమ వైఖరి మార్చుకున్నామని చెపుతూ, తెలంగాణ ప్రజలు ప్రజలు కాదని చెప్పకనే చెపుతున్నాయి.

ఈ పాలకవర్గాలు అటు కోస్తా, రాయలసీమ ప్రజలకు కూడ గత అరవై సంవత్సరాలలో ఒరగబెట్టిందేమీ లేదు. అక్కడ సువిశాల ప్రాంతంలో అవసరమైన విద్యా, ఉద్యోగ అవకాశాలు కల్పించడంలో, వైద్య, ఆరోగ్య, అభివృద్ధి సౌకర్యాలు కల్పించడంలో ఈ పాలకులు చేసింది శూన్యం. ఈ పాలకులందరూ కేంద్రీకృత అభివృద్ధి నమూనాతో హైదరాబాదులో వేల కోట్ల రూపాయల అక్రమ ఆస్తులు పోగుచేసుకుని ఇవాళ వాటిని రక్షించుకునే కుటిల పన్నాగాలకు పావులుగా కోస్తా, రాయలసీమ ప్రజలను వాడుకుంటున్నారు.

ఈ పాలకవర్గ కుట్రలను ఓడించి రెండు ప్రాంతాల ప్రజల మధ్య ఐక్యతకు, శాంతి సామరస్యాలకు పునాది వేయవలసి ఉంది. మరొకరి అవసరాల కోసం, ప్రయోజనాల కోసం తమ భవిష్యత్తును, కాలాన్ని, శక్తిని వృథా చేస్తున్నామని గుర్తించి కోస్తా, రాయలసీమ ప్రజానీకం విభజనానంతర రాష్ట్ర పునర్నిర్మాణానికి నడుం కట్టవలసి ఉంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పాలకవర్గ అక్రమ ఆస్తులకు వీలు కల్పించిన కేంద్రీకృత అభివృద్ధి నమూనా అనుభవాన్ని గుణపాఠంగా తీసుకుని రెండు రాష్ట్రాలలోనూ వికేంద్రీకృత, ప్రజాస్వామిక, ప్రజానుకూల అభివృద్ధి నమూనా అమలు కోసం పాలకుల మీద ఒత్తిడి తేవలసి ఉంది. వీ

# మరణశిక్షలు అత్యాచారాలను ఆపుతాయా?

నిర్భయగా ప్రఖ్యాతమైన జ్యోతి సింగ్ పాండే సామూహిక అత్యాచారం, హత్య కేసులను విచారించిన ఫాస్ట్ ట్రాక్ న్యాయస్థానం నలుగురు నిందితులకు మరణశిక్ష విధించింది. ఆ సామూహిక అత్యాచార ఘటన అత్యంత క్రూరమైనదీ, దారుణమైనదీ అయినందువల్ల, దానికి చాల ప్రచారం దొరికినందువల్ల అటు న్యాయవ్యవస్థలోను, ఇటు సమాజంలోను దానికి చాల ప్రాధాన్యత దొరికింది. విచారణ జరుగుతున్నంతకాలం నిందితులకు కఠినాతికఠిన శిక్షలు విధించాలని, మరణ శిక్ష విధించాలని ఎన్నో ప్రజాసమూహాలు ప్రదర్శనలు చేశాయి. బాధితురాలి కుటుంబ సభ్యులు అటువంటి ప్రతీకార వాంఛను ప్రకటిస్తే అర్థం చేసుకోవచ్చు. అటువంటి పంటికి పన్ను, కంటికి కన్ను అనే వ్యక్తిగత ప్రతీకార వాంఛలను క్రమబద్ధం చేసి, నాగరిక పద్ధతిలో శిక్షలు విధించేందుకే న్యాయవ్యవస్థ ఏర్పడింది. ఒక నేరానికి ఒక శిక్ష ఉండవలసిందే గాని ఆ శిక్ష నేరస్తుల మీద మాత్రమే కాగూడదనీ, నేర కారణాలను, మూలాలను కనుగొని రద్దు చేయాలని ఆ ఆధునిక నేరవిచారణా సంప్రదాయం చెపుతుంది. అంటే లక్ష్యం నేరస్తులను శిక్షించడం కాదు, నేరాన్ని రద్దు చేయడం కావాలి. ఢిల్లీ సామూహిక అత్యాచార నేరస్తులకు మరణశిక్ష విధించాలని వాదించిన వారందరూ ఆ శిక్షా భయం ఇకముందు అత్యాచార నేరాలు జరగకుండా అరికడుతుందని వాదించారు. కాని ఎప్పుడైనా శిక్ష ఉన్నదనే భయంతో ఏ నేరమైనా జరగకుండా ఆగదు, శిక్ష లేదనే హామీ ఉంటే నేరం జరగదు. నేరాలు జరగడానికి అనేక సామాజిక, సాంస్కృతిక, రాజకీయ కారణాలుంటాయి. అవి మారకుండా కేవలం శిక్షాభయం ఏ ఫలితమూ సాధించజాలదు. సాధారణంగా నేరాలు ప్రణాళికాబద్ధంగా గాని, తక్షణ ఆవేశంలోగాని జరుగుతాయి. ప్రణాళికాబద్ధంగా నేరం చేసేవారికి తాము చేసే నేరానికి ఏ శిక్ష పడుతుందో స్పష్టంగా తెలుసు. అయినా ఆ నేరం చేస్తారు. తక్షణ ఆవేశంలో నేరం చేసేవారికి ఆ క్షణాన ఏ శిక్షాభయమూ గుర్తుకు రాదు. అందువల్ల శిక్షలకు నేరాలను అరికట్టే శక్తి ఉందనుకోవడం భ్రమ. అట్లని నేరాలకు శిక్షలే లేని వ్యవస్థ రావాలని కాదు. నేరాలు ఎందుకు జరుగుతున్నాయో లోతుగా అర్థం చేసుకుని ఆ కారణాలను నిర్మూలించగల, తగ్గించగల వ్యవస్థ కావాలి. ఆడపిల్లను గర్భంలోనే గుర్తించి పిండస్థాయిలో హత్య చేస్తున్న దగ్గరి నుంచి జీవితమంతా వివక్షకు, అసమానతకు గురిచేసి తక్కువస్థాయి పౌరురాలిగా చూసే సమాజంలో, స్త్రీ పురుషుడి భోగవస్తువనే విలువలను ప్రచారం చేసే మత భావనలు, ప్రచార సాధనాలు, సాహిత్య సాంస్కృతిక సంప్రదాయాలు ఉన్న సమాజంలో, కిందినుంచి పైదాకా అధికార వర్గమంతా, న్యాయవ్యవస్థ కూడ స్త్రీ వ్యతిరేక, పురుషాధిపత్య భావనలతో నిండి ఉన్న సమాజంలో ఎంతమంది అత్యాచార నేరస్తులకు శిక్ష విధించినా ఏం ప్రయోజనం? ప్రతి క్షణం వ్యవస్థ అటువంటి నేరస్తులను తయారు చేస్తూనే ఉంటుంది. ఎంతమందికని మరణశిక్షలు విధిస్తారు? ఎంతమందిని చంపితే వ్యవస్థలో స్త్రీపురుష సమానత్వం నెలకొంటుంది? కనీసం స్త్రీలు భోగవస్తువులు కారనీ, వారి మీద అత్యాచారం చేయడం అనాగరికమనీ, అమానుషమనీ తెలిసివస్తుంది? లోతైన, వ్యవస్థాగతమైన అంశాలు ఆలోచించకుండా, తక్షణ కోపావేశాలతో భావోద్వేగాలను రెచ్చగొట్టి పబ్బం గడుపుకోవడానికే ఈ వ్యవస్థ ప్రయత్నిస్తున్నది. అది గ్రహించకపోతే మన వివేకానికి ఏం విలువ? వీ

# నైరోబీ, పెషావర్‌లలో అమాయకుల నెత్తురుటేర్లు

సెప్టెంబర్ 21న కెన్యా రాజధాని నైరోబీలో, 22న పాకిస్తాన్‌లోని ప్రాచీన నగరం పెషావర్‌లో అమాయకుల నెత్తురు ఏరులై పారింది. శనివారం సాయంకాలం నైరోబీలో వెస్ట్‌గేట్ మాల్ అనే దుకాణాల సముదాయంలో అల్ షబాబ్ (యువత) అనే సంస్థ హఠాత్తుగా బాంబులు పేల్చి, కాల్పులు జరిపి అక్కడికక్కడ వందమందిని బలిగొన్నది. ఆదివారం మధ్యాహ్నం పెషావర్ లోని చర్చి లోనుంచి బైటికి వస్తున్న సమూహంపై ఆత్మాహుతి బాంబు దాడి చేసిన జందల్లా (దేవుడి సైనికులు) అనే సంస్థకు చెందిన ఇద్దరు యువకులు ఎనబై మందిని బలిగొన్నారు. ఆధిపత్య శక్తులు, రాజ్య సాయుధ బలగాలు ఇటువంటి నరమేధానికి పాల్పడడం కొత్త కాదు. కాని ఈ రెండు సందర్భాలలోను తమను తాము సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులుగా, పాశ్చాత్య దేశాల ప్రభుత్వాలు ముస్లింలపై సాగిస్తున్న హంతక దాడులకు జవాబుగా చెప్పుకున్న బృందాలు ఈ హంతక చర్యలకు పాల్పడ్డాయి. నైరోబీలో దాడి చేసిన అల్ షబాబ్ సోమాలియాలో ముస్లింలపై కెన్యన్ ప్రభుత్వ బలగాలు చేసిన దాడికి ప్రతీకారంగానే ఈ దాడి చేశానని చెప్పుకున్నది. కాని ఈ అర్థరహితమైన. లక్ష్యరహితమైన హింసలో చనిపోయిన వారిలో ఎక్కువమంది సామ్రాజ్యవాద అనుకూలురూ కాదు, ప్రభుత్వ బలగాలూ కాదు. శనివారం సాయంత్రం సరుకులు కొనుక్కోవడానికో, వినోదానికో మాల్‌కు వచ్చిన వారు. అక్కడ జరుగుతున్న ఒక పిల్లల కార్యక్రమంలో పాల్గొనడానికి వచ్చినవారు. నిర్విచక్షణగా జరిపిన బాంబుదాడులలో, కాల్పులలో చనిపోయినవారిలో దాదాపు సగం మంది ముస్లింలు. ఘనా దేశపు ప్రఖ్యాత కవి, నాస్తికుడు, జీవితమంతా సామ్రాజ్యవాద వ్యతిరేక, పాశ్చాత్య వ్యతిరేక వైఖరితో కవిత్వం రాసిన కాఫీ అవుమర్ కూడ ఇలా బలి అయిపోయినవారిలో ఉన్నారు. ఇక పెషావర్‌లో బాంబుదాడులు జరిగిన ఆల్ సేంట్స్ ఆంగ్లికన్ చర్చి భారత ఉపఖండంలో నిర్మాణమైన తొలి చర్చిలలో ఒకటి. ఆ నూట నలభై సంవత్సరాల చర్చిని చూడడానికి ఇతర మతాల సందర్శకులు కూడ వస్తుంటారు. అక్కడ ఆ ఆదివారం ప్రార్థనలలో పాల్గొన్నవారు క్రైస్తవులే కావచ్చు గాని తప్పనిసరిగా సామ్రాజ్యవాద అనుకూలురూ, పాశ్చాత్య అనుకూలురూ కాదు. పాకిస్తాన్ భూభాగం మీద అమెరికన్ సామ్రాజ్య వాదులు సాగిస్తున్న డ్రోన్ దాడులకు వ్యతిరేకంగా ఈ బాంబుదాడులు చేశామని, ఇకముందు కూడ ఇస్లామేతరులపైన ఇటువంటి దాడులు చేస్తామని జందల్లా ప్రకటించింది. ఇంతకూ ఈ రెండు సంస్థలూ కూడ ఒకప్పుడు సామ్రాజ్యవాద శక్తులు, వారి తైనాతీలుగా ఉండిన పశ్చిమాసియా ఇస్లాం ఛాందస, రాచరిక శక్తులు, పాకిస్తాన్ సైనికబలగాలు పెంచి పోషించిన సంస్థలే. సామ్రాజ్యవాదం సాగిస్తున్న దుర్మార్గాలనూ, డ్రోన్ దాడులనూ, అది ప్రచారం చేస్తున్న ఇస్లామిక్ తీవ్రవాద బూచినీ తీవ్రంగా ఖండించవలసిందే. అన్ని హింసాసాధనాలూ తనదగ్గర పెట్టుకున్న సామ్రాజ్య వాదమే అసలు తీవ్రవాదమనీ, దాన్ని మట్టి కరిపించవలసి ఉందనీ చెప్పవలసిందే. సామ్రాజ్యవాద వ్యతిరేకంగా క్రియాశీల చర్యలు చేపట్టవల సిందే. కాని ఇలా నిర్విచక్షణగా దాడులు జరిపి సంబంధంలేని అమాయకు లను, ప్రజలను బలిగొనడం సామ్రాజ్యవాద వ్యతిరేకత కాదు. తీవ్రవాదం అనే మాటను అంగీకరించని వాళ్లు కూడ ఒప్పుకోలేని హింసోన్మాదం ఇది. వీ

# వర్తమాన చరిత్ర - రాజకీయార్థిక దృష్టి

## ద్రవ్యోల్బణం

తెలుగు పత్రికల్లో, టెలివిజన్ ఛానళ్లలో 'ద్రవ్యోల్బణం పెరుగుదల', 'తగ్గుముఖం పట్టిన ద్రవ్యోల్బణం' అని అప్పుడప్పుడూ వార్తలు వస్తుంటాయి. చాల మంది పాఠకులూ, శ్రోతలూ ద్రవ్యోల్బణం అంటే ధరల పెరుగుదల అని అర్థం చేసుకుంటారు. తాము ప్రతిరోజూ దుకాణాలలో ఏ సరుకు కొన్నా ధరలు పెరగడం మాత్రమే కనబడుతుండగా ద్రవ్యోల్బణం తగ్గుతున్నదని ప్రభుత్వం ఎలా ప్రకటిస్తున్నదా అని ఆశ్చర్యపోతుంటారు. ఆ ద్రవ్యోల్బణాన్ని బట్టే ఉద్యోగుల జీతభత్యాల నిర్ణయం, ముఖ్యంగా కరువు భత్యపు నిర్ణయం, పేదరికం గణాంకాల నిర్ణయం, సంక్షేమ కార్యక్రమాలు జరుగుతాయి గనుక ఈ ద్రవ్యోల్బణపు గణాంకానికి చాల ప్రాధాన్యత ఉంది. కాని అంత ప్రాధాన్యత గల ఆ భావన అసలు అర్థమేమిటో, దాన్ని ఎలా లెక్కిస్తారో అత్యధిక సంఖ్యాకులకు తెలియదు. ప్రజల నిత్యజీవిత అనుభవంలో ఉన్న విషయాన్ని, వారి ఆదాయాల మీద, జీవనం మీద ప్రభావం వేసే విషయాన్ని ప్రజలకు అర్థం అయ్యేలా చెప్పలేకపోవడమే, లేదా ప్రజలకు అర్థం కాకుండా మసిపూసి మారేడుకాయ చేసి చెప్పడమే పాలకవర్గ అర్థశాస్త్ర నైపుణ్యం. గతంలో బ్రాహ్మణుల గుత్తాధిపత్యం కింద సంస్కృతం నిర్వహించిన పాత్రనే ప్రస్తుతం పాలకవర్గ అర్థశాస్త్రం నిర్వహిస్తున్నది.

నిజానికి ద్రవ్యోల్బణం అనే మాటకు ద్రవ్యపు విలువ తగ్గిపోవడం అని అర్థం. అంటే ఒక నిర్దిష్ట పరిమాణపు ద్రవ్యానికి గతంలో వస్తున్న సరుకుల కన్న తక్కువ సరుకులు రావడం. మరో మాటల్లో చెప్పాలంటే ఆ సరుకుల ధరలు పెరిగిపోవడం. అయితే భారత ప్రభుత్వం ఎప్పటికప్పుడు ప్రకటించేది ద్రవ్యోల్బణం గురించి కాదు, ద్రవ్యోల్బణంలో మార్పులు జరుగుతున్న తీరు గురించి మాత్రమే. దాన్ని నిజానికి ద్రవ్యోల్బణం రేటు అనాలి. భారత ప్రభుత్వం ప్రతి నెలా ఈ ద్రవ్యోల్బణం రేటులో మార్పు గురించి అధికారిక ప్రకటన విడుదల చేస్తుంది. ప్రభుత్వం దృష్టిలో ద్రవ్యోల్బణం అంటే వార్షిక ప్రాతిపదికపై టోకుధరల సూచి విలువలో వచ్చిన మార్పు శాతం. ఈ నిర్వచనం అర్థం కావాలంటే టోకు ధరల సూచి అంటే ఏమిటో అర్థం చేసుకోవాలి. అది ప్రభుత్వం నిర్దేశించుకున్న కొన్ని సరుకుల బుట్ట ధర గత సంవత్సరం ఇదే సమయంలో ఎంత ఉండింది, ఇప్పుడు ఎంత అయింది అని లెక్కవేయడం. గత సంవత్సరపు టోకు ధరల సూచి నుంచి ప్రస్తుత టోకు ధరల సూచిని తీసివేసి, మిగిలిన దాన్ని గత సంవత్సరపు టోకు ధరల సూచితో భాగహారం చేసి, 100తో హెచ్చవేస్తే ప్రస్తుత ద్రవ్యోల్బణం ఎంతో తెలుస్తుంది. గత సంవత్సరం ఉండిన ద్రవ్యోల్బణం రేటుతో పోల్చినప్పుడు ఈ సంవత్సరం ద్రవ్యోల్బణం రేటు పెరిగిందా తగ్గిందా అన్నది మాత్రమే ప్రభుత్వం ప్రకటించే గణాంకం. అంటే అది నేరుగా ఒక సరుకు ధర పెరిగిందా తగ్గిందా చెప్పేది కాదు.

ఈ ద్రవ్యోల్బణ గణాంకాన్ని తయారు చేయడంలో ఉపయోగించే సంక్లిష్ట, సాంకేతిక సూత్రాల గురించి తెలుసుకోవడం అంత అవసరం లేదు గాని దాని వెనుక దాగి ఉన్న మాయను మాత్రం తెలుసుకోవాలి. ఈ ద్రవ్యోల్బణం లెక్క వేయడంలోనే చాల గందరగోళం ఉంది. ఇక్కడ కనీసం మూడు పెద్ద అపసవ్యతల గురించి చెప్పుకోవాలి.

ఈ లెక్క వేయడానికి ప్రపంచంలో చాల దేశాలు వినియోగదారుల చిల్లర ధరల సూచిని వాడుతుండగా, భారత ప్రభుత్వం టోకు ధరల సూచిని వాడుతున్నది. టోకు ధరలంటే ఆయా సరుకుల ఉత్పత్తిదారుల దగ్గర, లేదా, దేశవ్యాపిత, రాష్ట్రవ్యాపిత పంపిణీదారుల దగ్గర ఉండే ధర. ఆ సరుకు అనేక చేతులు మారి చిల్లర వర్తకులకు చేరి వినియోగదారుకు చేరుతుంది. అక్కడ ఉండే ధర చిల్లర ధర. మొదటి ధరను హోల్ సేల్ ప్రైస్ అనీ, రెండో ధరను కన్జ్యూమర్ ప్రైస్ అనీ అంటారు. ఈ ధరల సూచికలే హోల్ సేల్ ప్రైస్ ఇండెక్స్ (డబ్ల్యుపిఐ – టోకు ధరల సూచి), కన్జ్యూమర్ ప్రైస్ ఇండెక్స్ (సిపిఐ – వినియోగదారు ధరల సూచి లేదా చిల్లర ధరల సూచి). మన దేశంలో వ్యాపార గొలుసులో ఉన్న అనేక మజిలీలు ఉండి, ప్రతి మజిలీ దగ్గరా కొంత లాభం వేసుకోవడం వల్ల చిల్లర ధర టోకు ధర కన్న చాల ఎక్కువ అయిపోతుంది. అందువల్ల ఇక్కడ టోకు ధరల సూచి నిజమైన ధరలకూ, ధరల పెరుగుదలకూ సూచిక కాజాలదు. దాని ఆధారంగా ద్రవ్యోల్బణాన్ని లెక్కించడం, అలా లెక్కించిన ద్రవ్యోల్బణం ఆధారంగా కరువు భత్యాలు నిర్ణయించడం అసంబద్ధం.

అలాగే ఈ టోకు ధరలను లెక్కించడానికి భారత ప్రభుత్వం ప్రస్తుతం 676 ప్రాతినిధ్య సరుకుల బుట్ట మీద ఆధారపడుతున్నది. ఇందులో వేరువేరు ప్రాధాన్యతలతో ప్రాథమిక సరుకులు (ప్రాధాన్యత 20.12 శాతం), శక్తి ఇంధనాలు (14.91 శాతం), పారిశ్రామిక ఉత్పత్తులు (64.97 శాతం) ఉంటాయి. ఆధునిక జీవితంలో అతి ముఖ్యమైన, ఖరీదైన, ఆదాయంలో అత్యధిక భాగాన్ని ఆక్రమిస్తున్న సేవలకు ఈ బుట్టలో స్థానం లేదు. ఈ సరుకుల జాబితాలు కూడ ఎప్పుడో తయారయినవి. ఆ సరుకులన్నీ ఇవాళ అవసరమైనవేనా, కొంటున్నవేనా, కొన్నా ఒకప్పుడు కొన్న పరిమాణంలో కొంటున్నారా, వాటికి ఇచ్చిన తరతమ ప్రాధాన్యతలు సరైనవేనా వంటి ప్రశ్నలకు ఈ ధరల సూచి నిర్మాతల దగ్గర జవాబు లేదు.

నిజానికి భారతదేశంలో ఈ సూచి నిర్మాణం 1942లో మొదలయినప్పుడు ఈ సరుకుల బుట్టలో కేవలం 23 సరుకులు మాత్రమే ఉండేవి. కాలక్రమంలో ఆ సూచిని ఆరు సార్లు సవరిస్తూ వచ్చి 2010లో 676 సరుకులకు చేరారు. ప్రస్తుతం దాన్ని మరొకసారి సవరించాలని, ఈసారి ఆ బుట్టలో మార్పులు, చేర్పులు, తొలగింపులు చేసి 1100కు పైగా సరుకులతో కొత్త జాబితా తయారు చేయాలని ఆలోచిస్తున్నారు. ఆ జాబితా ఎంత పెద్దగా మారినప్పటికీ ఆదాయాలలోనూ, సరుకుల పంపిణీ, వినియోగాలలోనూ విపరీతమైన అసమానతలు, సరుకుల వినియోగంలో కుల, మత, ప్రాంత ప్రత్యేకతలు ఉన్న సువిశాల దేశంలో దేశవ్యాప్తంగా ఒకే రకమైన సరుకుల వినియోగాన్ని ప్రాతిపదికగా తీసుకోవడం, దేశవ్యాప్తంగా ఒకే సరుకుల బుట్టను, ధరల సూచిని

నిర్ణయించడం అసాధ్యం. ఆ అసాధ్యమైన పనిని ఏదో ఒక రకంగా చేసినా అది అస్పష్టతకే దారి తీస్తుంది. ప్రస్తుతం డబ్ల్యుపిఐ లెక్కింపులో ఈ అస్పష్టత పూర్తిగా కనబడుతుంది.

ఈ ధరల సూచి నిర్ణయంలో, ద్రవ్యోల్బణం నిర్ణయంలో మరొక పెద్ద గారడీ ప్రాతిపదిక సంవత్సరం. ధర ఎంత పెరిగింది అనేది ఒక పోలిక. ఆ పోలిక చెప్పడానికి తప్పనిసరిగా ఏదో ఒక ప్రాతిపదిక ఉండాలి. 'ఫలానా సంవత్సరంలో 100 ఉండేది, ఇప్పుడు 110 అయింది కాబట్టి ఈ రెండు సంవత్సరాల మధ్య 10 శాతం ద్రవ్యోల్బణం ఉంది' అని చెప్పక తప్పదు. ఉదాహరణకు ప్రస్తుత టోకు ధరల సూచి తయారీకి 2004-05 ను ప్రాతిపదిక సంవత్సరంగా తీసుకుంటున్నారు. అంటే 2004-05లో ఆ సరుకుల బుట్ట ధర 100 అనుకుంటున్నారు. అది ఆగస్ట్ 2013 నాటికి 177.5 కు పెరిగింది. అయితే ఇక్కడ మరొక గారడీ ఉంది: ఈ మొత్తం బుట్టలో విడిగా ప్రాథమిక సరుకులు (ఆహార పదార్థాలు, ఆహారేతర పదార్థాలు, ఖనిజాలు) లెక్కవేస్తే 247.8 అయ్యాయి, ఇంధనాలు, శక్తివనరులు 202.3 అయ్యాయి. పారిశ్రామిక సరుకులు 150 అయ్యాయి.

స్థూలంగా చెప్పాలంటే ప్రాతిపదిక సంవత్సరం (బేస్ ఇయర్) అనడమంటే ఆ సంవత్సరం ధరల సూచి 100 ఉన్నదని ప్రకటించడం. అయితే ఈ ప్రాతిపదిక నిర్ణయించడానికి శాస్త్రీయమైన పద్ధతి ఏమీ లేదు. వర్షాభావం వల్ల, ఆర్థిక వ్యవస్థ స్థితి వల్ల, సరఫరా తగ్గి ధరలు ఎక్కువై పోయిన సంవత్సరాన్ని ప్రాతిపదికగా తీసుకుని లెక్కిస్తే ఆ తర్వాత ధరలు తగ్గినట్టు కనబడవచ్చు. ధరలు తక్కువగా ఉన్న సంవత్సరాన్ని ప్రాతిపదికగా తీసుకుని లెక్కిస్తే ఆ తర్వాత ధరలు బాగా పెరిగినట్టు కనబడవచ్చు. మొదటిసారి 1942లో సూచి తయారు చేసినప్పుడు 1939ని ప్రాతిపదికగా తీసుకున్నారు. ఆ సూచిని 1947లో విస్తరించినప్పుడు కూడ 1939 ప్రాతిపదిక సంవత్సరాన్ని అలాగే ఉంచారు. తర్వాత 1952లో కొత్త సూచిని తయారు చేసినప్పుడు 1952-53 ప్రాతిపదిక సంవత్సరం అన్నారు. తర్వాత 1969లో 1961-62ను, 1977లో 1970-71ని, 1989లో 1981-82ను, 2000లో 1993-94ను, 2010లో 2004-05ను ప్రాతిపదిక సంవత్సరాలుగా ప్రకటించారు.

ఈ అంకెలను చూస్తేనే వాటి మధ్య క్రమబద్ధత ఏమీ లేదని, భారత ప్రభుత్వం ఈ ప్రాతిపదిక సంవత్సరాన్ని రాజకీయ కారణాలతోనే నిర్ణయిస్తున్నది గాని శాస్త్రీయమైన, వస్తుగతమైన కారణాలేమీ లేవని స్పష్టమవుతుంది. ఎప్పటికప్పుడు ప్రాతిపదికను మారుస్తూ ప్రజలు భయపడవలసిన రీతిలో ధరలు పెరగడం లేదని అంకెల గారడీ చేయడానికే ఈ ప్రాతిపదికల మార్పు ఉపయోగపడుతుంది. నిజానికి వలస పాలన అయిపోయిన తర్వాత మొదటిసారి తయారుచేసిన ప్రాతిపదికతో పోలిస్తే, అంటే 1952-53లో సరుకుల బుట్ట ధర 100 ఉంటే, అది ఇప్పుడు కనీస పక్షం 6000 పైన ఉండి ఉంటుందని ఒక అంచనా. అంటే భారత పాలకుల నిర్వాకం కింద ద్రవ్యోల్బణం ఎంత పెద్ద ఎత్తున జరిగిందంటే 1952-53లో రు. 100తో కొనగలిగిన సరుకులు కొనడానికి ఇవాళ రు. 6000 అవసరమవుతాయి. మరొక మాటల్లో చెప్పాలంటే ద్రవ్యానికి ఆరోజున ఉన్న విలువ ఇవాళ అరవై రెట్లు దిగజారిపోయింది. నిజానికి ధరలు ఇలా అరవై రెట్ల పైన పెరిగినప్పటికీ, జీత భత్యాలు, సగటు ఆదాయాలు ఈ స్థాయిలో పెరగలేదు. ఆర్థిక వ్యవస్థ పతనానికి, దాని వల్ల ప్రజాజీవన పరిస్థితుల, ప్రమాణాల పతనానికి అద్దం పట్టే సూచిక ఇది.

## రక్షణ వ్యయం - సింధురక్షక్

ఒకవైపు ప్రజలకు అందుబాటు ధరల్లో నిత్యజీవితావసరాలను సమకూర్చలేని, ధరలను అదుపు చేయలేని పాలకులు రక్షణ వ్యయం పేరిట మాత్రం ప్రజాధనాన్ని విచ్చలవిడిగా వెచ్చిస్తున్నారు. లక్షల కోట్ల రూపాయలను వెచ్చించి అవసరం లేని, పనికిరాని, కాలం చెల్లిన, ప్రమాదకరమైన రక్షణసామగ్రిని, ఆయుధాలను కొనుగోలు చేస్తున్నారు. పొరుగుదేశాలతో యుద్ధ బూచిని చూపి ఇబ్బడి ముబ్బడిగా ఆయుధాలు కొంటున్నారు. శాంతి సామరస్యాలకు అవకాశం ఉన్నచోట్ల కూడ కయ్యానికి కాలు దువ్వుతున్నారు. అంతర్జాతీయ ఆయుధవ్యాపార బహుళ జాతి సంస్థల లాభాల కోసం ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారు.

లక్షల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని ధ్వంసం చేస్తున్న ఈ రక్షణ సామగ్రి దుష్ఫలితాలకు ఒక నిదర్శనంగా ఇటీవల సింధురక్షక్ అనే జలాంతర్గామి లోపల పేలుడు జరిగి సిబ్బందితో సహా ధ్వంసమైపోయింది. రష్యా తయారు చేసిన ఈ అణు జలాంతర్గామిని భారత ప్రభుత్వం 1997లో కొన్నప్పుడు రు. 452 కోట్లు. గత సంవత్సరం దాన్ని మరమ్మత్తు చేయడానికి అయిన ఖర్చు రు. 858 కోట్లు. గత పదిహేను సంవత్సరాలలో దాని నిర్వహణకు అయిన ఖర్చు మరి కొన్ని వందల కోట్ల రూపాయలు ఉంటుంది. పదిహేను సంవత్సరాలలో అది చేసిన పని ఏమీ లేదు గాని, 2010లో ఒక ప్రమాదానికి గురయింది. 2013 ఆగస్ట్ 14న అంతర్గతంగా పేలుళ్లు జరిగి, మునిగిపోయి, పద్దెనిమిది మంది నావికాదళ సిబ్బందిని చంపివేసింది. ఈ ఒక్క ఉదంతంలోనే దాదాపు రెండు వేల కోట్ల రూపాయల ప్రజాధనం వ్యర్థమైపోయిందంటే, వందలాది ఉదాహరణలు ఉన్న రక్షణ శాఖ వృథా ఖర్చులతో ఎన్ని లక్షల కోట్ల రూపాయల ప్రజాధనం ధ్వంసమైపోతున్నదో, అందులో ఎన్ని వేల కోట్ల రూపాయలు రాజకీయ నాయకుల, అధికారుల సొంత ఖాతాల్లోకి ముడుపులుగా చేరుతున్నదో ఊహించవలసిందే.

భారత ప్రభుత్వం రక్షణ వ్యయంగా కేటాయిస్తున్న బడ్జెట్లను చూస్తే కళ్లు తిరిగిపోతాయి. వలస పాలన ముగిసిన తర్వాత 1947 నవంబర్ 26న సమర్పించిన తొలి బడ్జెట్ లో 1947 ఆగస్ట్ 15 నుంచి 1948 మార్చ్ 31 (ఎనిమిది నెలలకు) రక్షణ శాఖ కేటాయింపులు రు. 92.74 కోట్లు. ఆ తర్వాత సంవత్సరం పూర్తి సంవత్సరానికి రు. 136.07 కోట్లు. అరవై ఆరు సంవత్సరాలు గడిచిన తర్వాత 2013-14 సంవత్సరానికి రక్షణ శాఖ బడ్జెట్ రు. 2,03,672 కోట్లు. అంటే పెరుగుదల 1500 రెట్లు. ప్రజాజీవితంలో మరే ఒక్క అంశమూ ఇంత పెద్ద ఎత్తున పెరగలేదు. ఈ లక్షల కోట్ల రూపాయల నిధులు అంతర్జాతీయ ఆయుధ వ్యాపారులకు, బహుళజాతి సంస్థలకు అందుతాయి. ఆయా రక్షణ సామగ్రి నిజ6గా దేశ రక్షణకు అవసరమా కాదా అనే ప్రశ్నతో నిమిత్తం లేకుండా ఆ ఉత్పత్తి సంస్థలు ప్రభుత్వం వెంటపడి రక్షణ మంత్రుల దగ్గరినుంచి రక్షణ శాఖ సిబ్బంది దాకా లంచాలు పెట్టి ఆ సరుకులు కొనడానికి ఒప్పిస్తాయి. కొన్ని వేల రూపాయలలో, లక్షల రూపాయలలో వ్యయమయ్యే ప్రజా ప్రయోజనకరమైన చిన్న చిన్న పథకాలు అమలు చేయడానికి ఒకటికి పదిసార్లు ఆలోచించి, అమలు చేయకుండా ఉండిపోయే ప్రభుత్వాలు ఈ లక్షల కోట్ల రూపాయల కేటాయింపులు మాత్రం చేస్తూ ఉంటాయి. రక్షణ శాఖ వ్యయాలలో ఎక్కువ భాగాన్ని పార్లమెంటు గాని, ప్రచార సాధనాలు గాని చర్చించవు. ఆ రంగం గురించి విమర్శనాత్మకంగా మాట్లాడడం అంటేనే దేశద్రోహం అన్నట్టుగా ఒక తప్పుడు భావజాలం తయారయి ఉంది. అలా పవిత్రత ఆపాదించి, ఆ పవిత్రత చాటున అన్ని రకాల అక్రమాలు సాగించడానికి మార్గం సుగమం చేసుకున్నారు. వీ



❖ **కాళోజీ కథలు** – కాళోజీ కథలు – ప్రచురణ : కాళోజీ ఫౌండేషన్, వరంగల్ – 68 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : కాళోజీ ఫౌండేషన్, 2-5-311, నక్కలగుట్ట, హనుమకొండ – 506001, ముఖ్య పుస్తక విక్రయ కేంద్రాలు.



❖ **కాలం తెచ్చిన మార్పు** (పల్లె నుండి విశాల విశ్వం దాక) – కథల సంపుటి – బి.ఎస్. రాములు – ప్రచురణ : విశాల సాహిత్య అకాడమి – 208 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు : విశాల సాహిత్య అకాడమి 201, సులేఖ గోల్డెన్ టవర్స్, 2-2-186/53/5, రామ కృష్ణానగర్, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాద్ – 500013 ఫోన్ : 8331966987, 9059550998



❖ **మన తెలంగాణ** – మండగడ్డ విక్రమ్ కుమార్ – ప్రచురణ: సహజ ప్రచురణలు – 54 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : సహజ ప్రచురణలు, భగత్‌సింగ్ భవన్, 3-128, చందానగర్, ఎస్ఎల్‌పి సర్కిల్ – 12, పశ్చిమ విభాగం, హైదరాబాద్ – 500050, ఫోన్ : 040 – 23030305, ఫ్యాక్స్ : 040- 23031273, సెల్ : 9391050963



❖ **నా పొగరు మిమ్మల్ని గాయపరచిందా ? అయితే సంతోషం !** – ఎం.ఎఫ్. గోపీనాథ్– ప్రచురణ: హైదరాబాద్ బుక్ ట్రస్ట్– 162 పేజీలు, 1/8 డెమీ, రు.100, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 5000028; ఫోన్ : 23521849



❖ **కంటిపాప కలగన్నది!** (కథల సంపుటి) – జోగు అంజయ్య – ప్రచురణ : జనగామ రచయితల సంఘం – పేజీలు 46, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : తేజ నిలయం, 1-10-76/1/2, గ్రేయిన్ మార్కెట్ ఏరియా, జనగాం, ఫోన్ : 8008957480



❖ **సవాల్ –** తెలంగాణ కవిత్వం – అన్వర్ – తెలంగాణ వేదిక – పేజీలు 96, 1/8 డెమీ, రు. 60, ప్రచురణ : 16-10-374, శివనగర్, వరంగల్ – 506002, ఇమెయిల్ : anwarwarangal@gmail.com, అన్ని పుస్తక షాపులలో



❖ **బహిష్కారం –** ప్రపంచ తెలుగు మహాసభల నిరసన కవిత్వం – సంపాదకులు– నల్లెల్ల రాజయ్య, దండె రాజమౌళి – వరంగల్లు రచయితల సంఘం – పేజీలు 101, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : నల్లెల్ల సుగుణ ఇం.నెం. 7-1-384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్, ఫోన్ : 9989415571, ప్రముఖ పుస్తక కేంద్రాలు.



❖ **స్వేచ్ఛ సమానత్వం కోసం విడిపోవడం ప్రజాస్వామిక హక్కు** – పౌరహక్కుల సంఘం – పేజీలు 8, 1/8 డెమీ, రు. 5, ప్రతులకు : ప్రొ. ఎస్. శేషయ్య, ఫ్లాట్ నెం. 49, విద్యుత్‌నగర్, అనంతపురం – 515001, ఫోన్ : 9000919100



❖ **మానవ పరిణామంలో మతము – సైన్స్** – (సిడి) కొడవటిగంటి రోహిణీప్రసాద్ ఉపన్యాసం – ప్రచురణ : మానవ వికాస వేదిక – రు. 30, ప్రతులకు : మానవ వికాస వేదిక, హైదరాబాద్; సెల్ : 9390022200, 9490419044



❖ తెలంగాణ సాగునీటి రంగ పితామహుడు **నవాబ్ అలీ నవాబ్ జంగ్ బహదూర్** – శ్రీధర్‌రావు దేశ్‌పాండే – ప్రచురణ : తెలంగాణ ఇంజనీర్స్ జెఏసి, తెలంగాణ రిటైర్డ్ ఇంజనీర్స్ ఫోరం – పేజీలు 92, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : శ్రీధర్‌రావు దేశ్‌పాండే, 7-126, శ్రీశ్రీ ఎవెన్యూ, గుర్రంగూడ, వయా రాగన్నగూడ పోస్టు, రంగారెడ్డి – 501510, ఫోన్ : 9491060585



❖ **మహిళా సాధికారత –** సవాళ్లు సమాజ సాహిత్య స్వభావాలు – తోట జ్యోతిరాణి, కాత్యాయనీ విద్మహే – ప్రచురణ : స్త్రీ జనాభ్యుదయ అధ్యయన సంస్థ – పేజీలు 172 1/8 డెమీ, రు. 120, ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, ఆర్య సమాజ్ మందిర్ ఎదురుగా, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్.



❖ **జయంత మహాపాత్ర కవితలు** – అనువాదం డా. యు.ఎ. నరసింహమూర్తి – ప్రచురణ : పాలపిట్ట బుక్స్ – పేజీలు 104, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఫోన్: 27678430 ఇమెయిల్ : palapittabooks@gmail.com



❖ **చింతయామి** – డాక్టర్ ధేనువకొండ శ్రీరామమూర్తి – ప్రచురణ : పాలపిట్ట బుక్స్ – 72 పేజీలు , 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఫోన్: 27678430 ఇమెయిల్ : palapittabooks@gmail.com



❖ **రివిజనిజం** – మావో – ప్రచురణ : విప్లవ రచయితల సంఘం – 287 పేజీలు, 1/8 డెమీ, రు : 75, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్, నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్, సహచర బుక్ మార్క్, బాగ్ లింగంపల్లి, హైదరాబాద్



❖ **విద్యార్థి – యువజన ఉద్యమాలు** – లెనిన్ – ప్రచురణ : విప్లవ రచయితల సంఘం – 56 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్, నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్, సహచర బుక్ మార్క్, బాగ్ లింగంపల్లి, హైదరాబాద్



❖ **ఆపరేషన్ గ్రీన్‌హంట్ భయంనీడలో ఆదివాసిల బతుకులు** (నిజనిర్ధారణ కమిటీ నివేదికలు) – పౌరహక్కుల సంఘం – పేజీలు 48, 1/4 క్రౌన్, రు. 25, ప్రతులకు : ప్రొ. ఎస్. శేషయ్య, ఫ్లాట్ నెం. 49, విద్యుత్‌నగర్, అనంతపురం – 515001, ఫోన్ : 9000919100

### సికె నారాయణరెడ్డి మృతి

కమ్యూనిస్టువాది, గాంధేయవాది చల్లా కృష్ణ నారాయణరెడ్డి (88) సెప్టెంబర్ 5న నిమ్స్‌లో చికిత్స పొందుతూ చనిపోయారు. ఆయన చిత్తూరు జిల్లా పీలేరు మండలం చల్లావారిపల్లె గ్రామంలో 1925లో జన్మించారు. మదనపల్లెలో ఉన్నత విద్యనభ్యసించారు. రాయలసీమ ప్రాంతంలో నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలకు ప్రభావితుడైన వారిలో సికె ఒకరు. శ్రీకాకుళ ఉద్యమం సెట్‌బ్యాక్‌కు గురైన తరువాత ఆయన జనతా ప్రచురణలు, అనుపమ ప్రచురణలు, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ సంస్థలను స్థాపించారు.

### సేవ్ ఆంధ్రప్రదేశ్ సభ

ఆంధ్రప్రదేశ్ నాన్‌గెజిటెడ్ ఆఫీసర్స్ (ఏపిఎన్‌జిఒలు) ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని ఎల్‌బి స్టేడియంలో రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా సెప్టెంబర్ 7న 'సేవ్ ఆంధ్రప్రదేశ్ సభ' నిర్వహించారు. ఈ సభకు సీమాంధ్ర ఉద్యోగులు భారీ సంఖ్యలో హాజరయ్యారు. ఈ సభకు హాజరైన వక్తలు రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా మాట్లాడారు. అలాగే ఈ సభకు వ్యతిరేకంగా తెలంగాణ పొలిటికల్ జెఎసి తెలంగాణ బంద్‌కు పిలుపునిచ్చింది. ఈ బంద్‌లో విద్యార్థి సంఘాలు, జెఎసి సంఘాలు పాల్గొన్నాయి. బంద్‌లో పాల్గొన్న కొంత మంది తెలంగాణవాదులను పోలీసులు అరెస్టు చేశారు.

### కొత్త సీలింగ్ చట్టం

కేంద్ర ప్రభుత్వం జూలై 18న రాష్ట్రాలకు భూగరిష్ఠ చట్టంను తగ్గించాలనే ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం తిరస్కరించింది. రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంపై సెప్టెంబర్ 8న హైదరాబాద్‌లోని భూ పరిపాలన ప్రధాన కార్యాలయంలో జరిగిన సమావేశాన్ని ప్రతిపక్ష పార్టీలు, రైతు సంఘాలు వ్యతిరేకించాయి. రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం పేదలను మోసం చేయడమేనని రైతు సంఘాలు, వామపక్ష పార్టీలు విమర్శించాయి.

### ఎన్. కరుణాకర్ మృతి

ప్రముఖ చిత్రకారుడు, కార్టూనిస్టు ఎన్. కరుణాకర్ (60) గుండెపోటుతో హైదరాబాదులోని సోమాజిగూడలోని తన కార్యాలయం లో సెప్టెంబర్ 12న చనిపోయారు. ఆయన ఆంగ్ల, తెలుగు దిన, వార పత్రికల్లో కార్టూనిస్టుగా పని చేశారు. ఆయన స్వగ్రామం విశాఖపట్నం.

### ధర్మారెడ్డి మృతి

ప్రముఖ సాగునీటి రంగ నిపుణులు, తెలంగాణ విశ్రాంత ఇంజనీర్ల వేదిక ఉపాధ్యక్షులు ఎ. ధర్మారెడ్డి (72) క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ సెప్టెంబర్ 13న చనిపోయారు. ఆయనది మహబూబ్‌నగర్ జిల్లా పానగల్ మండలంలోని కల్వరాల గ్రామం. తెలంగాణలోని వివిధ ప్రాజెక్టులలో ఇంజనీరుగా పనిచేశారు. తెలంగాణ ప్రాజెక్టుల కోసం ఉద్యమించారు.

### తమ్మారెడ్డి కృష్ణమూర్తి మృతి

ప్రజానాట్యమండలి వ్యవస్థాపకులు, అభ్యుదయ చలన చిత్ర నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి (94) సెప్టెంబర్ 16న హైదరాబాదులోని కొండాపూర్‌లోని చంద్ర రాజేశ్వర్‌రావు ఫౌండేషన్ వృద్ధాశ్రమంలో చనిపోయారు. ఆయన లక్షాధికారి, జమీందార్, బంగారు గాజులు, ధర్మదాత, ఇద్దరు కొడుకులు మొదలై అభ్యుదయ చిత్రాలను నిర్మించారు. ఆయనది కృష్ణా జిల్లా, చినపాలపర్రు గ్రామం. ఆయన 1920 అక్టోబర్ 4న జన్మించారు.

### మాకినేని జగదాంబ మృతి

కమ్యూనిస్టు ఉద్యమ నాయకురాలు కామ్రేడ్ మాకినేని జగదాంబ (91) సెప్టెంబర్ 17న హైదరాబాద్‌లో చనిపోయారు. ఆమెది గుంటూరు జిల్లా, క్రామ గ్రామం. ఆమె ప్రఖ్యాత రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ స్థాపించిన శారద నికేతన్‌లో చదువుకున్నారు. ఆమె సిపిఎం మాజీ పొలిట్‌బ్యూరో సభ్యులు మాకినేని బసవపున్నయ్య సతిమణి.

### ఎంబిఎ, ఎంసిఎ కాలేజీల మూసివేత

రాష్ట్రంలోని 504 ఎంబిఎ, ఎంసిఎ కాలేజీలు మూతపడ్డాయి. 2012-13 విద్యా సంవత్సరంతో పోలిస్తే ఈ సారి ఎంబిఎలో 15465 సీట్లు, ఎంసిఎలో 24454 సీట్లు రద్దయ్యాయి. 170 ఎంబిఎ, 334 ఎంసిఎ కాలేజీలు ముతపడ్డాయి. ఈ రెండు కోర్సుల్లో 39919 సీట్లు తగ్గిపోయ్యాయి. ఈ కోర్సుల్లో ఉద్యోగావకాశాలు లేకపోవడం వల్లనే ఎంసిఎ, ఎంబిఎ కోర్సులకు ఆదరణ తగ్గిందని అధికారులు తెలిపారు.

### కవి ఛాయరాజ్ మృతి

జనసాహితీ రాష్ట్ర అధ్యక్షులు, కవి, విమర్శకులు, కథా రచయిత సామాజిక ఉపాధ్యాయులు ఛాయరాజ్ (66) సెప్టెంబర్ 20న అనారోగ్యంతో శ్రీకాకుళంలోని ఆయన స్వగృహంలో చనిపోయారు. ఆయన శ్రీకాకుళం (ఉద్యమ కావ్యం), దర్శిని, గుమ్మ, నిరీక్షణ, దుఃఖేర్, రసస్పర్శ, తాలెరుక మొదలైన రచనలు చేశారు.

### తెలంగాణ విద్యార్థి యుద్ధభేరి

పది జిల్లాలతో కూడిన తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని సెప్టెంబర్ 21న ఉస్మానియా యూనివర్సిటీ ఆర్ట్స్ కాలేజీ ప్రాంగణంలో 'మాదిగ విద్యార్థి ఫెడరేషన్' ఆధ్వర్యంలో 'తెలంగాణ విద్యార్థి యుద్ధభేరి' బహిరంగ సభ జరిగింది. ఈ సభకు వివిధ ప్రజా సంఘాల నాయకులు, రాజకీయ నాయకులు, విద్యార్థి సంఘాలు, విద్యార్థులు వచ్చారు.

### తెలంగాణ రచయితల వేదిక మహాసభ

'అఖిల భారత తెలంగాణ రచయితల వేదిక' రెండో మహాసభ కరీంనగర్‌లో సెప్టెంబర్ 22న జరిగింది. ఈ సభలో వివిధ కవులూ, రచయితలూ రచించిన నూతన పుస్తకాలను అవిష్కరించారు. ఈ సభకు ముఖ్య అతిథులుగా సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ సుదర్శన్‌రెడ్డి, కేంద్ర సాహిత్య అకాడమి కన్వీనర్ డా. ఎన్. గోపి హాజరయ్యారు. అలాగే ప్రజాఫ్రంట్ ఉపాధ్యక్షులు వేదకుమార్, నమస్తే తెలంగాణ పత్రిక సంపాదకులు అల్లం నారాయణ, కథ, నవల రచయిత అల్లం రాజయ్యలతో పాటు తెలంగాణలోని చాలా మంది కవులు, రచయితలు, కళాకారులు, మేధావులు హాజరయ్యారు.

### వైఎస్. జగన్‌కు బెయిల్

వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షులు వైఎస్. జగన్మోహన్‌రెడ్డికి నాంపల్లిలోని ప్రత్యేక సిబిఐ కోర్టు సెప్టెంబర్ 23న షరతులతో కూడిన బెయిల్ ఇచ్చింది. జగన్మోహన్‌రెడ్డి అక్రమణ అస్తులకు సంబంధించిన కేసుల్లో 2012 మే 27న అరెస్టు అయ్యారు.

వీ

# అత్యాచారాలకు మరణశిక్ష సమాధానమా?

***నేరస్వభావాల మూలాలను పట్టించుకోకుండా, వాటిని నిర్మూలించే విధానాలను అమలు పరచకుండా కేవలం నేరస్తులను శిక్షల ద్వారా అంతమొందించడం సమస్యకు పరిష్కారం కాదంటున్నారు* కె. సజయ**

**2012** డిసెంబర్ 16న దేశ రాజధాని ఢిల్లీ నడివీథుల్లో ఒక విద్యార్థినిపై అత్యంత అమానుషంగా, హింసోన్మాద లైంగిక దాడి జరిగింది. ఈ దాడికి సంబంధించి దేశవ్యాప్తంగా అప్పటికప్పుడు ఎదురయిన నిరసనలతో ప్రత్యేకించి ఈ విషయమై పభుత్వం లైంగిక అత్యాచారాలపై నెలరోజులలో నివేదికను కోరుతూ జస్టిస్ వర్మ నేతృత్వంలో ఒక కమిషన్‌ను డిసెంబర్ 23న ఏర్పాటు చేసింది. వర్మ కమిషన్ ఒక నెలరోజులలోనే దేశవ్యాప్తంగా అనేక విజ్ఞాపనలను స్వీకరించి తన రిపోర్టును ప్రభుత్వానికి అందజేసింది. ఈ కమిషన్‌తో పాటు ప్రభుత్వం ఢిల్లీలో ఒక ఫాస్ట్ ట్రాక్ కోర్టును ఏర్పాటు చేసింది. ఈ కోర్టు 10 నెలల కాలంలోనే కేసు విచారణ పూర్తిచేసి 2013 సెప్టెంబరు 13న నిందితులకు మరణశిక్ష విధిస్తూ తీర్పు వెలువరించింది. సంఘటనలో పాల్గొన్న బాలనేరస్థుడికి అంతకు ముందే జువనైల్ జస్టిస్ యాక్ట్ ప్రకారం మూడేళ్ల శిక్ష విధించింది. ఇతనికి కూడా మరణశిక్షే విధించాలనే డిమాండ్ సర్వత్రా వినిపిస్తోంది.

ఢిల్లీ సంఘటనకు వ్యతిరేకంగా దేశవ్యాప్తతంగా పిడికిలెత్తిన లక్షలాది గొంతులు, పేరేదయితేనేం దీనిలో బలయిన అమ్మాయి ఉదంతం హింసోన్మాద లైంగిక అత్యాచారాలకు సంబంధించి ఎన్నో అంశాలను, ప్రశ్నలను, సవాళ్లను మరోసారి సమాజం ముందు విసిరాయి. ఒక్కరా....ఇద్దరా....ఎంతోమంది స్త్రీల జీవితాలు లైంగిక అత్యాచారం అనే ఒక హింసాత్మక పురుషాధిపత్య వ్యవస్థకు బలైపోతున్నా గానీ పట్టనట్టు వ్యవహరించే వ్యవస్థీకృత పరిపాలనా రాజ్యయంత్రాంగ నిర్లక్ష్యంపై ప్రత్యక్ష ఆగ్రహరూపాన్ని ఈ సంఘటనలో చూశాం. సైద్ధాంతికంగా ఎన్ని పరిమితులు, ప్రశ్నలు ఉన్నప్పటికీ ప్రపంచీకరణ నేపథ్యంలో రాజకీయాలకతీతంగా ప్రజలందరూ ముఖ్యంగా నూతన తరం వ్యక్తం చేసిన నిరసనగా ఈ అంశాన్ని గుర్తించాలి. ముఖ్యంగా స్త్రీలు దేశవ్యాప్తంగా సమూహాలు సమూహాలుగా రోడ్ల మీదకొచ్చి నిరసన వ్యక్తం చేశారు. ప్రజల ప్రతిస్పందన నుంచి, ఇప్పటి వరకూ వివిధ రూపాల్లో వివిధ ప్రదేశాల్లో వయసుతో నిమిత్తం లేకుండా నిరంతరాయంగా స్త్రీలపై, ఆడపిల్లలపై జరుగుతున్న వ్యవస్థీకృత లైంగిక దాడుల గురించి, ప్రభుత్వాల నిర్లక్ష్యం, నిందితులకు పడుతున్న శిక్షలు, చట్టాలలో ఉన్న లోపాలు, రావలసిన మార్పులు... ఇలా ఎన్నో అంశాలు సమాజం ముందు చర్చకి వచ్చి నిలబడ్డాయి. బహిరంగ ప్రదేశాల్లో రక్షణ వ్యవస్థలను ఏర్పాటు చేయాల్సిన ప్రభుత్వ యంత్రాంగ నిర్లక్ష్యపూరిత స్వభావాన్ని ముందుకి తీసుకురావడం జరిగింది. ఇన్నాళ్లూ ఇదేదో కేవలం కొంతమంది గ్రూపులు, సామాజిక వర్గాల విషయంగా 'తమది' కానిదిగా పట్టించుకోని సమాజం ముఖ్యంగా భద్ర మధ్యతరగతి ఈ అంశం తమ రోజువారీ జీవితాలకి సంబంధించిన విషయంగా, నిలబడి ఆలోచించకపోతే ప్రమాదం మరింత పెరుగు తుందనే ఒక గ్రహింపులోకి వచ్చింది.

అయితే ఇదే సమయంలో ఇంతకు ముందెన్నడూ లేనివిధంగా స్త్రీలపై జరిగే లైంగిక అత్యాచారాలకు మరణశిక్షే సరైన శిక్ష అనే డిమాండ్ ఉన్మాద రూపంలో వ్యక్తమవడం ఆందోళన కలిగించే అంశమే. దీనికి మూలాలు కొత్తరూపంలో వ్యక్తమవుతున్న బ్రాహ్మణీయ కుల పితృస్వామ్యంలో ఉన్నాయి. ఢిల్లీలో జరిగిన సంఘటన గానీ ఆ తర్వాత ఈ మధ్యకాలంలో ముంబయి మహానగరంలో ఫోటో జర్నలిస్టు పై జరిగిన అత్యాచారం ఈ రెండు సందర్భాలలోనూ ఈ డిమాండ్ బలంగా ముందుకి వచ్చింది. రెండు సంఘటనల్లోనూ బాధితులు పట్టణ మధ్యతరగతి వర్గానికి చెందినవారు అవడం, నిందితులు వెనుకబడిన అట్టడుగు కులాల, మతాలకు సంబంధించిన వారు కావడం కాకతాళీయమే అయినప్పటికీ, ఈ పరిస్థితులను పై నేపథ్యంలో పరిశీలించి అర్థం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

నిజానికి స్త్రీల మీద జరుగుతున్న దాడుల్లో ఢిల్లీ సంఘటన మొదటిదీ కాదు, చివరది కూడా కాదనే విషయం మనందరికీ స్పష్టమే. ఢిల్లీ సంఘటనలోని తీవ్రతతో పాటు, వెనువెంటనే ప్రభుత్వ, పోలీసు యంత్రాంగం చూపించిన నిర్లక్ష్యపూరిత వైఖరి కూడా నగర యువత ఆగ్రహావేశాలకు కారణమయింది. అయితే ఇంతకు ముందు ఇంతకంటే తీవ్రమైన సంఘటనలు జరిగినా గానీ కేవలం ఆయా సమూహాలుగా ఉన్నవారు లేదా స్త్రీల, హక్కుల సంఘాలు తప్పించి ఏ సంఘటనపై కూడా స్పందించని వర్గాలు దీనిపై స్పందించడం మీద అనేక రకాలైన ప్రశ్నలు ముందుకు వస్తున్నాయి. ముఖ్యంగా దళిత, ఆదివాసి, మైనారిటీ సమూహాల నుంచి. ఈ సమూహాలకు చెందిన స్త్రీలపై వ్యక్తిగతంగా లేదా సామూహికంగా ఆధిపత్య వర్గాలు, కులాలు, రాజ్యవ్యవస్థ జరుపుతున్న లైంగిక అత్యాచారాలు కనీసం వార్తా ప్రసారాల చర్చల్లోకి రాకపోవడం, పోలీసులు కేసులు కూడా పెట్టకపోవడం, పెట్టినా గానీ న్యాయస్థానాల్లో సంవత్సరాల తరబడి కొనసాగడం చివరకు వీగిపోవడం వంటి సవాళ్లను సమాజం ముందుకి విసురుతున్నాయి. ఇక్కడ కొంచెం వ్యవస్థల గురించి మాట్లాడుకుందాం. పోలీసు వ్యవస్థ, చట్టాలు, కోర్టులు మనకు ఎంతవరకు అందుబాటులో ఉన్నాయో ప్రశ్నించుకోవాలి. ఉదాహరణకు ఈ 2013 ఆగస్టు 24న ఢిల్లీకి కూతవేటు దూరంలోని హర్యానాలోని జింద్ పట్టణం దగ్గర పరీక్ష రాసి వస్తున్న 20 ఏళ్ల దళిత యువతిని కిడ్నాప్ చేసి అత్యంత దుర్మార్గంగా అత్యాచారం జరిపి చంపిపారేశారు. నిందితులను అరెస్టు చేసేంతవరకు ఖననం చేసేది లేదని దాదాపు 5 రోజుల పాటు శవాన్ని అలానే ఉంచుకుని ఆ యువతి కుటుంబం, దళిత మహిళాసంఘాలు, కార్యకర్తలు హాస్పిటల్ ముందు

ధర్నా చేస్తే, లాఠీఛార్జి చేసి అనేకమందిని అరెస్ట్ చేశారు. ఢిల్లీకి అతి దగ్గరలో ఉన్నప్పటికీ ఏ జాతీయ మీడియా సంస్థ కూడా ఈ సంఘటనను రిపోర్టు చేయలేదు. మన కళ్లముందు ఇంకా సజీవంగా నెత్తురోడుతున్న వాకపల్లి ఆదివాసి స్త్రీల రూపాలు అలానే ఉన్నాయి. వారి తరఫున కొవ్వొత్తుల ప్రదర్శనలు, నిందితులను శిక్షించాలనే డిమాండ్‌తో ఏ యువతరమూ రాకపోవడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? 2010లో హైదరాబాదులోని బోరబండలో అత్యాచారానికి గురయిన 12 ఏళ్ల దళిత బాలిక త్రివేణి సంఘటన ఏ యువతనూ ఆకర్షించ లేకపోయిందనేది పచ్చి నిజం. ఇంకొంచెం వెనక్కి వెళితే మహారాష్ట్రలోని ఖైర్లాంజి సంఘటన నిలువెత్తు గాయంగా ఇంకా సలుపుతూనే ఉంది. మరి ఈ సంఘటనలన్నీ ఆయా సమూహాలకు మాత్రమే పరిమితమయినవిగా ఎందుకు ఉండిపోతున్నాయి? ఢిల్లీ సంఘటనలో మాదిరిగా ఒక సామూహిక ఆగ్రహంగా ఎందుకు మారడం లేదు? దానికి కారణాలేమిటి? ఈ ప్రశ్నలన్నీ సూటిగా ఈరోజు ఆయా సమూహాల నుంచి సంధించబడుతున్నాయి.

ఈ అంశాల నేపథ్యంలో స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలకి వ్యతిరేకంగా ఐదు దశాబ్దాలుగా దేశంలో స్త్రీల ఉద్యమం ముందుకి తెచ్చిన కొన్ని అంశాలను ఒక్కసారి పునఃపరిశీలించుకుందాం. మధుర, రమీజాబి, మాయాత్యాగి, గుంటాబెన్ తదితరులు పోలీసు కస్టడీలో పోలీసులచే జరపబడ్డ అత్యాచారాల నుంచీ, రాజస్థాన్, హర్యానా, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రలోని ఖైర్లాంజిలలో దళిత స్త్రీలపై అగ్రకులతత్వం అత్యంత దారుణంగా జరిపిన లైంగిక అత్యాచారాలు, ఈశాన్య రాష్ట్రాలలో ఆర్మ్‌డ్ ఫోర్సెస్ ఆక్ట్ పేరుతో అక్కడి స్త్రీలపై సాయుధ దళాలు జరుపుతున్న అత్యాచారాలు, కాశ్మీర్‌లో జరుగుతున్న ఉద్యమంలో స్త్రీలపై జరిగిన లైంగిక దాడులు, అత్యాచారాలు, చత్తీస్‌గఢ్ ఆదివాసిలపై నక్సలైట్లనే పేరుతో జరిగిన లైంగిక అత్యాచారాలు, ఇప్పటికీ సుప్రీంకోర్టులో నడుస్తున్న సోనీసోరి ఉదంతం, ఆంధ్రప్రదేశ్‌లో విశాఖ జిల్లాలో నక్సలైట్ల కూంబింగ్ పేరుతో వాకపల్లిలో 10 మంది ఆదివాసి స్త్రీలపై అత్యాచారం చేసిన గ్రేహౌండ్స్ పోలీసులు... ఇది కూడా సుప్రీంకోర్టు విచారణలో ఉంది... నిన్న కాక మొన్న ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ముజఫర్‌పూర్‌లో జరిగిన మతకల్లోలాలలో ముస్లిం మైనారిటీల స్త్రీలు, బాలికల మీద వారి కుటుంబ సభ్యుల ముందే జరిగిన అత్యాచార సంఘటనలు... హర్యానాలో జింద్ పట్టణంలో 20 ఏళ్ల దళిత విద్యార్థినిపై జరిగిన అత్యాచారం, హత్య.....ఇలా చెప్పుకుంటూ వెళితే ప్రతి సంఘటన ఎన్నో విధాన పరమైన ప్రశ్నలను లేవనెత్తుతున్నాయి. వాటన్నిటినీ కూడా విశ్లేషించాల్సిన అవసరం ఈనాడెంతయినా ఉంది. కేవలం ఢిల్లీ సంఘటన ఒక్కదాని చుట్టూనే చర్చను నడపడం ఆ కేసుకు సంబంధించిన తీర్పు ఒక్కటే స్త్రీలపై జరిగే అత్యాచారాలన్నిటికీ సమాధానం అవుతుందనుకుంటే అది చాలా పొరపాటు అభిప్రాయమే అవడమే కాక భవిష్యత్‌లో అనేక సమస్యలకు కూడా దారితీస్తుంది. ప్రభుత్వాలను తమ బాధ్యతల నుంచి తప్పించుకునే వెసులుబాటుని కల్పిస్తోంది.

గత యాభై సంవత్సరాలలో స్త్రీలపై లైంగిక అత్యాచారాలకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా అనేక ఉద్యమాలు జరిగినప్పటికీ ఎప్పుడూ కూడా మరణశిక్ష అనే డిమాండ్ లేదు. బాధితులకు అనుకూలమైన మార్పులు చట్టాలలో ఉండాలని, సత్వర న్యాయవిచారణ జరిపి నేరస్థులను శిక్షించాలని డిమాండ్ చేశారు. కానీ మరణశిక్ష అనే వాదనను స్త్రీల సంఘాలు ఏ రోజూ అంగీకరించలేదు. ఇప్పుడు వర్మ కమిషన్ కు వెళ్లిన కొన్ని వేల ప్రాతినిధ్యాలలో మరణశిక్ష డిమాండ్ లేదు. ముఖ్యంగా స్త్రీలసంఘాల నుంచి. ఇది స్వయంగా ఆయనే రిపోర్టులో వ్యాఖ్యానించారు కూడా.

ఈ నేపథ్యంలో భారతదేశంలో లైంగిక అత్యాచారాల చరిత్రలో కొన్ని కీలక మలుపులుగా చెప్పుకునే కొన్ని సంఘటనలను ప్రస్తావిస్తాను. 1970-80 మధ్యకాలంలో మధ్యప్రదేశ్‌లో మధుర అనే 16 సంవత్సరాల ఆదివాసి యువతిపై పోలీసులు జరిపిన అత్యాచారం కేసులో వెల్లడయిన అనేక అంశాలపై దేశవ్యాప్తంగా స్త్రీల సంఘాలు తమ నిరసన తెలిపాయి. ఆమె పెళ్లి కాకుండానే పరాయి వ్యక్తితో కలిసి వేరే ఊరికి వచ్చిందని, పైగా ఆదివాసిలకు నైతికత పెద్దవిషయం కాదని ఆమెకు నైతిక విలువలుండే అవకాశం లేదని, అంగీకారంతోనే జరిగిందని, కాబట్టి ఇది అత్యాచారం కాదని, పోలీసులు తమ చర్యను సమర్థించుకున్నారు. పై వాదనలతో ఏకీభవించిన సుప్రీంకోర్టు అత్యాచారం జరిపిన ఇద్దరు పోలీసులను నిర్దోషులుగా విడుదల చేసింది. స్వాతంత్ర్యా నంతర భారతంలో వ్యవస్థీకృతంగా స్త్రీలపై సాగుతున్న అణచివేత దానిలో ఇమిడి ఉన్న అనేక భావజాల అంశాలను ఈ సంఘటన సమాజం ముందుకి తీసుకువచ్చి నిలిపింది. రాజ్యాంగం ఇచ్చిన హామీలను నెరవేర్చడంలో ప్రజాప్రతినిధులకు, న్యాయస్థానాలకు ఉన్న బాధ్యత ఎలా ఉండాలి అనే అంశంపై విస్తృతమైన చర్చ జరిగింది. కులం, వర్గం ఈ అంశాలను ఏ విధంగా ప్రభావితం చేస్తున్నాయనే దానిపై గూడా చాలా చర్చ జరిగింది. 'నిరక్షరాస్యులు, శ్రామికులు, రాజకీయంగా గొంతులేని మధుర వంటి వర్గాలు ఇప్పటి రాజ్యాంగ పూర్వపు ఇండియాకే పరిమితమైపోయి ఖండించబడతారా' అంటూ ఈ అంశం మీద నలుగురు న్యాయశాస్త్ర అధ్యాపకులు సుప్రీంకోర్టు న్యాయమూర్తికి ఒక బహిరంగ లేఖ ద్వారా సూటిగా అనేక ప్రశ్నలు వేయడంతో కూడా ఈ చర్చ అనేక సమూహాల్లో మరింత బలోపేతం అయింది.

మధుర కేసులో ముందుకి వచ్చిన ఆందోళనల్లో ప్రధానమైనవి చట్టాలలో రావలసిన అనేక మార్పులు. దీనివల్లనే ముఖ్యంగా ఎవిడెన్స్ ఆక్ట్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్, ఇండియన్ పీనల్ కోడ్‌లలో కస్టడీలో అత్యాచారం అనే కేటగిరీని ప్రవేశపెట్టారు. అయితే ఈ మార్పులు ఏ మాత్రం సరిపోలేదని వివిధ పరిశోధనల్లో తేలిన అంశం. అధికారంలో ఉన్నవాళ్లు చేసే అత్యాచారాలను వ్యతిరేకిస్తున్నప్పటికీ ఎన్నో పోరాటాల తర్వాతనే ఇది పౌరహక్కుల చట్టంలో సవరణగా వచ్చింది. అయితే చట్టంలో, అమలులో ఉన్న లోపాలు అలాగే కొనసాగుతున్నాయనేది కూడా స్పష్టమవుతూ వస్తోంది. ఒక్కొక్క సంఘటనలో ముందుకి వస్తున్న ప్రశ్నలతో స్త్రీల ఉద్యమం అవగాహన కూడా విస్తృతమవుతూ వచ్చింది. పూర్వపు చట్టంలోని క్లాజుల్లో అత్యాచారం నిర్వచనం వైవాహిక అత్యాచారానికి వర్తించదు. అలాగే అత్యాచార చట్టంలో పద్దెనిమిది సంవత్సరాలకన్నా ముందే జరిపే సంపర్కానికి కూడా సమ్మతి అవసరం లేదు. అత్యాచారాన్ని నిర్ణయించడంలో బాధితురాలి శీలాన్ని పరిగణనలోకి తీసుకోకూడదనే మార్పు వచ్చినప్పటికీ దానికి విరుద్ధంగా పాత క్లాజులే ఉపయోగించబడుతున్నాయి. అత్యాచారం విషయంలో శీలం, నైతికతతో ముడిపెట్టడం జరగకూడదని స్త్రీల సంఘాలు మొత్తుకుంటున్నా గానీ అవే ప్రధాన విషయంగా మారుతున్నాయి. దీనికి హైదరాబాదులో రమీజాబి అనే ముస్లిం స్త్రీపై జరిగిన అత్యాచార ఉదంతమే ఒక పెద్ద ఉదాహరణ. 1977లో హైదరాబాద్ నగరంలో

రమీజాబి అనే స్త్రీపై పోలీసులు అత్యాచారం జరిపారు. ఆమె వేశ్య కాబట్టి అది అత్యాచారం కిందకు రాదని పోలీసు వ్యవస్థ దుర్మార్గంగా వాదించింది.

వ్యవస్థీకృత ఆధిపత్య కులసమాజం స్త్రీలపై ఏ విధంగా లైంగిక హింసోన్మాద చర్యలకు పాల్పడుతుందో పెద్ద ఉదాహరణ భావరీదేవి ఉదంతం. రాజస్థాన్ ప్రభుత్వం నిర్వహిస్తున్న బాలికాభివృద్ధి కార్యక్రమంలో గ్రామ కార్యకర్తగా పనిచేస్తున్న భావరీదేవి ఒక ఊరిలో జరుగుతున్న అగ్రకులస్తుల బాల్యవివాహాన్ని అడ్డుకున్నందుకు అగ్రకుల పురుషుల చేతిలో సామూహిక అత్యాచారానికి గురయింది.

ఈ అంశంపై కొన్ని స్త్రీల సంఘాలు కలిసి పని చేసే చోట స్త్రీలకు ఎదురవుతున్న లైంగిక వేధింపులు, అత్యాచారాల మీద సుప్రీం కోర్టులో ఒక పిటిషన్ వేశాయి. ఈ అంశాలు నిరంతరం చర్చల్లో భాగమవుతున్నా గానీ దీనికి ఒక రూపం తీసుకురావడానికి భావరీదేవి ఉదంతమే కారణం. ఈ సందర్భంగా విభిన్న ప్రదేశాల్లో లైంగిక వేధింపులను, అత్యాచారాలను ప్రశ్నిస్తూ స్త్రీల సంఘాలు 'విశాఖ' అనే వ్యక్తి పేరుతో వేసిన పిటీషన్‌ను పరిశీలించిన సుప్రీం కోర్టు 1997 ఆగస్టు 13న ఒక ఉత్తర్వును జారీ చేసింది. దీనినే విశాఖ గైడ్‌లైన్స్ అంటారు. దీనిలో ముఖ్యమైనవి: స్త్రీలు లైంగిక వేధింపులకు (మాట కావొచ్చు, చూపు కావొచ్చు, స్పర్శ కావొచ్చు) గురికాకుండా చూసే బాధ్యత, ఒకవేళ జరిగితే ఆయా సంఘటనలపై సక్రమంగా విచారణ చేసి అందుకు బాధ్యులైన వారి మీద చర్య తీసుకోవడం, యాజమాన్యాల, అధికారుల బాధ్యత అవుతుందని, ఈ ఉత్తర్వుల సారాంశాన్ని ప్రతి కార్యాలయం లోనూ స్పష్టంగా కనిపించే విధంగా ప్రదర్శించాలని, ప్రభుత్వ ఉద్యోగుల నియమావళిలో వీటిని తప్పనిసరిగా పొందు పరిచి, శిక్షార్హమైన చర్యగా గుర్తించాలని, ప్రైవేట్ రంగంలో అయితే, పరిశ్రమల ఉద్యోగ చట్టంలో వీటిని చేర్చాలని వీటికి సంబంధించిన ఫిర్యాదులను పరిశీలించడానికి, స్త్రీయే నిర్వహణాధికారిగా ఉన్న కమిటీని ఏర్పాటు చేయాలని, తప్పనిసరిగా మహిళా సంఘాల ప్రాతినిధ్యం ఉండాలని, ఏ ఫిర్యాదునైనా నిర్ణీత కాలవ్యవధిలో పరిశీలించి, రిపోర్టు తయారు చేసి, చర్య తీసుకునే విధంగా సంబంధిత శాఖలకు అందచేయాలని, బాధితురాలిని మరింత మానసిక సంఘర్షణకు గురి చేసే విధంగా విచారణ ఉండకూడదని, కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు, సంబంధిత శాఖలు, పబ్లిక్, ప్రైవేటు యాజమాన్యాలు వెంటనే ఈ ఉత్తర్వులను అమలు పరచాలని సుప్రీం కోర్టు స్పష్టంగా ఆదేశించింది. అయితే ఈ అంశాల అమలు అంత సులభంగా జరగలేదు అనేకంటే చాలాచోట్ల ఇది అమలు కాలేదనే చెప్పాలి. చాలామంది అధికారులకి ఇలాంటి ఉత్తర్వు ఉందని తెలియక పోగా ఇలాంటి సంఘటనలు ఎదురైనప్పుడు ఇవేవీ మాకు వర్తించవు అని మూర్ఖంగా కూడా వాదించడం జరిగింది. ఎవరైనా ఫిర్యాదు చేస్తే అది వారి వ్యక్తిగత చర్యగా చిత్రించడం, మద్దతుగా నిలబడిన వారి మీద క్రమశిక్షణా చర్యలు తీసుకుంటామనే బెదిరింపులు, మద్దతుగా ఉండే స్త్రీల సంఘాలని తమ కార్యాలయాల్లోకి రానివ్వక పోగా, వాళ్లని బయటి వ్యక్తులుగా చిత్రించడం, బాధితురాలిని మరింత మానసిక క్షోభకు గురిచేసే విధంగా యాజమాన్యాలు ప్రవర్తించడం అనేక సంఘటనల్లో అనుభవమే. (ఈ అంశాలే మార్పులు చేర్పులతో ఆర్డినెన్స్ రూపంలో మార్చ్ 2013లో భారత పార్లమెంటు ఆమోదించింది.) బాధితులకు వ్యతిరేకంగా, నిందితులకు వత్తాసుగా పోలీసు యంత్రాంగం, ఇతర వ్యవస్థలు పనిచేయడం అనేక సంఘటనల్లో కనిపిస్తోంది.

అన్నిటికంటే దుర్మార్గమైన అంశం భన్వరీదేవి ఉదంతంలో కేసును కొట్టివేసే తీర్పును ప్రకటించే ముందు సుప్రీంకోర్టు న్యాయమూర్తి ఒకరు వెలిబుచ్చిన అభిప్రాయం ఏమిటంటే 'అగ్రకుల పురుషులు ఒక కింది కులం స్త్రీని రేప్ చేయడం ద్వారా తమని తాము కించపరుచుకోరు'.

పై సంఘటనలను గమనిస్తే, మధుర, రమీజాబీ విషయాల్లో కస్టడీలో స్త్రీలపై జరిగే అత్యాచారాలతో పాటు అనేక పురుషాధిపత్య పితృస్వామ్య భావజాలాల ప్రభావం ఏలా ఉంటుందనేది ముందుకు వస్తే, భావరీదేవి ఉదంతం నిచ్చెనమెట్ల కులవ్యవస్థ దళితులపై జరిపే అత్యాచారాలకు న్యాయవ్యవస్థలో అత్యున్నత స్థానంలో ఉన్నవాళ్లు కూడా ఎలా ప్రతిస్పందిస్తారో తెలియజేస్తుంది.

స్త్రీల మీద అత్యాచారాలు జరిపే వారికి 'మరణశిక్ష' ఒక్కటే సరైన శిక్ష అనే భావనను మరింత బలోపేతం చేస్తూ ఢిల్లీ సంఘటనలో తీర్పు రావడం యాధృచ్ఛికమైతే కాదు. అయితే ఇక్కడ వర్మ కమిషన్ మరణశిక్ష అనేది అత్యాచారాలకు పరిష్కారం కాదని చెప్పిన అంశాన్ని మరొక్కసారి గుర్తుచేసుకోవాలి. ఎంతటి హీనమైన క్రూరమైన నేరానికైనా మరణ శిక్ష సమాధానం కాదని, అందుకు పాలనా పరంగా తీసుకోవలసిన ఎన్నో పరిష్కారాలను అన్వేషించాలని అందుకు ప్రభుత్వం చాలా ప్రయత్నం తీసుకోవాల్సి ఉంటుందని చాలా స్పష్టంగా పేర్కొన్నారు. మరణశిక్షలకు బదులు నిందితులకు శిక్షాకాలాన్ని పొడిగించడం కూడా ఒక పరిష్కారమార్గంగా సూచించారు. నిజానికి వర్మ కమిషన్ చెప్పిన అనేక ముఖ్య అంశాల ప్రాముఖ్యతను ప్రభుత్వం ఎంతవరకు పట్టించుకుందనేది ప్రశ్నార్థకమే.

ఎంత కఠినమై శిక్ష ఉంటే, అప్పుడు స్త్రీలకు రక్షణ ఉంటుందని, కఠినశిక్షలకు భయపడి లైంగిక పరమైన దాడులు జరగవనేది అనేది సమాజంలోని అనేకమందికి ఉన్న బలమైన అభిప్రాయం. శిక్షలను బట్టి నేరాలు జరగవనేది ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. నేరం జరగడానికి అవకాశం కల్పిస్తున్న సామాజిక పరిస్థితులలో మార్పులు జరగకుండా కేవలం కఠిన శిక్షలు ఉండడం ద్వారా నేరాల తీవ్రత తగ్గుతుందా? వెంటనే, నేరానికి అసలు శిక్షే ఉండకపోతే ఎట్లా అనే గందరగోళంలోకి, మూర్ఖత్వంలోకి వెళ్లిపోయేవారు చాలా మందే ఉన్నారు. శిక్షకు, మరణశిక్షకు మధ్య ఉన్న అంతరాన్ని తెలుసుకోవడం అవసరం. అసలు శిక్షలే ఉండొద్దని కాదు ఈ చర్చంతా. కానీ నేరాలను అదుపు చేయడానికి ఏ విధమైన రక్షణ వ్యవస్థలు ఉండాలని చర్చించడం అవసరం. వాటి అమలు మీద దృష్టి కేంద్రీకరించడం, ప్రభుత్వం తీసుకోవాల్సిన వ్యవస్థీకృత మార్పుల గురించి పనిచేయడం. నేరాలకి శిక్షలకు ఉండేటటువంటి సంబంధం అంత తేలికైన విషయమేమీకాదు. నిజానికి కఠినశిక్షలే ప్రామాణికమనుకుంటే ఈసరికి స్త్రీల మీద నేరాలే కాదు ఇంకా చాలా రకాల హింసలు కూడా కఠినమైన శిక్షలకు, చట్టాలకు భయపడి కనుమరుగై ఉండాల్సింది. కానీ చరిత్రలో అలా జరిగిన దాఖలా ఎక్కడా లేదు. నేరాలకి ఉండే అనేక స్వభావాలు, సామాజిక కోణాలు, రాజకీయ నేపథ్యాలు పరిగణనలోకి తీసుకోకుండా కేవలం కఠినమైన శిక్షలే పరిష్కారమార్గంగా చూస్తున్నామంటే ఎంత భ్రమ పూరితమైన ప్రపంచంలో ఉన్నామో అనిపిస్తోంది. ఇతర ఏ నేరాల గురించయినా కొంత సానుభూతితో చూడొచ్చు కానీ, స్త్రీల మీద అత్యాచారాలు చేసే వారికి మాత్రం కచ్చితంగా మరణ శిక్ష పడాల్సిందే అని వాదిస్తున్నవారు నిజంగా పరిశీలించాల్సిన అంశాలు చాలా ఉన్నాయి. చాలా సందర్భాలలో అత్యాచార సంఘటనలు అనేక సామాజిక కారణాల

వల్ల అసలు వెలుగులోకే రావు. ఒకవేళ వచ్చినా ఆ స్త్రీలకు కుటుంబం, సమూహం, పోలీసు స్టేషన్ల దగ్గరనుంచి కోర్టుల వరకూ అడుగడుగునా అడ్డంకులు, అవమానాలు ఎదురవుతూనే ఉంటాయి. అత్యాచారం కేసుల్లో న్యాయస్థానాల్లో ఎలాంటి అమానవీయమైన ధోరణులు ఉంటాయో చెప్పడానికి భన్వరీదేవి సంఘటనే ఒక ఉదాహరణ. నిమ్న కులాలకు చెందిన స్త్రీలను అగ్రకులస్తులు తాకను కూడా తాకరు కాబట్టి, అసలు అత్యాచారం ప్రసక్తే ఉండదని కేసుని కొట్టేసిన సుప్రీంకోర్టు జడ్జి తీర్పుని గమనించాలి. ఇలాంటి తీర్పులను ఆహ్వానించిన కొన్ని జాతీయపార్టీల స్వభావాలను అర్థం చేసుకోవాలి. కనీసపాటి శిక్ష కాదు కదా, కనీసం నేరం జరిగిందని నిరూపించడానికి కూడా ఈ స్త్రీలకు ఎన్నో రకాల అడ్డంకులు వస్తూనే ఉంటాయి. అత్యాచారాలకు సంబంధించి ఇంతకు ముందు చట్టాలు, ఇప్పటి నిర్భయ చట్టంతో సహా అనేక లొసుగులతో ఉన్నాయి. నమోదు చేసిన కేసులు కూడా ఈ లొసుగుల వల్ల చివరి వరకూ నిలబడలేక పోతున్నాయి, పోతాయి కూడా. అత్యాచారానికి గురైన వారికి అందించాల్సిన చట్టపరమైన ఆర్థిక రక్షణలతో పాటు, సామాజిక సానుభూతి పెంచడం పై తీవ్రంగా ఎక్కువ ఆలోచించాలి. ఇప్పటికీ అత్యాచారం అంశాన్ని మానం, పాతివ్రత్యం, శీలంలాంటి పురుషాధిపత్య భావజాల ప్రభావంతో ఆలోచించడం మానేయాలి. అత్యాచారాన్ని స్త్రీల మీద జరుగుతున్న భయానక హింసారూపంగా చూడాలి. దానిపై చట్టపరంగా తీసుకోవాల్సిన మార్గాల గురించి ఆలోచించాలి. చట్టాలు, పోలీసు వ్యవస్థ, కోర్టులు ఈ అంశాల మీద నిష్పక్షపాతంగా స్పందించాలని డిమాండ్ చేయాలి.

**కేంద్ర ప్రభుత్వంతో సహా అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తక్షణం తీసుకోవాల్సిన చర్యలు :** గ్రామాలు, పట్టణాలు, నగరాలతో సహా స్త్రీలకు 24 గంటలూ అందుబాటులో ఉండే విధంగా ప్రజారవాణా వ్యవస్థను ఏర్పరచాలి. ప్రమాదంలో ఉన్న స్త్రీలు, ఆడపిల్లలను రక్షించే విధంగా 108 లాంటి సర్వీసులను ప్రత్యేకంగా పెట్టాల్సిన అవసరం ఎంతైనా ఉంది. లైంగిక హింసలకు గురయిన వారిపట్ల పోలీసులు, వైద్య సిబ్బంది వ్యవహరించే విధానం మానవీయంగా ఉండాలి తప్ప మరింత అవమానపరిచేదిగా ఉండకూడదు. అలా ఉన్నట్లయితే వారిని కూడా తక్షణమే శిక్షించే విధంగా చట్టాలలో మార్పులు రావాలి. పోలీసు, మిలటరీ, పారా మిలటరీ వ్యవస్థలు జరుపుతున్న లైంగిక అత్యాచారాలను ప్రభుత్వం సమర్థించడం మాని, వారి చర్యలను నిరోధించడానికి తక్షణమే చట్టపరమైన మార్పులు తీసుకురావాలి. అత్యాచార సంఘటనలను వ్యతిరేకిస్తున్న కార్యకర్తలను, సంఘాలను పోలీసులు టార్గెట్ చేసి వేధించడాన్ని తీవ్రమైన చర్యగా ప్రభుత్వం పరిగణించాలి. బహిరంగ ప్రదేశాలలో స్త్రీలపై పెరుగుతున్న దాడులను అరికట్టడానికి తగిన రక్షణ చర్యలు చేపట్టాలి కానీ, స్త్రీలు పరిమిత సమయాల్లోనే బయటకు రావాలనే సంకుచిత ధోరణిని తీవ్రంగా వ్యతిరేకించాలి. అలాంటి స్టేట్‌మెంట్లు ఇచ్చే వ్యక్తులు, సంస్థలు వారు ఎంతటి ఉన్నత, అధికార స్థాయిలో ఉన్నా గానీ తక్షణమే వారిని అరెస్టు చేసి చట్టపరమైన చర్యలు తీసుకోవాలి. పోలీసు స్టేషన్లలో రిపోర్టు చేయడానికి వచ్చే బాధిత స్త్రీలను గౌరవప్రదంగా చూడాలి తప్ప వారిని మరింత క్షోభకు గురిచేసే విధంగా ఉండకూడదు. పురుష, మహిళా పోలీసులకు ఈ విధమైన వృత్తిపరమైన శిక్షణ అత్యవసరం. నిర్దేశించిన సమయానికే ఛార్జిషీట్లు ధాఖలు చేయాలి. నిందితుల వైపు నుంచి స్త్రీలకు వచ్చే బెదిరింపులు, వేధింపుల మీద పోలీసులు తక్షణమే చర్యలు తీసుకోవాలి. ఇలాంటి సందర్భాలలో నిందితులకు బెయిల్ లాంటివి మంజూరు చేయకూడదు. కోర్టులలో విచారణ సత్వరమే జరగాలి. సంవత్సరాల తరబడి జరగకూడదు. మహిళా న్యాయమూర్తుల, ప్రాసిక్యూటర్‌ల సంఖ్య ఎక్కువగా పెరగాల్సిన అవసరం ఉంది. న్యాయమూర్తులకు కూడా బాధిత స్త్రీలతో వ్యవహరించాల్సిన ప్రొసీజర్స్‌పై శిక్షణ ఇవ్వాల్సి ఉంటుంది. న్యాయమూర్తులు, లాయర్లు, ప్రాసిక్యూటర్లు క్రాస్ ఎగ్జామినేషన్ పేరుతో అతిక్రమించకూడని అంశాల గురించి బహిరంగంగా ప్రతికోర్టులోనూ వివరంగా ప్రదర్శించే విధంగా ఏర్పాట్లు చేయాలి. బాధిత స్త్రీలకు అవసరమైన శారీరక, మానసిక వైద్య సహాయం ప్రభుత్వమే తన ఖర్చుతో అవసరమైనంతకాలం అందించాలి. ప్రభుత్వ ఆసుపత్రులలో ఈ అవకాశం లేకపోతే ప్రైవేటు ఆసుపత్రులకు పంపించి వైద్యం చేయించాలి. మానసికంగా కోలుకునేందుకు అవసరమైన వైద్యపర్యవేక్షణను అందుబాటులో ఉంచాలి. వీటితో పాటు కోర్టులో కేసు నడుస్తున్నంత కాలం బాధితులకు ఆర్థికపరమైన సహాయాన్ని అందించాలి. బాధితులు పిల్లలైన పక్షంలో మరిన్ని రక్షణ వ్యవస్థలను కల్పించాలి. ప్రసారసాధనాల్లో బాధిత స్త్రీలు, పిల్లల హక్కులకు భంగం కలిగే విధంగా, వారిని గుర్తించే విధంగా పదే పదే చూపించకూడదని స్పష్టమైన ఆదేశాలు ప్రభుత్వం ఇవ్వాలి. ఉల్లంఘించిన వారిపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలి. ప్రకటనల్లో, సీరియల్స్‌లో స్త్రీలను, పిల్లలను కించపరిచేవిధంగా, హింసను ప్రేరేపించేవిధంగా చూపించటాన్ని ఆపివేయాలి. సందర్భానుసారం అలాంటివి చూపించాల్సి వస్తే వెంటనే వాటి కింద ఇవి చట్టప్రకారం శిక్షార్హమైన నేరాలని తెలియజేస్తూ ఆయా చట్టాల పేర్లతో సహా స్లైడ్‌లు చూపించాలి.

ఇన్ని రకాలైన పాలనా చర్యలు తీసుకొమ్మని డిమాండ్ చేయడం అంటే ప్రభుత్వపరంగా అనేక విధాలైన పరిపాలనా ప్రక్షాళనలకు శ్రీకారం చుట్టడమే. అంతే తప్పించి కేవలం మరణశిక్షే అసలైన శిక్ష అనడం అనేది మనకు మనంగా ప్రభుత్వాలు తాము చేయాల్సిన అసలైన బాధ్యతల నుంచి నిష్పూచిగా తప్పించడమే అవుతుంది.

ప్రపంచంలో మరణశిక్షను రద్దుచేసిన దేశాలు, చట్టంలో ఉన్నా గానీ అమలు పరచని దేశాలు మొత్తం 140, అమలు పరుస్తున్నవి 58. అమలు పరుస్తున్న వాటిలో భారతదేశం కూడా ఉందన్న విషయాన్ని మనం మళ్లీ చెప్పుకోవాల్సిన అవసరం లేదు. అయితే భారత ప్రభుత్వం జండర్ సమన్యాయం ఉండేలా చూస్తానని అంతర్జాతీయంగా బాధ్యత పడిన హక్కుల ఒడంబడికలు ఉన్నాయి. వాటిని పట్టించుకోవడమంటేనే సామాజిక పరంగా ఏ రకమైన వివక్షతలు లేకుండా నిష్పక్షపాతమైన పరిపాలనా వ్యవస్థలను అందించి, హింస, దౌర్జన్యాల నుంచి స్త్రీలకు, అణగారిన వర్గాల, కులాలకు, మతాలకు, పిల్లలకు రక్షణ కల్పిస్తామని చెప్పడం. ఆ దిశగా తీసుకోవాల్సిన చర్యలకు బాధ్యత వహించడం జరగాలి.

చివరగా, నేరస్వభావపు మూలాలను పట్టించుకోకుండా, వాటిని కూకటివేళ్లతో పెకిలించి వేసే విధంగా విధానాల రూపకల్పన జరగకుండా కేవలం నేరస్థులను మాత్రం అంతమొందించే వ్యవస్థ ను కోరుకోవటం, బలోపేతం చేయాలని అనుకోవటం ప్రజాస్వామిక స్ఫూర్తికే విరుద్ధమైన అంశం. మనుషుల మంచి చెడుల ప్రాతిపదికన జీవించే హక్కును రద్దు చేయడం ఉండకూడదని ఐక్యరాజ్యసమితి మానవహక్కుల ప్రకటన వచ్చి 60 సంవత్సరాలు పైనే అవుతోంది. ఆ స్ఫూర్తి ని నిలబెట్టే వైపుగా పౌరసమాజం కృషి ఉండాలి.

*(రచయితలు సామాజిక కార్యకర్త)* వీ

# నిర్భయ తీర్పు మానవీయం కాదు

*శిక్ష అనేది మనిషిలో మానసిక పరివర్తన తీసుకురావాలి కాని మనిషిని భౌతికంగా లేకుండా చేసే మార్పు సమాజ మార్పుకు దోహదపడదంటున్నారు.* **చిమ్మె జాన్ బర్నబాస్**

**2012** డిసెంబర్ 16న తన మిత్రునితో పాటు ఢిల్లీలో బస్సులో ప్రయాణిస్తున్న పారా మెడికల్ విద్యార్థిని జ్యోతిసింగ్‌పాండేపై జరిగిన సామూహిక అత్యాచారం, దాడి చేయడం, హత్యాయత్నం (తర్వాత కొద్ది రోజులకు మరణించడం జరిగింది.) కేసులో దోషులను కఠినంగా శిక్షించాలని దేశ వ్యాప్తంగా, పలు విద్యార్థి, యువజన సంఘాలు, రాజకీయ పక్షాలు ఉద్యమించి, ప్రపంచ వ్యాప్తంగా ఈ కేసుకు గుర్తింపు తెచ్చాయి. ఈ నేపథ్యంలో భారత పార్లమెంట్ 'నిర్భయ' పేరుతో ఒక కొత్త అత్యాచార వ్యతిరేక చట్టం రూపొందించింది. ఈ చట్టానికి ముందు సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్. జెఎస్. వర్మ కొన్ని ప్రతిపాదనలు, సూచనలు, భారత ప్రభుత్వానికి సూచించారు. ఈ అమానుషానికి పాల్పడిన నిందితులైన (1) అక్షయ్‌కుమార్ (2) వినయ్‌శర్మ (3) పవన్‌గుప్తా (4) ముఖేశ్ సింగ్‌లకు ఢిల్లీలోని సాకేత్ జిల్లా న్యాయస్థానం 2013 సెప్టెంబర్ 13న తీర్పు వెలువరిస్తూ, నిందితులందరికీ ఉరిశిక్షను ఖరారు చేసింది. ఈ కేసులో ప్రధాన నిందితుడు, రాంసింగ్ మార్చ్ 11న ఢిల్లీలోని తీహార్ జైలులో ఆత్మహత్య చేసుకున్నాడు. (జైలులో హత్య కావించబడ్డాడు.) ఒక 18 సంవత్సరాలలోపు (మైనర్) బాల నేరస్తునికి ఢిల్లీ జువైనల్ కోర్టు మూడేళ్ల జైలు శిక్ష విధించింది.

బాధితురాలి పట్ల రాక్షసంగా ప్రవర్తించినందుకే ఈ కేసులో నలుగురు దోషులకు 'ఉరి శిక్ష'ను ఖరారు చేసినట్లు న్యాయమూర్తి శ్రీ యోగేశ్‌ఖన్నా ప్రకటించారు. కేంద్ర హోంశాఖ మంత్రి సుశీల్‌కుమార్ షిండే - 'నిర్భయ' కుటుంబానికి న్యాయం జరిగిందనీ, విద్రోహులకు ఈ తీర్పు మరణ శాసనమవుతుందని కూడా వ్యాఖ్యానించారు.

'ఉరి శిక్ష' అనేది మొత్తంగానే సరైంది కాదనీ, నేరస్తుడు తన తప్పును తెలుకొని, జీవితాంతం కృశించాలనీ, అలాంటి వారిని చూసి, మిగతా నేరస్తులూ భయపడాలనీ, 'నేరం' చేయడానికి ముందుకు రావడానికి కొంతమందైనా భయకంపితులవుతారనీ, మహిళలపై సామాజిక దృక్కోణంలోనే ప్రధానంగా మార్పు రావాలనీ, అత్యాచార నిందితులకు 'జీవితకాల శిక్ష' విధిస్తే సరిపోతుందనీ దేశంలోని చాలా మహిళా సంఘాలూ, హక్కుల సంస్థలు భావిస్తున్నాయి. ఈ అత్యాచార ఘటనను దేశంలో తరతరాలుగా, స్త్రీల అణిచివేతలో భాగంగా చూడాలనీ, స్త్రీలను వ్యాపార వస్తువుగా, శృంగార సాధనంగా పరిగణిస్తూ, ప్రస్తుతం దేశంలో 'ఆధునికత' పేరుతో వెర్రితలలు వేస్తున్న 'విశృంఖల' సంస్కృతి, 'సామ్రాజ్యవాద ప్రపంచీకరణ'లో భాగంగా విస్తృతమవుతున్న భావజాలంగా చూడాలని, కొన్ని మహిళా సంఘాలు, హక్కుల సంస్థలూ భావిస్తున్నాయి.

నిందితుల తరఫున వాదించిన న్యాయవాది ఎపి. సింగ్ సాకేత్ కోర్టు బయట మాట్లాడుతూ, 'సాక్ష్యాధారాలను పరిశీలించి, చట్టబద్ధంగా, ఆలోచించకుండా, రాజకీయ ఒత్తిళ్లకు లోనైన న్యాయమూర్తి ఆ నలుగురు నిందితులకు మరణ శిక్ష విధించారనీ, మూడు నెలల లోపు దేశంలో ఏ మూలనైనా, ఈ తీర్పు ప్రభావంతో ఒక్క అత్యాచారం కూడా జరగని పక్షంలో తాను హైకోర్టు (అపీలు)కు వెళ్లననీ, తాను కూడా ఉరి వేసుకుంటానని కూడా వ్యాఖ్యానించారు.' ఈ తీర్పు వల్ల నిందితులకు సరైన న్యాయం ట్రయల్ (విచారణ) కోర్టులో జరుగలేదని కూడా బహిరంగంగానే, డిఫెన్స్ న్యాయవాది ఎపి. సింగ్ వ్యాఖ్యానించారు.

వాస్తవానికి, నిర్భయకేసు, ఆ తర్వాత ఏర్పడిన జస్టిస్ వర్మ కమిటీ, కేంద్ర ప్రభుత్వానికి చేసిన సిఫారసులలో దోషుల నేర నిరూపణ అయితే, 'మరణ శిక్ష' విధించాలనీ కూడా లేదు. 20 సంవత్సరాల వరకు జైలు శిక్ష విధించవచ్చునీ నిర్ధారించింది. 'జైలుశిక్ష' అనేది నిందితులలో 'పరివర్తన' తీసుకొని రావడానికి తప్ప, వారి జీవితాలను ముగించడానికి మాత్రం కాకూడదని దీని గూఢార్థం! దీనిని ఢిల్లీ సాకేత్ కోర్టు న్యాయమూర్తి యోగేవ్ ఖన్నా పట్టించుకున్నట్లు లేదు. ప్రపంచ వ్యాప్తంగా, 2012 సంవత్సరం నాటికి 140 దేశాలు, 'మరణశిక్ష'ని రద్దు చేశాయి. చాలా దేశాల్లో మరణశిక్ష అనాగరికమని వ్యాఖ్యానిస్తున్నారు.

నిర్భయ చట్టం ప్రకారం, అత్యాచార ఘటనలో బాధితురాలు తీవ్రంగా గాయపడి, ఆ తర్వాత మరణించినా, లేదా శాశ్వతంగా అచేతన స్థితిలో ఉండిపోయినా, నేరస్తులకు కనీసం 20 సంవత్సరాలు జైలుశిక్ష పడాలి. నేరస్తుడు జీవించి ఉన్నంతకాలం జైలు లేదా మరణశిక్ష విధించవచ్చని చట్టంలో నిర్దేశింపబడింది. కానీ, ఈ చట్టం అమలులోకి వచ్చిన తర్వాత, ఈ 6-7 నెలల కాలంలోనే దాదాపుగా దేశ వ్యాప్తంగా 300 అత్యాచార సంఘటనలు నమోదయ్యాయి. కఠిన చట్టాలు వచ్చినా నేరగాళ్ల ప్రవృత్తి మారడంలేదు. కఠిన చర్యల ద్వారానే నేరగాళ్ల ప్రవృత్తిలో మార్పు సాధించవచ్చనీ, పార్లమెంటరీ స్థాయి సంఘం కూడా అభిప్రాయపడింది.

దేశ జనాభాలో సగానికిపైగా మహిళలు ఉంటున్నప్పటికీ, వారి సంక్షేమానికీ, భద్రతకూ నిర్దేశించిన నిధులు కనీసం 25-30 శాతం మించడంలేదు. పాఠశాల స్థాయి నుంచే బాలికలను తీర్చిదిద్దాలి. అత్యాచార యత్నాలను తిప్పికొట్టేందుకు తగిన మానసిక స్థైర్యాన్ని విద్యార్థినులను తీర్చిదిద్దే క్రమంలోనే సమాంతరంగా కృషి జరగాలి. అందుకు తల్లిదండ్రులూ, అన్నదమ్ములు, తోటి మిత్రులందరూ బాలికలకు ప్రోత్సాహాన్ని ఇవ్వాలి.

శిక్షలు వేస్తూపోతే ఈ వ్యవస్థలో 'నేరా ప్రవృత్తి' దానంతట అదే తగ్గిపోతుందనే భావన కూడా సరికాదు - అది కూడా న్యాయ సమ్మతంకాదు. ఎందుకనగా, ఈ దేశంలో దర్యాప్తు సంస్థలూ, దర్యాప్తు అధికారులంతా 'సచ్చీలురు' అని భావించడానికి వీలులేదు. దర్యాప్తు వేగంలో ఎవరైనా అమాయకుడు 'నిందితుడు'గా మారిపోతే, ఆ నిందితునికి శిక్ష విధిస్తే అందుకు ఎవరిని బాధ్యులను చేయాలి? 'నూరు మంది దోషులు శిక్ష నుంచి తప్పించుకున్నా పర్వాలేదు కాని ఒక్క నిర్దోషికి శిక్ష విధించకూడదు!' అనే ఆధునిక న్యాయసూత్రం ఆ సందర్భంలో వివాదాస్పద మవుతోంది. కావున దర్యాప్తు కూడా నిజాయితీగా ఉండాలి. ఏ సమస్యకైనా 'ఉరి శిక్ష' పరిష్కారం కాదు. ఉరి శిక్ష రద్దు కోరుతున్న ఆధునిక సమాజంలో జీవిస్తున్న మనం ఆ దిశగా పయనించకుండా, తిరోగమన దిశలో పయనించడం మానవీయం అనిపించుకోదు - ప్రజాస్వామికం కాదు!!

*(రచయిత న్యాయవాది, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)*

వీ

# ముజఫర్ నగర్ మత కల్లోలాలు

*చరిత్రలో జరిగినట్టుగానే ఓటు రాజకీయాలే ముజఫర్‌నగర్ మతకల్లోలాలను ప్రేరేపించాయనీ, ఈ దుర్మార్గ రాజకీయాల వల్ల సామాన్య ప్రజల మధ్య విద్వేషాలు పెరిగి హింసాకాండ జరుగుతోందనీ అంటున్నారు* **సజ్జాద్ హుసేన్**

మేరా భారత్ మహాన్ అనీ, ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్యమనీ గొప్పలు చెప్పుకుంటున్న దేశంలో ప్రజాజీవన రంగాలలో మతోన్మాద హింస ఇంకా ప్రధాన పాత్ర వహిస్తూ ఉండడం, సమాజాన్ని, వోటర్లను మత ప్రాతిపదికపై విభజిస్తూ ఉండడం నిజంగా సిగ్గుచేటు. ఒకవైపు లౌకిక రాజ్యమని చెప్పుకుంటూ ఉండగానే, కొందరు రాజకీయ నాయకులు ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలతో, ఒక మత సమూహం గురించి మూస చిత్రణలతో బహిరంగంగా మతోన్మాద హింసను రెచ్చగొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. అడ్డూ అదుపూ లేని అంతర్జాలంలో వ్యాపిస్తున్న సోషల్ మీడియా యూ ట్యూబ్ వంటి సాధనాల ద్వారా వక్రీకరించిన, రెచ్చగొట్టే విడియో దృశ్యాలను ప్రదర్శిస్తున్నాయి. అవి సెకన్లలో లక్షలాది మంది మొబైల్ ఫోన్ వినియోగదారులకు చేరి పరస్పర శత్రుత్వాన్ని, ఉద్రేకాన్ని రగిలిస్తున్నాయి.

ఇటువంటి పరిణామాలతోనే తాజాగా తగులబడిపోయిన పట్టణం ముజఫర్ నగర్. ఉత్తరప్రదేశ్ పశ్చిమ భాగంలో, దేశ రాజధాని ఢిల్లీకి 125 కిమీ దూరంలో ఉన్న పట్టణం అది. దేశంలో సర్వసాధారణంగా మారిపోయిన మతోన్మాద హింస మరొకసారి ఆ పట్టణంలో చెలరేగింది. అయితే అంతర్జాతీయంగా భారతదేశానికి చెడ్డపేరు తెస్తున్న ఈ హత్యలకూ, లూటీలకూ, స్త్రీలపై అత్యాచారాలకూ కారణం మత విభేదాలు కాదు. ఎంతో కాలంగా ఇరుగు పొరుగులుగా జీవిస్తున్న వారి కుత్తుకలు కత్తిరించే కసినీ ఉన్మాదాన్నీ ఆ ప్రజలలో నింపినవి సామాజిక ఆర్థిక కారణాలు.

ముజఫర్ నగర్ మత కల్లోలాలు ప్రధానంగా ముస్లింలకు, జాట్‌లకు మధ్య జరిగాయి. ఐతే ఉత్తరప్రదేశ్‌లోని ఈ ప్రాంతంలో ఉన్న ముస్లిం లందరూ కూడ వారి వారసత్వాన్ని బట్టి చూస్తే జాట్ కులానికి చెందినవారే. వారు పదమూడో శతాబ్ది తొలిరోజుల్లో సూఫీ ప్రవక్తలు షేక్ ఫరీదుద్దీన్ గంజ్ శకర్, బహా అల్ హక్ జకిరియాల బోధనల ప్రభావంతో ఇస్లాంలోకి మారినా తమ పొరుగున ఉన్న హిందూ, సిక్కు జాట్‌ల లాగనే వ్యవసాయదారులు గానే ఉన్నారు. ఆ ప్రాంతంలోని హిందూ, సిక్కు మతాల జాట్‌లలో లాగనే ముస్లిం జాట్‌లలో కూడ అహీర్, అహ్లావత్, అత్వల్, బల్, భుల్లర్, చీమా, దేవ్, ధలివల్, ధిల్లాన్, ధింద్సా, గిల్, గ్రెవాల్, గుజ్జర్, జఖర్, ఖర్, ఖత్రి, మాన్, మాలిక్, మినాస్, నందా, రణధవా, సాగ్లా, సంధూ, సిధూ, ఉప్పల్ వగైరా వంశాలే ఉన్నాయి. జాట్ ముస్లింలు కూడ తాము ఇస్లాం స్వీకరించక ముందరి ఆచార వ్యవహారాలనే 1980ల దాకా పాటిస్తుండేవారు. ఆ దశాబ్దంలో అయోధ్య వివాదం చెలరేగి విద్వేషాల పొగలు చిమ్ముడం మొదలైన తర్వాత ఆచారాల మధ్య విభజన పెరిగింది. బాబ్రీ మసీదు విధ్వంసం తర్వాత దేశంలో పెరిగిన మత విభజన ఫలితంగా ఏర్పడిన శూన్యంలోకి మత ఛాందస శక్తులు ప్రవేశించాయి. భారత ముస్లింలను ఒకే ఉమ్మడి అస్తిత్వం కిందికి మార్చడానికి ప్రయత్నం మొదలయింది.

బాబ్రీ మసీదు విధ్వంసానంతర పరిణామాలలో ఉత్తరప్రదేశ్‌కు చెందిన ముస్లింలు, ముఖ్యంగా అష్రఫ్‌లు, అజ్లఫ్‌లు, దళితులు, తమ సాంప్రదాయక పోషకురాలైన కాంగ్రెస్‌ను వదిలి కన్షీరాం, ములాయం సింగ్ యాదవ్ వంటి కొత్త ఒబిసి–దళిత–మైనారిటీ కూటమివైపు రావడం మొదలుపెట్టారు. కాని పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోని ముజఫర్ నగర్, భాగ్‌పత్, శామ్లి జిల్లాలలోని జాట్ ముస్లింలు మాత్రం తమ హిందూ సోదరులతోపాటు అజిత్ సింగ్‌కు చెందిన రాష్ట్రీయ లోక్‌దళ్ వెనుక గట్టిగా నిలబడిపోయారు. ఆగస్ట్ చివరి వారంలో జరిగిన పరిణామాలు, అసహ్యకరమైన మతోన్మాదం వారిని వేరు చేసేదాకా వారు ఇరుగు పొరుగులుగా శాంతి సామరస్యాలతో జీవిస్తూ ఉండేవారు.

ముజఫర్ నగర్ నుంచి 15 కిమీ దూరంలో నివసించే ఒక ముస్లిం యువకుడు తమ సోదరిని వేధించాడనే పేరుతో ఆగస్ట్ చివరి వారంలో జాట్ యువకులు కొట్టి చంపేశారు. దానికి ప్రతీకారంగా ముస్లింలు ఆ యువకులను వెంటాడి చంపారు. అధికార యంత్రాంగం వెంటనే కదిలి తక్షణ చర్యలు తీసుకుని ఉంటే ఈ దెబ్బకు దెబ్బతో పరిణామాలు అక్కడ ఆగిపోయి ఉండేవి. కాని అధికార యంత్రాంగం అటువంటి తక్షణ చర్యలు తీసుకోకపోవడం మాత్రమే కాదు, పరిస్థితి చేయి దాటి పోవడానికి వీలు కల్పించింది.

ఈ పరిస్థితులలో ప్రవేశించిన రాజకీయ నాయకులు తమ ఉపన్యాసాల ద్వారా, మరెక్కడో వెంటాడి తరుముతున్న దృశ్యాన్ని సెల్‌ఫోన్‌ల మీదికి ఎక్కించి అది ఇక్కడిదే అని అబద్ధాలు చెప్పడం ద్వారా కోపోద్రేకాలను రెచ్చగొట్టడానికి ప్రయత్నించారు. బాబ్రీ మసీదు విధ్వంసానంతర ఉత్తరప్రదేశ్ రాజకీయాలలో కాంగ్రెసేతర సమాజ్ వాది పార్టీ – బహుజన సమాజ్ పార్టీ కూటమి ముస్లిం నాయకులకు ప్రాధాన్యత ఇవ్వడం ప్రారంభించింది. ఆ నాయకులు బలపడ్డారు. కాని తమ మతస్తుల మీద ఉన్న తప్పుడు మూసలను చెదరగొట్టడానికి గాని, తమ మతస్తులకు సామాజిక న్యాయాన్ని, ఆర్థిక సౌభాగ్యాన్ని, విద్యను కల్పించడానికి గాని వారు చేసిందేమీ లేదు. ఉత్తరప్రదేశ్‌కు చెందిన కాంగ్రెసేతర ముస్లిం నాయకులు ఆ సమాజంలోని ఉదారవాద భావాలకు ప్రతినిధులు కారు. ఎన్నో సందర్భాలలో వారు మత విశ్వాసాల విషయంలో భావోద్వేగాలను, మూఢత్వాన్ని రెచ్చగొట్టడానికే ప్రయత్నించారు. ఉదాహరణకు ప్రవక్త మీద కార్టూన్లు వేసిన డానిష్

చిత్రకారుడి తల తీసుకు వచ్చిన వారికి రు. 51 కోట్ల నగదు బహుమతి ఇస్తానని ములాయం సింగ్ యాదవ్ ప్రభుత్వంలో మంత్రిగా ఉండిన హాజి యాకూబ్ ఖురేషి ప్రకటించాడు. అలాగే 2005 డిసెంబర్‌లో ఇరాక్ అధ్యక్షుడు సద్దాం హుసేన్‌ను ఉరి తీసినప్పుడు, అప్పటిదాకా భారతదేశానికి మిత్రుడిగా ఉండిన నాయకుడి ఉరితీత మీద దేశమంతా సానుభూతి వ్యక్తమైనా భారత ప్రభుత్వం మౌనంగా ఉండిపోవడానికి కారణం ఉత్తరప్రదేశ్‌కు చెందిన షియా ముస్లిం నాయకులు ములాయం సింగ్ యాదవ్ ద్వారా యుపిఎ మీద ఒత్తిడి తేవడమే. తాజాగా, మసీదు గోడ కూల్చిందనే కారణంతో ఐఎఎస్ అధికారి దుర్గాశక్తి నాగ్‌పాల్‌ను అఖిలేశ్ యాదవ్ ప్రభుత్వం సస్పెండ్ చేయడం కూడ కేవలం ఒక బృందం మతాధిపతులను సంతృప్తి పరచడానికే, సమాజ్‌వాద్ పార్టీ, బహుజన్ సమాజ్ పార్టీల ప్రభుత్వాలు రెంటిలోనూ శాసనసభ్యులుగా, మంత్రులుగా ఉన్న ముస్లిం నాయకులు ఎన్నో సందర్భాలలో తమ అధికారాన్ని కాపాడుకోవడానికి ఉద్రేకభరితమైన రెచ్చగొట్టే వ్యాఖ్యలు చేశారు. అటువంటి సందర్భాలన్నిటిలోనూ ముస్లిం వోట్లను పోగొట్టు కుంటామనే భయంతో సమాజ్‌వాద్ పార్టీ మౌనంగా ఉండిపోయింది.

ముస్లిం నాయకులపట్ల కనబరచిన ఈ పక్షపాతం ఏ రకంగానూ ముస్లిం మతంలోని సాధారణ ప్రజలకు ఏ మేలూ చేయలేదు. కాని దానితో ఇతర మతాలలో అసంతృప్తి పెరగడం మొదలయింది. ముస్లిం యువకులను వెంటాడి కొట్టి చంపిన ఘటన తర్వాత ముజఫర్ నగర్‌లో ముస్లిం నాయకులు ఆగస్ట్ 30న ఒక బహిరంగ సభ జరిపారు. ఇరవై వేల మంది హాజరైన ఈ సభలో కాంగ్రెస్ నాయకుడు సైదుజ్జమన్, సమాజ్‌వాది పార్టీ నాయకుడు రషీద్ సిద్దిఖిలతో సహా ఎంతో మంది రాజకీయ నాయకులు రెచ్చగొట్టే ఉపన్యాసాలు చేశారు. దీని కొనసాగింపుగా సెప్టెంబర్ 7న జాట్‌లు ఒక మహా పంచాయత్ (ప్రదర్శన) కు పిలుపునిచ్చారు. అప్పటికే ముజఫర్ నగర్ జిల్లా అంతటా నిషేధాజ్ఞలు అమలులో ఉన్నప్పటికీ ఈ ప్రదర్శనకు జిల్లా అధికార యంత్రాంగం అనుమతి ఇచ్చింది. ఈ ప్రదర్శనలో ఒక లక్షా యాభైవేల మంది పాల్గొన్నారు. ఢిల్లీ, హర్యానా వంటి దూరప్రాంతాల నుంచి కూడ హాజరయ్యారు. భారతీయ జనతా పార్టీ శాసనసభ్యులు హుకుం సింగ్, సంగత్ సింగ్ సోమ్, సురేష్ రాణా, కువర్ భారతేందు, మాజీ కాంగ్రెస్ పార్లమెంటు సభ్యుడు హరేంద్ర మాలిక్, భారతీయ కిసాన్ యూనియన్ నాయకులు రాకేష్ తికాయత్, నరేష్ తికాయత్ వంటి వారు ఈ సభలో పాల్గొని ఉద్రేకపూరితమైన, రెచ్చగొట్టే ఉపన్యాసాలు ఇచ్చారు. హింసకు ప్రేరేపించారు.

ఈ మహాపంచాయత్ నుంచి వెనక్కి వెళ్లిపోతున్న వారిపై దాడికి ముస్లిం యువకులు ప్రణాళికలు రచించారు. ప్రదర్శన నుంచి తిరిగి వస్తున్న జాట్‌ల మీద జాలీ కెనాల్ ప్రాంతంలో దాడి, హత్యలు జరిగాయి. ఈ దాడి జాట్‌లలో ఆగ్రహావేశాలు పెంచింది. మారుతున్న ఆర్థిక రాజకీయ పరిస్థితులలో రైతులుగా తమ సామాజిక స్థాయి దిగజారు తున్నదని, తమ ముస్లిం సోదరులకే ప్రయోజనాలన్నీ దక్కుతున్నాయనీ భావిస్తున్న జాట్‌లు ఈ దాడితో మరింతగా ఉద్రేకపడ్డారు. ఎక్కడికక్కడ ముస్లింల మీద దాడులు చేశారు. మొత్తం మీద ఈ ఘర్షణలలో 48 మంది మరణించారు, ఎంతో మంది మాయమయ్యారు. వేలాది మంది ఇళ్లు వదిలి నిర్వాసితులై, సహాయ శిబిరాల్లో తలదాచుకోవలసి వచ్చింది. పరిస్థితిని అదుపులోకి తేవడానికి సైన్యం రావలసి వచ్చింది.

రానున్న 2014 సాధారణ ఎన్నికలలో తమ భవిష్యత్తు ఏమవుతుందో అని అధికార సమాజ్‌వాది పార్టీ, ప్రతిపక్ష భారతీయ జనతా పార్టీ రెండూ ఆందోళనలో ఉన్నాయి. భారతీయ జనతా పార్టీ తన ప్రధానమంత్రి అభ్యర్థిగా గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీ పేరు ప్రకటించింది గనుక ఆయనను లక్నో నుంచి లోకసభకు పోటీ చేయిస్తారని అనుకుంటున్నారు. మోడీకి నమ్మిన బంటు అయిన అమిత్ షాను ఇప్పటికే ఉత్తరప్రదేశ్‌లో పార్టీ ఎన్నికల ప్రచార బాధ్యుడిగా నియమించారు. హిందువులలో తన పట్ల వ్యతిరేకత పెరుగుతుందేమో అని భయపడుతున్న అఖిలేశ్ యాదవ్ ఒక యువతి వేధింపు అనే చిన్న సంఘటనను పెద్ద మతకల్లోలంగా భగ్గుమని మండడానికి వీలు కల్పించాడు.

ఉత్తరప్రదేశ్‌లో తమ ప్రతిపత్తి తగ్గిపోతున్నదని భావిస్తున్న పశ్చిమ ఉత్తరప్రదేశ్ జాట్‌లు క్రమక్రమంగా భారతీయ జనతా పార్టీకి దగ్గరవుతున్నారు. ఈ రాజకీయ చదరంగపుటెత్తుగడలన్నీ సక్రమంగా నడవాలంటే వోటర్లను, ప్రజలను చీల్చే లక్ష్యంతో ఒక పెద్ద మత కల్లోలం జరగడం అవసరమయింది. కొద్దిమంది ముస్లిం మూస నాయకులను అఖిలేశ్ యాదవ్ ప్రభుత్వం పోషిస్తున్నప్పటికీ, వాస్తవంగా ముస్లింలకు అభివృద్ధి కార్యక్రమాలు గాని, ఉపాధి గాని అందడం లేదు. ఉత్తరప్రదేశ్ పోలీసు శాఖలో ముస్లింల ప్రాతినిధ్యం చాల తక్కువ. దాన్ని సరిదిద్దడానికి ప్రస్తుత ప్రభుత్వం చేస్తున్న చర్యలేమీ లేవు. ఎన్నికల ప్రచారంలో వాగ్దానం చేసినట్టుగా తీవ్రవాద ఆరోపణలతో తప్పుడు కేసుల పాలై జైలు పాలయిన అమాయక ముస్లిం యువకులమీద కేసులు ఎత్తివేయడం కూడ జరగలేదు. అఖిలేశ్ యాదవ్ అధికారంలోకి వచ్చిన పద్దెనిమిది నెలల్లో 27 మతోన్మాద హింసా ఘటనలు జరిగాయి. ఈ మత ఘర్షణలలో రెండు వైపులా కిందికులాల వారే బాధితులుగా ఉన్నారని దళిత నాయకులు అంటున్నారు.

*(రచయిత అస్సాంకు చెందిన పత్రికారచయిత. ఈ వ్యాసం www.countercurrents.org పై అచ్చయింది.)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి. – సం.*

*ఇటీవల పోస్టల్ శాఖ అన్ని మనీ ఆర్డర్‌లను టెలిగ్రాఫిక్ మనీ ఆర్డర్‌లుగా పంపుతున్నది. మీరు ఎం.ఒ. చేసినప్పుడు కింద కూపన్‌లో రాసిన ఉత్తరం ఈ టెలిగ్రాఫిక్ ఎం.ఒ.లో మాకు చేరదు. కనుక ఎం.ఒ.లు చేసేవారందరూ విడిగా ఒక పోస్ట్‌కార్డు మీద మీరు ఎం.ఒ. ఎందుకు పంపుతున్నారో రాయండి. – సం.*

# కార్పొరేట్‌ల కోసమే కొత్త భూసేకరణ చట్టం

**కార్పొరేట్ శక్తుల కోసం భూసేకరణలో భాగంగానే ప్రభుత్వాలు కొత్త భూసేకరణ చట్టాలు తెస్తున్నాయనీ, ప్రజలు చైతన్యవంతులై పోరాటాల ద్వారా ఈ కుట్రలను నిరోధించాలనీ అంటున్నారు పి.వి. రమణ**

బలవంతపు భూసేకరణను అరికట్టి, రైతులకు న్యాయమైన పరిహారం లభించేటట్లు చేయడానికి బ్రిటిష్ కాలంనాటి 'భూసేకరణ చట్టం 1894' స్థానంలో కొత్త చట్టం 'న్యాయబద్ధమైన పరిహారం, భూసేకరణలో పారదర్శకత, పునరావాస, పునపరిష్కార బిల్లు 2012'ను ప్రతిష్ఠాత్మకంగా ప్రవేశపెడుతున్నట్లు యుపిఎ ప్రభుత్వం ప్రకటించింది. కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖా మంత్రి జైరాం రమేష్ ప్రవేశపెట్టిన ఈ బిల్లు లోక్‌సభలో ఆగస్టు 28న ఆమోదం పొందిన తరువాత, రాజ్యసభలో సెప్టెంబర్ 4న ప్రవేశపెట్టి కొన్ని సవరణల తరువాత ఆమోదించింది. ఈసవరణలలో సాగునీటి ప్రాజెక్టుల కోసం భూసేకరణ జరిపేటప్పుడు సామాజిక ప్రభావ అధ్యయనాన్ని చేపట్టవలసిన అవసరం లేదన్నది, సాగునీటి ప్రాజెక్టుల కోసం జరిపే భూసేకరణలో బాధితులకు భూమికి భూమి పరిహారంగా ఇవ్వవలసిన అవసరం లేదన్నది, కొత్త బిల్లు ద్వారా లభించే ప్రయోజనాలు పాత తేదీ నుండి అమలులోకి తెచ్చే నిబంధన నీటి పారుదల ప్రాజెక్టులకు వర్తించవన్నది, భూములను సేకరించడంలో కొనుగోలుకు బదులుగా లీజుకు తీసుకోవడానికి అవకాశం కల్పించడం లాంటి అంశాలున్నాయి. ఈ బిల్లు కొద్దిరోజులలో చట్టంగా మారబోతోంది.

ఈ బిల్లుకు సంబంధించిన ముసాయిదాకు ముందుమాటలో జైరాంరమేష్ 'రాజ్యాంగం ప్రకారం భూమి అన్నది రాష్ట్ర పరిధిలోని అంశం. కానీ భూసేకరణ అన్నది ఉమ్మడి అంశం పరిధిలో ఉంది. భూసేకరణ ప్రక్రియకు సంబంధించి ప్రస్తుతం అమలులో ఉన్న చట్టం 1894లో రూపొందించిన చట్టమే. మధ్యలో సవరణలు జరిగినప్పటికీ రానురాను ఈ చట్టం మరింత అనిశ్చిత స్థితికి తావునిస్తుంది. దేశంలో భూ మార్కెట్ చాలా అసమతుల్యంగా ఉంది. భూమిని సేకరించే వాళ్లకు, భూమిని కోల్పోయే వాళ్లకు మధ్య అధికారం, సమాచారం పరంగా చాలా తేడా ఉంది. ఈ క్రమంలో ఈ లావాదేవీలకు సంబంధించి హేతుబద్ధత, పారదర్శకత పరంగా ప్రభుత్వ ప్రాధాన్యత పెరిగింది'.

'ఈ ముసాయిదా బిల్లు మౌలిక సదుపాయాల అభివృద్ధి, పారిశ్రామికీకరణ, పట్టణీకరణ తదితర ప్రజా ప్రయోజన పనులకు భూసేకరణ ప్రక్రియలను సరళతరం చేయడం, మరో పక్క భూములు కోల్పోయే రైతులు, ఈ భూములపై ఆధారపడి బతుకుతూ జీవనోపాధి కోల్పోయే వాళ్ల ప్రయోజనాలను పట్టించుకోవడం కోసం ఉద్దేశించింది. పునరావాసం, రీ సెటిల్‌మెంట్ అంశాలను భూసేకరణ ప్రక్రియలో అంతర్గత అంశాలుగానే పరిగణిస్తూ, తగిన వ్యవస్థాగత ఏర్పాట్లను ప్రతిపాదిస్తుంది. ఈ ముసాయిదా బిల్లులో మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే, ప్రైవేట్ కంపెనీలకు నేరుగా రైతుల నుండి భూమిని సేకరించుకోవడానికి అనుమతిస్తుంది. ఈ క్రమంలో ఒక పరిమితికి మించి భూమిని సేకరించేటప్పుడు, ఒక హేతుబద్ధమైన పునరావాసం, రీ సెటిల్‌మెంట్ ప్యాకేజిని బాధిత కుటుంబాలకు అందించాలని ప్రతిపాదిస్తుంది. ఎట్టి పరిస్థితిలోను సాగులో ఉన్న భూమిని, పంటలతో కూడిన భూమిని సేకరించకూడదని కూడా ప్రతి పాదన ఉంది' అని ప్రకటించారు.

అదే ముసాయిదాలో కొత్త చట్టం ఎందుకు తెస్తున్నారో వివరిస్తూ 'భూసేకరణ, సంబంధిత అంశాలపై ప్రజలలో పెరుగుతున్న ఆందోళన, పునరావాసం, రీ సెటిల్‌మెంట్, కోల్పోయిన జీవనోపాధికి నష్టపరిహారం వంటి అంశాలకు సంబంధించి జాతీయ స్థాయిలో ఒక సమగ్ర చట్టం లేదు. ప్రధాన చట్టానికి ఎన్నో సవరణలు చేసినప్పటికీ ఇప్పటికీ భూసేకరణకు సంబంధించి 1894 భూసేకరణ చట్టమే ప్రధాన చట్టంగా కొనసాగింది. భూసేకరణ వల్ల భూమిని కోల్పోయే రైతులతోపాటు, దానిపై ఆధారపడి ఇతరత్రా జీవనోపాధి పొందేవారి ఆందోళనను, సమస్యలను పట్టించుకోవడం, పారిశ్రామికీకరణ, నగరీకరణ, మౌలిక సదుపాయాల కల్పన అవసరాలకు సంబంధించి భూసేకరణకు వెసులుబాటు కల్పించడం, భూసేకరణ, సంబంధితులకు నష్టపరిహారం, పునరావాసం, రీ సెటిల్‌మెంట్ అన్నవి ఒకే నాణానికి రెండు కోణాలు అన్న విషయాల్ని తప్పనిసరిగా గుర్తించడం జరగలేదు. ప్రతి సందర్భం లోనూ భూ సేకరణ, సంబంధితులకు నష్టపరిహారం, రీ సెటిల్‌మెంట్ అన్నవి వెనువెంటనే జరగాలని గుర్తించడం, భూసేకరణ సంబంధితులకు నష్టపరిహారం, రీ సెటిల్‌మెంట్ అన్న విషయాలు ఒకే చట్టంలో కాకుండా వేర్వేరు చట్టాలుగా ఉంటే నష్టపరిహారం, రీ సెటిల్‌మెంట్ అన్న విషయానికి ప్రాధాన్యత ఇవ్వకపోవడం అన్నది ఇప్పటివరకూ ఉన్న అనుభవాలను బట్టి తెలుస్తున్న వాస్తవం. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని భూసేకరణ ప్రక్రియలో భూమిని కోల్పోయిన, నష్టపోయిన బాధిత కుటుంబాల పునరావాసం, రీ సెటిల్‌మెంట్‌కు సంబంధించి తొలిసారిగా జాతీయ స్థాయిలో ఈ చట్టాన్ని రూపొందించడం జరుగుతుంది' అని ప్రకటించారు.

**ఈ బిల్లులో ముఖ్యాంశాలు**

1. గ్రామీణ ప్రాంతాల్లో మార్కెట్ విలువకు నాలుగు రెట్ల దాకా, పట్టణ ప్రాంతాల్లో రెండు రెట్ల దాకా పరిహారం అందివ్వాలని బిల్లు ప్రతిపాదిస్తోంది. ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్య (పిపిపి) ప్రాజెక్టులకు భూసేకరణ చేయాలంటే 70 శాతం దాకా, ప్రైవేట్ కంపెనీలకు భూసేకరణ చేయాలంటే 80 శాతం దాకా తప్పనిసరి సమ్మతి ఉండాలి.

2. భూమికి భూమి, ఇళ్ల మంజూరు, ఉపాధి, సేకరించిన భూమికి ఏకమొత్తంలో చెల్లింపు తదితర ప్రయోజనాలు.

3. గతంలో భూసేకరణ జరిగి, పరిహారం ఇవ్వని కేసులకూ ఈ చట్టం వర్తింపు.

4. షెడ్యూల్డ్ ప్రాంతాల్లో గ్రామ సభల ఆమోదం లేకుండా భూసేకరణకు వీల్లేదు. పరిహారం పూర్తిగా చెల్లించేంతవరకు, పునరావాసానికి ప్రత్యామ్నాయ స్థలాలు సిద్ధం చేసేంతవరకు ఎవరి

దగ్గర నుంచీ భూమిని తీసుకోవడానికి వీల్లేదు.

5. ఆహారభద్రతకు భంగం కలగకుండా, ఏకపక్షంగా భూసేకరణ జరగకుండా ఉండేందుకు వ్యవసాయ భూముల సేకరణపై పరిమితులు విధించాలని రాష్ట్రాలకు సూచన.

6. సేకరణ జరిగిన తర్వాత భూమిని ఉపయోగించకపోతే ఆ భూమిని తిరిగి సొంతదారుకు అప్పగించడం లేదా రాష్ట్ర భూబ్యాంకుకు జమ చేసే అధికారం రాష్ట్రాలకు.

7. భూమిని అప్పగించిన వ్యక్తికి కొత్త చట్టంలోని నిబంధనల ప్రకారం అందే మొత్తంపై ఆదాయపు పన్ను విధించరాదు. స్టాంపు రుసుం వసూలు చేయరాదు.

8. సేకరించిన భూమిని మూడో పార్టీకి అధిక ధరకు విక్రయించిన పక్షంలో లాభంలో 40 శాతం సొంతదారుకు ఇవ్వాలి.

9. ప్రాజెక్టుల్లో భూమిని కోల్పోయే ఎస్.సి/ఎస్.టి వర్గాల వారికి భూమికి భూమి లేదా రెండున్నర ఎకరాలు రెండింటిలో ఏది తక్కువయితే అది ఇవ్వాలి.

10. భూసేకరణతో ప్రభావితమయ్యే వారు ఎస్సీ, ఎస్టీ వర్గాలయి ఉండి వారిని మరో జిల్లాకు తరలించాల్సి వస్తే అదనంగా 25 శాతం పునరావాస పరిహారం చెల్లించాలి. ఏక మొత్తంగా చెల్లించాల్సిన రు. 50 వేలకు ఇది అదనం.

గ్రామీణ ప్రాంత అభివృద్ధిపై ఏర్పడిన పార్లమెంటరీ స్టాండింగ్ కంపెనీ ఈ బిల్లును సమీక్షిస్తూ '16 కేంద్ర చట్టాలకు మినహాయింపులు ఇవ్వడం వల్లనే, ఆ చట్టాల ద్వారా దేశంలో భారీగా అక్రమ భూసేకరణలు జరిగాయని, తిరిగి వాటికి ఈ బిల్లులో మినహాయింపు ఇవ్వడం అర్థం లేని పని' అని విమర్శించింది. 'ఈ మినహాయింపు క్లాజును రద్దు చేయాలని, అంతేకాకుండా భూసేకరణ సమయంలో కొత్త బిల్లు ప్రకారం వర్తించే నిబంధనలన్నీ ఆ చట్టాలకు కూడా వర్తించేటట్లు చేయాలని' డిమాండ్ చేసింది.

భూమి, అభివృద్ధి నిజానికి రాష్ట్ర పరిధిలోకి వస్తాయి. కాని భూసేకరణ కేంద్ర పరిధిలో ఉంది. చాలా రాష్ట్రాలలో తమ స్వంత చట్టాలు ఉండడం వల్ల వాటి ద్వారా ప్రైవేట్ కంపెనీలకు అనుకూలంగా భూసేకరణ జరిగింది. ఇకమీద కూడా జరుగుతుంది. ఉదాహరణకు మహారాష్ట్రలో ప్రభుత్వం ముంబాయి, ఢిల్లీ కారిడార్ ప్రాజెక్టుల కోసం 78 గ్రామాల నుండి 67,500 ఎకరాల భూమిని రాష్ట్ర పరిశ్రమల అభివృద్ధి చట్టం ద్వారా సేకరించడానికి ప్రయత్నిస్తుంది. దానికి వ్యతిరేకంగా రైతులు పోరాటం కొనసాగిస్తున్నారు. స్టాండింగ్ కమిటీ వద్ద తమ అభిప్రాయాలు చెప్పిన రాష్ట్ర ప్రభుత్వాలేవీ తమ చట్టాలను మార్చుకోవడానికి అంగీకరించలేదు. మధ్యప్రదేశ్ ప్రభుత్వం భూ సేకరణకు తమ రాష్ట్రంలో ఉపయోగిస్తున్న 'మున్సిపల్ కార్పొరేషన్ చట్టం' 'మధ్యప్రదేశ్ లాండ్ రెవెన్యూ కోడ్'లకు, ఏ మాత్రం కేంద్ర భూసేకరణ బిల్లు ప్రతిపాదించినట్లు సవరణలు చేయలేమని చెప్పింది. 16 కేంద్ర చట్టాలకు ఇచ్చినట్లుగానే తమ రాష్ట్రాలలో చట్టాలకు కూడా మినహాయింపులు ఇవ్వాలని రాష్ట్రాలు కోరాయి. మహరాష్ట్ర ప్రభుత్వం కొత్తం చట్టం వలన ప్రాజెక్టుల వ్యయం భారీగా పెరిగిపోతుందని చాలా ఆందోళన వెలిబుచ్చింది. కేంద్రం మార్గంలోనే రాష్ట్రాలు కూడా కార్పొరేట్ శక్తుల సేవే పరమార్థంగా ఎంచుకున్నాయి.

రెండు సభలలోనూ బిల్లు ఆమోదం పొందిన తరువాత జైరాం రమేష్ మీడియాతో మాట్లాడుతూ 'భారతీయ కంపెనీలు ఇంకా ప్రభుత్వాలను ఉపయోగించుకుంటూ భూములను బలవంతంగా లాక్కోగలమని నమ్ముతున్నాయి. ఆ శకం అంతరించిపోయింది. ఇక మీదట బలవంతంగా ఎవ్వరూ భూములను సేకరించలేరు. నిజానికి వారు ప్రారంభించే ప్రాజెక్టుల కోసం పెట్టే మొత్తం పెట్టుబడిలో భూముల విలువ చాలా చిన్న భాగం. 1 నుండి 4 శాతం వరకు మాత్రమే ఖర్చవుతుంది. విచారకరమైన సత్యమేమంటే ప్రభుత్వరంగ సంస్థల కోసం జరిగిన భూసేకరణ కారణంగా లక్షలాది మంది ప్రజలు నిర్వాసితులయ్యారు. ప్రైవేట్ కంపెనీల విషయంలో కూడా ఇంత అన్యాయం జరగలేదు. జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్, ఒడిశా రాష్ట్రాలలో దీనివల్లనే నక్సలిజం పెరిగిపోయింది'.

'ఈ కొత్త చట్టాన్ని సరిగ్గా అమలు చేయగలిగితే మనం నక్సలిజాన్ని ఓడించగలం. పాత 1894 భూసేకరణ చట్టం నక్సలైట్లకు ఆయుధంగా మారింది. కొత్త చట్టం వలన గిరిజనులు మనతోనే ఉంటారు. గతంలో జరిగినట్లుగా గిరిజనుల్ని అన్యాయంగా తరిమేసే పరిస్థితి ఏర్పడదు. ఈ బిల్లు ప్రకారం షెడ్యూల్ ఏరియాలో ఎటువంటి భూసేకరణ జరగలేదు. ఒకవేళ జరిగినా స్థానిక సంస్థల అంగీకారం లేకుండా జరగదు' అని వివరించారు. ఇది చట్టాల వలన మారే సమస్య కాదని ఆయనకు తెలియనిది కాదు. ఇప్పటికే అనేక చట్టాలున్నా వాటినేమాత్రం ఖాతరు చేయకుండా దేశ వ్యాప్తంగా బడా కంపెనీలు, కార్పొరేట్ శక్తులు ఎంత విధ్వంసం సృష్టించాయో, ఎన్ని లక్షల మందిని నిర్వాసితులు చేశారో అందరికీ తెలుసు. దేశ పాలకులనే శాసిస్తున్న ఈ శక్తులకు కొత్త చట్టాన్ని కూడా వారికనుకూలంగా మలుచుకోవడం పెద్ద సమస్యేమి కాదు. ప్రభుత్వం అనుసరిస్తున్న సామ్రాజ్యవాద అనుకూల విధానాల గురించి మాట్లాడకుండా, నక్సలిజం పెరుగుదలకు పాత భూసేకరణ చట్టం కారణమని చెప్పడం, నెపమంతా దానిపైనే నెట్టేయడం హాస్యాస్పదం.

'ప్రభుత్వ కొత్త చట్టం వలన మరింత అదనపు వ్యయంతోపాటు అనవసర ఆలస్యం కూడా జరుగుతుంది. కంపెనీలు, రైతులు ఇద్దరూ పూర్తిగా అంగీకారానికి వచ్చినప్పుడు ప్రభుత్వం వారికి ఈ చట్టం నుండి మినహాయింపుని ఇస్తే కంపెనీలు రైతులకు మంచి ధరను చెల్లించడానికి అవకాశం ఉంది' అని మెగా రియల్ ఎస్టేట్ సంస్థ డిఎల్ఎఫ్ డైరెక్టర్ రాజీవ్ తల్వార్ అన్నారు.

పాత చట్టం ప్రకారం భూసేకరణ కార్యక్రమం 18 నెలల నుండి 2 సంవత్సరాలు పడితే కొత్త చట్టం వలన 4 నుండి 5 సంవత్సరాల వరకూ పడుతుందని, దీనిపై పరిశోధన చేసిన స్టాండర్డ్ అండ్ చార్టర్డ్ బ్యాంక్ అంచనా. చాలా మంది బడా కంపెనీల అధిపతులు ఈ బిల్లు తమకు ఎలాంటి లాభం చేకూర్చదని అంటున్నారు.

ఈ బిల్లుపై ఎకనమిక్ టైమ్స్ పత్రిక తన సంపాదకీయంలో 'ఈ చట్టం వలన వ్యాపారస్తులకు భూమి మీద వ్యయం మరింత పెరిగిపోతుంది. ఎందుకంటే వారు భూమిని కొన్న తరువాత పునరావాసం, రీ సెటిల్‌మెంట్ కల్పించాల్సిన అవసరం ఏర్పడింది. కాని, సింగూర్ లాంటి తీవ్రమైన ఒడిదుడుకులను తగ్గించడానికి తద్వారా మావోయిస్టుల బలం పెరగకుండా చూడడానికి అవకాశం కల్పించింది' అని రాసింది.

ఈ బిల్లుపై ప్రతిస్పందిస్తూ కేంద్ర ఇంధన వనరుల విశ్రాంత కార్యదర్శి ఇఎస్ శర్మ 'ప్రజాప్రయోజనం గురించి ఈ బిల్లులో విస్తృతంగా మార్పులు చేసినప్పటికీ, ప్రైవేట్ కంపెనీలకు ఉపయోగపడేలానే ఉంది. వ్యవసాయం చేసే వారిలో ఎక్కువ భాగం అసలు యజమానులు ఉండరు. కానీ, వారే పరిహారాన్ని పొందే అవకాశం ఏర్పడింది. ఈ సమస్యను బిల్లు పరిష్కరించలేదు. ప్రభుత్వ భూములను దున్నుకొనే భూమిలేని నిరుపేదల విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది. గతంలో

జరిగినట్లుగానే చట్టాన్ని అనుకూలంగా మార్చుకుని ముందస్తు అంగీకారం పేరుతో ప్రైవేట్ కంపెనీలు తమ బ్రోకర్ల ద్వారా భూములను ముందుగానే కొనేయడం జరుగుతుంది. అసలు ఈ బిల్లు ప్రవేశికలోనే భూసేకరణ ప్రధానంగా పరిశ్రమల కోసమేనని చెప్పడం కార్పొరేట్ శక్తులకు అనుకూలంగా ఉండే అంశమే. ప్రత్యేకంగా ఈ బిల్లు పర్యవసానంగా ఏర్పడే ఆహార భద్రతా సమస్య గురించి నిర్లక్ష్యం చేశారు. ఎంత అధికంగా సొమ్ము పరిహారంగా చెల్లించినా, ఒకసారి తాము జీవిస్తున్న ప్రాంతం నుండి తొలగించబడిన వారి మానసిక స్థితిని, ఆవేదనను తగ్గించలేదు' అని అన్నారు.

సుప్రీంకోర్టును ఏమాత్రం గౌరవించని కొత్త చట్టం

పాత భూసేకరణ చట్టాన్ని ఉపయోగించుకుని అరాచక శక్తులు దేశంలో జరిపిన అనేక మారణకాండల మీద సుప్రీంకోర్టు పాత చట్టం స్థానంలో మరింత సమగ్రమైన, సామాన్య ప్రజల జీవనోపాధికి భంగం కలిగించని కొత్త చట్టాన్ని తేవాల్సిన అవసరాన్ని అనేక కేసుల సందర్భంలో ప్రకటించింది. ప్రత్యేకంగా 2010లో ఒక తీర్పులో సుప్రీంకోర్టు '116 సంవత్సరాల క్రితం భూసేకరణ కోసం ఏర్పడ్డ ఈ చట్టం ద్వారా ఈ దేశంలో అనేక పరిణామాలు సంభవించాయి. గ్రామీణ ప్రాంతం నుండి విస్తారమైన ప్రాంతాలను అభివృద్ధి పేరుతో ప్రైవేట్ కంపెనీలకు, మల్టీ స్టోరీ కాంప్లెక్సులకు, కమర్షియల్ సెంటర్లకు, పారిశ్రామిక ప్రాజెక్టులకు కేటాయించడం జరిగింది. చట్టంలోని పార్ట్-VII నిబంధన 'ప్రజాప్రయోజనం' పేరుతో ఇవన్నీ జరిగాయి. దీని వలన అంతవరకూ గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయం సాగిస్తూ జీవనం సాగిస్తున్న వారికి జీవనాధారం కోల్పోవలసి వచ్చింది. వారిలో అధిక శాతానికి తమకున్న రాజ్యాంగపరమైన హక్కులు, చట్టపరమైన హక్కుల గురించి తెలియకపోవడం, రాజ్యాంగంలో ఆర్టికల్ 32, 226ల ఆధారంగా సమస్యను పరిష్కరించుకోగలమని కూడా వారికి తెలియకపోవడం చాలా నష్టాన్ని కలుగజేసింది. సామాన్య ప్రజల సంక్షేమాన్ని ఈ చట్టం ఏమాత్రం పట్టించుకోకుండా తయారు చేయబడింది. ఈ చట్టాన్ని వెంటనే మార్చవలసిన అవసరం ఉంది. న్యాయపరంగా, సహేతుకమైన కారణాలతో రాజ్యాంగ బద్ధమైన స్ఫూర్తితో, ప్రత్యేకంగా 'ఆర్టికల్ 300ఎ' ఆధారంగా సమగ్రమైన చట్టాన్ని చేయాలి' అని ప్రభుత్వానికి ఆదేశమిచ్చింది. కాని ప్రభుత్వం సుప్రీంకోర్టు తీర్పు స్ఫూర్తిని ఏమాత్రం గౌరవించకుండా కేవలం కార్పొరేట్ శక్తుల అవసరాలే ప్రధానంగా ఈ కొత్త చట్టాన్ని తీసుకు వచ్చింది.

1894 భూసేకరణ చట్టంలో 'ప్రజాప్రయోజనం' అన్న అంశం కారణంగానే దేశ వ్యాప్తంగా అనేక ఆందోళనలు చెలరేగాయి. కొత్త చట్టంలో కొద్దిగా మార్పులు చేసినప్పటికీ ఇంకా అస్పష్టంగానే ఉంది. ప్రభుత్వం ప్రకటించే నిర్మాణ కార్యక్రమాలలో ప్రైవేట్ హాస్పిటల్స్, ప్రైవేట్ విద్యాసంస్థలు, ప్రైవేట్ హోటల్స్‌లను మినహాయించి మిగిలినవన్నీ చట్టపరమైన ప్రజాప్రయోజనాల కిందకు వస్తాయి. పారిశ్రామిక కారిడార్లు, మైనింగ్, పట్టణ, గ్రామీణాభివృద్ధి, ఆటలు, ఆరోగ్య రక్షణ, రవాణా, స్పేస్ కార్యక్రమాలు అన్నీ ప్రజాప్రయోజనాల కిందే వస్తాయి.

గతంలో 1894 చట్టంలోని 'అత్యవసరం' క్లాజును ఉపయోగించుకుని చట్టవిరుద్ధంగా అనేక ప్రాజెక్టులకు కేటాయింపులు జరిగాయి. ఈ బిల్లులో 'అత్యవసరం' అన్న క్లాజును దేశ రక్షణ, దేశ భద్రత, ప్రకృతి బీభత్సాల కారణంగా ఏర్పడే అత్యవసర పరిస్థితులకు మాత్రమే వర్తిస్తుందని ప్రకటించారు.

ఈ బిల్లులో ప్రత్యేకంగా భూసేకరణకు ముందు చేయాల్సిన సామాజిక ప్రభావ అంచనా (సోషల్ ఇంపాక్ట్ ఎసెస్‌మెంట్)ను ప్రత్యేకంగా స్వతంత్ర్య నిపుణుల గ్రూపులతో చేయించి వారి సూచనల మేరకు భూసేకరణ చేయాలి. అవసరమనుకుంటే వారి సూచనలను తిరస్కరించే అవకాశం కూడా ఈ బిల్లులో కల్పించారు. కాని, ఈ స్వతంత్ర్య సంస్థల భాగోతం పోస్కో విషయంలో చూశాం. నేషనల్ కౌన్సిల్ అప్లయిడ్ ఎకనామిక్ రిసెర్చ్ అనే స్వతంత్ర సంస్థ పోస్కో ప్రాజెక్టు విషయంలో కంపెనీకి అనుకూలంగానే రిపోర్టు ఇచ్చింది. స్వతంత్రత అనేది పేరులోనే తప్ప, ఈ సంస్థలు అధిక శాతం కార్పొరేట్ శక్తుల ఆధీనంలో నడిచేవే.

పాత భూసేకరణ చట్టంలో 16 కేంద్ర చట్టాలకు మినహాయింపు ఇచ్చారు. వాటిలో సెజ్‌ల చట్టం కూడా ఉంది. కొత్త చట్టంలో సెజ్ చట్టంతోపాటు కంటోన్‌మెంట్స్ చట్టం, వర్క్స్ ఆఫ్ డిఫెన్స్ చట్టాలకు గతంలో ఇచ్చిన మినహాయింపులు రద్దుచేస్తూ మిగిలిన 13 చట్టాలకు మినహాయింపునిచ్చారు. వీటిలో విద్యుత్ చట్టం, రైల్వేల చట్టం, బొగ్గు గనుల చట్టం, మైనింగ్ చట్టం లాంటి అన్నింటికీ మినహాయింపు కొనసాగించారు. దేశంలో భూసేకరణ సందర్భంగా జరిగిన తీవ్రమైన విధ్వంసం అధిక భాగం ఈ చట్టాల ద్వారానే జరిగింది. ఇంతేకాక కేంద్రం తర్వాత కాలంలో మరిన్ని పాత, కొత్త చట్టాలకు మినహాయింపునిచ్చే అధికారం కలిగి ఉంది.

ఆహార భద్రతకు ఆపద రాకుండా చేయడానికి ఈ చట్టంలో అనేక పంటలు పండే వ్యవసాయ భూములని భూసేకరణకు అనుమతించ కూడదని, ఒక వేళ సేకరించినా ఆ ప్రాంతపు మొత్తం వ్యవసాయ భూమిలో 5 శాతానికి మించి ఉండకూడదని నిర్దేశించారు. కాని, సోంపేటలో ఏం జరిగిందో మనకు తెలుసు. సస్యశ్యామలంగా, పచ్చని పంటలు పండే బీల భూములను, ఎందుకూ పనికిరాని బీడుభూములుగా అక్కడి తహసీల్దారు పంపిన నివేదికను ఏమాత్రం పరిశీలన జరపకుండా జిల్లాకలెక్టర్ దాన్ని ధృవీకరిస్తూ పరిశ్రమల కార్యదర్శికి పంపడం జరిగింది. దీన్ని బట్టి ప్రభుత్వ యంత్రాంగం, ప్రైవేట్ కంపెనీల తొత్తులుగా మారినప్పుడు, కొత్త చట్టం వచ్చినా భవిష్యత్తులో పంట భూములను స్వాధీనం చేసుకోరని గానీ, తద్వారా ఆహార భద్రతకు ప్రమాదం తీసుకురారని గానీ హామీ లేదని అర్థం అవుతుంది.

నేషనల్ రిహాబిలిటేషన్ అండ్ రీ సెటిల్‌మెంట్ పాలసీ (ఎన్. ఆర్. ఆర్. పి) ప్రకారం 2007 - 08 నుండి 2010 -11 వరకూ 20 రాష్ట్రాలలో 7,90,000 హెక్టార్ల వ్యవసాయ భూమి తగ్గిపోయింది. వీటిలో ఒడిశాలో 2,60,000, ఆంధ్రప్రదేశ్‌లో 1,18,000, హర్యానాలో 65,000, పశ్చిమ బెంగాల్‌లో 55,000, ఉత్తరప్రదేశ్‌లో 53,000 హెక్టార్లు ఉన్నాయి. ఈ రాష్ట్రాలన్నీ వ్యవసాయ భూమిని వ్యవసాయేతర ప్రాజెక్టులకు, అభివృద్ధి కార్యక్రమాల పేరుతో నిర్మాణ కార్యక్రమాలకు తరలించడమే కారణమని ప్రకటించింది.

**అటవీ భూముల అవకతవకలపై కాగ్**

అటవీ భూములను అనేక అభివృద్ధి కార్యక్రమాలకు, ప్రాజెక్టులకు కేటాయించడం వలన జరిగిన తీవ్రమైన పర్యావరణ విధ్వంసాన్ని ఖండిస్తూ, జరిగిన నష్టాన్ని భర్తీ చేయడానికి ఎంత అటవీ ప్రాంతం నష్టపోయిందో అంతే ప్రాంతాన్ని కొత్త అటవీ ప్రాంతంగా అభివృద్ధి చేయాలని సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. దీన్ని పర్యవేక్షించడం కోసం 'కాంపెన్సేటరీ ఎఫోరెస్టేషన్ ఫండ్ మేనేజ్‌మెంట్ అండ్ ప్లానింగ్ అథారిటీ (సి.ఎ.ఎమ్.పి.ఎ)' ను ఏర్పాటు చేసారు. అటవీ ప్రాంతాలను ధ్వంసం చేసిన ప్రాజెక్టుల నుండి దీని కోసం అవసరమైన సొమ్మును వసూలు చేసారు. ఈ కార్యక్రమ నిర్వహణలో జరిగిన అవకతవకలను ఈ మధ్యనే కాగ్ బయటపెట్టింది. ప్రాజెక్టులకోసం ధారపోసిన అటవీ భూమి

1,03,381.91 హెక్టార్లుండగా, వాటి స్థానంలో కొత్తగా అటవీ ప్రాంతంగా మార్చడానికి సేకరించిన స్థలం కేవలం 28,086 హెక్టార్లు మాత్రమే. అంటే 27 శాతం. మళ్లీ దీంట్లో అటవీ ప్రాంతంగా మార్చింది 7,280.84 హెక్టార్లు. అంటే కేవలం 7 శాతం మాత్రమే. ఈ విధంగా ప్రభుత్వం అటవీ భూములను చట్ట విరుద్ధంగా గోవా, కర్నాటకలలో మైనింగ్ కంపెనీలకు, రిలయన్స్ పవర్, టాటా స్టీల్ లాంటి బడా కంపెనీలకు ధారాదత్తం చేయడాన్ని కాగ్ తన నివేదికలో తీవ్రంగా ఖండించింది.

దేశంలో బలవంతపు భూసేకరణ జరిగిన, ఇంకా జరగబోతున్న కొన్ని ముఖ్య ప్రాంతాల గురించి, భూయజమానులకు ద్రోహం చేస్తూ కార్పొరేట్ శక్తులకు భూములను ఎంత చౌకగా అప్పజెప్పారో గుర్తుచేసుకుందాం.

**ప్రైవేట్ కంపెనీల చెల్లింపులలో జరిగిన మోసం**

| కంపెనీ పేరు | ఊరు | భూమి (ఎకరాలలో) (కోట్ల రూ.) | మార్కెట్ ధర (కోట్ల రూ.) | అమ్మిన ధర |
|---|---|---|---|---|
| విప్రో | హైదరాబాద్ | 101.3 | 428 | 40.41 |
| రహేజా కార్పొరేషన్ | " | 109.35 | 520 | 54.67 |
| స్టార్ గేజ్ ప్రోపర్టీస్ | " | 250 | 1282.50 | 50 |
| బ్రహ్మణి ఇన్ఫోటెక్ | " | 250 | 750 | 50 |
| ఇన్ఫోసిస్ | " | 447 | 1225 | 54 |
| అపోలో హెల్త్ సిటి | విశాఖ | 20 | 200 | 40 |

పశ్చిమ బెంగాల్‌లో వామపక్ష ప్రభుత్వం 2006లో ఇండోనేషియాకి చెందిన సలీమ్ గ్రూప్ ఆఫ్ కంపెనీ ఏర్పాటు చేసే రసాయనిక పరిశ్రమ కోసం 34 వేల ఎకరాల పంట భూమిని కేటాయించింది. సింగూర్‌లో టాటా కంపెనీ చిన్నకార్ల ప్రాజెక్టుకోసం 997 ఎకరాల పంట భూమిని కేటాయించింది. 2008లో మేదినీపూర్, సాల్బోనీలో జిందాల్ గ్రూప్ స్టీల్ ప్లాంట్ కోసం 4,500 ఎకరాల అటవీ భూమిని, ప్రభుత్వ భూమిని కేటాయించారు.

విశాఖ, కాకినాడల మధ్య నిర్మించబోయే కోస్టల్ కారిడార్ కోసం లక్షన్నర ఎకరాల వ్యవసాయ భూమిని కేటాయించారు. ఈ పచ్చని పంటపొలాల ద్వారా తూర్పు గోదావరి జిల్లాలో 15.09 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, విశాఖ జిల్లాలో 3.31 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు పండుతున్నాయి. వీటిని ధ్వంసం చేయడం వలన ప్రత్యక్షంగా, పరోక్షంగా దాదాపు రెండున్నర కోట్ల మంది రైతులు, రైతు కూలీలు, వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్న ఇతర కుల వృత్తుల వారి జీవితాలన్నీ నాశనమైపోయే ప్రమాదముంది.

సోంపేటలో థర్మల్ పవర్ ప్రాజెక్టుకోసం నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీకి 2000 ఎకరాల భూమిని కేటాయించారు. ఈ ప్రాంతమంతా పచ్చని పంటలతో కళకళలాడే బీల భూములతో నిండి ఉంటుంది. దీన్ని ఈ ప్రాంతపు కోనసీమగా, మరో కేరళగా పిలుస్తారు. రైతుల దగ్గర కంపెనీ ప్రతినిధులు పవర్‌ప్లాంట్ కోసమని కాకుండా, తోటలు పెంచడానికని మోసం చేసి 570 ఎకరాలను కొన్నారు. కాకరాపల్లిలో పవర్‌ప్లాంట్ కోసం ఈస్ట్‌కోస్ట్ ఎనర్జీ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీకి 3,333 ఎకరాల భూమిని కేటాయించారు. ఈ ప్రాంతమంతా రెండు పంటలు పండే మాగాణి భూమి ఉంటుంది. ఈ ప్రాంతంలో ప్రపంచంలోనే అరుదైన చిత్తడి నేలలున్నాయి. 1982లో రామ్‌సర్‌లో జరిగిన చిత్తడినేలల, బీల భూముల పరిరక్షణకు ఉద్దేశించిన అంతర్జాతీయ ఒప్పందంలో భారత ప్రభుత్వం సంతకం చేసింది. ఈ భూములను కాపాడవలసిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకుంది. అయినా రెండూ వాటిని ఖాతరు చేయలేదు.

విశాఖ జిల్లా అచ్యుతాపురం, రాంబిల్లి మండలాల్లో మెగా కెమికల్ కాంప్లెక్సుల కోసం 10,000 ఎకరాలను, నక్కపల్లిలో 8,000 ఎకరాలను కేటాయించారు. ఈ భూములన్నీ పంట భూములే. రాంబిల్లి మండలాన్ని విశాఖ జిల్లా కోనసీమ అని పిలుస్తారు. ఇక్కడ కొబ్బరి తోట ఎకరానికి 15 లక్షల ధర, జీడితోట ఎకరానికి 13 లక్షలు ధర ఉంటే కేవలం రెండింటికి ఎకరానికి 3 లక్షల రూపాయల నష్టపరిహారం ప్రకటించారు.

గుజరాత్‌లో మోడి ప్రభుత్వం అదాని గ్రూప్ కంపెనీకి ముంద్రా పోర్టు కోసం వేలాది ఎకరాలను గజం 50 పైసలకు అమ్మేసింది. ఆ కంపెనీ తర్వాత దాన్ని చదరపు గజం 1200 రూపాయలకు అమ్ముకుంది. ఈ విధంగా 20 వేల కోట్ల రూపాయలు ఖరీదు చేసే భూమిని కేవలం 8 కోట్ల రూపాయలకు అమ్మేశారు.

భూములకు ప్రభుత్వం నిర్ణయించిన మార్కెట్ ధరల కన్నా, బయట మార్కెట్ ధరలు అనేక రెట్లు ఎక్కువ ఉంటుందని అందరికీ తెలుసు. ప్రభుత్వం చెప్పే మార్కెట్ ధర అంటే రిజిస్ట్రేషన్ ధరలే. అత్యధికశాతం పరిహారం చెల్లిస్తున్నామని చెప్పుకున్నప్పటికీ, నిజానికి అవి అసలు మార్కెట్ ధరకన్నా చాలా తక్కువగా ఉంటాయి. ఆ విధంగా కూడా లబ్ధిదారులకు నష్టమే జరుగుతుంది. భూమి అమ్మకాల ద్వారా వచ్చిన సొమ్ము ఆ కుటుంబాలకు ఒక తరానికే సరిపోదు. ఆ సొమ్ము తరతరాలు ఆదుకునే భూమికి సాటిరాదు.

పశ్చిమబెంగాల్‌లోని టాటా కంపెనీ, సలీమ్ కంపెనీ, జిందాల్ కంపెనీలకు, సింగూర్, నందిగ్రామ్, సాల్బోనిలలో ప్రాజెక్టుల కోసం, ఒడిశా కళింగనగర్‌లో టాటా ఉక్కు ప్రాజెక్టు కోసం, నియాంగిరిలో వేదాంత అల్యూమినియం కంపెనీ కోసం, జగత్‌సింగ్‌పూర్‌లో పోస్కో ప్రాజెక్టు కోసం, సోంపేట, కాకరాపల్లిలో థర్మల్‌పవర్ ప్లాంట్‌ల కోసం, ఢిల్లీకి సమీపంలో గ్రేటర్ నోయిడాలో రైతుల వద్ద సాగిన బలవంతపు భూసేకరణలతోపాటు దేశవ్యాప్తంగా జరిగిన అనేక బలవంతపు భూసేకరణలకు వ్యతిరేకంగా జరిగిన ప్రజాపోరాటాలే ఈ కొత్త భూసేకరణ చట్టానికి కారణమని మనకు తెలుసు. గతంలో ప్రజలందరూ నూటికి నూరు శాతం వ్యతిరేకించినా, దేశవ్యాప్తంగా వేలాది బలవంతపు భూసేకరణలు జరిగాయి. కొత్త చట్టంలో 70,80 శాతం సమ్మతి తప్పని సరి అని నిర్దేశించినా కార్పొరేట్ శక్తులు దాన్ని తమకనుకూలంగా మలుచుకోవడం పెద్ద కష్టమైన పనేమి కాదని మనకు తెలుసు.

రాబోయే కాలంలో కార్పొరేట్ శక్తుల కోసం మరింత తీవ్రంగా భారీ భూసేకరణ జరగబోతోంది. సహజంగానే దీనిపై ప్రజలు మరింత తీవ్రంగా పోరాటాలు చేస్తారు. లబ్ధిదారులకు చాలా అధిక స్థాయిలో ప్రభుత్వం న్యాయమైన నష్టపరిహారం చెల్లిస్తున్నదనే ప్రచారం ద్వారా సమాజాన్ని మభ్యపెట్టి, ప్రజల పోరాటాలను అణచివేయడానికే ఈ కొత్త చట్టాన్ని తెస్తున్నారు. ప్రజలపై దాడిచేసే ఉద్దేశంతో కొత్త చట్టాలు ఎన్ని తెచ్చినా ప్రజలు చైతన్యవంతమైన ఐక్యపోరాటాల ద్వారా పాలకుల కుట్రలను తిప్పికొట్టితీరతారు.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# భూసంస్కరణల ముసాయిదా బూటకం

***1973లో వచ్చిన భూగరిష్ట పరిమితి చట్టాన్ని భూస్వాములు వ్యతిరేకిస్తే, ఇప్పుడు రానున్న చట్టాన్ని భూస్వాములకు, పెట్టుబడిదారులకు అండగా నిలుస్తున్న రాజకీయ పార్టీలు, ప్రభుత్వం వ్యతిరేకిస్తున్నాయంటున్నారు ఆశాలత***

మన దేశంలో భూసంస్కరణల తతంగం గత 60 ఏళ్లకుపైగా సాగుతోంది. ఇందిరాగాంధీ ప్రభుత్వం మొదలుకొని నేటి యుపిఎ ప్రభుత్వం వరకు ముందుకు తెచ్చిన భూసంస్కరణ విధానాలు, చట్టాలు, పంచవర్ష ప్రణాళికలు, భూపంపిణి కార్యక్రమాలు, వాటిని సక్రమంగా అమలు పరచడానికి, సూచనలివ్వడానికి నియమించిన అనేక కమిషన్లు, కమిటీలు, ఇప్పుడు ఈ జాబితాకు కొత్తగా వచ్చి చేరింది జాతీయ భూసంస్కరణల ముసాయిదా విధానం. పైకి చాలా ప్రగతిశీలమైనదిగా కనిపించే ఈ ముసాయిదా విధానం 2013 జూలై 18న బహిరంగ చర్చ కోసం ముందుకు తెచ్చింది. ఇది భూసంస్కరణలపై మరొక సారి విస్తృత చర్చ జరగడానికి అవకాశాన్ని కల్పిస్తున్నందుకు ఆహ్వానించవలసిందే కాని దేశంలో భూసంస్కరణలు అమలు జరిగిన చరిత్రను సమీక్షిస్తే ఈ విధానాలు చట్టాల ద్వారా భూమిలేని తనాన్ని పరిష్కరించవచ్చని ఆశించడం అత్యాశే అవుతుందని స్పష్టమవుతుంది.

బ్రిటిష్ వ్యతిరేక జాతీయోద్యమంలో పెద్ద ఎత్తున జమిందారీ వ్యతిరేక పోరాటాలు పెల్లుబికాయి. ఎన్నో పోరాటాలు జరిగిన నేపథ్యంలో వలసవాదులు దేశాన్ని వదిలి వెళ్లిన తర్వాత మొదటి మూడు దశాబ్దాలలో కాంగ్రెస్ ప్రభుత్వం భూసంస్కరణల కార్యక్రమాన్ని పెద్ద ఎత్తున భుజాన వేసుకుంది. కేంద్ర ప్రభుత్వ విధానాలను మార్గదర్శకంగా తీసుకుని ఆయా రాష్ట్రాలు తమ తమ భూసంస్కరణ చట్టాలను రూపొందించుకున్నాయి. రైతాంగంపై అమానుష దోపిడి సాగించిన ఎస్టేట్లను, జాగీర్లను, జమిందారీలను రద్దు చేయడంలో ఈ భూసంస్కరణలు విజయం సాధించాయి. కాని సీలింగ్ అదనపు భూమిని సేకరించి భూమిలేని వారికి పునఃపంపిణి చేయడంలో కాని కౌలు పద్ధతిని క్రమబద్ధీకరించడంలో కాని ఘోరంగా విఫలమయ్యాయి. 2005 నాటికి వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు ప్రకటించిన సీలింగ్ మిగులు భూమి 73.4 లక్షల ఎకరాలు కాగా అందులో స్వాధీనం చేసుకున్నది 65 లక్షల ఎకరాలు. దానిలో 53.9 లక్షల ఎకరాలను 56.4 లక్షల కుటుంబాలకు పంచిపెట్టారు. అంటే సగటున ఒక కుటుంబానికి ఒక ఎకరం కంటే తక్కువే అందింది. పంచి పెట్టిన భూమి దేశంలోని మొత్తం వ్యవసాయ భూమిలో ఒక శాతం మాత్రమే. భూమిని పొందినవారు గ్రామీణ జనాభాలో నాలుగు శాతం కంటే తక్కువే. ఇది కూడా పశ్చిమ బెంగాల్, జమ్మూ కాశ్మీర్, అస్సాం వంటి రాష్ట్రాలలో తప్ప మిగిలిన చోట్ల సరిగ్గా అమలు కాలేదు. ఇదీ దేశంలో 40 సంసత్సరాలకు పైగా అమలు జరిగిన భూసంస్కరణల ఫలితం. ఇది సర్వత్రా అంగీకరిస్తున్న విషయమే. ఇక మన రాష్ట్రంలో 1950లో తెలంగాణ ప్రాంత కౌలుదారి చట్టం, 1956లో ఆంధ్ర ప్రాంత కౌలుదారి చట్టం వచ్చాయి, కౌలుదార్లకు భద్రత కల్పించి వారిని క్రమంగా భూమి యజమానులుగా మార్చడమే ఈ చట్టాల ఉద్దేశం. కాని నిజానికి ఈ నాటికీ కూడా కౌలు రైతులపై జరుగుతున్న దోపిడీ అంతం కాలేదు. వారికి భూమి హక్కులు అందకపోగా కౌలు రైతుల సంఖ్య నానాటికి పెరుగుతోంది, ఇతరత్రా ఎటువంటి హక్కులు లేకుండా అప్పుల పాలవుతున్నది, ఆత్మహత్యలు చేసుకుంటున్నదీ ఎక్కువగా కౌలు రైతులే. 1973లో ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల (గరిష్ట పరిమితి) చట్టం వచ్చింది. దీనికి భూస్వామ్య వర్గాల నుండి పెద్ద ఎత్తున వ్యతిరేకత ఎదురైంది. భూ సంస్కరణల కార్యక్రమాన్ని అమలు చేయడానికే ఆ రోజున పివి నర్సింహరావును ముఖ్యమంత్రిని చేసినట్లు కాంగ్రెస్ ప్రభుత్వం ఊదరగొట్టింది. ఈ చట్టం అమలులో జరిగిన జాప్యం వల్ల భూస్వాములు, తమ భూములను బినామీ పేర్ల మీద పట్టాలు సృష్టించుకోవడానికి ఉపయోగపడింది. ఇక సీలింగ్ లెక్కలు పూర్తి అయ్యే సరికి ఆనాడు తేలిన మిగులు భూమి 11 వేల ఎకరాల మాగాణి (తరి), 2 లక్షల ఎకరాల మెట్టభూమి. అప్పటికి కట్టిన లెక్కల ప్రకారం 10 లక్షలకుపైగా ఉన్న వ్యవసాయ కూలీలకు, పేదరైతు కుటుంబాలకు ఈ భూమి ఏమాత్రం సరిపోతుందో అంచనా వేయవచ్చు. భూసంస్కరణల అమలు కోసం నిర్దిష్టంగా ప్రయత్నం చేశాడని చెప్పుకున్న పివి నర్సింహరావు 1990లో ప్రధానమంత్రిగా ప్రవేశపెట్టిన ఆర్థిక సరళీకరణ విధానాలు దేశంలో 'తిరోగమన భూసంస్కరణల' శకానికి నాంది పలికాయి. ఆర్థిక సరళీకరణ విధానాలు మొదలైనప్పటి నుండి భూసంస్కరణలు వెనుకపట్టు పట్టి అంతకు ముందు పేద ప్రజలకు పంచి ఇచ్చిన భూములను ప్రజాప్రయోజనం పేరుతో పారిశ్రామిక వర్గాల కోసం సేకరించడం (వెనక్కు తీసుకోవడం) పెద్దఎత్తున ప్రారంభమయింది. ఇక 2004లో రాష్ట్ర ప్రభుత్వానికి నక్సలైట్లకు మధ్య జరిగిన చర్చలలో విప్లవ పార్టీలు ప్రధానంగా భూమి సమస్యను ముందుకు తెచ్చాయి. రాష్ట్రంలో ఎంత మంది భూమిలేని వారున్నారు. దళితుల, ఆదివాసుల భూములు ఏ విధంగా అన్యాక్రాంతం అయ్యాయి, భూస్వాముల, పారిశ్రామికవేత్తల చేతిలో ఎంత భూమి కేంద్రీకరించబడి ఉంది అనే పూర్తి వివరాలను వాళ్లు బయటపెట్టారు. ఆ చర్చలు విఫలమైన తర్వాత, భూమి సమస్యపై పెద్ద ఎత్తున జరుగుతున్న చర్చ నేపథ్యంలో తనను తాను రక్షించుకోవడానికి 2004 డిసెంబర్‌లో రాష్ట్ర ప్రభుత్వం భూపంపిణి కార్యక్రమాలను అంచనా వేసి భూచట్టాల నియమాలను మెరుగుగా అమలు పరిచేందుకు సూచనలు ఇవ్వడానికి కోనేరు రంగారావు కమిటీని

నియమించింది. ఆ కమిటీ 104 సిఫార్సులతో 2006లో నివేదికను సమర్పించగా వాటిలో 90 సిఫార్సులను ఆమోదిస్తూ ప్రభుత్వం 2007 జూలైలో ఉత్తర్వులు జారీ చేసింది. ఆ కమిటీ సిఫార్సులు అమలు కాలేదు. సరికదా ఇప్పుడు అవి ఎవరికీ గుర్తు కూడా లేవు.

ఇక 2012 అక్టోబర్‌లో 'ఏక్తా పరిషత్' అనే సంస్థ దళితులతో, ఆదివాసులతో, భూమిలేని రైతులతో గ్వాలియర్ నుండి కొత్త ఢిల్లీ వరకు భూమి హక్కుల కోసం జనసత్యాగ్రహ పేరుతో భారీ యాత్ర నిర్వహించింది. 26 రాష్ట్రాల నుండి వచ్చిన 50,000 మంది, 100 కిలోమీటర్లకు పైగా నడిచి అగ్రా చేరే సరికి ఆ యాత్ర ఢిల్లీ చేరడాన్ని ఎట్లాగైనా ఆపడానికి ప్రభుత్వం దిగివచ్చి ఆగ్రాలో వారితో చర్చలు జరిపి, వారి డిమాండ్లను అంగీకరిస్తూ ఆరు నెలలలో భూమిలేని వారికి న్యాయం చేసే కొత్త భూసంస్కరణల విధానాన్ని ప్రకటిస్తామని హామీ ఇచ్చి జనసత్యాగ్రహ యాత్రను ఆపుచేయించింది. దీని ఫలితంగా వచ్చిందే కొత్త జాతీయ భూసంస్కరణల ముసాయిదా విధానం. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన 66 ఏళ్ల తర్వాత ఇప్పుడు మళ్లీ ఒక కొత్త భూసంస్కరణల విధానం అవసరమయిందంటే భూసంస్కరణల అమలులో ప్రభుత్వానికి ఎంత చిత్తశుద్ధి ఉందో అర్థమవుతోంది. భూమిలేని పేద ప్రజలలో అసంతృప్తి పెల్లుబికి పోరాట మార్గం చేపట్టినప్పుడల్లా ప్రభుత్వం దాన్ని చల్లార్చడానికి, భ్రమలను కల్పించడానికి భూసంస్కరణ చట్టాలను ముందుకు తెస్తున్నదే తప్ప నిజంగా వారికి భూమిని ఇచ్చి పేదరికం నుండి బయటేయడానికి కాదు.

జాతీయ నమూనా సర్వే సంస్థ (2003-04) గణాంకాల ప్రకారం దేశంలో 31.12 శాతం కుటుంబాలకు భూమి లేదు. మరొక 30 శాతం మందికి ఒక హెక్టారు కంటే తక్కువ భూమి ఉంది. అంటే దేశ జనాభాలో 60 శాతం మందికి మొత్తం భూమిలో 5 శాతం మాత్రమే ఉంది. కాని 10 శాతం మంది చేతిలో 55 శాతం భూమి కేంద్రీకరించబడి ఉంది. భూమి యాజమాన్యంలో ఉన్న తీవ్ర అసమానతలలో ఎటువంటి మార్పు రాలేదని దీనివల్ల అర్థమవుతుంది. పైగా దేశంలో భూమిలేని వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగిందని 2011 జనాభా లెక్కలలో వెల్లడయింది. కేంద్ర ప్రభుత్వం కొత్తగా ప్రతిపాదించిన భూసంస్కరణల జాతీయ విధానం ఈ వాస్తవాన్ని ఉటంకిస్తూ వ్యవసాయ కూలీలు, పేద రైతులు, వెనుకబడిన వర్గాలకు, ఆ వర్గాలలోని స్త్రీలకు సమానంగా, న్యాయంగా భూమిని కేటాయించే పద్ధతి ఉండాలని సూచించింది. సీలింగు పరిమితిని మాగాణి (తరి) భూములకు 5-10 ఎకరాలకు, మెట్ట (కుష్కి) భూమికి 10-15 ఎకరాలకు తగ్గించాలని కూడా సూచించింది. ధార్మిక సంస్థలు, కంపెనీలకు చేసే భూమి కేటాయింపులు 15 ఎకరాలకు మించకూడదని, తోటలకు, రొయ్యల చెరువులకు, పార్కులకు భూ గరిష్ట పరిమితి నుండి మినహాయించడాన్ని రద్దు చేసి పరిమితి విధించాలని కూడా సూచించింది. అయితే ఈ ముసాయిదా ప్రపంచీకరణ, కార్పొరేటీకరణలలో భాగంగా ముందుకొచ్చిన మార్కెట్ పదజాలంలో భాగమయిన 'భూమి బ్యాంక్'లను ఏర్పాటు చేయాలని కూడా సూచించింది. అంతే కాకుండా కొత్త భూసేకరణ నష్టపరిహారం, పునరావాస బిల్లును (దీన్ని 2013 ఆగస్టు 29న లోక్‌సభ ఆమోదించింది) యథాతథంగా ఆమోదిస్తే పేదలకు అన్యాయం జరుగుతుందని వివిధ సెక్షన్ల నుండి అభ్యంతరాలు ఎదురైనప్పటికి, అది చాలా అనుకూలమైనదిగా ఆ ముసాయిదా సూచించింది. ఈ ముసాయిదా కేవలం ఒక మార్గదర్శకమే. దీనిని చట్ట రూపంలో మార్చినప్పుడే దీనిలో సూచించిన అంశాలు అమల్లోకి వచ్చే అవకాశం ఉంది.

ఈ ముసాయిదా భూసంస్కరణల విధానంలో ప్రతిపాదించిన కొన్ని పేదల అనుకూల సూచనలకు అప్పుడే వ్యతిరేకత మొదలయింది. 2013 సెప్టెంబర్ 8న భూపరిపాలన ప్రధాన కార్యాలయంలో జరిగిన సమావేశంలో రెవెన్యూ మంత్రి రఘువీరారెడ్డి ఈ విధానం సూచించిన కొత్త భూగరిష్ట పరిమితిని ప్రభుత్వం వ్యతిరేకిస్తున్నట్లు ప్రకటించాడు. వామపక్షాలు మినహా అన్ని ప్రధాన రాజకీయ పార్టీలు కూడా మారిన వ్యవసాయ పరిస్థితులను సాకుగా చూపి దానిని వ్యతిరేకించాయి. భూగరిష్ట పరిమితిని తగ్గించాలని కోనేరు రంగారావు కమిటీ చేసిన సూచనలను కూడా ప్రభుత్వం గతంలో తిరస్కరించింది. 1973లో వచ్చిన భూగరిష్ట పరిమితి చట్టాన్ని భూస్వాములు వ్యతిరేకిస్తే ఇప్పుడు భూస్వాములకు, బడా పెట్టుబడిదారులకు కొమ్ముకాసే రాజకీయ పార్టీలు, ప్రభుత్వం వ్యతిరేకిస్తున్నాయి. మొత్తం సాగు భూమిలో 55 శాతం భూమి 10 శాతం మంది చేతిలో ఉన్నప్పుడు, భూగరిష్ట పరిమితి తగ్గించకుండా వ్యవసాయంపై ఆధారపడి బతుకుతున్న మెజారిటీ భూమిలేని ప్రజలకు భూమి ఎక్కడ నుండి వస్తుంది? ఈ ప్రశ్నకు సమాధానం లేదు.

ఈ రోజున గ్రామాలలో గతంలో మాదిరిగా పెద్ద భూస్వాములు కనిపించరు కాని, కొత్తరకం భూస్వాములు తలెత్తారు. 'సాగు' చేయని కుటుంబాల చేతిలో భూమి కేంద్రీకరణ ఎక్కువగా జరుగుతోంది. గ్రామాలలో ఉండకుండా పట్టణాలకు వలసపోయి వ్యవసాయేతర రంగాలలో స్థిరపడిన యాబ్సెంటి ల్యాండ్ లార్డ్స్ కొంత మంది అలాగే మరికొంత మంది గ్రామాల్లోనే ఉంటూ రాజకీయ పాలనాపరమైన పెత్తందార్లు, పైరవి కార్లు, కాంట్రాక్టర్లు, వర్తకులు, ట్రాక్టర్లు తదితర సాధనాలను అద్దె కివ్వడం, రియల్ ఎస్టేట్ వ్యాపారం సాగిస్తూ మిగులును సంగ్రహిస్తూ భూములను చేతిలో పెట్టుకున్నారు. వీరంతా తమ భూములను ఇతరులకు కౌలుకు ఇచ్చి వ్యసాయంలో వస్తున్న లాభ నష్టాలతో సంబంధం లేకుండా కౌలు రైతులను దోపిడీ చేసి ఆదాయం పొందుతున్నారు. ఈనాడు మన రాష్ట్రంలో 40-60 శాతం కౌలుదార్లే సాగుచేస్తున్నారు. వీళ్లలో అత్యధికులు భూమి లేక కౌలుకు తీసుకుంటుంటే కొంతమంది ధనిక రైతులు వాణిజ్య పంటలు వేయడం కోసం పేదరైతుల వద్ద భూములు కౌలుకు తీసుకోవడం కూడా జరుగుతోంది. గత 20-30 ఏళ్లలో కౌలు రైతులు పెరగడమనేది ఒక లక్షణంగా బయటికొచ్చింది.

ప్రభుత్వం గతంలో భూసంస్కరణలు, భూపంపిణి కార్యక్రమంలో భాగంగా దళితులకు, వెనుకబడిన వర్గాలకు పంచి ఇచ్చిన భూములలో చాలా వరకు సాగుకు యోగ్యం కాని ఊసర క్షేత్రాలు, గ్రామ ఉమ్మడి భూములు, మేత భూములే. సీలింగ్ భూములను అంటుకోకుండానే ప్రభుత్వం పేదలకు భూమి ఇచ్చిన ఖ్యాతి దక్కించుకున్నది. దళితులకు ఇచ్చిన భూములు కూడా చాలా వరకు అన్యాక్రాంతమయ్యాయి. పరిశ్రమలు, ప్రత్యేక ఆర్థిక మండలాలు, మౌలిక సదుపాయాలకు ప్రభుత్వం సేకరిస్తున్న భూములలో గతంలో పేదలకు పంచి ఇచ్చిన అసైన్‌మెంట్ భూములు ఎక్కువగా ఉన్నాయి. వాటికి నష్టపరిహారం కూడా చెల్లించనక్కర లేదు. ఎందుకంటే అది ప్రభుత్వ భూమిని తిరిగి

# ఎన్‌కౌంటర్లు ప్రభుత్వ విధానమే

***ఎన్‌కౌంటర్ల పేరుతో పోలీసులు చేస్తున్న అరాచకాలకు పాలకులు మద్దతు పలుకుతున్నారనే విషయం వంజారా లేఖ ద్వారా సభ్య సమాజానికి బట్టబయలైందనీ, ఈ దమననీతి ఒక ప్రాంతంలోనే కాదు దేశమంతటా అమలవుతోందనీ అంటున్నారు ఎల్. అరణ్య***

దేశవ్యాప్తంగా సంచలనం సృష్టిస్తున్న అమాయకుల ఎన్‌కౌంటర్లలో ప్రభుత్వాల నుంచి మొదలుపెట్టి పోలీసుల దాకా పాత్ర పోషిస్తుండడం జరుగుతూనే ఉంది. పౌరసమాజం చేష్టలుడిగి చూస్తుండడం మాత్రం విచారకరం. సమాజాలు, అందులోని పౌరులు నిజానికి ఇలాంటి దుర్మార్గ చర్యలను నిరసించనంతకాలం ఎన్‌కౌంటర్లు కొత్త కొత్త రూపాలతో చిన్న చిన్న కారణాలకు గాను జరుగుతూనే ఉంటాయి. నిరసించడాన్ని హక్కుగా భావించనప్పుడు, ఆ హక్కును పరిరక్షించుకోనపుడు ప్రభుత్వాలు వాటిని అణిచివేస్తూనే ఉంటాయి. ఆ అణిచివేతల బలం పెరిగితే ఎన్‌కౌంటర్లకు, నిరసనలకు మధ్య దూరం పెరిగిపోయి ఎన్‌కౌంటర్లు చట్టబద్ధమయ్యే ప్రమాదముంది. నిన్నటి వరకు తెలంగాణలో నేడు చత్తీస్‌గడ్, గుజరాత్‌లలో జరుగుతున్నదదే. ఈ ప్రాంతాల ఆదర్శంగా దేశంలోని చాలా రాష్ట్రాలు ఎన్‌కౌంటర్లను సాఫీగా నిర్వహించుకునేలా అణిచివేతల ప్రక్రియను అమలు చేస్తున్నారు.

గుజరాత్ కేంద్రంగా జరిగిన దేశవ్యాపిత ఎన్‌కౌంటర్లు దేశ భవిష్యత్‌కే సవాలుగా నిలిచాయి. నిజానికి 2002 గుజరాత్ మారణకాండ సమయంలో అనేక మంది ప్రజాస్వామిక వాదులు గుజరాత్ గురించి ఆందోళన చెందారు. ఒక ప్రజాస్వామ్య దేశంలో సాధారణ ప్రజలకు అందులోనూ మైనారిటీలకు బతికే హక్కును ప్రశ్నార్థకంగా మార్చిన దారుణమైన హత్యలు అవి. ఆ సమయంలో గుజరాత్‌లోనే నరేంద్రమోడీ లాంటి క్రూరమయిన ముఖ్యమంత్రి పాలనలో ప్రజల భవిష్యత్తు ఎలా ఉంటుందోనని బాధ పడినవారికి ఇవాళ మోడీ ప్రధానమంత్రి అభ్యర్థిగా నిలుచున్న వేళ దేశంలోని పౌరులు, పౌరహక్కుల గురించిన ఆందోళన మొదలవడంలో ఆశ్చర్యమేమీ లేదు. రాబోయే లోక్‌సభ ఎన్నికలలో కనుక మోడీ నాయకుడిగా భారతీయ జనతా పార్టీ అధికారంలోకి వస్తే ఈ హత్యల పరంపర కొనసాగడంలోనూ ఏమాత్రం ఆశ్చర్యం ఉండబోదు. ఒకవైపు దుర్మార్గమైన హత్యాకాండను దేశానికి శాంపుల్‌గా వదిలి మరోవైపు శరవేగంగా అభివృద్ధి చెందుతున్న రాష్ట్రంగా ఊదర గొడుతూ అభివృద్ధి నీడలో తన హత్యా రాజకీయాలను ప్రజలు మరిచి పోయేలా చేస్తూ వస్తున్న మోడీ కేవలం గుజరాత్‌లోనే కాకుండా గుజరాత్ బయట కూడా హత్యలు చేయించిన విషయం అందరం చూస్తూనే ఉన్నాం. ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి దేశవ్యాప్త హత్యలను ఎన్‌కౌంటర్ల పేరుతో చేస్తుండడానికి వ్యతిరేకంగా జరగాల్సినంతగా ఉద్యమాలు, నిరసనలు జరగకపోవడం, ఒక రాష్ట్ర పరిధి దాటి మరీ అసాంఘికంగా ప్రవర్తించే హంతక అధినేతలను ప్రశ్నించకపోవడం అనేది ఆ నాయకులకు ఎల్లలులేని, దాటిన ఎన్‌కౌంటర్ల చట్టబద్ధత కల్పించడమే. ఇప్పటికే ఎన్‌కౌంటర్లకు చట్టబద్ధత ఇచ్చేలా తమ మౌనంతో పరోక్ష మద్దతు ఇచ్చిన సమాజాలు ఇప్పుడు ఎల్లలు దాటి మరీ ఎన్‌కౌంటర్లు చేసే చట్టబద్ధతను కూడా అందివ్వబోతే సాధారణ ప్రజల మనుగడే ప్రశ్నార్థకంగా మారిపోయే ప్రమాదముంది. మణిపూర్‌లో బట్టలమ్ము కొనేవాళ్లు, తమిళనాడులో కిల్లీకొట్టువాళ్లు, కశ్మీర్‌లో ఆపిల్ తోటల

---

తీసుకోవడంగానే పరిగణించబడుతోంది. ఆ భూములను తిరిగి అభివృద్ధి పేరిట కంపెనీలకు దారాదత్తం చేస్తోంది. వ్యవసాయ భూములను వ్యవసాయేతర అవసరాలకు మళ్లించడం పెద్ద ఎత్తున జరుగుతోంది. అందుకు ఇటీవల లోక్‌సభ ఆమోదించిన భూసేకరణ చట్టం అధిక నష్టపరిహారం ముసుగులో మార్గం మరింత సుగమం చేస్తోంది.

అటవీ హక్కుల గుర్తింపు చట్టం వచ్చినప్పటికీ దాని అమలు పూర్తి లోపభూయిష్టంగా ఉండి ఆదివాసులకు భూమి దక్కడంలేదు. ఆదివాసి భూములలో దాదాపు సగం భూములు అదివాసేతరుల చేతులలో ఉన్నాయి. అభివృద్ధి పేరిట పోలవరం ప్రాజెక్టు వంటి ప్రాజెక్టులు, మైనింగ్ తదితరాల కారణంగా ఆదివాసులు నిర్వాసితులయ్యే ప్రమాదం ఎక్కువగా ఎదుర్కొంటున్నారు. మహిళల చేతుల్లో భూమి ఉండడమే చాలా తక్కువ. దేశంలో సగటున రెండు శాతం కమతాలు మాత్రమే మహిళల పేరు మీద ఉన్నాయి. ప్రభుత్వ భూపంపిణి కార్యక్రమాలలో మహిళల పేరు మీద లక్షల ఎకరాలకు పట్టాలు ఇస్తున్నామని ప్రకటిస్తున్నా అవి కాగితాలకే పరిమితమవుతున్నాయి. వారికి భూమిపై నిజమైన హక్కులు అందడం లేదు.

రాష్ట్ర విభజన చర్చలు జరుగుతున్న నేపథ్యంలో రెండు ప్రాంతాలలోను భూమి సమస్యను సమగ్రంగా సమీక్షించాల్సిన అవసరం ఉంది. రెండు రాష్ట్రాలు ఏర్పడి పునర్నిర్మాణం జరగవలసిన సమయంలో దళితులు, ఆదివాసులు, వెనుకబడిన కులాలు, భూమిలేని వ్యవసాయ కూలీలు, మహిళల భూమి హక్కులపై చర్చకు పెద్దపీట వేయాలి. వ్యవసాయంతో సంబధం లేకుండా వందల ఎకరాల భూమిని గుప్పెట్లో పెట్టుకుని కొత్త భూస్వాములు కౌలురైతుల రక్తాన్ని పీలుస్తున్న నేటి పరిస్థితిని సమీక్షించనిదే భూమి సమస్య పరిష్కారం కాదు. దళిత, ఆదివాసి, బలహీన వర్గాలపై పరోక్ష భూస్వామ్య దోపిడీ అంతం కావాలంటే 'దున్నే వాడికే భూమి' అనే సూత్రాన్ని కేవలం మొక్కుబడి నినాదం నుండి వాస్తవంలో అమలు జరగాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

కూలీలు, తెలంగాణలో చెప్పులు కుట్టుకునే వాళ్లు కూడా మోడీ అంటే, ఆర్‌ఎస్‌ఎస్ అంటే నిత్యం వణికిపోయే స్థితి ఏర్పడే ప్రమాదం రావచ్చు.

గుజరాత్‌లో చాలా ప్రణాళికాబద్ధంగా ఎన్‌కౌంటర్ల ప్రయోగం జరిగింది. బహిరంగ సభల్లో, మీడియాలో నరేంద్రమోడీ రాజ్యాంగం గురించి ఉపన్యాసాలిస్తుంటాడు. రాజ్యాంగం దృష్టిలో అంతా సమానమేనని, కుల వివక్ష, మత వివక్షలు ఉండవని, రాజ్యాంగాన్ని గౌరవించి ఆచరించే నిబద్ధ ప్రభుత్వం గుజరాత్ ప్రభుత్వమని ఊకదంపుడు ఉపన్యాసాలిస్తుంటాడు. కానీ అక్కడి అధికార గణం మాత్రం ఒక వర్గాన్ని ఒక మతాన్ని టార్గెట్ చేస్తూ వచ్చింది. వారందరినీ తీవ్రవాదులని, ఫలానా ప్రాంతంలో నివసించే వారందరినీ గుజరాత్‌కు వ్యతిరేకులనీ దీర్ఘకాలం ప్రచారం చేసింది. నాగరిక సమాజాలకు, ప్రజాస్వామిక విలువలకు ఆ ఫలానా మతం వారు అడ్డుగా ఉన్నారని సంవత్సరాలుగా అబద్ధాలాడుతూ వచ్చింది. అధిక సంతానం, బురఖా పద్ధతి, బహు భార్యత్వం వంటివి చూపించి వారంతా నాగరిక నిరోధకులని అంటూ వచ్చింది. గోధ్రా ఘటనను చూపించి దారిన పోయే అమాయకులను చంపే దుర్మార్గులుగా నెపం మోపింది. ఆ కారణంతోనే కదా, ఆరువేల మంది అమాయక ముస్లింలను ఆనాడు మోడీ చంపించాడు. సెప్టెంబర్ 11 దాడుల వెనుక ముస్లింలే ఉన్నారని అమెరికా చేసిన దుష్ప్రచారాన్ని ఇక్కడ గుజరాత్‌లో బాగా వాడుకున్నారు. బిన్‌లాడెన్ చర్యలను మాత్రమే కాకుండా చివరికి అతని వేషాన్ని కూడా చూపించి అసలు లాడెన్ లాంటి వస్త్రధారణ, గడ్డం ఉన్న ప్రతి ఒక్కరూ ఉగ్రవాద కార్యకలాపాలతో సంబంధాలు కలిగి ఉంటారనే విధంగా ప్రచారం చేసింది. ఈ అధికారగణానికి ఆర్‌ఎస్‌ఎస్, విహెచ్‌పిలు సలహాల మద్దతు అందిస్తూ వచ్చాయి. ఉగ్రవాదులలో ఎక్కువ మంది ముస్లింలే కనుక ముస్లిం మతస్థులంతా ఉగ్రవాదులే అనే ఆర్‌ఎస్‌ఎస్ సూత్రీకరణను అమలుచేసే కార్యనిర్వాహక వర్గంగా అధికారగణం మారిపోయింది. ఏళ్లకుఏళ్లు విషప్రచారాలు నిర్వహించి ముస్లింలను అకారణంగా ఉగ్రవాదనెపంతో చంపడానికి గుజరాత్ ప్రభుత్వం అధికార గణం సహాయంతో రంగం సిద్ధం చేసుకుంది. మీడియా సహాయంతో ఈ ప్రచారాన్ని దేశవ్యాప్తం చేసింది. నరేంద్రమోడీ, అద్వానీ, తొగాడియా వంటి బిజెపి దాని అనుబంధ సంస్థల వ్యక్తుల చరిష్మా ముస్లింలపై దుర్మార్గ ప్రచారం దేశమంతటా వ్యాపింప చేయడానికి తోడ్పడింది.

ఆ తర్వాత తన ప్రణాళికను అమలుచేసింది. తమ సంవత్సరాల ప్రచారం సహాయంతో ముస్లింలను నెగెటివ్‌గా చిత్రించాక వారిని చంపడంలో తప్పేమీ లేదనే దుర్మార్గ వాదనకు కార్యరూపాన్ని గుజరాత్‌కు లోపలా, బయటా అమలు చేస్తూ వచ్చారు. 2002 హత్యలు గుజరాత్‌లోపల జరిగిన ప్రయోగం కాగా సోహ్రబుద్దీన్, ఇష్రత్ జహాన్ తదితరుల ఎన్‌కౌంటర్లు గుజరాత్ పోలీసులతో పాటు బయటి పోలీసుల ప్రమేయం కూడా ఉన్న హత్యలు. సోహ్రబుద్దీన్ ఎన్‌కౌంటర్‌లో ప్రధాన నిందితుడైన గుజరాత్ హోంశాఖ మాజీ సహాయ మంత్రి అమిత్ షా ఎన్‌కౌంటర్లకు స్వయంగా వ్యూహ రచన చేసి దానికి సంబంధించిన రాష్ట్రాలన్నింటి ప్రభుత్వాల, అధికారుల సహాయంతో ఎన్‌కౌంటర్లను నిర్వహించేవారు. ప్రాణం విలువ తెలియని కోటీశ్వరుల జాతిన పుట్టిన అమిత్ షా ప్రజాస్వామ్యాన్ని, పత్రికలను బాహాటంగా తిట్టిపోసే మనిషి. దేశమంతటా అమిత్‌షాకు ఇన్‌ఫార్మర్లు, సాయపడే పోలీసులుండేవారు. అంటే ఒక రాష్ట్రాన్ని పాలించే ప్రభుత్వంలోని ఒక హోంశాఖ సహాయ మంత్రికి దేశమంతటా నెట్‌వర్క్ ఉండడం ఏ సంకేతాలనిస్తుందో అర్థం చేసుకోవాలి. ఒక సాధారణ నేరస్తుని లాగా అతిపెద్ద స్థాయిలోని పోలీసు అధికారులు (వంజారా, అభయ్ చేవాసనా – సోహ్రబుద్దీన్ కేసులో) హత్య కేసుల్లో ఊచలు లెక్కపెట్టడాన్ని ఎలా అర్థం చేసుకోవాల్సి ఉంటుంది? సోహ్రబుద్దీన్‌ను అన్యాయంగా చంపి ఆయన భార్య కౌసర్‌బీని, సాక్షిగా ఉన్నందుకు తుల్సి ప్రజాపతిని చంపి, వ్యతిరేకంగా రాసిన తెహెల్కాపై దాడిచేసి అదేదో ఘనకార్యంలాగా భావించి ఆ హత్యను మరిచిపోకముందే హత్యల మీద హత్యలు చేస్తూ వాటికి ఎన్‌కౌంటర్లని పేర్లు పెడుతూ ఆ హత్యలను చట్టబద్ధం చేసుకుంటూ హంతకులంతా ధైర్యంగా రోడ్లమీద, ఆయుధాలతో బెదిరిస్తూ తిరుగుతున్న దేశంలో ఉన్నందుకు మనమంతా సిగ్గుపడాలి.

రాష్ట్రాల సరిహద్దులు దాటి ఎన్‌కౌంటర్‌లు చేయడం ఇప్పటికి కొత్తేమికాదు. ఇవాళ యునిఫైడ్ కమెండ్స్ పేరుతో కేంద్ర ప్రభుత్వమే రాష్ట్రాల సరిహద్దులు దాటి ఎన్‌కౌంటర్లు చేయండని చెప్తున్నది గానీ తెలంగాణ ప్రాంతంలో నక్సలైట్లను మహరాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒడిశా పోలీసులు హత్యచేసిన ఘటనలు దశాబ్దాల కిందటే జరిగాయి. ఇప్పుడు చత్తీస్‌గడ్‌లోనూ జరుగుతున్నాయి. అవన్నీ నక్సలైట్లపై జరిపిన హత్యలు. ఇప్పుడు అదే పద్ధతిన మైనారిటీలను హత్యలు చేయిస్తూ మోడీ ఎల్లలు దాటిన ఎన్‌కౌంటర్లతో దేశం మీద పడుతున్నాడు. ప్రధాని గద్దెనెక్కి దేశమంతటా మారణహోమాలు సృష్టించాలనుకుంటున్నాడు. అప్రమత్తంగా ఉండకపోతే అభివృద్ధి, హిందూత్వం మాటున నరమేధాలు జరిపే నాయకుడు దేశానికి ప్రధానమంత్రి అవుతాడు. అర్థం చేసుకుని అభివృద్ధి మాయలో పడకపోతేనే ఈ దేశ ప్రజలకు బతుకు భద్రత లభిస్తుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- **ఇది కథ కాదు - డా. నళిని**
- **పోరు మహిళ - కె. రాధ, మోతీబాయి, వసంత**
- **సిరియాపై దాడికి అమెరికా సన్నాహాలు - ఎం.కె. కుమార్**
- **నేటి అనంతపురం - కె. నాగేశ్వరాచారి**
- **ఆంధ్రలో తొలి మహిళా సమాజం - షేక్ మహబూబ్ బాషా**

# విశాఖపట్నం ఎచ్‌పిసిఎల్‌లో పేలుళ్లు

***ఎచ్‌పిసిఎల్ కంపెనీ పేలుళ్లు పునరావృతం కావడానికి యాజమాన్య నిర్లక్ష్యమే కారణమని, వారిపై కఠిన చర్యలు తీసుకొని, బాధితులకు తగిన న్యాయం చేయాలని అంటున్నారు తుంపాల శ్రీరామమూర్తి***

విశాఖపట్నంలోని నవరత్న హోదా కలిగిన, చాలా సంవత్సరాల నుండి పని చేస్తున్న 'హిందుస్థాన్ పెట్రోలియం కార్పొరేషన్ లిమిటెడ్'లో 2013 సెప్టెంబర్ 23న భారీ పేలుడు సంభవించిన సంఘటనలో అక్కడికక్కడే ఒకరు మరణించగా, 40 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఈ సంఘటనలో ఇప్పటికి 25 మంది కాలిన గాయాలతో మరణించారు. వీరిలో కూలింగ్ టవర్ కూలిన శిథిలాల కింద ఆరుగురు మరణించారు. మరుసటి రోజు శిథిలాలలు తొలగించగా ఆరు మృతదేహాలు బాగా కాలిపోయి తూనాతునకలై చిద్రమై గుర్తించడానికి వీలులేని విధంగా ఉన్నాయి. ఎచ్‌పిసిల్ యాజమాన్యం సంఘటన గురించిగాని, సంఘటన కారణాల గురించిగాని ఎంత మంది ఆ ప్రాంతంలో పనిచేస్తున్నారో వారి వివరాల గురించిగాని నేటికి స్పష్టమైన ప్రకటన చేయలేదు. కూలింగ్ టవర్ కూలిపోవడానికి కారణాలు చెప్పలేదు. వాస్తవానికి 1997 నుండి కంపెనీలో ఘోర ప్రమాద సంఘటనలు జరుగుతూనే ఉన్నాయి. 1997 సెప్టెంబర్ 14న రాత్రి అతి పెద్ద ఎల్‌పిజి ట్యాంకులు ఒక్కొక్కటిగా పెద్ద పెద్ద శబ్దాలతో పేలిపోయాయి. 63 మంది అక్కడికక్కడే మరణించారు. ఈ పేలుడు సంఘటన కారణంగా ఆ పరిసర ప్రాంతం మల్కాపురం గ్రామంలోని కొన్ని ఇండ్లు పాక్షికంగా కూలిపోయాయి. జనం భయంతో సుమారు రెండు వేల మంది తమ నివాసాలను వదిలి సుదూర ప్రాంతాలకు వెళ్లిపోయారు. ఆ తదుపరి కూడా కొన్ని చెదురుమదురు సంఘటనలు జరిగాయి. అయినప్పటికీ యాజమాన్యం సంఘటనలకు గల కారణాలను ప్రకటించలేదు. ప్రమాదాలు జరగకుండా నివారణ చర్యలు తీసుకోలేదు. ఈ కంపెనీలో సుమారు ఐదువేల మంది కాంట్రాక్టు ఉద్యోగులు పనిచేస్తున్నారు. శాశ్వత ఉద్యోగులు 1500 మంది మాత్రమే ఉన్నారు. ప్రమాదాల నుంచి యాజమాన్యం గుణపాఠం నేర్చుకోలేదు. ఈ ఏడాది మే 7న సిబి3లో ప్రమాదం సంభవించింది. 1997 సంఘటనలో మాజీ సుప్రీంకోర్టు న్యాయమూర్తిచే విచారణ జరిపించారు. ఆయన ఇచ్చిన సిపార్సులను ఇప్పటికీ అమలు చేయలేదు. ఎచ్‌పిసిఎల్‌లో దాని స్వభావం రీత్యా అనేక జాగ్రత్తలు తీసుకోవలసిన అవసరం ఉన్నా యాజమాన్యం భద్రత ప్రమాణాలు పాటించకపోవడం వలన నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడం వలన ఈ సంఘటన జరిగింది. ఈ కూలింగ్ టవర్ల నిర్మాణం పనుల దగ్గర 120 మంది కాంట్రక్టు ఉద్యోగులు పనిచేస్తున్నారు. వీరంతా గోపాల్ ఇంజనీరింగ్, రూఫ్ ఆండ్ బ్రిడ్జ్ తదితర ప్రైవేట్ కంపెనీలకు టవరు నిర్మాణ పనులకు సంబంధించిన అనుభవం, నైపుణ్యం లేనివారు. చనిపోయిన వారిలో మురళి (సూపర్‌వైజర్) మాత్రమే ఎచ్‌పిసిఎల్ శాశ్వత ఉద్యోగి. కూలింగ్ టవర్ల నిర్మాణాన్ని చేపట్టే సంస్థలు దేశంలో రెండే ఉన్నాయి. వాటితో పనిచేయించకుండా సాదారణ కంపెనీలకు అనుమతి ఇచ్చారు.

ఎచ్‌పిసిఎల్ రిఫైనరీ యూనిట్లను కూలింగ్ చేయడానికి రెండు టవర్లను ఉపయోగిస్తున్నారు. ఒక్కొక్క టవరులో ఐదు సెల్స్ ఉంటాయి. ఇవి సముద్రపు నీటితో పని చేస్తుంటాయి. నాణ్యత ప్రమాణాలు పాటించనందు వలన ఏడాది కాలంలో ఇదే కూలింగ్ టవరు రెండు సార్లు కూలి పోయింది. అప్పుడు ఎటువంటి ప్రాణ నష్టం జరగలేదు. ఒక్కొక్క కూలింగ్ టవరును 30 మీటర్లు, అంతకంటే ఎక్కువ ఎత్తులో నిర్మిస్తారు. భూమిలో పిల్లర్లు వేసి దానిపై పెద్ద బెసిన్‌ల పెద్ద రాఫ్ట్ నిర్మిస్తారు. ఇది ఐదు మీటర్ల ఎత్తు ఉంటుంది. ఒక్కొక్క టవర్‌కి ఐదు నుంచి ఎనిమిది కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. క్రూడ్‌ను వేడి చేయగా వచ్చే పెట్రో ఉత్పత్తులను చల్లబరచడమే కూలింగ్ టవర్ల పని. ప్రాసెసింగ్ తరువాత వేడెక్కి వచ్చే నీటిని మళ్లీ చల్లబరచి యూనిట్లకు పంపుతారు. కూలింగ్ టవర్ల పని తీరు నిర్మాణానికి ఉపయోగించిన చెక్కపైనే ఆధారపడి ఉంటుంది. విదేశాల నుంచి దిగుమతి చేసుకొన్న ప్రత్యేకమైన చెక్కతో నిర్మాణం చేపడతారు. నీటిని ఎక్కువ సేపు చల్లగా ఉంచేందుకు ఈ విధంగా చెక్కను ఉపయోగిస్తారు. ఇటీవల ఒక టవరులో రెండు సెల్స్‌కు మరుమత్తులు చేపట్టారు. ఐదవ నెంబర్ సెల్స్ కొత్తగా నిర్మించారు. 2013 ఆగస్టు 23న ట్రయిల్ రన్ ద్వారా ఎలా పని చేస్తోందో పరిశీలించారు. ఇలాంటివి పరీక్షించే ముందు ఏదైనా ప్రమాదం జరిగితే దాన్ని తక్షణమే నిరోధించడానికి తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. పైపులన్నీ సక్రమంగా ఉన్నాయా లేవా ఎక్కడైనా లీకేజీలు ఉన్నాయా అని చెక్ చేసుకోవాలి. అయితే ఈ ట్రయల్ రన్ సందర్భంగా అటువంటివి ఏమీ చేయలేదని తెలుస్తోంది. ప్రమాదం జరిగినప్పుడు మోగాల్సిన సైరన్ సరిగ్గా పనిచేస్నున్నది, లేనిది నిర్ధారించుకోలేదు. చాలా క్యాజువల్‌గా స్విచ్ ఆన్ చేసి కార్యక్రమం ప్రారంభించారు. అదే ప్రమాదానికి దారి తీసింది. నీరు రావలసిన పైపుల నుంచి గ్యాస్ వచ్చింది. పెద్ద ఫోర్స్‌తో రావడం అది బయటకు వచ్చిన చోట వెల్డింగ్ చేస్తుండడంతో పెద్ద విస్పోటనం సంభవించింది. ఆ ధాటికి నిర్మాణంలో ఉన్న 40 మీటర్ల ఎత్తున మూడు టవర్లు కుప్ప కూలిపోయాయి. ప్రమాద ఘంటికలు మోగించాల్సిన మూడు సైరన్లూ మూగబోయాయి. ఒక్కటి కూడా పని చేయలేదు. పెద్ద ఎత్తున మంటలు చెలరేగాయి. ఆ సమయంలో అక్కడ 102 మంది వివిధ పనుల్లో నిమగ్నమై ఉన్నట్లు అధికారులు, రిజిష్టర్లు చెపుతున్నాయి. టవర్‌పైన పనులు చేస్తున్నవారు మంటల్లో కాలి ముద్దయిపోయారు. కొందరు శిథిలాల కింద ఉండి పోయారు. మిగిలినవారు పారిపోయారు. కూలింగ్ టవర్లలో సెల్స్ 2009 నుండి కూలి పోతూనే ఉన్నాయి. అయినా యాజమాన్యం నిర్లక్ష్యంగానే వ్యవహరిస్తోంది. ఇప్పుడు జరిగిన సంఘటనపై నిపుణులతో సమగ్ర విచారణ జరిపించి బాధ్యులైన అధికారలపై క్రిమినల్ చర్యలు తీసుకోవాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాం. మృతి చెందిన కాంట్రాక్టు కార్మికులకు 30 లక్షల నష్ట పరిహారంతో పాటు వాళ్ల కుటుంబంలో ఒక్కరికి శాశ్వత ఉద్యోగం అలాగే గాయపడిన వారికి నష్టపరిహారం చెల్లించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాం.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)*

వీ

# వెనుకబాటుతనం - వ్యవస్థ, సంస్కృతి ప్రభావం

***ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రాంతాల్లోని వెనుకబాటుతనాన్ని వివరిస్తూ దీన్ని అవకాశంగా తీసుకొని రాజకీయ పార్టీలు ఆయా ప్రాంతాల్లోని ప్రజలను ఎలా తప్పదోవ పట్టిస్తున్నాయో వివరిస్తున్నారు అరుణ్***

ప్రజాస్వామ్య ఉద్యమాల క్రమంలో సామాన్య ప్రజలు చైతన్య మవుతారని, పెరిగిన ఆ చైతన్యంతో మరిన్ని హక్కుల సాధనకు, నూతన ఉద్యమాలు చేపడతారని సాధారణంగా చెప్పుకుంటాం. అయితే, తొలుత ఆ ప్రజాస్వామ్య ఉద్యమాలకు ప్రేరకం ఏమిటి? హక్కుల ఆలోచన విడివిడి వ్యక్తులతో ప్రారంభమై దానికి సామాజిక పునాది ఉన్నప్పుడు సమిష్టి రూపం తీసుకుంటుందనుకున్నాం. అయితే, ఆ హక్కుల చైతన్యం కొందరికే కలగడానికి గల కారణాలేమిటి? అనే ప్రశ్న బయలు దేరుతుంది. సామాన్యంగా దోపిడీ, పీడన భరించలేనంత దశకు చేరుకున్నపుడు, ఆ సమాజంలోని పీడితులలో, అధిక చైతన్యం గల వారిలో తొలుత తిరుగుబాటు ఆలోచన కలుగుతుందనుకోవచ్చు? అలా అనుకుంటే, మరల మనకు పైన వేసుకున్న ప్రశ్నే ఎదురవుతుంది. పోరాటాల నుండి చైతన్యం, తిరిగి చైతన్యం నుండి మరిన్ని పోరాటాలుగా చెప్పుకున్నపుడు ఇవి రెండు పరస్పర ఆధారితాలుగా చెప్పుకోవచ్చు.

ఆదిమ మానవునికి వ్యవసాయదశలో తన జీవితావసరాలకు అనుక్షణం శ్రమ చేయవలసి వచ్చేది కాదు. అతనికి శ్రమ నుండి కొంత వెసులుబాటు రావడం, ఆ వెసులుబాటు వల్ల, ప్రకృతిని పరిశీలించడం, చుట్టూ ఉన్న జీవరాశి చలనాన్ని చూసి, విశ్లేషించి, వాటిని తనకు అన్వయించుకోవడానికి ప్రయత్నించడంలోనే నూతన ఆవిష్కరణలు నిప్పు, చక్రం లాంటివి కనిపెట్టడం జరిగింది. తొలి మానవుడు నిత్యం ప్రకృతితో సంభాషిస్తూ, సంఘర్షిస్తూ ప్రకృతిని తనకనుకూలంగా మార్చుకున్నాడు . దాంతో, ప్రకృతి శాస్త్రాలు పుట్టాయి.

మరి సామాజిక సంబంధాల మాటేమిటి? తాను దోపిడీకి గురవు తున్నాననే చైతన్యం, వ్యక్తిగా మానవునికి, సమిష్టిగా, ఆ సమాజానికి ఎలా కలిగింది? స్పార్టకస్ బానిసల తిరుగుబాటు నుండి, నేటి గిరిజనుల 'జల్ జంగిల్ జమీన్' పోరాటం వరకు, ప్రపంచం యావత్తూ కొనసాగుతున్న తిరుగుబాట్లు గాని, విప్లవోద్యమాలకు గాని ప్రేరణ ఏది? దాన్ని తనకన్నా మెరుగైన జీవన సదుపాయాలు అనుభవిస్తున్న, దోపిడివర్గం గురించి పీడిత వర్గానికి కలిగిన ఆలోచనే కారణమా? అదే సమయంలో తనపై కొనసాగుతున్న దోపిడీ పీడనలు భరించలేని దశకు చేరడం మరొక కారణంగా చెప్పుకుంటాం. అయితే, ప్రజలు దోపిడీకి గురవుతున్న, భౌతిక సమాజంలో పవరూ కారణం కాదని, అది వారి కర్మ అని దానికి భౌతికేతర, అలౌకిక కారణాలున్నాయనే భావన కల్పించడం, దానికి బలంగా గురైన సమాజాలు, తామెంత దోపిడీకి గురవుతున్నామో, స్వయంగా తెలుసుకోకపోవడం, చాలా సమాజాలకు అనుభవమే. ఆయా వ్యవస్థలలోని ఉత్పత్తి సంబంధాల వల్ల ఏర్పడిన మానవ సంబంధాలు, వాటివల్ల పుట్టుకొచ్చిన సంస్కృతి, ఆయా సమాజాల్లోని ప్రజలపై బలమైన ప్రభావం చూపుతుంది. సహజం గానే ఆ సాంస్కృతిక ప్రభావం ఆయా వ్యవస్థలను కాపాడేందుకు దోహద పడుతుంది. దాని నుండి బయటపడలేని వారు, ఆ వ్యవస్థలోని దోపిడీకి, అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాటం చేయలేరు. విముక్తి పొందలేరు. అయితే, సమాజంలో జరిగే ప్రతి చిన్న ప్రజాస్వామిక ఉద్యమం, ఆ సమాజ చైతన్యాన్ని మరింత పెంచుతుంది. అదొక ముందడుగు.

1) నేడు, వివిధ ప్రాంతాలలో తమ న్యాయమైన హక్కుల కోసం జరుగుతున్న ఉద్యమాలను పరిశీలిస్తే, ఆయా ప్రజలపై బలంగా ప్రభావం చూపుతున్న సాంస్కృతిక స్వభావం స్పష్టమవుతుంది. గత కొన్ని సంవత్సరాలుగా, ఆంధ్రప్రదేశ్‌లో కొనసాగుతూ వస్తున్న 'ప్రత్యేక రాష్ట్రం' నేటి 'సమైక్య ఉద్యమాలు', ఆయా ప్రాంతాల ప్రజల పోరాట చైతన్యాన్ని అక్కడ నెలకొన్న 'సంస్కృతి'ని తెలియచేస్తాయి. అయితే, చేస్తున్న విశ్లేషణ, ఆయా ప్రాంతాల ప్రజల చైతన్యాన్ని అంచనా వేయగలదా? అంటే, అందులో, కొన్ని కాల, ఉపప్రాంత మినహాయింపులుంటాయని చెప్పాల్సి ఉంది. ఆ పరిశీలనకై తెలంగాణ, రాయలసీమ, దక్షిణకోస్తా, ఉత్తరాంధ్ర ప్రాంతాల భౌగోళిక వాతావరణ పరిస్థితులు, పాలనా చరిత్రను మనం పరిగణలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ఆయా ప్రాంతాల భౌతికాభివృద్ధి, సామాజిక చైతన్యంపై ఆధారపడి ఉండడమే దానికి కారణం.

2) **మొదటగా తెలంగాణ సమాజాన్ని పరిశీలిద్దాం :** సాధారణంగా ప్రకృతి వనరులు సమృద్ధిగా ఉన్న ప్రాంతాలలో అభివృద్ధి త్వరితగతిన జరుగుతుంది. అయితే, తెలంగాణ అందుకు భిన్నంగా ఉంది. గోదావరి, కృష్ణా పరీవాహక ప్రాంతంగా సమృద్ధిగా 'బొగ్గు' దొరికే ప్రదేశంగాను, 1953కు ముందే అభివృద్ధి చెందిన హైదరాబాద్ పట్టణం నడిబొడ్డున ఉన్నా కూడా తెలంగాణ ప్రాంతం అభివృద్ధి చెందకపోవడానికి కారణాలేమిటి? రాయలసీమలోలాగా, అక్కడి ప్రకృతిని నిందించే అవకాశాలు లేవు. కృష్ణా గోదావరే గాక, ప్రాణహిత, మంజీర, మూసి లాంటి చిన్న నదులూ తెలంగాణ ప్రాంతంలోనే ఉన్నాయి. అయినా ఆ ప్రాంత ప్రజలకు ప్రకృతి వనరుల వల్ల కలిగిన ప్రయోజనం అతి స్వల్పమే. 1970ల తర్వాత విప్లవోద్యమం వల్ల, ఆ ఉద్యమ అణచివేతకు, ఆ ప్రాంతంలో వాడవాడలకు, చివరకు అటవీ ప్రాంతానికి రోడ్లు వేయబడ్డాయి. టెలిఫోన్, టెలిగ్రాం సౌకర్యాలు కల్పించబడ్డాయి. ప్రజాందోళనలు, తిరుగుబాట్లు పాలకుల నుండి కొంతమేరకైనా ప్రజలకు సౌకర్యాలను సాధిస్తాయనే వాస్తవం నిరూపించబడ్డది. 'ప్రత్యేక తెలంగాణ ఉద్యమం' కూడా తెలంగాణ ప్రాంతంలో అటు గోదావరి, ఇటు కృష్ణానదులపై కొన్ని ప్రాజెక్టుల శంకుస్థాపనలయినా జరిగేల ప్రభావం చూపింది. అయితే సామ్రాజ్యవాద విధానాల ప్రభావంతో పాలిస్తున్న పాలకవర్గం, అభివృద్ధి చెందని ప్రాంతాలను తమకు ముడిసరుకుల నందించే వలసలుగా చూస్తుంది. దాని ఫలితమే తెలంగాణ ప్రాంతం,

తనకున్న ప్రకృతి వనరులను తగినంత మేరకు, ఆ ప్రాంత అభివృద్ధికి వినియోగించుకోలేకపోయింది.

ముందుగా అభివృద్ధి చెందిన ప్రాంత పెట్టుబడుదారులు, రాయలసీమ, తెలంగాణలను తన అంతర్గత వలసలుగా భావించారు. తెలంగాణేతర ప్రాంత విద్యావంతులలో మేధావులలో, వారు సాంస్కృతికంగా బాగా వెనుకబాటులో ఉన్నారనే భావన బలంగా ఉంది. తెలంగాణ భాష, అలవాట్లు, సంస్కృతిని కించపరిచేలా అభివృద్ధి చెందినవారిగా చెప్పుకుంటున్న వారి ధోరణి, ప్రవర్తన కనపడుతుంది. ఇతరుల భాషా, అలవాట్లు, సంస్కృతులను కించపరచడమనేది ప్రజాస్వామ్య సంస్కృతి కాదనే విషయాన్ని తాము బాగా అభివృద్ధి చెందిన వాళ్లమని చెప్పుకునే వారు గ్రహించకపోవడం నేటి విషాదం. మరి, అలా తరతరాలు అణగదొక్కబడిన తెలంగాణ ప్రాంత ప్రజలలో, మిగతా ప్రాంత ప్రజల్లో లేని చైతన్యం, తమ భాషా, సంస్కృతులపట్ల స్వీయాభిమానంతో పాటు, తమను అణగదొక్కిన, దొక్కుతున్న వారికి వ్యతిరేకంగా పోరాటం చేయాలనే మెలుకువ ఎలా కలిగింది? ప్రాంతీయ స్పృహతో పాటు, తమ చరిత్రపట్ల మెలుకువ కలిగి ఉండడానికి కారణాలేమిటి? ఆలోచిస్తే, ఆ ప్రాంతంలో జరిగిన ప్రజా ఉద్యమాలే అని చెప్పవచ్చు.

వలస పాలనకు వ్యతిరేకంగా, కొమురం భీం నుండి, అంతకు ముందు సమ్మక్క, సారక్కల, పగిడిగిద్ద రాజుల స్వాభిమానం, అణచివేతకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలు, ఆ తర్వాత మహత్తర తెలంగాణ రైతాంగ పోరాటానికి, తెలంగాణ ప్రజల్ని మానసికంగా సిద్ధం చేశాయని చెప్పవచ్చు. ఆ పోరాట స్పృహ, కమ్యూనిస్టుల సైద్ధాంతిక అవగాహన, కలగలపి, భూమి కోసం పెద్ద ఎత్తున సాయుధ పోరాటాలకు దారితీసింది. కొన్ని సంవత్సరాలపాటు జరిగిన ఆ రైతాంగ పోరాటం, తెలంగాణ ప్రాంతపు, ప్రతి కుటుంబాన్ని తనలో భాగస్వామ్యం చేసుకుంది. దాంతో, పోరాటం చేసిన వారికే గాక, వారి కుటుంబ సభ్యులలో ప్రజాస్వామ్య ఉద్యమాలపట్ల అవగాహన, అన్యాయాన్ని ఎదుర్కోవాలనే చైతన్యం కల్గింది. ఆ తర్వాత 'రూమీటోపి పోయి / నెహ్రూ టోపి వచ్చినా' పీడనకు వ్యతిరేకంగా పోరాటం చేయాలనే ఎరుక ఆ ప్రాంత ప్రజల్లో నిబిడీకృతమై ఉంది.

1960 చివరలో శ్రీకాకుళ రైతాంగ పోరాటం, ఆంధ్రప్రదేశ్‌లో నిప్పురవ్వగా మొదలయి దావానలంలాగా వ్యాపించడంతో దాన్ని తొలుత ఆహ్వానించి, వ్యాపింపచేసిన ప్రతిష్ట తెలంగాణ ప్రజలదే. నక్సల్ పోరాటాలిచ్చిన స్ఫూర్తి, తెలంగాణ ప్రజలకు మరింత హక్కుల స్పృహను, పోరాడాలనే సంకల్పాన్ని బలీయం చేసింది. ఆ వెలుగులోనే, ఆ తర్వాత సుదీర్ఘకాలంగా జరిగిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర పోరాటాన్ని చూడాల్సిఉంది. తెలంగాణ ప్రజల పోరాట స్పృహను ఇప్పుడిప్పుడే ఆవిర్భవిస్తున్న తెలంగాణ పెట్టుబడిదారీ వర్గం, తమ ప్రాంత వనరులపై పట్టుకై ఉపయోగించుకుంది. వాస్తవంలో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో సామాన్య ప్రజల, బడుగు బలహీన వర్గాల ఆకాంక్షలు వేరు. అగ్రకులాల పెట్టుబడిదారీ వర్గపు ఆకాంక్షలు వేరు. అంటే, ఒక ప్రాంత ప్రజల చైతన్యాన్ని, అక్కడ జరిగిన ప్రజాపోరాటాలు నిర్దేశిస్తాయని చెప్పవచ్చు. అయితే, అలా అన్ని ప్రాంతాలలో జరుగుతుందనే భరోస లేదు. దానికి మినహాయింపును మనం నేటి ఆంధ్రప్రదేశ్‌లో నున్న వేరే ప్రాంతంలోనూ చూడవచ్చు.

3) **దక్షిణకోస్తా :** అయితే, పోరాటాలు లేని ప్రాంతంలోనూ, తమ ప్రాంత స్పృహ ఉంటుందని దానికి కారణాలు ఆర్థికపరంగా ఉంటాయని మనకు దక్షిణకోస్తా ప్రాంతం చెబుతోంది. పోరాట ప్రాంతాలలో ప్రజలకున్న ఎరుక, స్పృహ, చైతన్యాలలో స్వార్థం ఉండదు. అవి మౌలికంగా ప్రజాస్వామ్యమైనవి. మెజారిటీ ప్రజల జీవితాల్ని స్పృశించేవి కూడా. దక్షిణకోస్తా ప్రాంతం, కాటన్‌దొర పుణ్యాన తొలుత, ఆ తర్వాత సాగర్ జలాలవల్ల సుసంపన్నమయ్యింది. బ్రిటిష్ పాలన కింద ఉండడం వల్లకూడా ఆ ప్రాంతం విద్యారంగంలో అభివృద్ధి చెందింది. దక్షిణాన మద్రాస్, ఉస్మానియా విశ్వవిద్యాలయాల తర్వాత నెలకొల్పబడ్డ విశ్వ విద్యాలయం ఆంధ్ర విశ్వవిద్యాలయమని చెప్పవచ్చు. వ్యవసాయరంగం లాభసాటి కావడం, దాంతో ఆ రంగంలోని మిగులు వ్యాపారంలోకి ముఖ్యంగా సినిమారంగంలో పెట్టుబడులుగా మార్చడం, నిత్యం మద్రాస్ నగరంతో సంబంధాలు పెరగడంతో దక్షిణకోస్తా సమాజంలో పెట్టుబడిదారీ సంబంధాలు ప్రవేశించాయి. పెట్టుబడిదారీ వ్యవస్థకు జాతి ఎరుక కలుగుతుంది. ఐరోపాలో కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి చెందే దశలో దానికి చోదకంగా జాతిరాజ్యాలు అవసర మయ్యాయని ప్రపంచ చరిత్ర చెపుతోంది. తన ప్రాంతం, తన జాతి ఎరుకతోపాటు, జాతి స్వయంపాలన, తమ ప్రాంత వనరులపై తమకే ఆధిపత్యమనే స్పృహ, కోస్తా సమాజంలో పెరుగుతూ వచ్చింది. అందువల్లనే కాబోలు, తమిళులు ఆధిపత్యానికి వ్యతిరేకంగా, అంతకు ముందు బ్రిటిష్ వలసవాదులకు వ్యతిరేకంగా మొదట ఆ ప్రాంతం నుండి గొంతు వినిపించింది. తమిళులపట్ల వారికున్న విముఖతేగాక, అప్పుడే అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ వర్గం, తమ ప్రాంత వనరులను, ఇతర ప్రాంతాల వారు తరలించుకపోవడాన్ని సహించలేని స్థితి ఏర్పడింది. దాంతో తెలుగు వారందరూ ఏకం కావాలని, తెలుగు రాష్ట్రం ఏర్పడాలనే డిమాండ్ మొదలు ఆ ప్రాంతం నుండే ఉద్భవించడం లో ఆశ్చర్యపడేదేమీ లేదు.

4) ఇక రాయలసీమ వారిని తమతో కలుపుకొనకపోతే, తమ లక్ష్యం, 'తెలుగురాష్ట్రం' నెరవేరదనే విషయం వారు ముందే పసిగట్టారు. దానికితోడు, మొదటి నుండి నిష్కర్షగా, ముక్కుసూటితనాన్ని అమాయకత్వాన్ని పుణికిపుచ్చుకున్న రాయలసీమవాసులు, కోస్తావాసు లతో సహజీవనం గావించడం తమకిష్టంలేదని కుండబద్దలు కొట్టినట్టు చెప్పడమూ జరిగింది. దాని ఫలితమే, శ్రీబాగ్ ఒడంబడిక, దానికి చట్టబద్ధతలేదని, త్వరలోనే తెలంగాణ ప్రాంతంతో కలిసి 'విశాలాంధ్ర' ఏర్పడుతుందని పసిగట్టిన కోస్తాంధ్ర రాజకీయ నాయకత్వం, కర్నూల్‌లో రాజధాని ఏర్పాటుకు అంగీకరించింది. కర్నూల్ రాజధాని మూన్నాళ్ల ముచ్చట అని ప్రకాశం పంతులుకూ తెలుసు. ఆ విషయాన్ని, తమకు రాష్ట్ర రాజధాని దక్కలేదని ఆందోళన చేస్తున్న వారికి స్పష్టంగా చెప్పాడు కూడా. ఏతావాత, నష్టపోయింది రాయలసీమ మాత్రమే. రాజధాని పోయింది. ఇక కృష్ణాజలాల వినియోగంలో, సీమకివ్వాల్సిన ప్రాధాన్యత నీటిబుడగలయ్యింది. మూడు ప్రాంతాల విలీనంతో, రెండు ప్రాంతాల మధ్య రాసుకున్న ఒప్పందం చిత్తుకాగిత మయ్యింది. సీమప్రాంత ప్రజలు మోసపోయినట్లుగా, కోస్తాంధ్ర పాలకుల కుతంత్రాలకు తర్వాతికాలం తెలంగాణ ప్రజలు బలవ్వడం చారిత్రక వాస్తవం.

5) పెట్టుబడి కేవలం తన ప్రాంతంపై ఆధిపత్యంతో సంతృప్తి చెందదు. తన విస్తరణకై వెనుకబడిన ప్రాంతాల దోపిడీకై అర్రులు

చాస్తుంది. తన దురాశకు, ఇతర ప్రాంతాల పాలకవర్గాల చేయూత లభిస్తే పెట్టుబడి విస్తరణకు పరిమితి, హద్దు ఉండదు. ఆ కారణంగానే దక్షిణకోస్తా వ్యవసాయం మిగులు, తెలంగాణ ప్రాంతంలో ముఖ్యంగా సరిహద్దు జిల్లాలైన నల్లగొండ, ఖమ్మంలలో పాగా వేసింది. ఆ తర్వాత హైదరాబాద్ రాజధాని కావడంతో, దక్షిణకోస్తా పెట్టుబడిదారీ వర్గపుకన్ను ఆ నగరంపై బడింది. అయితే ఈ పెట్టుబడి ఒక విధంగా ప్రగతిశీల పెట్టుబడి కాదు. కోట్లాది రూపాయలు, పదిమందికి కూడా పని కల్పించని 'రియల్ ఎస్టేట్' వ్యాపారంలో పెట్టారేగాని, కనీసం వేయిమందికి ఉపాధి కల్పించే పరిశ్రమలు నెలకొల్పలేదు. ప్రభుత్వం తమ చేతుల్లో ఉండడంతో, అక్రమ ఆస్తులు పెరిగాయి. క్రమంగా, రోడ్ల నిర్మాణం లాంటి ఇతర రంగాలలో కూడా కోస్తా పెట్టుబడిదారులు ప్రవేశించారు. ఆ విధంగా మొత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వనరులపై ఆధిపత్యం వహిస్తున్న పెట్టుబడిదారులకు, నేడు ఈ మధ్యే కుబుసం విడిచిన తెలంగాణ పెట్టుబడిదారీ వర్గం నుండి బలమైన పోటీ వచ్చింది. అయితే, తెలంగాణ పెట్టుబడిదారులకు, అక్కడి ప్రజలలో కోస్తాంధ్ర పాలకులపై దశాబ్దాలుగా పేరుకున్న వ్యతిరేకత, బలం చేకూర్చింది. తమ భాషను, సంస్కృతిని కించరచడంతో పాటు, స్వాతంత్ర్యం వచ్చిన కొత్తగా ఆంగ్ల విద్యాభ్యాసం పొందిన తమ పిల్లలు న్యాయంగా పొందవలసిన ఉద్యోగ వాటాను, ఇతర ప్రాంతాల వాళ్లు కొట్టుకపోవడం జీవన పోరాటంగా మారింది. పెట్టుబడికి మానవత దృష్టి ఉండదు. ఎంతసేపూ లాభాపేక్షే. అందువల్లే దశాబ్దాలుగా కోస్తాంధ్ర పెట్టుబడిదారి వర్గంపై తెలంగాణ ప్రజలకు పెరుగుతున్న వ్యతిరేకతను తగ్గించేందుకు తగిన చర్యలు తీసుకోలేదు. దాంతో తెలంగాణ పెట్టుబడిదారీ వర్గం 'తమ వనరులపై తమకే హక్కు' ఉండాలనే వాదంతో ప్రజలను, విద్యార్థులను, ఉద్యోగులను సంఘటితం చేయగలిగింది. అది చివరకు రాష్ట్ర విభజనకు దారి తీసింది. ఇప్పుడు కోస్తాంధ్ర పెట్టుబడి తన వలసను కోల్పోబోతుంది. కోట్లాది రూపాయల రియల్ ఎస్టేట్ వ్యాపారం దివాళ తీస్తుంది. అక్రమ ఆస్తులు పోతాయేమో ననే భయం ఉంది. ఆంధ్ర, రాయలసీమ ప్రాంత, ఉద్యోగుల, విద్యార్థుల ప్రయోజనాలు దెబ్బతింటాయనే ఊహాజనిత ఆందోళనకు పరోక్షంగా లగడపాటి లాంటివారు గత కొన్ని సంవత్సరాలుగా ఆజ్యం పోస్తూనే ఉన్నారు. దానికితోడు భూస్వామ్య సంస్కృతి బలమైన ప్రభావం కలిగిన సమాజంలో (రాయలసీమలో) 'ఉమ్మడి కుటుంబపు' భావన ఒకవైపు, మరోవైపు (కోస్తాంధ్రలో) జాతిస్పృహ, ఈ రెండూ తెలంగాణేతర ప్రాంతంలో ఉద్యమ ఉధృతికి తోడ్పడుతున్నాయి.

6) అదలా ఉంచితే, రాయలసీమ మాటేమిటి? నేడు రాష్ట్ర విభజన ప్రకటించాక, కోస్తాంధ్రులు, తమకు రాయితీగా డెల్టా రైతులకు ముక్కారు పంటలకు సాగునీరు స్థిరీకరణకై పోలవరం ప్రాజెక్టును కేంద్ర ప్రాజెక్టుగా పొందారు కదా! సీమవాసులెందుకు అలాంటి ప్రయోజనమేదైనా పొందాలనే చైతన్యం ఎందుకు పొందలేదు? సాక్షాత్తు శ్రీకృష్ణ కమిటీనే ఈ సమైక్య రాష్ట్రంలో, రాయలసీమ అత్యంత వెనుకబడిన ప్రాంతమని చెప్పినా, ఇక్కడి రాజకీయ నాయకులుగాని, విద్యావంతులుగాని, మేధావులుగాని 'సమైక్యాంధ్ర' అంటున్నారేగాని, సీమప్రాంత అవసరాల గురించి ఎందుకు మాట్లాడడం లేదు. రాజకీయ నాయకులంటే, ఏ ఎండకాగొడుగుపట్టే అవకాశవాదులు, మరి మిగతా మేధావులు, ఉపాధ్యాయులు, లాయర్లు, విద్యార్థుల మాటేమిటి? వీరికి నిజంగా 'తెలుగుజాతి' అంతా కలసి ఉండాలనే కోరిక ఉందా? ఉంటే 'హైదరాబాద్' గురించే ఎందుకు ఎక్కువగా మాట్లాడుతున్నారు. కొందరు 'రాయల్ తెలంగాణ' అని, మరికొందరు అనంతపురంను కర్నాటకలో కలుపమని అడగడంలో 'విభజన' పట్ల వీరికి స్పష్టమైన వైఖరి లేదని తెలిపోతుంది. రాజకీయ నాయకులనలా ఉంచితే, మధ్యతరగతి బుద్ధిజీవులు, కవులూ, కళాకారులకు ప్రాంతీయ ఎరుక లేకపోవడానికి కారణాలేమిటి? ఇప్పటి వీరి ఉద్యమానికి బలమైన కారణం విద్య, ఉపాధి గురించిన అనవసర భయాలు తప్ప, 'జాతిపరుక' కాదు.

7) పై విషయాల్ని అర్థం చేసుకొనడానికి, రాయలసీమ ప్రాంత ఆర్థిక వ్యవస్థను, ఉపరితలాంశమైన సంస్కృతిని విశ్లేషించాల్సిన అవసరముంది. మొదటి నుండి వర్షపాతం తక్కువగా ఉన్న ఈ ప్రాంతం విజయనగర రాజుల కాలంలో, వాళ్లు ముందు చూపుతో తవ్వించిన చెరువులవల్ల కొంతమేరకైనా వ్యవసాయికంగా ప్రజలు బాగుపడ్డారు. విజయనగర సామ్రాజ్య విచ్ఛిన్నం తర్వాత రాయలసీమ పన్నులు వసూలు చేయడం తప్ప, మరే అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టని పాళెగాళ్ల ఆధీనంలోకి వచ్చింది. పన్నులు వసూలు చేయడం తప్ప, మరే అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టని పాళెగాళ్లు, నిరంతరం అంతర్యుద్ధాలతో ఈ ప్రాంతాన్ని అతలాకుతలం చేశారు. వరుస కరువులతో లక్షలాది మంది మరణించారు. విద్య, ఉపాధి కరువై ప్రజలు బతుకు తెరువుకై ఎవరో ఒకరి పంచన చేరాల్సిన పరిస్థితి. ఆ తర్వాత కాలంలో కొంతకాలం నైజాంపాలన, ఆ తర్వాత బ్రిటిష్ పాలన వచ్చినా కూడా ప్రజల మధ్య భూస్వామ్య సంబంధాలలో వచ్చిన మార్పేమి లేదు. 'స్వామిభక్తి'కి మారుపేరుగా నిలిచారు రాయలసీమ ప్రజలు. ఆ సంస్కృతి నుండి విద్యావంతులు, మేధావులు, రచయితలు, కళాకారులు బయట పడకపోవడం ఒక వైచిత్రం, ఒక విషాదం. పాళెగాళ్లు, ముఠా నాయకులుగా, భూ ఆక్రమణదారులుగా, మైనింగ్ మాఫియాలుగా, వారే చివరకు రాజకీయ నాయకులుగా రూపాంతరం చెందారు. పేరుకు ప్రజాస్వామ్యమే గాని, ఆయా నియోజకవర్గాలు, అక్కడి రాజకీయ నాయకుల స్వంత ఆస్తి. అక్కడ ఏ అధికారి అయినా, ఆ నియోజకవర్గ ప్రజా(?) ప్రతినిధి కనుసన్నలలో మెలగాల్సిందే. పోలీసు ఆఫీసర్ అయినా సరే. తమ మాట వినని అధికారులను, ఎంతటి ఉన్నత స్థానంలో ఉన్నా, బూతులు తిట్టడం, కొన్నిమార్లు చేయి చేసుకోవడం ఇక్కడ సోకాల్డ్ ప్రజాప్రతినిధులకు పరిపాటి. దాన్ని తుడుచుకొని మౌనంగా సహించడం ఉద్యోగులకూ పరిపాటే. సీమలో ప్రతి ఊరు, ఒకరిద్దరు నాయకుల మధ్య విభజింపబడి ఉంటుంది. ప్రతి పనికి గ్రామ ప్రజలు తమ రాజకీయ నాయకునిపై ఆధారపడాల్సిందే. మొదటి నుండి ఆధిపత్యం వహిస్తున్న సామాజిక వర్గమే, అన్ని రాజకీయ పార్టీలకు ప్రాతినిథ్యం వహిస్తోంది. నందమూరి తారక రామారావు రాకతో రాజకీయ పరిస్థితులలో కొంత మార్పు వచ్చింది. ఈ కొత్త పార్టీపై బి.సి., ఇతర వెనుకబడిన వర్గాలు ఆశలు పెంచుకొని మద్దతు నిచ్చాయి. కాని, ఆ పార్టీలో ప్రాధాన్యత మరొక అగ్రకులానిదే. బిసి, ఎస్‌సిలలో నాయకత్వం స్థాయికి ఎదిగినవారు కొందరున్నా, వారు తమ రాజకీయ, వ్యక్తిగత ప్రయోజనాల కోసం ఏదో ఒక బలమైన సామాజిక వర్గానికి బంట్లుగా నిలిచారు.

8) పై నేపథ్యంలో, రాయలసీమ ప్రాంత ప్రజలకు 'జాతి' ఎరుకగాని,

హక్కుల చైతన్యం గాని అలవడలేదు. కొంతకాలం విప్లవోద్యమ ప్రభావంలో కొన్ని ప్రాంతాలు ఉండినా, అక్కడా, రెండు ప్రధాన సామాజిక వర్గాల మధ్య ఘర్షణే. సీమ సంస్కృతిని, భాషను కించపరుస్తున్నా నీటి వాటా, ఉద్యోగ వాటాలలో సీమకు అన్యాయం జరుగుతున్నా, ఆ విషయమై పట్టించుకున్న రాజకీయ పార్టీలేవీ లేవు. దశాబ్దం కిందట కొందరు తమ రాజకీయ ప్రయోజనాలకై సీమ సమస్యలు లేవనెత్తి ఉద్యమాలు నిర్వహించినా అవి ఉద్యమ నాయకుల గద్దె నెక్కించాయేగాని, ఉద్యమాల్లో పాల్గొన్న సామాన్య ప్రజలకు ఒరిగిందేమీ లేదు. అసలు ప్రజల్లోనే తాము నిర్లక్ష్యానికి గురవుతున్నామనే స్పృహే కరువైంది. ఎవరో ఒక బలమైన నాయకుని ప్రాపకం సంపాదించుకొని, జీవనం గడపాలనే యోచనే తప్ప, తమకు స్వతంత్రంగా, గౌరవంగా జీవించగలిగే హక్కుఉందనే ఆలోచనే సామాన్య ప్రజలకు లేదు. ఇక విద్యావంతులు, మేధావులు, రచయితలు, కళాకారులు, సీమ కడగండ్లకు ప్రకృతిని నిందించారే తప్ప ప్రస్తుత విజ్ఞాన సమాజంలో, నిబద్ధతతో పనిచేస్తే అన్ని ఆటంకాలు అధిగమించ వచ్చనే స్పృహ కనబరచలేదు. ఒక దేశంగా ఇజ్రాయిల్, అరబ్బు దేశాలు గాని, మనదేశంలోని రాజస్థాన్‌గాని వర్షపాతం విషయంలో రాయలసీమ కన్నా హీనపరిస్థితుల్లో ఉన్నా, తమ ప్రజలకు తాగునీరు, సాగునీరు అందిస్తున్నాయనే వాస్తవాన్ని పై మేధావులెన్నడూ పట్టించుకోలేదు. ప్రజా ప్రయోజనాలపట్ల నిబద్ధత ఉంటే, ఎటువంటి సంక్లిష్ట పరిస్థితినుండైనా, ఏ విధంగా బయటపడాలనే ఆలోచన కలుగుతుంది. ప్రజలపట్ల అలాంటి నిబద్ధత ఇక్కడి మేధావి వర్గానికి లేకపోవడం ఈ ప్రాంత ప్రజల దురదృష్టం. కొందరిలో అది కనిపించినా అది ఆచరణకు దారి తీయక, తామేమి చేయలేమనే నిరాశతో నిర్లిప్తంగా ఉండడం జరుగుతూ వచ్చింది. లేకపోతే దాదాపు మూడు దశాబ్దాల కిందటే రాయలసీమ ప్రజల హక్కులకై జరిగిన ఉద్యమం నీరుగారకుండా ఉండేది. కనీసం నివురు గప్పిన నిప్పులాగానైనా ఉండేది. సమైక్య రాష్ట్రంలో, అత్యంత వెనుకబడిన రాయలసీమ ప్రాంతం, ప్రత్యేక రాయితీలు పొందడం అటుంచి, తమ ప్రాంతానికి జనాభా, వైశాల్యం ప్రాతిపదికన ప్రకృతి వనరులు, ప్రభుత్వ ఉద్యోగాలు పొందాలనే డిమాండ్ ఇక్కడి ప్రజల్లో ముఖ్యంగా నిరుద్యోగ యువతలో, విద్యావంతులలో రాకపోవడం ఒక విషాదం. ఈ ప్రాంత ప్రజలు భూస్వామ్య సంస్కృతికి బందీలు కావడం తమ కష్టాలకు బాహ్య ప్రపంచంలో కారణాలు వెదకగా, అవన్నీ తమ 'కర్మ'గా భావించడమే, దానికంతా కారణంగా భావించవచ్చు.

9) ఉత్తరాంధ్ర పరిస్థితి మరి విశ్లేషణకు అందేలా కన్పించదు. భారతదేశ రాజకీయ ముఖచిత్రాన్నే మార్చేసి, భూమి సమస్యను, గిరిజనుల సమస్యలు అన్ని పార్టీల ఎజండాలో తెచ్చి, నేటికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దళారీ విధానాలనడ్డుకుంటున్న నక్సల్‌బరీ (నేటి మావోయిస్టు) పోరాటాలకు, ఆంధ్రప్రదేశ్‌లో పురిటిగడ్డ ఉత్తరాంధ్ర ప్రాంతం. భాషను సంస్కరించి తెనుగును తేటతెనుగుగా మార్చేందుకు ఉద్యమించిన గిడుగు రామ్మూర్తి పంతులు, ఆకాశంలో పయనిస్తూ, అంగాంగ వర్ణాలతో నిండిన తెలుగు కవితను భూమార్గం పట్టించి, భూకంపం, శ్రీశ్రీ తన సారా, పారో కథలతో అట్టడుగువర్గాల వ్యథలతో పాటు, మధ్యతరగతి డొల్లతనాన్ని బహిర్గతం చేసిన రావిశాస్త్రి, నెహ్రూ సోషలిస్టు విధానాల డొల్ల తనాన్ని బట్టబయలు చేసిన కారా, చాగంటి సోమయాజులు, ఆరుద్ర లాంటి నవ వైతాళికుల పుట్టినిల్లు ఉత్తరాంధ్ర. ఎన్నో ప్రకృతి వనరులూ, నదులూ ఉన్నా, అభివృద్ధికి ఆమడదూరం ఉన్నా, ఏమీ పట్టించుకోని ప్రజానీకం, ప్రజాప్రతినిధులు 1927లోనే ఆంధ్ర యూనివర్సిటీ వల్ల ఉన్నత విద్య అందుబాటులో వచ్చినా, ఉత్తరాంధ్ర ఎందుకంత వెనుకబడిన ప్రాంతంగా ఉంది? అక్కడి మేధావులూ, విద్యావంతులు ప్రాంతీయ స్పృహకెందుకతీతంగా ఉన్నారు. పైన పేర్కొన్న రచయితలలో వామపక్షభావాలు గలవారూ, సాయుధ పోరాటాన్ని సమర్థించిన వారూ ఉన్నారు. సోషలిస్టు వ్యవస్థకై కలలుగన్న వీరికి, తమ చుట్టూ ఉన్న ప్రజల తక్షణ సమస్యలు కనపడలేదా? ఒకవైపు నక్సల్‌బరీ ఉద్యమం, మరోవైపు ఆ ఉద్యమంలో ప్రేరితమై ప్రజల పక్షాన నిలబడ్డ రచయితలూ, అయినా ప్రజలకు ఈ బూర్జువా వ్యవస్థలో తమ కనీస అవసరాలకై పోరాడాలనే ఆలోచన, తమ ప్రాంతాన్ని పూర్తిగా విస్మరిస్తున్నారనే ఎరుక లేకపోవడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఎందుకు, ఇప్పటికీ ఉత్తరాంధ్ర ప్రజలు తమ కనీస అవసరాల డిమాండ్లతో పీలగానైనా గొంతెత్తి అరవడం లేదు. సాహిత్యం ద్వారా తమ ప్రాంతీయులకు, ఇతర ప్రాంతవాసులకు అక్కడ పరిస్థితులను తెల్పడం లేదు. సెజ్‌లకు, అణువిద్యుత్ కేంద్ర నిర్మాణాలకు వ్యతిరేకంగా పోరాడుతున్నా, తమ ప్రాంత అభివృద్ధికై వారు ఉద్యమాల్ని నడపక పోవడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి. దీనికి బహుశా రెండు కారణాలను చెప్పుకోవచ్చును. ఉత్తరాంధ్ర సాంస్కృతిక కేంద్రంగా వెలివిరిసిన గంజాం జిల్లాలోని బరంపురం పర్లాకిమిడి లాంటి పట్టణాలు 1930లనే ఉత్తరాంధ్రా వాసులకు దూరం కావడం, దాన్ని పూర్తిగా నివారించలేక భాషా సంస్కరణకర్త గిడుగురామ్మూర్తి దంపతులు బరంపురంను శాశ్వతంగా వదలి, రాజమండ్రి నివాసం ఏర్పరచుకున్నమాట చరిత్ర చెబుతున్న విషయం. అంటే ఒక విధంగా, ఉత్తరాంధ్ర ప్రజలు సాంస్కృతి పురోగమనానికి బరంపురం, పర్లాకిమిడి, ఆ ప్రాంతం నుండి వేరుపడడం అడ్డుకట్ట వేసిందని చెప్పవచ్చు. ఆ తరువాత శ్రీకాకుళ రైతాంగ పోరాటం మొదలయినా, అది గిరిజనులను కదిలించినంతగా, ఇతర వర్గాలను కదలించ లేదనవచ్చు. జాతిస్పృహ, ప్రాంతీయ ఎరుక అనేది ప్రధానంగా మధ్యతరగతి, అప్పుడే పైకి వస్తున్న పెట్టుబడిదారి వర్గపు భావజాలమే గాక భౌతిక అవసరం కూడా. ఆ రెండు కూడా ఉత్తరాంధ్ర ప్రాంత ప్రజల్లో, రాయలసీమ ప్రజల్లో కూడా కలుగలేదు. అంటే సమాజంలో పెట్టుబడిదారీ సంబంధాలు ప్రవేశించకపోవడం, మధ్యతరగతి ప్రభావితం చేసే ప్రజాస్వామ్య పోరాటాలు లేకపోవడం వల్ల నేటి రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రజలు తమ కనీస అవసరాలకు గొంతెత్తి అరిచే స్పృహను పొందలేక పోయారని చెప్పవచ్చు.

10) ఏది ఏమైనా, రాయలసీమ ఉత్తరాంధ్ర ప్రాంత ప్రజలు ఇప్పటికైనా మేల్కొని తమ ప్రాంత అభివృద్ధికై, తమ ప్రాంత రాజకీయ ప్రతినిధులపై ఒత్తిడి తేవాల్సింది. 56 ఏళ్ల 'సమైక్య ఆంధ్ర'లో ఎక్కువగా అభివృద్ధికి నోచుకోనిది రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాంతాలే. తెలంగాణ వారిలా, తమ హక్కులకై వీరు కనీసం గొంతెత్తి అరవనూ లేదు. 'విభజన' సమయంలోనైనా తమ ప్రాంతాలకు న్యాయంగా రావాల్సిన నీటివాటా, ప్రకృతి వనరులపై ఆధిపత్యం, ఉద్యోగాల్లో వాటాకై పెద్దఎత్తున ఉద్యమించకపోతే భవిష్యత్తరాలు ఆయా ప్రాంతాల మేధావులను, ప్రజాస్వామ్య వాదులను క్షమించరు.

*(రచయిత రాయలసీమ విద్యావంతుల వేదిక సభ్యులు)* వీ

# తెలంగాణ విభజన -సమైక్యాంధ్ర ఉద్యమం

***ప్రజల సమస్యలు ఏనాడు పట్టించుకోని ఉద్యోగ సంఘాలు విభజన వల్ల ఉద్యోగులకు, ప్రజలకు కలిగే నష్టమేంటో చెప్పకుండా సమైక్యాంధ్ర పేరుతో సమ్మెకు పిలుపు ఇవ్వడం వెనుక ఉన్న శక్తులేమిటో చెప్పాలంటున్నారు గాంధీ***

ప్రజాస్వామ్యంలో ప్రజలకు కలిసి ఉండే స్వేచ్ఛ, విడిపోయే స్వేచ్ఛ రెండూ ఉంటాయి. ఉంటేనే అది ప్రజాస్వామ్యం అవుతుంది. ఒక ప్రాంత ప్రజలను బలవంతంగా కలిసి ఉండాలని కోరుకోవడం ప్రజాస్వామ్య విలువకాదు. ఏప్రాంత ప్రజలనైనా ప్రేమతో, సమన్యాయంతో, ప్రాంతీయ భేదాలులేని అభివృద్ధితో కలిపి ఉంచగలం గాని బలవంతంగా ఉంచలేం.

ప్రత్యేక తెలంగాణ కోసం, ఆ ప్రాంత ప్రజలు అనేక సంవత్సరాలుగా, ముఖ్యంగా గత నాలుగు సంవత్సరాలుగా చేసిన పోరాటం మన కళ్లారా చూశాం. వందలమంది యువకులు భావోద్వేగంతో మరణించిన విషయం మనకు తెలుసు. ముఖ్యంగా టి.వి. కెమెరాల సాక్షిగా సజీవ దహనమైన శ్రీకాంతాచారి ఆత్మాహుతి ఇంకా కళ్లముందు మెదులుతూనే ఉంది. ఉస్మానియా, కాకతీయ యూనివర్సిటీల విద్యార్థులు చేసిన సమరశీల పోరాటాలను చూశాం. యూనివర్శిటీలు రణరంగాన్ని తలపించాయి. భాష్పవాయువు గోళాలతో నిండిపోయాయి. ఈ ఉద్యమంలో ప్రజాసంఘాలు, కవులు, కళాకారులు, అడ్వకేట్లు చేసిన కృషి మరువలేనిది.

ఉద్యమ ప్రారంభానికి కారకులు ఎవరైనప్పటికీ, కాలక్రమంలో అది తెలంగాణాలోని విస్తృత ప్రజా శ్రేణులలోకి తీసుకెళ్ళబడింది. స్వార్ధ రాజకీయ నాయకులను తెగనాడారు. వారి కుయుక్తులపట్ల ఎప్పటికప్పుడు అప్రమత్తంగా వ్యవహరించారు. పర్యవసానంగా ఆ ప్రాంత ప్రజల ఆకాంక్షలను గౌరవించవలసిన ఆవశ్యకత ఏర్పడి, అన్ని రాజకీయ పక్షాలు తెలంగాణా ఏర్పాటుకు అనుకూలంగా నిర్ణయాలు చేయవలసిన అనివార్యత ఏర్పడింది. అయితే అన్ని రాజకీయ పార్టీలు, ప్రజల ఉద్యమం ఆకాంక్షలపట్ల ఉన్న గౌరవంతో కాకుండా, ఓట్ల, సీట్ల వేటలో భాగంగా మాత్రమే అనుకూల నిర్ణయాలు చేయటం జరిగింది. కేంద్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీకూడ చివరకు అదే బాటలో నడిచింది. తెలంగాణకు అనుకూల నిర్ణయమైతే ప్రకటించాయి కాని, సీమాంధ్రలోనివాటి శ్రేణులకు, అనుకూల నిర్ణయానికి దారితీసిన పరిస్థితులను వివరించి, వారిని చైతన్యపరచడంలో విఫలమైనాయి. కొద్దో గొప్పో ప్రజలను చైతన్యవంతులను చేయగలిగే ప్రజా సంఘాల ఉనికి సీమాంధ్రలో నామమాత్రమై పోయింది. ఫలితంగా సీమాంధ్ర ప్రాంతంలో సమైఖ్యాంధ్ర ఉద్యమం ఎగసిపడుతోంది.

భారతదేశంలో స్వాతంత్ర్యానంతరం ఇతర రాష్ట్రాలు విలీనమవడానికి, హైదరాబాద్ రాష్ట్రం విలీనమవడానికి గల తేడాను గమనించవలసిన అవసరముంది. హైదరాబాద్ రాష్ట్రాన్ని బలవంతంగా సైనిక చర్యద్వారా విలీనంచేయటం జరిగింది. తదుపరి మద్రాస్ రాష్ట్రం నుండి విడిపోయిన సీమాంధ్ర ప్రాంతాన్ని, తెలంగాణ ప్రాంతాన్ని కలిపి భాషా ప్రాతిపదికన 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా ఏర్పాటుచేయటం జరిగింది. ఆనాడు చేసుకున్న పెద్ద మనుషుల ఒప్పందం అమలుకు నోచుకోకపోవడం, ఎక్కువ కాలం సీమాంధ్ర ప్రాంతం వారే ముఖ్యమంత్రులుగా ఉండటం తెలంగాణ ప్రాంత ప్రజల, రాజకీయ నాయకుల అసంతృప్తికి కారణమైంది. రెండు ప్రాంతాల మధ్య విద్వేషాలకు దారితీసింది.

ఈ 56 సంవత్సరాలలో, వ్యవసాయానికి, నీటిపారుదలకు అనువుగా ఉన్న కోస్తాంధ్ర ప్రాంతం వ్యవసాయపరంగా, రాజధాని అయిన హైదరాబాద్ పారిశ్రామికంగా, మౌలిక వసతులపరంగా అభివృద్ధి చెందినప్పటికీ, ఆ అభివృద్ధి ఫలాలు ఇరు ప్రాంతాల సామాన్య ప్రజలకు అందింది అంతంతమాత్రమే. అనేక సంవత్సరాలు రాయలసీమ వారు ముఖ్యమంత్రులుగా వ్యవహరించినప్పటికీ ఆ ప్రాంతాన్ని అభివృద్ధి చేయడంలో వారు విఫలమయ్యారనే చెప్పాలి.

హైదరాబాద్‌ని తమ రక్తంతో, స్వేదంతో అభివృద్ధి చేశామని చెప్తున్న సీమాంధ్ర నాయకులు, తెలంగాణలోని కోల్‌బెల్ట్ ఏరియాని ఓపెన్‌కాస్ట్ మైనింగ్‌తో బొందలగడ్డగా మార్చిన విధ్వంసానికి కారకులెవరోకూడ చెప్పాలి. ఆంధ్ర తీర ప్రాంతంలో ఉన్న సహజవాయువు నిక్షేపాలను రిలయన్స్ కంపెనీ తరలించుకు పోతుంటే మిన్నకుండిన ఆంధ్ర ప్రాంత నాయకులు, హైదరాబాద్ అభివృద్ధిని కారణంగా చూపి, తెలంగాణ ప్రజలు పోరాడి సాధించుకున్న ప్రత్యేక రాష్ట్రాన్ని అడ్డుకోవటం ఎంతవరకు సమంజసమో ఆలోచించవలసిన అవసరముంది.

అభివృద్ధి అంటే రాతి కట్టడాలు కాదని, హైదరాబాద్ నగరంలో నిర్మించిన ఫ్లై ఓవర్‌లు, ఔటర్‌రింగ్ రోడ్లు, విమానాశ్రయాలు, పాశ్చాత్య సంస్కృతిని దిగుమతి చేసుకున్న డిస్కోథెక్‌లు, పబ్‌లు కాదని, ప్రజల జీవన ప్రమాణాల మెరుగుదలని, ప్రజలందరికీ పౌష్టికాహారం అందటమని, ప్రజలు ఆరోగ్యంగా, విద్యావంతులై, చైతన్యవంతంగా ఎక్కువ కాలం జీవించటమని, శిశు మరణాలు, భ్రూణ హత్యలు లేకుండా చేయడమని, ప్రజలు స్వేచ్ఛగా, సామరస్యంగా జీవిస్తూ, సాంస్కృతికంగా అభివృద్ధి చెందుతూ, సమాజంలో ఉన్న దోపిడీ, పీడనలను, దురాచారాలను రూపుమాపుతూ, కుల, మత, లింగ వివక్షలేని సమాజాన్ని నిర్మించడమని అర్థం చేసుకోవాలి. పాలకులు చెబుతున్న వృద్ధిరేటునే అభివృద్ధి అనుకుంటే మిగిలేది సహజ వనరుల దోపిడీ, విధ్వంసమేగాని అభివృద్ధికాదు. ఏ అభివృద్ధి ఐనా సామాన్య ప్రజలకు అందనంతవరకు అది నిరుపయోగమే.

కేంద్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీ తెలంగాణా రాష్ట్ర ఏర్పాటుకు అనుకూలంగా నిర్ణయం తీసుకున్న వెంటనే, అన్ని రాజకీయ

# ప్రాంతీయ విద్వేషాలు-కుటిల రాజకీయాలు

*ప్రత్యేక రాష్ట్ర, సమైక్యాంధ్ర ఉద్యమాలు ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించవనీ, అవకాశవాద రాజకీయ పార్టీలు తమ ఆధిపత్యంకోసం ప్రాంతాల మధ్య విద్వేషాలను రెచ్చగొడుతున్నాయనీ అంటున్నారు* **ముప్పాళ్ల భార్గవశ్రీ**

గత పదేళ్లుగా తెలంగాణ ప్రాంతంలో ప్రత్యేక రాష్ట్రం కోరుతూ వివిధ రూపాలలో ఆందోళనలు సాగుతున్నాయి. తెలంగాణ రాష్ట్రాన్ని ఇచ్చేది, తెచ్చేది కాంగ్రెస్సేనంటూ తెలంగాణలో బలహీనపడుతున్నా కాంగ్రెస్‌కు జవజీవాలు కల్పించడానికి, మరోవైపు తెలంగాణ ఉద్యమం పేరుతో పెరిగిపోతున్న టిఆర్ఎస్‌ను తమ పట్టునుండి తప్పిపోకుండా దారికి తెచ్చుకోవడానికి తగిన 'ఎత్తుగడలు' వేస్తూనే ఉన్నది. అలానే ప్రతిపక్ష పార్టీలను, ఆఖరికి వామపక్ష పార్టీలను కూడా తెలంగాణ ముగ్గులోకి సునాయాసంగా లాగగల్గింది. రానున్న 2014 పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికల్లో 'ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం'ను ఆమోదిస్తే తగినన్ని సీట్లు సంపాదించుకొని సెంటర్‌లో 'సుస్థిర' ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోగలనన్న లెక్కలతో జూలై 30న ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు కాంగ్రెస్ అధిష్టానం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది.

ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని ప్రకటించిన తర్వాత నిదానంగా సమైక్య ఆంధ్రా ఉద్యమం రాజుకోవడం ప్రారంభమైంది. ఈ ఉద్యమంలో ఎక్కువగా విద్యార్థులు, వివిధ రంగాల ఉద్యోగులు పాల్గొంటున్నారు. అలానే రాయలసీమ జిల్లాలో ఉద్యమం ఉధృతంగా సాగుతున్నది. సమైక్యంగా ఉన్నా రాష్ట్రాన్ని విడగొడితే సహించేదిలేదని సెంటిమెంట్ స్థాయికి తీసుకెళ్తున్నారు. అందరి కష్టార్జితమైన హైదరాబాద్ లేని రాష్ట్రాన్ని కలలోనైనా ఊహించలేమని, హైదరాబాద్‌ను జారవిడుచుకొంటే నిరుద్యోగ రాక్షస కరాళనృత్యాలకు నిరుద్యోగులు బలైపోతారని, ఇప్పటికే సాగునీటి సమస్యతో సతమతమౌతున్న ఆంధ్రా ప్రాంతం ఎడారిగా మారుతుందని, విడిపోతే హైదరాబాద్‌లో ఉండే వివిధ వర్గాల ఆంధ్రా ప్రజలకు రక్షణకరువై రెండవశ్రేణి పౌరులుగా మిగిలిపోతారన్న భయాందోళనల మధ్య సమైక్యవాదులు ఉద్యమాన్ని నడిపిస్తున్నారు.

---

పార్టీలు సీమాంధ్ర ప్రాంతంలో ఓట్లు, సీట్లు ఎలా దండుకోవాలో ఆలోచించటం ప్రారంభించాయి. ఒక పార్టీ తనకు తెలంగాణ ప్రాంతంలో ఉన్న నామమాత్రపు బలాన్ని పూర్తిగా వదులుకోవటానికి సిద్ధపడి, తన ఎమ్మెల్యేలతో రాజీనామాలు చేయించి సీమాంధ్ర ప్రాంతంలో రాజకీయంగా బలపడడానికి పావులు కదిపింది. ప్రధాన ప్రతిపక్షం రెండు ప్రాంతాలలో పాగా వేయాలని చూస్తున్నప్పటికీ సీమాంధ్ర ప్రాంతంలో తన శ్రేణులను కట్టడి చేయటంలో వ్యూహాత్మకంగానే విఫలమవుతుంది. ఇక అధికార పక్షం అధిష్ఠానం నిర్ణయాన్ని కాదనలేక ఇతర పార్టీల ఒత్తిడిని తట్టుకోలేక తమ రాజకీయ భవిష్యత్ సీమాంధ్రలో ఏమవుతుందోనని సతమతమవుతుంది. పదే పదే రాజీనామాలకు కాలుదువ్వి, ఎన్నికలలో సీట్లు పెంచుకోవాలనే తెలంగాణ ఉద్యమ పార్టీ ఎత్తుగడకు, కాంగ్రెస్ పార్టీ చెక్ పెట్టింది. ఆ దెబ్బతో ఒక్కసారిగా కుదేలైన ఆ పార్టీ సీమాంధ్ర ప్రజలను, ఉద్యోగులను రెచ్చగొట్టటానికి ప్రయత్నం చేస్తుంది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు అనుకూలంగా ఉన్న జాతీయ ప్రతిపక్ష పార్టీ ప్రస్తుతానికి వాయిదా వేయించి, ఎన్నికల తర్వాత తానే ఇచ్చి ఆ క్రెడిట్ కొట్టేయాలని చూస్తుంది. ప్రజల స్వయం పాలనను అంగీకరించకుండా, సమైక్యాంధ్ర కోసం కట్టుబడి ఉండడం ఎంతవరకు సమంజసమో మార్క్సిస్టు సూత్రాలను అవపోసన పట్టిన వామపక్ష పార్టీ ఆలోచించుకోవాలి.

ఇక తమ జీత భత్యాల గురించి తప్ప ఏనాడు ప్రజా సమస్యల గురించి పట్టించుకోని ఉద్యోగ సంఘాలు, ఈనాడు సమైక్యాంధ్రకోసం నిరవధిక సమ్మెకు పిలుపు నివ్వటం వెనుక ఉన్న శక్తులేవో బహిర్గతం కావలసి ఉన్నది. విభజన వలన ఉద్యోగులకు, ప్రజలకు కలిగే నష్టమేంటో కనీసం వివరించకుండా అకస్మాత్తుగా నివధిక సమ్మెలోకి దించడం ఏ ప్రయోజనాల నాశించో అర్థం కావట్లేదు. సీమాంధ్ర ప్రజా ప్రతినిధులు రాజీనామా చేయాలని డిమాండ్ చేయడం వలన ప్రయోజనం ఏంటి. అతి త్వరలో మధ్యంతర ఎన్నికలకు సిద్ధమవుతున్న కాంగ్రెస్ పార్టీ, వీరి రాజీనామాలతో దిగివస్తుందని అనుకోవటం భ్రమ. ఎ.పి.ఎన్.జి.ఒ. సంఘ నాయకులకు టి.ఎన్.జి.ఒ.ల ఉద్యమమే ప్రేరణగా నిలిచినట్లు కనిపిస్తోంది. టి.ఎన్.జి.ఒ. అసోసియేషన్ అధ్యక్షునిగా ఉండి, ఉద్యమంలో కీలకపాత్ర పోషించి, పదవీ విరమణ అవగానే, రాజకీయ పార్టీలో చేరి ఎం.ఎల్.సి. అయిన ఆ నాయకుని నుండి బాగా స్ఫూర్తి పొందినట్లు కనిపిస్తోంది. ఏది ఏమైనప్పటికీ విభజన సమయంలో ఇరు ప్రాంతాల ప్రజలకు ఉద్యోగులకు ఎటువంటి ఇబ్బందులు లేకుండా సమన్యాయం జరిగేటట్లు డిమాండ్ చేయవలసిన బాధ్యత అందరిపై ఉంది. అందువలన ప్రజాప్రతినిధుల రాజీనామా డిమాండ్‌పై పునః సమీక్షించుకుని, అసెంబ్లీలో పార్లమెంటులో తమ వాదనలను సమర్ధవంతంగా వినిపించి, ఇరు ప్రాంతాల ప్రజలకు ఎటువంటి అన్యాయం జరగకుండా చూడాల్సిన బాధ్యత వారిమీద ఉంచుతూ ప్రజల తరపున సహేతుకమైన డిమాండ్లను వారిముందు ఉంచుతూ, ప్రజల ప్రయోజనాలకు భంగం కలిగే పరిస్థితి వస్తే బిల్లును తమ ఓటు ద్వారా వ్యతిరేకించాలని డిమాండ్ చేయడం సమంజసంగా ఉంటుందేమో ఆలోచించుకోవాలి.

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగి)* వీ

ప్రత్యేక తెలంగాణ వాదనల గురించి ప్రత్యేకంగా వివరించనవసరం లేదు. ఎందుకంటే తెలంగాణ వెనుకబాటుకు కలిసి ఉండడమే ప్రధానకారణమని చెవినిల్లుకట్టుకొని అదేపనిగా ప్రచారం చేస్తున్నారు.

మేం కమ్యూనిస్టు విప్లవకారులంగా అటు ప్రత్యేకవాదులను, ఇటు సమైక్యవాదులతోపాటు ఆయా ప్రాంతాల్లోని వివిధ వర్గాల ప్రజానీకాన్ని రాష్ట్రాల అభివృద్ధికి చేయవలసిన మౌలికమైన విషయాల గురించి, అలానే అభివృద్ధి పట్ల పాలకవర్గ పార్టీల వైఖరుల గురించి నిశితంగా పరిశీలించవలసిందిగా కోరుతున్నాం. మొదటిది మౌలికమైన ప్రశ్న మనల్ని పరిపాలిస్తున్నది అశేష ప్రజల ప్రయోజనాల్ని కోరుకునే వారేనా! 1947 ఆగస్టు 15 అర్ధరాత్రి తెల్లదొరల నుంచి నల్ల దొరలకు 'అధికార మార్పిడి' జరిగిన నాటి నుండి నేటి వరకు 66 సంవత్సరాల పరిపాలనలో ఏ వర్గాలు 'అభివృద్ధి' చెందాయో ప్రభుత్వాల గణాంకాలే తేటతెల్లం చేస్తాయి. పీడిత వర్గాలు నానాటికి పీడించబడుతూ బతుకుదెరువు ప్రశ్నార్థకంగా మారిపోయింది. ఈ దుస్థితిలో భాగమే దేశానికి వెన్నెముకగా ఉండాల్సిన లక్షలాది రైతుల ఆత్మహత్యల హృదయవిదారక దృశ్యాలు.

1990ల తర్వాత భారతదేశ చిత్ర పటంతోపాటు మన రాష్ట్ర చిత్ర పటం మరింతగా బీటలువారడం ప్రారంభమయింది. ఈ పరిస్థితికి ముఖ్యకారణం మన భారత పాలకవర్గాలు ప్రపంచాధిపత్యం కోసం అమెరికన్ సామ్రాజ్యవాదులు పన్నుతున్న పన్నాగాలలో భాగంగా ప్రవేశపెట్టిన సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలను ఎర్ర తివాచీలు పరిచి స్వాగతించారు. ఈ విధానాలను 'అభివృద్ధి' జపంతో ప్రజలకు రంగుల ప్రపంచాన్ని చూపించి విదేశీ శక్తులకు నిలువుదోపిడి చేసుకోవడానికి రాజమార్గాన గేట్లు బార్లా తెరిచారు. పి.వి.నరసింహారావు ప్రభుత్వ కాలంలో స్వాగతించిన ప్రైవేటీకరణ విధానాలను వాజ్‌పేయ్ నాయకత్వాన ఎన్‌డిఎ ప్రభుత్వం రెట్టించిన ఉత్సాహంతో అమలుజరిపి కీలకమైన ప్రభుత్వరంగ పరిశ్రమలను వధ్యశాలలకు జంతువులను తెగనమ్మినట్లు కారుచౌకగా ప్రైవేట్ శక్తులకు అమ్మివేసింది. తిరిగి అధికారంలోకి వచ్చిన మన్మోహన్‌సింగ్ నాయకత్వంలోని యుపిఎ 1, యుపిఎ 2 ప్రభుత్వాలు మరింత బరితెగించి ప్రత్యేక ఆర్థిక మండలాలకు, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు నూటికి నూరు శాతం అనుమతించేలా, ఇప్పుడు తాజాగా 'ఆహార భద్రత' బిల్లును పార్లమెంట్ సాక్షిగా చట్టం చేసే 'ధైర్యం' సంపాదించుకొన్నారు. దీనిలో భాగంగానే మనకు అపారంగా లభించే సహజవాయువు, ఆయిల్ నిక్షేపాలపై 'నూతన అన్వేషణ పాలసి' పేరుతో ప్రభుత్వరంగ సంస్థ ఒఎన్‌జిసిని పడావుగా పెట్టి రిలయన్స్ లాంటి బడా బహుళజాతి కంపెనీలకు కారుచౌకగా అప్పజెప్పటమే కాక, ధరల నిర్ణయాల వంటి విధాన నిర్ణయాల్లో వారి చేతుల్లో కీలుబొమ్మలుగా ప్రభుత్వాలు మారిపోయాయి.

సరిగ్గా ఈ ప్రైవేటీకరణ విధానాల నేపథ్యంలోనే చంద్రబాబు నాయుడు వరుసగా రెండు పర్యాయాలు (1995-2004) ముఖ్యమంత్రిగా రాష్ట్రాన్ని పరిపాలించిన కాలంలో హైదరాబాద్‌ను పైవంతెనలతో, అంతర రోడ్లతో, మధ్యతరహ, భారీ పరిశ్రమలతో, హైటెక్‌సిటీగా ఇబ్బడి ముబ్బడిగా అభివృద్ధి చేశారు. హైదరాబాద్‌ను అంతర్జాతీయ స్థాయిలో నిలబెట్టిన ఘనుడు, ప్రపంచ బ్యాంక్ 'సిఇఓ' గా తనకు తానుగా కితాబు ఇచ్చుకున్న చంద్రబాబు, ఇదే కారణంతో వ్యవసాయ రంగాన్ని పట్టించుకోలేదన్న ముఖ్య కారణంతో 2004 ఎన్నికల్లో ప్రజలు తిరస్కరించారు. ఆ తర్వాత వచ్చిన వైఎస్ ప్రభుత్వం కూడా ప్రైవేటీకరణ విధానాలను రెట్టించిన ఉత్సాహంతో ప్రజాకర్షక పథకాల మాటున అమలుచేసింది. ఫలితంగా రాజధానిగా హైదరాబాద్ మాత్రమే 'అభివృద్ధి' చెంది ఇటు సమైక్యవాదులకు, అటు విభజనవాదులకు హైదరాబాద్ తెగని సమస్యగా పరిణమించింది. హైదరాబాద్ నగరం చుట్టూనే సమస్య తిరుగుతూ ఆవేశకావేషాలకు రాష్ట్ర ప్రజలు ఎందుకు గురికావాలి! మన పాలకులకు రాష్ట్ర అభివృద్ధిపట్ల సమగ్ర, సామాజిక దృష్టి లేకపోవడమే ముఖ్య కారణంగా కనిపిస్తున్నది. ఈ సమగ్ర దృష్టి కనుక ఉంటే హైదరాబాద్‌తో పాటు రాష్ట్రంలో ఉన్న అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరు, ఒంగోలు, గుంటూరు, విజయవాడ, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, కరీంనగర్, నిజామాబాద్ లాంటి నగరాలు, పట్టణాలను, ఆయా ప్రాంతాల్లో లభించే సహజ వనరుల ఆధారంగా చిన్న, మధ్యతరహా పరిశ్రమలను ఏర్పాటు చేయాలి.

వ్యవసాయం ప్రధానంగా ఉన్న కోస్తా జిల్లాల్లో వ్యవసాయ ఆధారిత పరిశ్రమలపై దృష్టి పెట్టినట్లుగానే, ఇనుప ఖనిజం లభించే ఓబుళాపురం, బయ్యారం, బాక్సైట్ లభించే కడప, విశాఖ జిల్లాల్లో గ్రానైట్ లభించే ప్రకాశం, కర్నూలు జిల్లాల్లో పరిశ్రమలు పెట్టి, పత్తి పండించే ప్రాంతాల్లో జిన్నింగ్ మిల్లులు, బట్టల తయారీ పరిశ్రమలు, నానాటికి అభివృద్ధి చెందుతున్న నూతన టెక్నాలజీని అందిపుచ్చుకునేలా, ప్రోత్సహించేలా వివిధ రంగాల పరిశ్రమలను అభివృద్ధి చేసే సమగ్ర దృష్టి ఉంటే ఒక్క హైదరాబాద్ వైపే చూడనవసరంలేదు. ఇలాంటి అభివృద్ధికి అనుగుణంగా యువతకు ఉపాధి అవకాశాలు ముంగిటి ముందుకు పరిగెత్తుకు వస్తాయి.

కాని మన రాష్ట్ర పాలకులు చేసిందేమిటి? మన దేశీయ అవసరాలకు సరిపడిన పారిశ్రామిక అభివృద్ధికి చర్యలు తీసుకోవడానికి బదులు కేంద్ర పాలకులు చేపట్టిన ప్రైవేటీకరణ విధానాలకు పెద్దపీట వేసి రిలయన్స్ జిఎంఆర్, జివికె, స్పెక్ట్రం లాంటి దేశీయ, విదేశీ బహుళజాతి కంపెనీల ప్రయోజనాలను నెరవేర్చే దళారీ విధానాలను, ఆశ్రయిస్తున్నారు. రాష్ట్రంలో పరిశ్రమలను అభివృద్ధి చేసే పేరుతో వాన్‌పిక్, టెక్స్‌టైల్ పార్కులు, కెమికల్ కారిడార్లు, ఎగుమతి జోన్‌లు, ఇబ్బడిముబ్బడిగా థర్మల్ ప్లాంటుల నిర్మాణానికి అనుమతులిచ్చారు. ప్రత్యేక ఆర్థిక మండలాలు (సెజ్) చట్టాన్ని అడ్డుపెట్టుకొని పారిశ్రామిక 'అభివృద్ధి' పేరుతో లక్షలాది ఎకరాల పంట భూములను ప్రజలు ఆందోళనలు చేస్తున్నా వాటిని పాశవికంగా అణచివేసి బహుళజాతి కంపెనీలకు కారుచౌకగా కట్టపెట్టే చర్యలకు పాల్పడుతున్నారు. వాన్‌పిక్‌కు అడ్డగోలుగా వేలాది ఎకరాల పంట భూములు కేటాయించడంలో అవినీతికి పాల్పడిన మంత్రి వెంకటరమణారావు జైల్లో ఉండగా మరికొందరు మంత్రులు విచారణలు ఎదుర్కొంటున్నారు. అలానే అనంతపురం జిల్లాలో లేపాక్షి హబ్ పేరుతో జరిగిన అవినీతిపై గీతారెడ్డి లాంటి కేబినెట్ మంత్రులే విచారణ ఎదుర్కొంటున్నారు. పారిశ్రామిక అభివృద్ధిని సాధించాలంటే మనకు కీలకమైన వ్యవసాయ రంగాన్ని ఫణంగా పెట్టాలా? ఇప్పటికే హరిత విప్లవం పేరుతో విత్తనాలు, ఎరువులు, నాలెడ్జ్ ట్రాన్స్‌ఫర్ పేరుతో

మన వ్యవసాయ రంగాన్ని విదేశీ సంస్థల పెరట్లో కట్టివేశారు. మన దేశ ఆర్థికవ్యవస్థకు మూలమైన వ్యవసాయ రంగమే సంక్షోభంలో పడితే ప్రజల భవిష్యత్ ఏమిటి? అంధకారంలోకి నెట్టడమే కదా!

కావున మన దేశ సామాజిక అభివృద్ధితోపాటు మన రాష్ట్ర అభివృద్ధి జరగాలంటే అమెరికన్ సామ్రాజ్యవాదుల ముద్దుబిడ్డ అయిన ప్రపంచబ్యాంక్ నిర్దేశిత సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలను మన రాష్ట్ర పాలకులు తూచా తప్పకుండా పాటిస్తున్నందునే రాష్ట్రం సర్వతోముఖంగా అభివృద్ధి కావటం లేదనేది పచ్చి వాస్తవం. కనుక సమైక్యవాదులైనా, విభజన వాదులలైనా, రేపు అధికారంలోకి వచ్చే పాలక పార్టీల నుంచి ప్రైవేటీకరణ విధానాలను అమలు చేయబోమని, రాష్ట్ర సామాజిక అభివృద్ధికి కట్టుబడతామన్న హామీని పొందగలరా! ఏ మాత్రం పొందలేరు! ఎందుకంటే మన రాష్ట్రంలోని పాలకవర్గ పార్టీలు అన్నిటికి ఆమోదయోగ్యమైన ఎజెండా ప్రైవేటీకరణ విధానాలేనన్నవి ఇన్ని సంవత్సరాల వారి ఆచరణే ఇందుకు నిదర్శనం. ఈ ప్రత్యేక, సమైక్య ఆందోళనలను ప్రజల్లో సెంటిమెంట్ల ఆధారంగా రెచ్చగొడుతూ ఏ ప్రైవేటీకరణ విధానాలయితే ప్రజల జీవితాలను సర్వ నాశనం చేస్తున్నాయో, వాటి నుంచి పక్కమార్గం పట్టించే దగాకోరు పాలకవర్గాల కుట్రలు దాగిఉన్నాయన్నది మరిచిపోకూడదు. పాలకవర్గా పార్టీలన్నీ కలిసికట్టుగా ఆడిన నాటకం ఇది.

1970లో చెన్నారెడ్డి నాయకత్వాన జరిగిన ప్రత్యేక తెలంగాణ కొరకు సాగిన ఆందోళన సందర్భంగా, 1971లో సాగిన జైఆంధ్ర ఉద్యమం సందర్భంగా, తిరిగి 1997లో ప్రత్యేక తెలంగాణవాదం ముందుకు వచ్చిన సందర్భంగా, 2001లో కెసిఆర్ నాయకత్వాన టిఆర్ఎస్ పార్టీగా ప్రత్యేక తెలంగాణ కోసం చాలాకాలం ఉద్యమం సాగిస్తున్న సందర్భంగా కమ్యూనిస్టు విప్లవకారులంగా రాష్ట్ర విభజనపై స్పష్టమైన వైఖరిని ప్రకటిస్తూ వచ్చాం. అసమానంగా ఉన్నా రాష్ట్ర సమగ్రాభివృద్ధి కోసం వ్యవసాయ, పారిశ్రామిక రంగాల సమతుల్య అభివృద్ధికి దోహదపడే సమగ్ర జలవనరుల పథకాలను, విప్లవ భూసంస్కరణల ద్వారా పూర్తి స్థాయిలో భూమి వినియోగ పథకాల వంటి ఆచరణయోగ్యమైన ప్రత్యామ్నాయ విధానాలకు రూపకల్పన చేయడం జరిగింది. అలానే ప్రాంతాల వారీగా తెలంగాణ, రాయలసీమ, ఉత్తరాంధ్ర, మొత్తంగా రాష్ట్ర అభివృద్ధికి చేపట్టాల్సిన సమగ్ర చర్యలను ప్రతిపాదించడమే కాక ఉద్యమంగా ప్రజల్లోకి తీసుకొని వెళ్లాం.

అందువల్ల పాలకవర్గ పార్టీల ముఠాలు తమ పదవీకాంక్షల కోసం రెచ్చగొట్టే ప్రాంతీయ విద్వేషాలకు బలికాకుండా అసమానంగా ఉన్న రాష్ట్ర సమగ్రాభివృద్ధి కోసం దోపిడి, పీడనలులేని సమసమాజ స్థాపన కోసం పీడితవర్గాల శక్తులన్ని సమైక్యంగా పోరాటం సాగించడానికి నడుంబిగించాలి! నేడు పీడితవర్గాల ప్రజల మెడపై కత్తిలాగా వేలాడుతున్న ప్రపంచీకరణ విధానాలను తిప్పికొట్టేలా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట పతాకను దేశభక్తియుత, ప్రజాతంత్ర శక్తులు భుజాన చేబూని సమరశంఖం పూరించాలి.

చుక్కలనంటుతున్న ధరలు దిగివచ్చి నిత్యావసర సరుకులు అందుబాటులోకి వస్తాయా? చదువు కొనుక్కోలేని దుస్థితి తప్పుతుందా? వైద్యం అందరికీ అందుబాటులోకి వస్తుందా? ప్రాంతీయ అసమానతలకూ, వెనుకబాటుతనానికీ కారణాలైన సాగునీటి కొరత తీరుతుందా? పరిశ్రమల స్థాపన సాగుతుందా? 94శాతంగా ఉన్న అనియతరంగ శ్రామికులకు పని భద్రత, జీవన వేతనం సమకూరుతాయా? ప్రజావసరాలను తీర్చేందుకు ఖనిజ వనరులు వినియోగిస్తూ ఉపాధికల్పన పెరుగుతుందా? యువతను పెనుభూతంలా వెంటాడుతున్న నిరుద్యోగ సమస్య తీరుతుందా? నేడు రాష్ట్రంలో ప్రజలడుగుతున్న ప్రశ్నలివి. ప్రజలెదుర్కొంటున్న సమస్యలివి.

పాలకవర్గ పార్టీలు అసలీ సమస్యలే లేనట్లు వ్యవహరిస్తున్నాయి. కాంట్రాక్టు లెక్చరర్లు సమ్మె చేస్తున్నారు. మునిసిపల్ కార్మికులు, జూనియర్ డాక్టర్లు సమ్మె చేస్తున్నారు. 108 సర్వీసు ఉద్యోగులు, ఆర్టీసి కార్మికులు, అంగన్‌వాడీ కార్యకర్తలు, వెలుగు కాంట్రాక్టు ఉద్యోగులు, గ్రామ సేవకులు సమ్మెచేస్తున్నారు. వీరందరూ కోరుతున్నది చట్టబద్ధమైన, ప్రభుత్వం అంగీకరించిన కనీసవేతనం, ఉద్యోగ భద్రతా ఇవ్వమని. అయినా వారిని పట్టించుకొని, వారి సమస్యలను వినే తీరిక కూడా నేతలకు లేదు.

పోనీ ఇంతకంటే ముఖ్య సమస్యలు తీర్చేపనిలో ఉన్నారా అంటే గోదావరి వరదలతో లక్షలాది ఎకరాలు నీటమునిగి పంట నష్టపోయినా ప్రజలనాదుకొనే చర్యలను పర్యవేక్షించేపని కూడా తలపెట్టలేదు.

పరీక్షలు రాసి ఇంజనీరింగు కాలేజీల్లో చేరదామని ఎదురుచూస్తున్నా, అడ్మిషన్లు ప్రారంభించేందుకు మంత్రులకు తీరికలేదు. ప్రారంభమైన వైద్య కళాశాలల్లో యాజమాన్యాలు సీట్లను కోట్ల రూపాయలకు అమ్ముకుంటున్నా ప్రభుత్వ, ప్రతిపక్ష పార్టీ నాయకులకు పట్టలేదు.

హైదరాబాదు, ఢిల్లీల మధ్య విమానాల్లో తిరగడానికే వారికి ఎక్కడలేని తీరిక ఉంది. ఎందుకిలా జరుగుతోంది? రాష్ట్రంలో విశాల ప్రాంతాలను నిత్యకరువు పీడితంగా ఉంచిందెవరు? నీటి ప్రాజెక్టులకు శంఖుస్థాపనలే తప్ప పూర్తిచెయ్యనిది ఎవరు? వేలాది రైతాంగాన్ని ఆత్మహత్యల్లోకి పడదోసిందెవరు? వేలాది చిన్న, మధ్యతరహా పరిశ్రమల మూసివేతకూ, వీధులలోకి కార్మికుల నెట్టివేతకూ కారకులెవరు? ఇనుప ఖనిజ ఎగుమతులతో బొజ్జలు నింపుకున్నదెవరు? ఆ ఖనిజంతో ఉక్కుమిల్లు పెట్టి వేలాదిమందికి ఉపాధి కల్పిద్దామన్న ఆలోచన చెయ్యనిదెవరు? ప్రజలను ఆర్థికంగా, నైతికంగా దిగజార్చే మద్యం వ్యాపారాన్ని ఏడాదికేడాదికీ పెంచుకుంటూపోతూ, వేలకోట్ల రూపాయల ప్రజల ఆదాయాన్ని కొల్లగొడుతూ తమ ఖజానా నింపుకుంటున్నదెవరు? అభివృద్ధి పేరిట ప్రజల నుండి బలవంతంగా భూములు గుంజుకున్న దెవరు? రాష్ట్రం ఏర్పడినప్పుడు వెనుకబడ్డ ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక పథకాలు, రక్షణలు కల్పిస్తామన్న ఒప్పందాలను అమలు చెయ్యనిదెవరు? ఇవన్నీ వదలిపెట్టి తెలంగాణ కావాలని తీర్మానాలు చేసిందెవరు? తెలంగాణ ఇస్తారనగానే, సమైక్యమంటూ రోడ్డెక్కుతున్నదెవరు? ప్రజలు పరిష్కారం కోరుతూ ఏ సమస్యను ముందుకు తెచ్చినా తెలంగాణ వస్తే అన్నీ పరిష్కారమౌతాయని ఒకవైపు, తెలంగాణపోతే ఇవి జటిలమౌతాయని మరో వైపూ రెచ్చగొడ్తున్నదెవరు?

ఈ ప్రశ్నలకు సమాధానాలు ప్రజలకు స్పష్టంగానే తెలుస్తున్నాయి. 56 ఏళ్లుగా రాష్ట్రాన్ని పాలించిన పార్టీలేనన్నది వారికి తెలుసు. ఈ మౌలిక సమస్యలు పరిష్కారం కావాలని వారు కోరుకుంటున్నారు. అలా పరిష్కారం చెయ్యని పాలకులపైనా, ప్రభుత్వాలపైనా ఆగ్రహిస్తున్నారు.

అందరికీ చదువు, అందరికీ వైద్యం అంటూ ఒకవైపు నినాదాలతో ప్రజలను బుజ్జగించ పూనుకున్నారు. మరోవైపున కొనుగోలు చేయగల సరుకులుగా విద్యా, వైద్యాలను మార్చారు. ఈ బుజ్జగింపులను అధిగమించి సమస్య పరిష్కరించమని ప్రజలు సంఘటితంగా అడిగితే పాశవిక నిర్బంధానికీ పూనుకున్నారు. తమ ఆధిపత్యాన్ని నిలబెట్టు కునేందుకూ, మౌలిక సమస్యల నుండి ప్రజల దృష్టి మళ్ళించేందుకూ ప్రజలను చీల్చివేసేందుకు వారు వెనుకాడటంలేదు. కులాలమధ్య, కులాల్లోనే ఉపకులాలమధ్య, మతాలమధ్య, భాషా, జాతులమధ్య, విద్వేషాలు, కలహాలు రగల్చబూనుకున్నారు.

తమ ప్రాంతం, వ్యవసాయం అభివృద్ధి చెందాలనీ, పరిశ్రమలు ఏర్పడి ఉపాధి పెరగాలనీ రాష్ట్రంలో వివిధ ప్రాంతాల ప్రజలు కోరుకుంటున్నారు. ఈ న్యాయమైన ప్రజాస్వామిక ఆకాంక్షలను ఈడేర్చడానికి పూనుకోకుండా వాటిని ప్రజల మనోభావాల స్థాయికి కుదించి, పొరుగు ప్రాంతాల ప్రజలపైకి మళ్లించడానికి పాలకులు పూనుకుంటున్నారు. ప్రాంతీయ ఉద్యమాలను పెంచి పోషిస్తున్నారు. వాటితో తమ స్వార్థ, సంకుచిత రాజకీయ ముఠా ప్రయోజనాలను నెరవేర్చుకుంటున్నారు. రాష్ట్రంలో ఇంతకు ముందువచ్చిన ముల్కి ఉద్యమం, ప్రత్యేక తెలంగాణ, జై ఆంధ్ర ఉద్యమాలన్నింటిలోకి యువజనులను కదిలించింది నిరుద్యోగ సమస్యే. కానీ నిరుద్యోగ సమస్యకు మూలకారణాన్ని మరుగుపరచి, పొరుగు ప్రాంతం వారే నిరుద్యోగ సమస్యకు కారణంగా చూపెట్టి యువజనులను పక్కదారి పట్టించారు. ఇప్పుడు జరుగుతున్నది కూడా అదే. అన్ని ప్రాంతాలలోనూ విద్యార్థులూ, యువజనులూ ఈ ఆందోళనల్లోకి రావటానికి కారణం నిరుద్యోగమే. ప్రభుత్వ ఉద్యోగాలలో ఖాళీలు నింపే ప్రకటనలే తప్ప గత 15ఏళ్లలో ప్రభుత్వ ఉద్యోగుల సంఖ్య తగ్గించివేశారు. ప్రభుత్వరంగ సంస్థలను బహుళజాతి సంస్థలకు కారుచౌకగా అమ్మివేశారు. మిగిలిన వాటిలో పెద్దదైన సింగరేణి, ఆర్‌టిసిలో కార్మికుల, ఉద్యోగుల సంఖ్యను తగ్గించివేస్తూ, అందునా తాత్కాలిక ప్రాతిపదికమీద నియామకాలు చేస్తున్నారు. ఉపాధి కల్పనకు ఇక మిగిలింది ప్రైవేటురంగం. ఇది కల్పించే ఉద్యోగాలలో అధికభాగం స్థానికేతరులకూ, ఇతర రాష్ట్రాల వారికీ కేటాయిస్తారు. ఆవిధంగా వారు తమ హక్కులకోసం ఐక్యమై పోరాడకుండా చూడాలన్న విభజించి పాలించే విధానాన్ని అనుసరిస్తున్నారు.

ఇటు 'సమైక్య' వాదులకుగానీ, అటు ప్రత్యేక రాష్ట్రాల వాదులకుగానీ ఈ సమస్యకు పరిష్కారం చూపించే కార్యక్రమంలేదు. తమ ప్రాంతపు ఉద్యోగాలను మరెవరో దోచుకుపోతున్నారని రెచ్చగొట్టి, తమ ప్రాంతం రాష్ట్రంగా ఏర్పడితే ఆ ఉద్యోగాలన్నీ తమ ప్రాంతంవారికే వస్తాయని ఆశపెట్టడమే వారి సింగిల్‌పాయింటు ఎజండా. ఎంతో కొంత ఉపాధి ఉన్న హైదరాబాదు నగరం పోతే, ఉద్యోగాలు రావని రెచ్చగొట్టడమే 'సమైక్య'వాదుల ఎజండా. ఓబుళాపురం గనుల అక్రమ తవ్వకాల గురించి అనుమతించిన వారితోసహా అందరూ వీరంగాలు వేశారుతప్ప, ఇనుప ఖనిజంతో ఉక్కుమిల్లు ఎందుకు పెట్టలేదన్న ప్రశ్నమాత్రం ఎవరినోటంటా రాలేదు. నిన్నటిదాకా తెలంగాణకు అభ్యంతరం లేదన్న వారంతా ఒక్కసారిగా సమైక్యనినాదం పుచ్చుకున్నారు. అదేమంటే ప్రజల మనోభావాలనడం వెనుక మారింది ప్రజల ఆకాంక్షలుకాదు, పాలకముఠాల స్వార్థ ప్రయోజనాలన్నది స్పష్టమే.

ఇది ఆంధ్రప్రదేశ్‌కే పరిమితమైన సమస్యగా లేదు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు అభ్యంతరంలేదని కేంద్రం నుండి ప్రకటన రాగానే దేశ నలుమూలల నుండీ ప్రత్యేక రాష్ట్రాల డిమాండ్లు ముందుకు రావటమే దీనిని తెలుపుతున్నది. దశాబ్దాలుగా ఆయా ప్రాంతాలు నిరాదరణకూ, వివక్షకూ గురై అభివృద్ధి లేక వెనుకబాటుతనంలో ఉన్నాయన్నది వాస్తవం. ఈ ప్రాంతాలనుండే శ్రమజీవులు కడుపుచేతపట్టుకుని మహానగరాలకు ప్రవాహంలా వలసలు పోతున్నారన్నది వాస్తవం. ఈ వలస ప్రవాహాన్ని ఆపే విధానాలు అమలు జరపకుండా ప్రత్యేక రాష్ట్రాల ఏర్పాటు, అసలు సమస్య అంచును కూడా తాకవన్నది వాస్తవం.

ప్రత్యేక రాష్ట్రాల ఏర్పాటుకానీ, సమైక్య రాష్ట్రంగానీ ప్రజలెదుర్కొంటున్న ఏ ఒక్క మౌలిక సమస్యనూ పరిష్కరించలేవు. మౌలిక పరిష్కారం నుండి ప్రజల దృష్టి మళ్లించి, ఎవరి ఆధిపత్యంలో రాజకీయ అధికారం ఉండాలన్న తగవును పరిష్కరించుకొనేందుకు పాలకవర్గంలోని ముఠాలు ప్రాంతీయ విద్వేషాలను రెచ్చగొడుతున్నాయన్నది స్పష్టం.

ఇన్నాళ్లూ సాగిన ప్రత్యేక తెలంగాణ, ఇప్పటి సమైక్యాంధ్ర ఆందోళనల ఫలితంగా పాలకవర్గ ముఠాల తగవులు తాత్కాలికంగా తీరతాయేతప్ప ప్రజలకు ఒరిగేదేమీ లేదు. పాలనా విధానాలు మారవు. ప్రత్యేక, సమైక్య నినాదాలతో దృష్టిమళ్లించే విభజన విధానాలకు లోనుగాకుండా, మౌలిక సమస్యల పరిష్కారం కోసం వివిధ వర్గాల ప్రజానీకమంతా సంఘటిత పోరాటాలు సాగించేందుకు ముందుకు సాగాలి.

నానాటికీ పెరిగిపోతున్న రైతాంగ ఆత్మహత్యలకు మూలమైన పాలకుల విధానాలపై, విద్యా ప్రైవేటీకరణకు, నిరుద్యోగ తీవ్రతకు కారణమైన ప్రభుత్వ విధానాలను పాతరేసేందుకు, మన దేశాన్ని ప్రపంచ విపణిలో అంగాంగం తాకట్టుపెడుతూ, బహిరంగంగా విక్రయిస్తోన్న దళారీల భరతం పట్టేందుకు, ప్రజలందరికీ చెందాల్సిన దేశ సహజ, ఖనిజ, అటవీ సంపదలన్నీ నిరంతరాయంగా విదేశీ బహుళజాతి కంపెనీలు దోచుకుపోవడాన్ని నిలువరించేందుకు, చేయి చేయి కలిపి ఉద్యమించండి! ఆకలి, పేదరికం, అవిద్య, నిరుద్యోగం, దోపిడీ దౌర్జన్యాలు, అత్యాచారాలూ, కుల అణచివేతలకు ఆస్కారంలేని సమ సమాజ స్థాపనకోసం సమరం సాగించడానికి నడుం బిగించండి!

*(రచయిత సిపిఎం (ఎం.ఎల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

# నదీజలాల పంపకాల్లో జరిగిందేమిటి?

***రాష్ట్రంలోని మూడు ప్రాంతాల్లో ఏర్పడిన అసమానతలకు అక్రమంగా వాడుకున్న సాగునీరు ప్రధాన కారణమనీ, ఇది రాష్ట్ర విభజనకు తీవ్ర అవరోధంగా మారిందనీ అంటున్నారు* పర్చా కిషన్ రావు, సజయ కాకర్ల**

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ప్రకటన వచ్చిన తర్వాత ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల్లో జరుగుతున్న ఆందోళనల్లో ప్రధానంగా ముందుకు వస్తున్న అంశాల్లో హైదరాబాద్ ఎవరిది అనే దగ్గర నుంచి, నదీజలాలు, వ్యవసాయం, విద్య, ఉద్యోగాలు ఉన్నాయి. ముఖ్యంగా నదీజలాల అంశాలపై చాలా అపోహలు, భయాందోళనలు అన్ని వర్గాల్లోనూ ప్రచారమయిపోతున్నాయి.

తెలంగాణ మా అస్తిత్వం అని తెలిసినప్పటికీ సీమాంధ్ర మూలాల నుంచీ వచ్చిన మా తోటి విద్యార్థులు మా పట్ల ఒక విధమైన హేళనతో ఉండడానికి, అడ్డగోలుగా వాదించడానికి ఏ మాత్రం జంకరు. ముఖ్యంగా ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ప్రకటన వచ్చిన దగ్గర నుంచీ ఈ ధోరణి మరీ పెరిగిపోయింది. తెలంగాణ సమస్యకు మూలాలిక్కడ ఉన్నాయి అని చెప్పి ఆలోచించండి అంటే కనీసం వినిపించుకోకుండా మీకు కల్చర్‌ని మేమే నేర్పించాం, హైదరాబాద్ అభివృద్ధి మొత్తం మేమే చేశాం, మీకు అసలు నదులే లేవు, నీళ్లెక్కడి నుంచి వస్తాయి అంటారు. పెద్ద జోక్ ఏమిటంటే చాలా మందికి కృష్ణా నది విజయవాడ ప్రకాశం బారాజ్ నుంచి, గోదావరి నది రాజమండ్రి ధవళేశ్వరం ఆనకట్టల నుంచే మొదలవుతాయని వాదిస్తారు. గోదావరి నది మహారాష్ట్ర నుంచి ఆదిలాబాద్ జిల్లాలోని పోచంపాడు దగ్గర ఈ రాష్ట్రంలోకి ప్రవేశించి 540 కి.మీ పైగా తెలంగాణ జిల్లాలలో ప్రవహించి గోదావరి జిల్లాల్లోకి వస్తుందని, కృష్ణా నది కర్నాటక రాష్ట్రం నుంచి మహబూబ్‌నగర్ జిల్లాలోని జూరాల దగ్గర ప్రవేశించి 350 కి.మీ ప్రవహించి గుంటూరు జిల్లా దగ్గర ప్రవేశిస్తుందన్న విషయం కూడా తెలియదు. వాళ్ల దృష్టిలో తెలంగాణ ప్రాంతానికి ఏ రకమైన ప్రత్యేకత, చరిత్ర లేదు. ప్రతి అంశమూ వారే నేర్పించబట్టి కొద్దిమంది మాలాంటి పిల్లలు ఈ విద్యా సంస్థల్లోకి అడుగుపెట్టామనుకుంటారు. ఈ రకంగా తెలిసీ తెలియకుండా మాట్లాడే వాళ్లతో ప్రతిరోజూ క్లాసులో ఒకలాంటి ఘర్షణే మాకు. తెలంగాణ పిల్లలం ఒకరో ఇద్దరమో ఉంటాం, వాళ్లు చాలామంది ఉంటారు. ఇది హైదరాబాదులో ఒక అత్యున్నత విద్యాసంస్థలో గ్రాడ్యుయేషన్ చేస్తున్న 20 సంవత్సరాల అమ్మాయి మాతో పంచుకున్న అనుభవం.

ఈ నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన ప్రకటనతో ఆవేశకావేశాలకు లోనవుతున్న కోస్తా, రాయలసీయ ప్రాంతాలలోని యువత, అలాగే హైదరాబాద్‌లోని సీమాంధ్ర మూలాలున్న యువత కొన్ని అంశాల మీద ఇప్పటికైనా దృష్టి సారించి పరిశీలించవలసిన అవసరాన్ని గుర్తించాలి. అలాగే నదీ జలాల గురించిన కొన్ని వాస్తవ విషయాలు మాట్లాడడం, సమాచారాన్ని పొందుపరచడం అవసరం అని చాలా బలంగా అనిపించింది. మొదటగా రాష్ట్ర విభజన అంశం ఒక్కరోజులో వచ్చిన అంశం కాదు. గత 45 సంవత్సరాల నుంచీ రాష్ట్ర రాజకీయాలలో నలుగుతూ వస్తున్న అంశం. 1969లో ప్రత్యేక తెలంగాణ కోసం వచ్చిన ఉద్యమంలోనూ, ఆ తర్వాత 1972లో వచ్చిన జైఆంధ్ర ఉద్యమంలోనూ కొన్ని వందల మంది ప్రాణాలు కోల్పోయారు. తాత్కాలికంగా సమస్య సమసిపోయినట్లు కనిపించినప్పటికీ అసలు మూల సమస్య పరిష్కారం కాలేదనే వాస్తవాన్ని అర్థం చేసుకోవాలి. మరీ ముఖ్యంగా 2009 నుంచి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర అంశం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజకీయాలలో రోజువారీ అంశం అయిందనే వాస్తవాన్ని గుర్తించ నిరాకరించడం అంటే అంతకంటే నిర్లక్ష్యపూరితమైన అంశం మరొకటి ఉండదు.

ఇప్పుడు మనం చూస్తున్న హైదరాబాద్ ఆర్థికాభివృద్ధి పునాదులు వ్యవసాయంలో సాధించిన అదనపు ఉత్పత్తి, తద్వారా వచ్చిన మిగులు ధనంలో ఉన్నాయి. వ్యవసాయంలో అదనపు ఉత్పత్తి సాధించాలంటే నికరమైన సాగునీటి పారుదల వ్యవస్థతో పాటు కచ్చితమైన నీటి సౌలభ్యం ఉంటేనే సాధ్యం. దాంతోపాటు సాగునీటి సరఫరాను, వ్యవస్థలనూ ప్రభుత్వమే తలకెత్తుకుని రైతు మీద అదనపు ఆర్థికభారం మోపకుండా ఉంటే మిగులు ధనం మరింతగా పెరుగుతుంది. ఆంధ్రప్రదేశ్ విషయంలో విభజన వాతావరణం నేపథ్యంలో ఈ మొత్తం క్రమం ఎలా జరిగిందో నిష్పక్షపాతంగా పరిశీలిద్దాం.

ఇవాళ సమైక్యాంధ్ర ఆందోళన నినాదాన్ని మోస్తున్న ఆంధ్ర, రాయలసీమ యువత ఈ విషయాల పట్ల ఏమాత్రం అవగాహన కల్పించని కుటిల రాజకీయ వాతావరణంలో ఉన్నందున ఈ విషయాల గురించి పౌరసమాజంతో విపులంగా చర్చించవలసిన అవసరం ఎంతైనా ఉందని భావిస్తున్నాం. ఆ క్రమంలో చారిత్రిక, సామాజిక, ఆర్థిక మూలాలను తెలుసుకుని జరిగిన విషయాలను బేరీజు వేసుకుని ఆ దిశగా కార్యాచరణ రూపొందించుకోవలసిన అవసరం ఉంది. స్వాతంత్ర్యానికీ, స్వేచ్ఛకు ఉన్న తేడాను గమనించి తమకు ఉన్నటువంటి హక్కులను, వాటిని సాధించుకోవడంలో ఉన్న పరిమితులను కూడా గ్రహించవలసిన అవసరం ఉంది. రాజకీయ పార్టీల, నాయకుల పడికట్టు పదాల ప్రలోభంలో పడిపోకుండా అభివృద్ధిని రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలకు అందకుండా చేసి, కేవలం హైదరాబాద్ నగరంలోని తమ ఆస్తుల రక్షణ కోసం ప్రజల మధ్య విద్వేషపూరిత వాతావరణాన్ని సృష్టిస్తున్న వారినే నిలదీయాల్సిన అవసరం ఉంది. గత అరవై సంవత్సరాలుగా నీటి సంబంధిత పరిజ్ఞానాన్ని, తత్సంబంధిత

వాస్తవాలను అన్ని ప్రాంతాల రాజకీయ నాయకులు ప్రజాబాహుళ్యానికి దూరంగా, గోప్యంగా ఉంచడంలో సఫలీకృతులయ్యారు. వాటి గురించి కొంచెం తెలుసుకుందాం. ఇక్కడ హైదరాబాద్ ఎవరిది అనే ప్రశ్నకు కూడా సమాధానం వస్తుంది.

మూడు రాష్ట్రాలు సరిహద్దు కలిగిన కృష్ణానదీ పరివాహక ప్రాంతంలో లభ్యమవుతున్న 2060 టిఎంసి ఫీట్ల నికర జలాల్లో 800 టిఎంసి ఫీట్లు ఆంధ్రప్రదేశ్‌కు, 700 టిఎంసి ఫీట్లు కర్ణాటకకు, 560 టిఎంసి ఫీట్లు మహారాష్ట్రకు బచావత్ ట్రిబ్యునల్ కేటాయించింది. ఆంధ్రప్రదేశ్ వాటాగా వచ్చిన దాంట్లోనే పంట పొలాలకు నీళ్ల ఇచ్చిన తర్వాత కొంతభాగం నదిలోకే వచ్చి కలుస్తుంది. కాబట్టి ఆ నీటి పరిమాణాన్ని కూడా అంచనా వేసి అదనంగా మరో 11 టిఎంసి ఫీట్ల నీళ్లు ఆంధ్రప్రదేశ్‌కే చెందుతాయని మొత్తం 811 టిఎంసి ఫీట్లుగా నిర్ధారించారు.

అసలు టిఎంసి ఫీట్ అంటే ఏమిటి? థౌజండ్ మిలియన్ క్యూబిక్ ఫీట్. సరళంగా చెప్పాలంటే ఒక టిఎంసి ఫీట్ అంటే 28 వందల కోట్ల లీటర్లు. (28,00,00,00,000). ఒక టిఎంసి ఫీట్ నుంచి తాగునీటి అవసరాలను దృష్టిలో పెట్టుకుంటే ప్రపంచ జనాభా 700 కోట్లకి ఒక రోజుకి 4 లీటర్ల నీరు అందించవచ్చు. అదే సాగునీరు అయితే ఒక ఎకరం వరి పొలానికి ఒక పంటకు 30 లక్షల నుంచి 50 లక్షల లీటర్లు వరకూ అవసరమౌతుంది. ఈ విధంగా చూస్తే ఒక టిఎంసి ఫీట్ నీళ్లతో 7500–10000 ఎకరాలలో ఒక వరిపంట తీయవచ్చు. ఖరీఫ్‌లో (వానాకాలం) వరిపంట పండించినట్లయితే వర్షపు నీటిని కూడా ఉపయోగించుకున్నట్లయితే అదే టిఎంసి ఫీట్ నీళ్లతో 15000 ఎకరాల దాకా కూడా సాగుచేయవచ్చు.

కృష్ణాడెల్టా ప్రాంతం (బెజవాడ – నాగాయలంక దిగువ)లో కృష్ణా నదీ పరివాహక ప్రాంతం 2 లక్షల ఎకరాలలోపే ఉంటుంది. కానీ ఇక్కడ సాగవుతున్న భూమి దాదాపు 15 లక్షల ఎకరాలు. 1970లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1 టిఎంసి ఫీట్ల నీటితో 7223 ఎకరాలలో ఒక పంట సాగుకోసం బచావత్ ట్రిబ్యునల్ ముందు 180 టిఎంసి ఫీట్ల నీరు కావాలని (13 లక్షల ఎకరాల కోసం) తన అంచనాను పెట్టింది. (మొత్తం కృష్ణాడెల్టాకి సంబంధించినంతవరకు 1 టిఎంసి ఫీట్ నీటితో 7223 ఎకరాలు సాగవుతాయని అంచనా వేసిన ప్రభుత్వం నాగార్జునసాగర్ ప్రాజెక్టు కుడి గట్టు కాల్వ కింద సాగయ్యే పొలాలు 1 టిఎంసి ఫీట్ నీటితో 8434 ఎకరాలుగా, ఎడమ గట్టు కాల్వ కింద పొలాలు 7800 ఎకరాలుగా, ఎలిమినేటి మాధవరెడ్డి ప్రాజెక్టు (ఎస్ఎల్‌బిసి) కింద 1 టిఎంసి ఫీట్ నీటితో 9000 ఎకరాలు వరిపంట సాగుచేయవచ్చని అంచనా వేసింది.) అయితే 1980లో బచావత్ ట్రిబ్యునల్ తన తుది తీర్పులో కృష్ణాడెల్టాకి 150 టిఎంసి ఫీట్ల నీటినే కేటాయించింది. అయితే ట్రిబ్యునల్ ఒక పంట కోసం మాత్రమే నీటిని కేటాయించడం జరిగితే, దాదాపు 15 లక్షల ఎకరాలలో మొదటి పంటకు 170–200 టిఎంసి ఫీట్‌లు, రెండో పంటకు 125–150 టిఎంసి ఫీట్‌లు మొత్తంగా సంవత్సరానికి 295–350 టిఎంసి ఫీట్‌ల వరకూ కృష్ణా డెల్టాలో వాడుకుంటున్నారు. ఇది వాస్తవం.

కృష్ణానదీ జలాల పంపిణీ గురించి మాట్లాడేటప్పుడు తప్పనిసరిగా గుర్తుపెట్టుకోవలసింది ఒకప్పటి మద్రాస్ నగరంగా పేరుపొందిన ఇప్పటి చెన్నై నగరాన్ని. 1980లో ఈ నగరంలో ఏర్పడ్డ తాగు నీటి ఎద్దడిని తీర్చడానికి మానవీయ కోణంలో కర్ణాటక, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు తలా 5 టిఎంసి ఫీట్‌ల కృష్ణా నీళ్లను పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ ద్వారా (తెలుగుగంగ కాలువ) చెన్నైకి సరఫరా చేయడానికి ఒప్పుకుని ఒప్పందం చేసుకున్నాయి. దాని అమలు కూడా జరుగుతోంది. నిజానికి ఈ కేటాయింపులు రాయలసీమకు గానీ నెల్లూరుకు గానీ లేవు. ఈ ప్రాంతాలు పెన్నా నదీ పరివాహక ప్రాంతంలో ఉండడమే కారణం. తెలుగుగంగ కాలువల ద్వారా ఒప్పందం ప్రకారం చెన్నైకి మాత్రమే కృష్ణ నీరు వెళ్లాలి. అయితే ఇప్పుడు జరుగుతున్నదేమిటంటే, చెన్నైకి నీటిని సరఫరా చేసే పేరుతో పోతిరెడ్డిపాడు హెడ్‌పాయింట్ నుంచీ తెలుగుగంగ కాలువల ద్వారా వరదజలాల పేరుతో 100 నుంచి 200 టిఎంసి ఫీట్‌ల నికర జలాలు పెన్నా బేసిన్‌లోని కర్నూలు, కడప, నెల్లూరు జిల్లాల్లోని పొలాలకు సాగునీరుగా అందుతున్నట్లు, సోమశిల రిజర్వాయర్‌కు వెళుతున్నట్లు సమాచారం. అదేవిధంగా జలయజ్ఞం పథకం కింద పెన్నా బేసిన్‌లో కడుతున్న అన్ని ప్రాజెక్టులు కృష్ణానది మిగులు జలాల ఆధారంగా కడుతున్నవే. ప్రస్తుతమున్న బ్రిజేష్‌కుమార్ ట్రిబ్యునల్ అవార్డ్ అమలయితే ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకూ మిగులు జలాలు అనేవే ఉండవు. పర్యవసానంగా తెలుగుగంగలో ప్రవహించబోయేది చెన్నైకి వెళ్లవలసిన 15 టిఎంసి ఫీట్ల నీళ్లు మాత్రమే.

కృష్ణానది వరదలో ఉన్నప్పుడల్లా మొట్టమొదట లాభపడుతున్నది కెసి కెనాల్, ఆ తర్వాత శ్రీశైలం రిజర్వాయర్‌లో కర్నూలు వైపు ఉన్న తెలుగుగంగ(పోతిరెడ్డిపాడు). దీని ప్రత్యేకత ఏమిటంటే 40వేలకు పైగా క్యూసెక్కుల వరద నీటిని తీసుకెళ్లగలిగిన సామర్థ్యం ఉంది. అంటే రోజుకి నాలుగు టిఎంసి ఫీట్ల నీటిని సరఫరా చేయగల సామర్థ్యం కలిగి ఉంది. ఆ విధంగా రాయలసీమకు, నెల్లూరుకు అత్యధిక ప్రయోజనం పొందే అవకాశం ఉంది. (క్యూసెక్ అంటే క్యూబిక్ ఫీట్ పర్ సెకెండ్ ప్రతి సెకెనుకు ప్రవహించే ఘనపుటడుగుల నీరు. ప్రవాహంలోని నీటిని క్యూసెక్కుల రూపంలోనూ, స్థిరంగా ఉండే నీటి పరిమాణాన్ని టిఎంసి ఫీట్ గానూ పరిగణిస్తారు.)

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం తెలంగాణ, సీమాంధ్రగా విడిపోయినా లేదా రాయల తెలంగాణ, సీమాంధ్రగా విడిపోయినా తెలుగుగంగ కాలువలో కృష్ణానది నికర జలాలు మాత్రం ప్రవహించవు. ఒక కాలువలో సుమారుగా 11,500 క్యూసెక్కుల ప్రవాహం ఉంటే, ఆ ప్రవాహం 24 గంటలపాటు సాగితే ఒక టిఎంసి ఫీట్ నీళ్లు తరలిపోయినట్లు భావించాలి. పోతిరెడ్డిపాడు హెడ్‌రెగ్యులేటర్ ద్వారా రోజుకి దాదాపు 4 టిఎంసి ఫీట్‌ల నీళ్లని కృష్ణాబేసిన్ నుంచి పెన్నా బేసిన్‌కు తరలించవచ్చు.

నికర జలాలు అంటే నిర్వచనం ఆ రాష్ట్రం పరిధిలో 50 నుంచి 75 సంవత్సరాలపాటు నదీపరివాహక ప్రాంతంలో అందుబాటులోకి వస్తున్న జలాల పరిమాణాన్ని ఒక సంవత్సర కాలానికి పరిమితం చేసి నిర్ణయించిన జలాల పరిమాణమే నికర జలాలు. కృష్ణానదిలో ఆంధ్రప్రదేశ్ వాటా 811 టిఎంసి ఫీట్‌గా బచావత్ ట్రిబ్యునల్ నిర్ధారించింది. నికరజలాల కంటే అదనంగా ప్రవహించే జలాలని మిగులు జలాలుగా నిర్వచించారు. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకూ శ్రీశైలం, నాగార్జునసాగర్, పులిచింతల రిజర్వాయర్‌లు నిండిన తర్వాత విజయవాడలోని ప్రకాశం బ్యారేజ్ నుంచి కిందికి వదిలివేసే నీటినే వరద జలాలుగా భావిస్తారు.

ఇక నాగార్జునసాగర్ దగ్గరికి వస్తే డ్యామ్‌కు కుడి, ఎడమ కాల్వల సామర్థ్యం చెరి 10 వేల క్యూసెక్కులుగా ఉంది. ఈ ప్రకారం చూస్తే ఒక్కో కాలువలో రోజుకి ఒక టిఎంసి ఫీట్ చొప్పున 150 రోజులకు గానూ దగ్గర దగ్గర 300 టిఎంసి ఫీట్‌ల సాగు నీరు ఆంధ్ర తెలంగాణలలో ప్రవహిస్తోంది. ఈ ప్రకారం చూస్తే ఖరీఫ్‌లో ఎడమకాల్వ కింద తెలంగాణలోని ఖమ్మం, నల్గొండ జిల్లాలలో సుమారుగా 5 లక్షల ఎకరాలకి సాగునీరు అందుతుంటే, దాదాపు 4 లక్షల ఎకరాలు పశ్చిమ కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాల ప్రాంతానికి వెళుతున్నాయి. కుడి కాల్వ కింద గుంటూరు, ప్రకాశం జిల్లాలలో దాదాపు 11 లక్షల ఎకరాలు సాగవుతున్నాయి. సాగర్ కుడి ఎడమ కాల్వల ద్వారా మొత్తం 264 టిఎంసి ఫీట్‌ల నీరు సరఫరా అవుతోంది. అందులో 4వ వంతు అంటే కేవలం 65 టిఎంసి ఫీట్ నీళ్లు మాత్రమే తెలంగాణకు అందుతున్నాయి. దాదాపు 200 టిఎంసి ఫీట్‌ల నీళ్లు ఆంధ్ర ప్రాంతానికి వెళ్తున్నాయి. సగానికి పైగా సాగర్ ఆయకట్టు కృష్ణా పరివాహక ప్రాంతానికి బయట పెన్నా నదీ బేసిన్‌లో సాగవుతున్నది. ( గుంటూరు, ప్రకాశం, పశ్చిమ గోదావరి జిల్లాలు.) రాష్ట్ర విభజన జరిగిన తర్వాత సాగర్ కుడి కాల్వ ద్వారా కృష్ణా నికర జలాలు మునుపటివలే ప్రవహించడం అసంభవమే అవుతుంది. ఆ మేరకు మొత్తం సుమారుగా 130-140 టిఎంసి ఫీట్‌ల నీళ్లు తెలంగాణలోని పొలాలకు అందుబాటులోకి వస్తాయి.

ప్రస్తుతం నల్గొండ జిల్లాలోని అక్కంపల్లి రిజర్వాయర్ (ఎలిమినేటి మాధవరెడ్డి రిజర్వాయర్) ద్వారా దాదాపు లక్ష ఎకరాలకు సాగునీటి సౌకర్యంతో పాటు హైదరాబాద్ మహానగర తాగునీటి అవసరాలు తీరుతున్నాయి.

పై వాస్తవాలన్నింటినీ పరిశీలిస్తే ఆంధ్రప్రదేశ్‌లో వాడుకుంటున్న నికరజలాలు, వరద జలాలతో కలిపి సుమారుగా 1000 టిఎంసి ఫీట్ నీళ్లతో ఒక సంవత్సరంలో కనీసం 80 లక్షల ఎకరాలలో వరిపంట పండించవచ్చు. ఇందులో తెలంగాణలో జూరాల ప్రాజెక్టు నుంచి లక్ష ఎకరాలు, అక్కంపల్లి నుంచి లక్ష ఎకరాలు. సాగర్ ఎడమ కాల్వ నుంచి రెండు పంటలకు గానూ 5-10 లక్షల ఎకరాలు మాత్రమే సాగవుతున్నాయి. మొత్తంగా 10 లక్షల ఎకరాల కన్నా ఎక్కువ దాటడం లేదు.

68.5 శాతం కృష్ణానదీ పరివాహక ప్రాంతం కలిగిన తెలంగాణ కేవలం 15 శాతం నీటిని మాత్రమే వివిధ ప్రాజెక్టుల ద్వారా వాడుకుంటుందనేది వాస్తవం. అయితే ఇది ఎందుకు ఎలా జరుగుతోందో తెలుసుకోవాలంటే నదీజలాల వివాదాలను పరిష్కరించే ట్రిబ్యునల్స్ గురించి ముందుగా తెలుసుకోవాలి. ఇందులో రాష్ట్రానికే ప్రాతినిధ్యం ఉంటుంది గానీ, రాష్ట్రాలలోని ప్రాంతాలకు ఉండదు. కృష్ణాజలాలకు సంబంధించి అప్పటి బచావత్ ట్రిబ్యునల్ ముందు గానీ, ఇప్పటి బ్రిజేష్‌కుమార్ ట్రిబ్యునల్ ముందు గానీ తమ రాష్ట్రంలోని ప్రాంతాల ప్రాతినిధ్యానికి, అక్కడి అవసరాల గురించి, సహజ న్యాయానికి పూచీ పడవలసింది ఆయా రాష్ట్ర ప్రభుత్వాలే. ఇక్కడే తెలంగాణ ప్రాంతానికి జరిగిన అన్యాయానికి మూలాలున్నాయని అర్థం చేసుకోవాలి. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు జరిగిన తర్వాత కేంద్ర ప్రభుత్వం అప్పుడు అనివార్యంగా ఏర్పాటు చేసే ట్రిబ్యునల్ ముందు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం సహజ న్యాయ సూత్రాలను, సాగు విస్తీర్ణం నిష్పత్తికి అనుగుణంగా నీటి కేటాయింపు సూత్రాన్ని ఉటంకిస్తూ తాను ప్రస్తుతం వాడుకుంటున్న 15శాతం వాటాను సాధ్యమైనంత ఎక్కువగా 68.5 శాతం దరిదాపుల్లో ఉండే విధంగా వాదనను వినిపిస్తోంది. ఇప్పుడు వాడుకుంటున్న దానికంటే అదనంగా అత్యధిక వాటాను పొందుతోంది.

పైనున్న వాస్తవాలని శాస్త్రీయ పద్ధతుల్లో విశ్లేషిస్తే మనకు రెండు విషయాలు స్పష్టంగా గోచరిస్తాయి. ఒకటి, ఉమ్మడి రాష్ట్రంలో గత 40 సంవత్సరాలుగా తెలంగాణ ప్రాంత రైతాంగానికి అన్యాయం జరిగిందనీ, చాలా సంపదను నష్టపోయారనీ తెలుస్తోంది. రెండోది విభజనానంతర పరిస్థితిలో రెండు రాష్ట్రాలు అస్తిత్వంలోకి వస్తే ఆంధ్ర, రాయలసీమల్లో అందుబాటులోకి వచ్చే కృష్ణానది నీళ్లు సుమారుగా 350 నుంచి 400 టిఎంసి ఫీట్‌లకి పరిమితమవుతాయి. దీనికి తగ్గట్టుగా ఆ ప్రాంత పంటల విధానం, వ్యవసాయ పద్ధతుల్లో మార్పులు చేయడం అనివార్యం అవుతుంది. ఆ మేరకు అక్కడి ప్రజానీకాన్ని, ముఖ్యంగా రైతాంగాన్ని సంసిద్ధపరచాలి.

ఇప్పుడున్న ఆధునిక వ్యవసాయ పరిజ్ఞానంతో(ఉదా: శ్రీవరి సాగు) ఒక టిఎంసి ఫీట్ నీటితో 7500 ఎకరాలకు బదులు కనీసం 10వేల ఎకరాలను సాగు చేయవచ్చు. ప్రస్తుతమున్న వరి ఉత్పాదకత, మార్కెట్లో బియ్యం రేట్లను పరిగణనలోకి తీసుకుంటే ఒక ఎకరం నుంచి వరిపంట ఉత్పత్తి విలువని యాభైవేల రూపాయలుగా నిర్ధారించవచ్చు. ఒక టిఎంసి ఫీట్ నీటితో 10వేల ఎకరాల వరి సాగుచేస్తే 50 కోట్ల రూపాయల విలువ గల సంపదను సృష్టించవచ్చు. అదే నీటితో వేరే వాణిజ్య పంటల్ని సాగుచేస్తే ఇంకా ఎక్కువ విలువ గల ఉత్పత్తిని సాధించవచ్చు. ఆ విధంగా చూస్తే మన రాష్ట్రం వాటా 1000 టిఎంసి ఫీట్ నీటి నుంచి ప్రతి సంవత్సరం కనీస పక్షం (1000 - 50కోట్లు) రు.50 వేల కోట్ల విలువగల సంపద వ్యవసాయ ఉత్పత్తుల ద్వారా సృష్టించబడుతోంది. కృష్ణానది జలాల్లో 85 శాతం ఆంధ్ర ప్రాంతానికే వెళ్లడం వల్ల అక్కడి ఆర్థిక వ్యవస్థలో దాదాపు 45 వేల కోట్ల మేర విలువైన సంపద వివిధ రూపాల్లో సర్క్యులేషన్ (పంపిణి) లో ఉంది. సాగర్ జలాలు అందుబాటులోకి వచ్చినప్పటి నుంచి గత నలభై సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం ఇంత సంపద సృష్టించబడుతోంది. ఇప్పటి రేట్ల ప్రకారం కనీసం 20 లక్షల కోట్ల రూపాయల సంపద మూలధనంగా ఆంధ్ర, రాయలసీమ ప్రాంతం నుంచీ పెట్టుబడుల రూపంలో వివిధ నగరాలకు మరీ ముఖ్యంగా హైదరాబాద్ నగరానికి చేరింది.

ఇంక గోదావరి నది విషయానికి వస్తే నికర జలాలు అపరిమితంగా అందుబాటులో ఉన్నా గానీ, గోదావరి డెల్టాలో ఉన్న 10 లక్షల ఎకరాలలో మొదటి పంట, రెండోపంట పూర్తికాలం సాగునీరు అందుబాటులో ఉంచడం కోసం ధవళేశ్వరం ఎగువన ఉన్న తెలంగాణ ప్రాంతంలో ఏ ఒక్క ప్రాజెక్టునీ ఈ 40 సంవత్సరాలుగా కట్టకుండా కాలయాపన చేయడంతోనే సరిపోయింది. పైన చెప్పిన సంపద వివరాలు ఇక్కడ కూడా వర్తిస్తాయి. ప్రస్తుతం రాష్ట్ర విభజన అనివార్యం అన్న పరిస్థితుల్లో గోదావరి డెల్టాకి పూర్వం లాగానే సాగునీరు సాఫీగా అందించడం కోసం పోలవరం ప్రాజెక్టు పనులను త్వరితగతిన పూర్తి చేయాలని రాష్ట్ర ప్రభుత్వం ఒకపక్క, జాతీయ హోదా పేరుతో కాంగ్రెస్ పార్టీ మరోపక్క యథాశక్తి ప్రయత్నం చేస్తున్నాయి.

ఇంత సంపదకు కారణమైన కృష్ణా, గోదావరి జలాల్లో తెలంగాణాకి న్యాయమైన పంపిణి జరిగి ఉంటే హైదరాబాద్‌ని ఎవరు అభివృద్ధి చేశారు అన్న సమస్యే ఉత్పన్నం కాదు. ఇందులో యాభై శాతానికి పైగా మూల పెట్టుబడి (సీడ్ క్యాపిటల్)గా వివిధ రంగాలలోకి (విద్య, వైద్యం,

# తెలంగాణ ఉద్యమం- ఒక విశ్లేషణ - 2

*తెలంగాణ ఉద్యమాల తీరును విశ్లేషిస్తూ, పార్లమెంటరీ పార్టీల స్వభావాలను తెలియజేస్తూ, ప్రజాస్వామ్య తెలంగాణ నిర్మాణ బాధ్యత ప్రజాస్వామిక వాదులదేనంటున్నారు.* **డా. ఎం. గంగాధర్**

(గత సంచిక తరువాయి...)

తెలంగాణ ప్రాంతంలో రాత్రింబవళ్లూ ప్రత్యేక రాష్ట్రమే ఒక ఆలాపనగా మారినపుడు తెలంగాణకు వ్యతిరేకమైన టిడిపి తెలంగాణలో కిందపడీ, మీదపడీ చివరకు తెలంగాణ కావాలని అన్నది. కురుక్షేత్ర యుద్ధ సమయంలో ధర్మరాజు అశ్వత్థామ హతో హతః అని, నరోవా కుంజరోవా అని గొణిగినట్లు, టిఆర్ఎస్ లోకి పోయిన తరువాత కడియం శ్రీహరి నిలదీసినట్లు, చంద్రబాబు నాయుడు ఇంకా తాను తెలంగాణకు వ్యతిరేకం కాదని అన్నాడే గాని, తెలంగాణను ఇవ్వండి అని అనలేదు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తెలంగాణను అంగీకరిస్తున్నట్లు ప్రకటించిన ఒక రోజు తరువాత గాని చంద్రబాబు నాయుడు స్పందించలేక పోయారు. ఆ స్పందనలో కూడ ఆయన సంతోషాన్ని వెలిబుచ్చలేదు. విభజన తరువాత సీమాంధ్ర ప్రాంతానికి ఏమేం చేయాలో చెప్పారు.

సరే. టిడిపి స్పష్టాస్పష్టంగా ఉంది. దాగుడుమూతలాడు తున్నది. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ మాత్రం తెలంగాణకు వ్యతిరేకమనే విషయం స్పష్టమే కదా. ఒక ఉద్యమ దశలో జరిగిన మానుకోట సంఘటన వరంగల్‌కు, తెలంగాణకు ఉంది. కాని ఆ వరంగల్ లోనూ, ఆ తెలంగాణ లోనూ ఆ పార్టీ ప్రవేశించగలిగింది. ఈ పరిస్థితులు కూడ తెలంగాణ ముందు సవాళ్లుగా ఉన్నాయి.

6. ఉద్యమాల ద్వారానే తెలంగాణ వస్తుందని, ఓట్ల ద్వారా రాదని తెలంగాణ ఉద్యమంలో తరచుగా ఒక మాట వినబడుతూ వచ్చింది. స్థూలంగా ప్రజాస్వామ్య తెలంగాణను లక్ష్యంగా పెట్టుకుని పని చేసిన ఉద్యమ శక్తులు ప్రధానంగా, ఏదో ఒక రూపంలో సామాజిక తెలంగాణ గురించి మాట్లాడిన వారు కొంత మేరకు ఈ మాట చెపుతూ రావడం జరిగింది. ఓట్లతో ఏర్పడే చట్ట సభలతో నిమిత్తం లేకుండా, క్షేత్ర స్థాయిలో జరిగే ఉద్యమాలతోనే తెలంగాణ వస్తుందని ఈ శక్తులు అనుకున్నాయా? కాదు. ఓట్ల మీద, సీట్ల మీద ఆధారపడి కొనసాగే పార్లమెంటరీ లాబీయింగ్ రాజకీయాలతో తెలంగాణ రాదని వాళ్లు చెప్పదలుచుకుని ఉండవచ్చును. పార్లమెంటులో తెలంగాణ బిల్లు పెట్టాలని వాళ్లు కూడ అడిగారు. ఆ బిల్లు పెట్టవలసిన ప్రభుత్వం మీద, ఆ బిల్లు మీద ఓటు వేయవలసిన పార్లమెంటు సభ్యుల మీద ఉద్యమాల ద్వారా ఒత్తిడి తెచ్చి తెలంగాణను సాధించుకోవాలని వారి ఉద్దేశం. తెలంగాణ కొరకు చేసిన ఉద్యమాలతోనైనా, చేసి ఉండవలసిన ఉద్యమాలతోనైనా భౌగోళిక తెలంగాణయే కాకుండా, దానితో పాటు సామాజిక తెలంగాణయో, ప్రజాస్వామ్య తెలంగాణయో వస్తుందని వారు భావించారని అనుకోలేం.

ఉద్యమమే, దానంతట అదే, ఒక చైతన్యం. ఉద్యమాలు ప్రజల్లో చైతన్యాన్ని ప్రోది చేస్తాయి. ఉద్యమం జరిగే క్రమంలో ఆ ఉద్యమాని

---

పరిశ్రమలు, సినిమాలు, (ప్రాజెక్టులు, ఎయిర్ పోర్టులు, భారీ నౌకాశ్రయాలు, రియల్ ఎస్టేట్ నిర్మాణ రంగాలు) పెట్టుబడుల రూపంలో ప్రవహించాయి. ఈ పెట్టుబడులు కాలక్రమంలో ఎన్నోరెట్ల విలువైన సంపదను సృష్టించగలిగాయి. ఇప్పుడు మనం చూస్తున్న ఈ సంపద, అభివృద్ధి (!?) మూలాలు వ్యవసాయరంగంలో సాధించిన అదనపు ఉత్పత్తిలో ఉన్నాయనడంలో అతిశయోక్తి లేదు.

ప్రస్తుత హైదరాబాద్ నగర పరిస్థితులను పరికిస్తే ఔటర్‌రింగ్‌రోడ్డు లోపలి వైశాల్యం 2000 చదరపు కిలోమీటర్లు అంటే 5 లక్షల ఎకరాలు. హెచ్ఎమ్‌డిఎ 6000 చదరపు కిలోమీటర్ల పరిధిలో విస్తరించి ఉంది. అంటే 15 లక్షల ఎకరాలు. ఔటర్ రింగ్‌రోడ్డులో ఉన్న 5 లక్షల ఎకరాలు, బయట ఉన్న హెచ్ఎమ్‌డిఎ పరిధిలోని 10 లక్షల ఎకరాలు మొత్తం 15 లక్షల ఎకరాలలో (ఇవన్నీ ఒకప్పటి తెలంగాణ వ్యవసాయ భూములు) ఎక్కువ భాగం రియల్ ఎస్టేట్‌గా మారడం, అందులోకి లక్ష కోట్లకు పైగా పెట్టుబడులు పెట్టడం జరిగింది. ఒకప్పుడు అతి తక్కువ ధరలకి వ్యవసాయ భూముల పేరుతో కొన్నా వాటిని రియల్ ఎస్టేట్‌గా మార్చి స్పెక్యులేషన్‌లోకి దిగడం వల్ల కూడా హైదరాబాద్ సమస్య జటిలమయింది.

పై విషయాలన్నీ పరిగణనలోకి తీసుకుంటే నీరు, సంపద, అభివృద్ధిల మధ్య ఉన్న అవినాభావ సంబంధం మనకు స్పష్టంగా అవగత మవుతుంది. సహజ సిద్ధంగా నదీపరివాహక ప్రాంత ప్రజలకి చెందాల్సిన ఉమ్మడి వనరైన నీటిని అక్రమంగా తరలించుకుపోయి ఒక పంట బదులు రెండు పంటలూ పండిస్తూ రెండింతల నీళ్లు అక్రమంగా వాడుకుంటూ దాన్ని ప్రైవేట్ సంపదగా మార్చుకున్న క్రమం మనకు కనిపిస్తూనే ఉంది. ఇప్పుడు తెలుగు ప్రజల ముందు ఉన్న ప్రధాన సమస్య సమన్యాయాన్ని ఏ సూత్రాల ప్రాతిపదికన అమలు చేయాలి? ఒక ప్రాంతానికి జరిగిన అన్యాయాన్ని పరిష్కరించడంలో భాగంగా కొత్త రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలన్న నిర్ణయం తీసుకుంటే అది ఇతర ప్రాంతాలకి ఏ విధంగా అన్యాయమవుతుంది? ఆలోచించండి. ఇప్పటి పరిస్థితుల్లో ద్వేష భావనకు తావివ్వని రీతిలో ఇరు రాష్ట్రాల ప్రజల మధ్య సత్సంబంధాలు ఉంటేనే భవిష్యత్తులో ఇచ్చిపుచ్చుకునే అవకాశాన్ని మిగుల్చుకోగలుగుతాం. మనందరం భారతదేశ చిత్రం కిందనే ఉన్నామన్న సంగతి, న్యాయసూత్రాలు అందరికీ సమంగా వర్తిస్తాయనే ప్రజాస్వామ్య న్యాయస్ఫూర్తిని నిలుపుకోగలగాలి.

*(రచయితలు రైతు, సామాజిక కార్యకర్త)* వీ

కున్న పరిమిత లక్ష్యాన్ని విశాలతరం చేయడానికి ఈ చైతన్యం పనికి వస్తుంది. దాని వలన ఉద్యమానికి స్వల్ప కాలిక లక్ష్యమే కాకుండా దీర్ఘకాలిక లక్ష్యం ఏర్పడడానికి, ఉపరితల లక్ష్యమే కాకుండా మౌలిక లక్ష్యం ఏర్పడడానికి, ఆ దీర్ఘ కాలికమైన, మౌలికమైన లక్ష్యాలపట్ల ప్రజలను సంఘటిత పరచడానికి అవకాశం ఉంటుంది. భౌగోళిక తెలంగాణ లక్ష్యంతో ఉద్యమం చేస్తున్నవారు ప్రజలను తమ వెంట ఉంచుకోవడానికి వాగాడంబరంతో ఇచ్చే హామీలను, ఆ భౌగోళిక తెలంగాణ వచ్చిన తరువాత, మరిచి పోకుండా ఉండడానికి, వాటిని ఆ ఉద్యమనాయకులకు గుర్తు చేయడానికి, వాటి అమలు కొరకు అవసరమైతే మళ్లీ ఉద్యమించడానికి, ఆ చైతన్యం ఉపయోగపడుతుంది.

సామాజిక తెలంగాణ కొరకు, ప్రజాస్వామ్య తెలంగాణ కొరకు మీడియాలో, సభల్లో జరిగిన చర్చ, వాదోపవాదాలు, క్షేత్రస్థాయిలో జరిగిన ఉద్యమాలు అందించిన చైతన్యం భౌగోళిక తెలంగాణలో నిలబడి తమ న్యాయమైన డిమాండ్లను అడగగలిగే స్థితిలో ఉండాలి. అవసరమైతే అందుకోసం ఉద్యమించగలిగేలా ఉండాలి. ఉద్యమాల ద్వారానే తెలంగాణ వస్తుందనే మాటకు ఇంతటి అర్థం ఉంటేనే, అది భవిష్యత్తులో ప్రజలకు భరోసాగా ఉంటుంది.

7. ఇప్పటి తెలంగాణ ఉద్యమం ఎలక్ట్రానిక్ మీడియా కాలంలో జరిగింది. నిరంతరం వార్తలను, దృశ్యాలను అందించే చానళ్లు ఉన్న కాలంలో జరిగింది. ఆ చానళ్లు కూడ అనేకం ఉండి వార్తలను అందించడం కొరకు పోటీ పడుతున్న కాలంలో జరిగింది. ఇందులో కొన్ని చానళ్లు తెలంగాణ ఉద్యమానికి అనుకూలమైనవి కావచ్చును, కొన్ని వ్యతిరేకమైనవి కావచ్చును, కొన్ని తటస్థంగా ఉన్నవి కావచ్చును. మొత్తం మీద ఉద్యమ వార్తలను అందుకోవడంలో ఆలస్యానికి పెద్దగా తావు లేకుండా పోయింది. ప్రింట్ మీడియాలో ఎలక్ట్రానిక్ మీడియాలోని చానళ్ల కంటే తక్కువ సంఖ్యలో పత్రికలు ఉండడం, అవి రోజుకు ఒకసారే దర్శనమిచ్చేవి కావడం, వాటి కుండే స్థలాభావం అనే పరిమితుల్లోనే అవి కూడ ఉద్యమ వార్తలను అందించాయి. ఈ రెండు రకాల మీడియా వలన ఉద్యమానికి బాగా ప్రచారం వచ్చింది. ఉద్యమం విస్తృతం కావడానికి అది పనికి వచ్చింది. అదే సమయంలో ఈ మీడియా వలన నష్టం కూడ జరిగింది.

ప్రింట్ మీడియా ప్రాచుర్యం అక్షరాస్యతా సమాజం మీద ప్రబలిన తరువాత, అంతకు మించి ఎలక్ట్రానిక్ మీడియా ప్రాచుర్యం మొత్తం సమాజం మీద ప్రబలిన తరువాత, మీడియా ఉద్యమాల మీద తన ప్రభావాన్ని వేయడం ప్రారంభించింది. సమాచార మాధ్యమంగానూ, సంఘటనల విశ్లేషణావేదిక గానూ ఉండవలసిన మీడియా సమాజంలో తనకు లభిస్తున్న ప్రాచుర్యాన్ని ఇందుకు సాధనంగా వాడుకుంటున్నది. మీడియాలో ప్రచారం మీద మోజున్న ఉద్యమకారుల బలహీనత ఇందుకు అంది వచ్చిన అవకాశంగా మారింది.

తెలంగాణకు సంబంధించి కొంత మంది ఉద్యమం, కొన్ని ఉద్యమ సంఘటనలు మనకు మీడియాలోనే కనిపించాయి. క్షేత్ర స్థాయిలో ఆ ఉద్యమం గాని, ఆ ఉద్యమ సంఘటనలు గాని కనిపించవు. సామాజిక తెలంగాణ అనే భావన ఎక్కువగా మీడియా నుండి ఉత్పత్తి అయిన భావన గానే కనిపిస్తుంది. సైద్ధాంతిక స్థాయిలో సామాజిక తెలంగాణ అనే భావనకు మీడియా ఒక వేదికగా ఉండడంలో తప్పు లేదు. కాని అది ఒక భౌతిక శక్తిగా మారి ఏదైనా క్షేత్రస్థాయి ఉద్యమాన్ని నిర్మించిందా? సామాజిక తెలంగాణ భావనలో ఇమిడి ఉన్న ఏవైనా నిర్దిష్టమైన అంశాల మీద ఏవైనా ఉద్యమ కార్యక్రమాలు జరిగాయా?

తెలంగాణ ఉద్యమంలో గ్రామ స్థాయి నుండి రాష్ట్ర స్థాయి వరకు అనేకానేక ఐక్య సంఘటనలు ఉన్నాయి. ఇవి కింది నుండి పై వరకు దొంతర్లుగా ఉన్నాయి. ఒకదాని పక్క మరొకటి సమాంతరంగా ఉన్నాయి. సమాంతరంగా ఉన్న ఐక్య సంఘటనల మధ్య ఫెడరల్ ఐక్యత లేకుండా పోయింది. తెలంగాణ విషయంలో ఆ ఐక్య సంఘటనల మధ్య ఉన్న సైద్ధాంతిక విభేదాలు, ఉద్యమ కార్యాచరణ విభేదాలు అందుకు కారణం అయి ఉండవచ్చును. అందుకే భౌగోళిక తెలంగాణ, సామాజిక తెలంగాణ, ప్రజాస్వామ్య తెలంగాణ అనే భిన్నమైన లక్ష్యాలు తెలంగాణ ఉద్యమంలో కనిపిస్తున్నాయి.

ఇలాంటి విభేదాలు కనిపిస్తున్న పరిస్థితిలో పరస్పరం విమర్శలు సహజమే. ఎదుటివారి మీద విమర్శలు చేసే వారు ఎదుటివారు ఏం చేయాలని విమర్శిస్తారో ఆ పనిని తాము చేస్తారని ఆశిస్తాం. కాని తాము ఆ పనిని చేయడంతో నిమిత్తం లేకుండా విమర్శించడమే ఒక ధోరణిగా తెలంగాణ ఉద్యమంలో మనకు కనిపించింది. తెలంగాణ ప్రజల అనుగ్రహం నుండి దూరం కాకూడదనుకున్న పార్లమెంటరీ పార్టీల మధ్యనే కాకుండా ఒక సైద్ధాంతిక అవగాహనతో పని చేస్తున్న వారు కూడ ఈ ధోరణిని ప్రదర్శించారు.

1968, 1969 ల నాటి తెలంగాణ ఉద్యమం జరిగిన సుమారు మూడు దశాబ్దాల తరువాత మళ్లీ ప్రారంభమై, నాలుగు దశాబ్దాల తరువాత కూడ కొనసాగుతున్న తెలంగాణ ఉద్యమానికి నేపథ్యంలో విప్లవోద్యమం, అస్తిత్వ ఉద్యమాలు, ప్రజాస్వామిక ఉద్యమం ఉన్నాయి. ఈ ఉద్యమాల అనుభవం తెలంగాణ ప్రజలకు ఉన్నప్పటికిని తెలంగాణ ఉద్యమంలో మాత్రం సామాజిక, ప్రజాస్వామ్య ఉద్యమ శక్తులు, తెలంగాణ పెట్టుబడిదారీ సంపన్న వర్గాల కంటే సాపేక్షంగా బలహీనంగా ఉన్నాయి. తెలంగాణకు సంబంధించి కీలకమైన ఉద్యమ కార్యక్రమాల నన్నింటిని తెలంగాణ జెఎసి నిర్ణయిస్తే వాటిలో పాల్గొనవలసిన స్థితిలో ప్రజాస్వామ్య ఉద్యమ శక్తులు పని చేశాయి.

తమ విధానాల మేరకు ఈ శక్తులు తీసుకున్న ఉద్యమ కార్యక్రమాలు ఉన్నాయి గాని అవి పరిస్థితులు కల్పించిన అవసరాల మేరకు లేవు. జరిగిన కార్యక్రమాలు కూడ ఇటీవలి సంవత్సరాలలో తెలంగాణ ఉద్యమం తెలంగాణ ప్రజల మనస్సులలో కల్పించిన భావోద్వేగాల స్థాయిలో లేవు. తెలంగాణ సమాజం దాని విప్లవోద్యమ చైతన్యం ఆశిస్తున్నట్లుగా ప్రజాస్వామ్యీకరణ చెందడానికి, రేపటి తెలంగాణ ప్రభుత్వం ప్రజానుకూలమైన విధానాలను అమలు చేయడానికి తెలంగాణ సమాజంలోని ప్రజాస్వామ్య శక్తులు పెద్ద పోరాటమే చేయవలసి ఉంది. తెలంగాణ ఉద్యమంలో భాగంగా సామాజిక, ప్రజాస్వామ్య శక్తులు చేసిన పోరాటాలు, కొనసాగించిన చర్చ ప్రజల్లో కొంత పునాదిని ఏర్పరచుకుని, అది వారి చైతన్యంగా ఎంత నిలిచి ఉంటే అంతగా ఆ చైతన్యం ఈ పోరాటానికి దోహదంగా ఉంటుంది.

తెలంగాణ ఉద్యమంలో కనిపించిన కాంగ్రెస్, టిడిపి, టిఆర్ఎస్ పార్టీల రాజకీయ సంస్కృతి, విధానాలు తెలంగాణ సమాజానికి తక్కువ ప్రమాదకరమైన వేమీ కాదు గాని, తెలంగాణ రాష్ట్రాన్ని ఇవ్వాలనే విధాన నిర్ణయాన్ని తీసుకుని, తెలంగాణ ఉద్యమంలో పాల్గొని, తెలంగాణ సమాజంలో తన ప్రాబల్యాన్ని కొంత పెంచుకున్న బిజెపి రాజకీయ

సంస్కృతి, విధానాలు ఎక్కువ ప్రమాదకరమైనవి. ఈ సమయానికే నరేంద్రమోడీ ఆలాపన రావడం ఆ ప్రమాదాన్ని పెంచుతున్నది. కాంగ్రెస్, టిడిపి, టిఆర్ఎస్, బిజెపిలు తెలంగాణ ఉద్యమం నుండి, ఈ ఉద్యమం ఫలితంగా తెలంగాణను ఇవ్వడానికి కేంద్ర ప్రభుత్వం అనివార్యంగా తీసుకోవలసి వచ్చిన నిర్ణయం నుండి ఎన్నికల ప్రయోజనాన్ని పొందడం కొరకు పరస్పరం తీవ్రమైన ఘర్షణ మధ్యనే ఉన్నాయి. ఈ ఘర్షణ సారాంశాన్ని, ఘర్షణ పడుతున్నప్పటికీ ఈ పార్టీల మధ్యనున్న రాజకీయార్థిక విధానాల ఏకత్వాన్ని, అవి అంతిమంగా తెలంగాణ సమాజానికి మేలు చేయవనే అంశాన్ని ఆచరణాత్మకంగా అర్థం చేయించవలసిన ముందస్తు షరతులాంటి కర్తవ్యం ప్రజాస్వామ్య శక్తుల ముందు ఉంది.

8. గత నాలుగు సంవత్సరాలకు పైగా తెలంగాణ ఉద్యమంలో తెలంగాణ సమాజంలోని దాదాపు అన్ని సామాజిక శ్రేణులు పాల్గొన్నాయి. తెలంగాణ ఉద్యమం ఆ శ్రేణులను నిరంతర భావోద్వేగ స్థితిలో ఉంచాయి. ఈ భావోద్వేగ స్థితి ఎక్కడినుండి వచ్చింది? ఆంధ్రప్రదేశ్ పాలనలో తెలంగాణ ప్రాంతానికి అన్యాయం జరిగిందనే భావనలో నుండి వచ్చింది. తెలంగాణ ప్రాంతాన్ని ఈ అన్యాయం నుండి తెలంగాణ రాష్ట్రం మాత్రమే బయటపడ వేస్తుందనే భావనలో నుండి వచ్చింది. తెలంగాణ ప్రజలు గుర్తించిన అన్యాయాలు చాల ఉన్నాయి. కృష్ణా, గోదావరి నదులు తెలంగాణ గుండా ప్రవహిస్తున్నప్పటికి తగినంత సాగునీటి వసతి తెలంగాణ ప్రాంతానికి లేకుండా పోయింది. వ్యవసాయానికి సాగునీరు లేక, జిల్లాలో ఇతర ఉపాధి అవకాశాలు తగినన్ని లేక మహబూబ్‌నగర్ జిల్లా నుండి లక్షలాది జనం పాలమూరు లేబరుగా దేశంలోని వివిధ ప్రాంతాలకు వలస కూలీలుగా పోతున్నారు. పక్కనే కృష్ణానది ప్రవహిస్తున్నప్పటికి తగినంత సాగు నీటికే కాకుండా, సురక్షితమైన తాగు నీరు కూడ లభించక నల్గొండ జిల్లా ప్రజలు ఫ్లోరైడ్ సమస్యను తీవ్రంగా ఎదుర్కొంటున్నారు. గోదావరి నుండి తెలంగాణ పంట భూములకు అందవలసిన సాగు నీరు అందడం లేదు. ప్రభుత్వ ఉద్యోగాల్లో, ముఖ్యంగా రాష్ట్రపతి ఉత్తర్వులు వర్తించని రాష్ట్ర స్థాయి ప్రభుత్వ కార్యాలయాల్లో, 42 శాతంగా ఉన్న తెలంగాణ ప్రజలకు తగిన వాటా లభించలేదు. లభించిన ఉద్యోగాలు కూడ కింది స్థాయి ఉద్యోగాలు మాత్రమే. ప్రధానంగా హైదరాబాదులో కేంద్రీకృతమైన ప్రైవేట్ కార్పొరేట్ పెట్టుబడులు కల్పిస్తున్న ఉపాధి అవకాశాలు తెలంగాణ ప్రజలకు పెద్దగా దక్కడం లేదు. హైదరాబాదు బయట, మిగిలిన తెలంగాణ ప్రాంతంలో ఉన్నత స్థాయి విద్యావకాశాలు చాల తక్కువగా ఉన్నాయి. హైదరాబాదును మినహాయించి చూస్తే మిగిలిన తెలంగాణ ప్రాంతంలో పరిశ్రమల స్థాపన దాదాపుగా లేదు. పైగా నిజాం కాలం నుండి ఉన్న పరిశ్రమలను కూడ మూసి వేశారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటి నుండి తెలంగాణ ప్రాంతానికి చెందిన వారు ముగ్గురు ముఖ్యమంత్రులుగా ఉన్నప్పటికిని ఆ అధికారం తెలంగాణ ప్రాంత సమస్యల పరిష్కారానికి ఏమీ ఉపయోగపడలేదు. రాయలసీమ ప్రాంతానికి చెందిన వారు ఎక్కువ మంది, ఎక్కువ కాలం ముఖ్యమంత్రులుగా ఉన్నప్పటికిని ఆ ముఖ్యమంత్రుల చేతిలో ఉన్న అధికారం ఆ ప్రాంతానికి సాగునీటి వసతిని కల్పించడానికి దోహదపడలేదు. ఈ ముఖ్యమంత్రులందరు చలాయించిన ప్రభుత్వాధికారం పెట్టుబడులకు సేవ చేస్తూ వచ్చిందని మనకు అర్థమవుతున్నది. ఈ పెట్టుబడులు ప్రధానంగా కోస్తాంధ్ర ప్రాంత వాసులవి. ఈ ఆరు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్‌లో సంపద పోగుపడి, ఆ సంపద పెట్టుబడిగా మారి, ఆ పెట్టుబడి మీద ఆధిపత్యం కలిగిన వారే ప్రయోజనాలను పొందారు. అందుకే కాళోజీ రెండున్నర జిల్లాలకు చెందిన రెండున్నర కులాల వారే ఈ సమస్యలకు కారణమని చెప్పారు.

రాచరికానికి, భూస్వామ్యానికి వ్యతిరేకంగా సాయుధంగా పోరాడిన చరిత్ర తెలంగాణ ప్రాంతానికి ఉంది. దున్నేవానికే భూమి అనే నినాదంతో వ్యవసాయ విప్లవం, ఆ వ్యవసాయ విప్లవం ద్వారా నూతన ప్రజాస్వామ్య వ్యవస్థ కొరకు విప్లవోద్యమంలో పాల్గొన్న చరిత్ర ఉంది. అనేక ప్రజా పోరాటాలు, సామాజిక ఉద్యమాలు, అస్తిత్వ ఉద్యమాలు కొనసాగుతున్న వర్తమానంలో తెలంగాణ సమాజం ఉంది. ఈ పోరాటాలన్నీ తెలంగాణ ప్రజల్లో రేకెత్తించిన ఆకాంక్షలు, కల్పించిన చైతన్యం తెలంగాణ ప్రజల్లో ఉన్నాయి. వీటన్నింటికి తోడు, ఒక ఫ్రెంచి విప్లవంలో లాగా, తెలంగాణ ఉద్యమానికి నాయకత్వం వహించిన తెలంగాణ పాలక వర్గ శక్తులు, అవి ఏ పార్లమెంటరీ పార్టీ రూపంలో ఉన్నప్పటికి, అత్యంత వాగాడంబరంతో వివిధ సామాజిక శ్రేణుల్లో కల్పించిన ఆశలు ఉన్నాయి. ఈ సామాజిక శ్రేణులు అన్నీ తమ సమస్యల పరిష్కారాన్ని, తమ భవిష్యత్తును తెలంగాణ రాష్ట్ర సాధనలో చూసుకున్నాయి. అందుకే ఇటీవలి సంవత్సరాలలో తెలంగాణ ఉద్యమంలోకి ఈ సామాజిక శ్రేణులన్నీ గొప్ప భావోద్వేగంతో ప్రవేశించి ఉద్యమించాయి.

ఇంతకు ముందే చెప్పినట్లుగా తెలంగాణ ఉద్యమంలో తెలంగాణ సంపన్న పాలక వర్గాల నాయకత్వమే ప్రధాన నాయకత్వం అయినందు వలన, ఆ నాయకత్వంలో ప్రజలకు మేలు చేసే ఏ కొత్త రాజకీయ సంస్కృతీ లేనందు వలన, తెలంగాణ ఉద్యమం రేకెత్తించిన ఆశలు, ఆకాంక్షలు నెరవేరే విధంగా పరిపాలనా విధానాలను అమలు చేయగల కొత్త ప్రభుత్వం ఏదీ రేపు తెలంగాణలో ఏర్పడ బోవడం లేదు. పైగా దేశంలోని దళారీ బూర్జువా భూస్వామ్య వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తూ, బహుళ జాతి సంస్థల కార్పొరేట్ పెట్టుబడులకు సేవ చేస్తున్న యుపిఎ (ఎన్‌డిఎ చేసే సేవ కూడ ఇదే) టిఆర్ఎస్ పాత్రను కుదించి వేస్తూ తెలంగాణకు అంగీకరించిన తీరు, ఆ తీరు వలన రేపు తెలంగాణలో దానికి లభించబోయే రాజకీయ ఆధిక్యత రేపటి తెలంగాణ ప్రభుత్వం ఇప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మంతటి ఆధ్వాన్న ప్రభుత్వంగానే ఉంటుందని అనుకోవడానికే ఆస్కారం ఉంది. ఇలాంటి పరిస్థితి ఉత్పన్నమైనప్పుడు ఇప్పటి తెలంగాణ ఉద్యమంలో పని చేసిన ప్రజాస్వామ్య శక్తులు ప్రజల్లో కల్పించిన చైతన్యం, ఆ చైతన్యంతో ముందుముందు జరగబోయే ఉద్యమాలే మళ్లీ ప్రజలకు శరణ్యమవుతాయి.

తెలంగాణ ఉద్యమంలో ప్రబలంగా పాల్గొన్న శక్తులుగా విద్యార్థులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు ఉన్నారు. ఉద్యమంలో ఈ శక్తులు ఏ ఆకాంక్షలకు సంకేతాలుగా కనిపించాయో ఆ ఆకాంక్షల పరిపూర్తి కొరకు రేపు క్రియాశీలకంగా పని చేస్తాయా? విద్యార్థి ఉద్యమానికి నాయకత్వం వహించిన కొంత మంది ఇప్పటికే రానున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని అన్ని అవలక్షణాలను కలిగి ఉన్న రాజకీయ పార్టీలలో చేరిపోయారు. కొంత మంది ఉద్యోగ నాయకులు, ఉపాధ్యాయ నాయకులు కూడ ఆ మార్గంలోనే తమ గమ్య స్థానాన్ని చేరుకున్నారు. ఇంకా చాల మంది పేర్లు వినిపిస్తున్నాయి. రాజకీయ నాయకులు కూడ ఒక పార్టీ నుండి మరో పార్టీలోకి తమ చిరునామాలను మార్చుకుంటున్నారు. ఇప్పుడు

తామున్న పార్టీలో టికెట్ దొరకదేమో అనే అపనమ్మకం ఉంటే, దొరుకుతుందనే హామీనో, నమ్మకమో ఉన్న పార్టీలోకి నాయకుల సంచారం కొనసాగుతోంది. కాంగ్రెస్, టిడిపి, టిఆర్ఎస్, బిజెపిల మధ్య ఈ ఆదాన ప్రదానాలు జరుగుతున్నాయి. ఈ పార్టీలన్నీ అనుసరిస్తున్న రాజకీయ విధానాల సారాంశం ఒకటేనని చెప్పడానికి ఈ ఒక్క సన్నివేశం చాలదా? తెలంగాణ కోసమే, ఉద్యమం కోసమే తానేర్పడ్డానని చెప్పుకుంటున్న టిఆర్ఎస్ కూడ మిగిలిన పార్టీల కంటే భిన్నమైనది కాదని అర్థం చేసుకోవడానికి కూడ ఈ సన్నివేశం సరిపోతుంది కదా? తెలంగాణ పట్ల ఉన్న ప్రేమా, అభినివేశమూ చాల మందిని టిఆర్ఎస్ వద్దకు తీసుకుని వెళ్లింది. తెలంగాణ విషయంలో కాంగ్రెస్ నిర్ణయం కీలకమయింది కావడం వలన, ఆ కాంగ్రెస్ అధినాయకత్వం తాను తెలంగాణకు అనుకూలమని (హైదరాబాదు పదేళ్లు ఉమ్మడి రాజధాని అనే షరతుతో, పోలవరం జాతీయ ప్రాజెక్టు అనే షరతుతో) ప్రకటించి నందువలన కూడ కొంత మంది కాంగ్రెస్ వద్దకు వెళ్లారు. తెలంగాణ ముఖ్యమంత్రి అభ్యర్థిత్వం విషయంలో జానారెడ్డికో, దామోదర రాజనర్సింహకో లభిస్తున్న ఆమోదాన్ని ఈ విధంగానే అర్థం చేసుకోవాలి కదా?

తాము తెలంగాణ కోసమే, తెలంగాణ ప్రజల కోసమే నని గట్టి పట్టుదలతోనే ఉద్యమంలో పాల్గొన్న ఉద్యోగులు రేపు తెలంగాణ రాష్ట్రంలో ప్రజల పట్ల సేవా దృక్పథాన్ని కలిగి ఉండి పని చేస్తారా? పురాణ కాలక్షేపం చేయకుండా తమ పని గంటలను పూర్తిగా తమ విధినిర్వహణకే ఉపయోగిస్తారా? అవినీతి, ఆశ్రిత పక్షపాతాలకు తావు ఇవ్వకుండా పని చేస్తారా? ఫైళ్లలో మెలికలు పెట్టి, ఆ ఫైళ్లతో ముడివడి ఉన్న ప్రజల జీవితాలను వడిపెట్టకుండ ఉంటారా? తెలంగాణ ఉద్యమంలో ఉద్యోగులు సంవత్సరాల తరబడిగా పాల్గొనడం, ప్రజల కోసం సకల జనుల సమ్మెలో పాల్గొనడం వారిలో ప్రజాసేవా భావాన్ని, అందుకవసరమైన చైతన్యాన్ని కల్పించాయా?

ఉద్యోగుల విషయంలో తలెత్తిన ప్రశ్నలన్నీ ఉపాధ్యాయులకు, అధ్యాపకులకు కూడా వర్తిస్తాయి. ప్రభుత్వ విద్యారంగం పట్ల ప్రజలకు విశ్వాసం పోవడానికి అనేక కారణాలు ఉన్నప్పటికీ, అందుకు తమ వంతు బాధ్యత ఎంతో గుర్తించి, ఆ లోపాన్ని ఉపాధ్యాయులు సవరించుకుంటారా? ప్రభుత్వ విద్యారంగమే ప్రజలకు సేవ చేస్తుందని, ప్రైవేట్ విద్యారంగం అంతిమంగా వ్యాపారమే చేస్తుందని గుర్తించి, ఆ ప్రజల కొరకు విద్యారంగ ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఉపాధ్యాయులు పోరాటం చేస్తారా?

9. ఒక అన్యాయానికి వ్యతిరేకంగా ఒక ఉద్యమం జరిగినపుడు ఆ ఉద్యమంలోనే అలాంటి అన్యాయం ఉండకూడదు. తెలంగాణ ఉద్యమం తన లక్ష్యాలుగా పెట్టుకున్న అనేక అంశాలలో ఆధిపత్య ధోరణి, అసమానతలు ఉన్నాయి. కాని తెలంగాణ ఉద్యమ నిర్మాణాల్లోనే, అందువలన అనివార్యంగా ఆ నిర్మాణాలు పని చేసే పద్ధతిలోనే, ఆధిపత్య ధోరణి కనిపించింది. తెలంగాణ ఉద్యమం బలమున్న వారి పోరాటమో, బలం సంతరించుకున్న వారి పోరాటమో, ఆ బలం ద్వారా తమ ప్రయోజనాలను నెరవేర్చుకునేందుకు, కాగూడదు. అదే జరిగినపుడు ఏ సమస్యలను పరిష్కరించుకోవడానికి తెలంగాణ ఉద్యమం వచ్చిందో, ఆ సమస్యలు తెలంగాణ వచ్చిన తరువాత కూడ ఉంటాయి. పీడకులు మాత్రం మారతారు. అన్యాయానికి వ్యతిరేకంగా చేసే పోరాటం ఉద్యమ నిర్మాణాల్లో కూడ ఒక విలువగా ఉన్నపుడు ఆ పోరాటం వలన లభించే ఫలితాలు ఆ పోరాటంలో పాల్గొన్న వారందరికి అందుతాయి.

1968 తెలంగాణ ఉద్యమం, 1972 ఆంధ్ర ఉద్యమం తరువాత ప్రభుత్వ ఉద్యోగాలకు సంబంధించి రాష్ట్రపతి ఉత్తర్వులు వచ్చాయి. రాష్ట్రపతి ఉత్తర్వులు ప్రభుత్వ ఉద్యోగాలను జిల్లా, జోనల్, రాష్ట్ర స్థాయి పోస్టులుగా మూడు రకాలుగా విభజించాయి. జిల్లా, జోనల్ స్థాయి పోస్టులలో నిర్దిష్ట పరిమితి మేరకు స్థానికులకు రిజర్వేషన్లను కల్పించాయి. రాష్ట్రపతి ఉత్తర్వులలోనే ఉన్న అసంబద్ధతలు, వాటి అమలులో జరిగిన అవకతవకలు విడిగా చర్చించదగినవి. ఉద్యమాలలో ఆ చర్చ జరిగింది.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తరువాత రాష్ట్రపతి ఉత్తర్వులు ఉండవు. రాష్ట్రపతి ఉత్తర్వులు ఉండకపోతే ప్రభుత్వ ఉద్యోగాల్లో స్థానికులకు ఇప్పుడు అమలవుతున్న రిజర్వేషన్లు ఉండవు. అప్పుడు తెలంగాణలో వెనుకబడిన జిల్లాల్లోని విద్యావంతులు ప్రభుత్వోద్యోగాలను పొందడంలో వివక్షకు గురవుతారు.

ఇప్పటి వరకు కొనసాగిన తెలంగాణ ఉద్యమంలో చాల భాగం 610 ఉత్తర్వులను అమలు చేసే క్రమంలో, రాష్ట్రపతి ఉత్తర్వులు జిల్లా స్థాయి పోస్టుల విషయంలో తెలంగాణలోని పది జిల్లాలను పది జిల్లాలుగా గుర్తించాయని, జోనల్ పోస్టుల విషయంలో రెండు జోన్లుగా, కొన్ని శాఖలకు సంబంధించి హైదరాబాదు సిటీ కేడర్‌ను ప్రత్యేకంగా గుర్తించాయని అంగీకరించడానికి సిద్ధపడలేదు. తెలంగాణలో అంతర్గతంగా జిల్లాల మధ్య ఉన్న అసమానతలను గుర్తించడానికి సిద్ధపడకపోవడం వలన ఇది జరిగింది. ఇట్లా అంతర్గత అసమానతలను గుర్తించక పోవడం పాలక వర్గ దృక్పథ పర్యవసానం.

ఈ దృక్పథంలో మార్పు రాకపోతే ప్రభుత్వోద్యోగాల విషయంలోనే కాదు, విద్య, వైద్యం, సాగు నీరు, తాగు నీరు, మౌలిక వసతుల కల్పన, పరిశ్రమలు మొదలైన విషయాలన్నింటిలో ఆధిపత్యం, వివక్ష అనే ధోరణులు తెలంగాణ రాష్ట్రంలో కూడ కొనసాగుతాయి. ఈ ప్రమాదాలను ముందుగానే గుర్తించి, వాటిని నివారించడానికి ముందుగానే తగిన ఏర్పాట్లు చేసుకోకపోతే తెలంగాణ రావడమనేది ఇంటి దీపమని ముద్దాడినట్లుగా ఉంటుంది.

తెలంగాణ ఉద్యమంలో చాల భాగం ఈ అసమానతలను, అందువలన వచ్చే ప్రమాదాలను గుర్తించే దృక్పథాన్నే కలిగి లేదు. కాబట్టి అది ముందు జాగ్రత్తల గురించి ఆలోచిస్తుందని అనుకోలేం. ఈ ప్రమాదాన్ని గుర్తించిన వారు తెలంగాణ ఏర్పడిన తరువాత కూడ రాష్ట్రపతి ఉత్తర్వుల లోని ఏర్పాటు వంటి ఒక ఏర్పాటును రాజ్యాంగ బద్ధంగానే కల్పించుకుంటేనే తప్ప బలహీనులు, వెనుక బడిన ప్రాంతాలు వివక్షకు గురి కావడం కొనసాగుతూనే ఉంటుంది.

ఇలాంటి సమస్యలు మన ముందుకు వచ్చినపుడు ప్రజాస్వామ్య తెలంగాణ అనే భావనకున్న ప్రాధాన్యం ఏమిటో బాగా అర్థమవుతుంది. అందుకోసం జరగవలసిన ఉద్యమాలు, ఆ ఉద్యమాలు సాధించవలసిన ఫలితాలు మన ముందు నిలువెత్తు కర్తవ్యాలుగా నిలబడతాయి. ఇల్లలుకగానే పండగ కాదన్నట్లుగా తెలంగాణ రాగానే అంతా అయిపోలేదు. ఇప్పుడే మనం చేయవలసింది చాల ఉంది. రేపు మనం నిందించడానికి సీమాంధ్రులు ఉండరు. ఇది మన మధ్యనే జరగవలసిన పోరాటం. ఇది కష్టతరమైన పోరాటం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# 'రాష్ట్ర విభజన' - మూడు ప్రాంతాల ప్రజాభిప్రాయాలు

***జూలై 30 కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మాన నేపథ్యంలో వీక్షణం మూడు ప్రాంతాలలో సాధారణ ప్రజల అభిప్రాయాలను సేకరించడానికి ప్రయత్నించింది. సెప్టెంబర్ సంచికలో పదకొండు జిల్లాల ప్రజాభిప్రాయాలను ప్రచురించాం. మిగిలిన జిల్లాల ప్రజాభిప్రాయాలను అందిన మేరకు ప్రకటిస్తున్నాం. - సం.***

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీసుకున్న నిర్ణయం మంచిదే. పరిపాలనా సౌలభ్యం కొరకు చిన్న రాష్ట్రాల ఏర్పాటు అవసరం. అంబేద్కర్ ఆలోచన దృక్పథం కూడా అదే. అయితే విభజన ప్రక్రియ సక్రమంగా జరగకపోవడం వల్లే సీమాంధ్ర ప్రజలు భయాందోళనకు గురవుతున్నారు. ఆర్థిక, సామాజిక అవసరాలను దృష్టిలో పెట్టుకొని సమ న్యాయంతో విభజన జరగాలి. రాష్ట్ర విభజనను హైదరాబాద్‌తో ముడిపెట్టవలసిన అవసరం లేదు. అది తెలంగాణదే. సమైక్యాంధ్ర ఉద్యమం వల్ల ప్రభుత్వ రంగంలోని ఎస్.సి, ఎస్.టి, బి.సి, మైనారిటీ పేద విద్యార్థులకు తీరని నష్టం జరుగుతుంది.

– ***పురిమిట్ల నారాయణ,*** ఎం.ఎ, ప్రైవేటు ఉద్యోగి, కావలి

కాంగ్రెస్ పార్టీ తీసుకున్న నిర్ణయం ఎట్టి పరిస్థితుల్లోనూ కరెక్ట్ కాదు. సీమాంధ్రలో రాజధాని ఏర్పాటు విషయంలో కేంద్రం చెప్పినంత సులువుగా నిధులు ఇవ్వరు. గతంలో ఏర్పాటు చేసిన రాష్ట్రాలకు జరిగింది అదేకదా! అందులో లక్షల కోట్ల అప్పుల్లో ఉన్న కేంద్రం రాజధాని ఏర్పాటుకు నిధులు ఎక్కడి నుండి తెస్తుంది. నీటి సమస్య వస్తుంది. ఇప్పుడు మహారాష్ట్రలోనూ, ఆంధ్రప్రదేశ్‌లోనూ కాంగ్రెస్ ప్రభుత్వాలు ఉన్నప్పుడే మహారాష్ట్ర వాళ్లను ఒప్పించలేకపోయాము. తెలంగాణలో కాంగ్రేసేతర ముఖ్యమంత్రి వస్తే పరిస్థితి ఏమిటి? విస్తీర్ణంలో చిన్నదైన తమిళనాడు అభివృద్ధి చెందింది. మొదటి నుండి కేంద్రానికి మన రాష్ట్రం అంటే చిన్న చూపు ఉంది. నెహ్రూ నుండి ఇందిరా గాంధీ దాకా ఇదే జరిగింది.

– ***మందాడి వెంకటేశ్వర్లు,*** వ్యాపారి, కావలి

అంతా కలిసి ఉంటే బాగుంటుందనేది నా కోరిక. నా పిల్లవాడు ఇప్పుడు హైదరాబాద్‌లో సిఎ చదువుతున్నాడు. ఇప్పుడు పంపినంత ధైర్యంగా తరువాత పంపలేము కదా! పిల్లల ఉద్యోగాలు ఇబ్బంది కరమంటున్నారు. నీళ్ల సమస్య ఉంటుందంటున్నారు. కె.సి.ఆర్ ఇప్పుడు వేలు ఎత్తి హెచ్చరిస్తున్నాడు. రేపు మెట్టితో (కాలితో) తన్నీ తరుముతారు.

– ***షేక్ కరీముల్లా,*** ప్రభుత్వ ఉద్యోగి, కావలి

సైద్ధాంతిక ప్రాతిపదికలేని అనేక రాజకీయ పార్టీల అవకాశవాద నాటకాలకు ముగింపుగా, తనవంతు పాత్రపోషిస్తూ, కాంగ్రెస్ తెలంగాణ విభజన నిర్ణయాన్ని ప్రకటించింది. దీర్ఘకాల సమస్యను పరిష్కరించాలనే ఆకాంక్షతో అలా చేసిఉంటే అది హర్షణీయమే. కాని రాష్ట్ర ప్రజలను సంసిద్ధులను చేయకుండా (విభజన నేపథ్యాన్ని వివరించకుండా) విభజించాలని నిర్ణయించడం భాధ్యతా రాహిత్యమే. ప్రస్తుతం దేశం అనేక ఆర్థిక, రాజకీయ సమస్యలు ఎదుర్కొంటోంది. ఈ తరుణంలో వాటికి పరిష్కారం ముందుగా చూడకుండా, రాష్ట్రాల పునర్విభజన లాంటి సమస్యను రెచ్చగొట్టడం రాజకీయ అంశాలపై స్పష్టత, అవగాహన లేని నాయకత్వాన్ని సూచిస్తుంది.

– ***టి.వి. రమణ,*** లెక్చరర్, కావలి

ఢిల్లీవాళ్లు తీసుకున్న నిర్ణయం ఎంతవరకు మంచితో నాకు తెలియదు. కాని నమ్మకం కోల్పోయినప్పుడు విడిపోవడమే మంచిది. విడిపోతామంటున్నవారిని కలిసుండమని కోరుకోవడమంటే అందులో ఏదో స్వార్థం ఉన్నట్లే లెక్క. ఇంతదాకా వచ్చినాక రాష్ట్రాన్ని విభజించడమే మేలు. ఆలస్యం చేయకుండా నిర్ణయం అమలు చేయడమే మేలు.

– ***నత్తల నాగవేణి,*** గృహిణి, కావలి

మనందరం తెలుగువాళ్లమే కదా! ఇన్ని వివక్షలు ఎందుకు? కాకపోతే తెలంగాణ వెనకబడి ఉంటే వాళ్లకు అదనంగా ఉద్యోగావకాశాలు, కొన్ని అదనపు మొత్తాలను ఇస్తే సరిపోతుంది. వెనకబడి ఉన్నారు కాబట్టి ప్రభుత్వమే ఆరకంగా చేయాలి. అలా కాకుండా భవిష్యత్‌లో ఇంకా మరిన్ని రాష్ట్రాలు ఏర్పడే అవకాశం ఉంటుంది. అది మనకు నష్టం. ఒక రాష్ట్రం అభివృద్ధి చెందాలంటే పన్నులు వేయక తప్పదు. అదంతా మనమే భరించాల్సి వస్తది కదా! రెండు ప్రాంతాల ప్రజలు ఇబ్బంది పడతారు.

– ***కాపులూరి రాధ,*** గృహిణి, వైకుంఠపురం, కావలి

(సేకరణ **డా. శ్రీనివాసరావు చొప్పర,** కావలి, నెల్లూరు)

ఇప్పుడు జరుగుతున్న తెలంగాణ, సమైక్యాంధ్ర వాదుల సవాళ్లలో రాజకీయ నాయకుల జోక్యం లేకుండా మేధావుల ద్వారా చర్చలు జరిపి నిష్పక్షపాతంగా ఇరువురికి నష్టం జరగకుండా విభజించినట్లైతే పరిష్కారం దొరుకుతుంది. తెలంగాణ సమస్య దీర్ఘకాలమయింది కనుక ఆ సమస్యను పరిష్కరించుట ఇరువురికి మేలు. మూడు ప్రాంతాల నిస్పక్షపాత మేధావులతో చర్చించి నిర్ణయాలు తీసుకోవాలి.

– ***మెరెడ్డి శ్రీనివాసులు రెడ్డి,*** వ్యాపారి, ఉదయగిరి

ఇప్పుడు రాష్ట్రంలో జరుగుతున్న ఉద్యమాలు పెద్దవాళ్లకి సంబంధించినవే కాని పేదలకి సంబంధించినవి కాదు. వాళ్ల ఆస్తుల్ని కాపాడుకోవడానికి ఇంకా పెద్దవి చేసుకోవడానికి మాత్రమే కాని హైదరాబాద్‌లో పెట్టిన సొమ్ము తమకు చెందకుండా పోతుందనే తపనతోనే వాదుకొంటున్నారు తప్ప ఇంకేమి ప్రయోజనం లేదు. న్యాయంగా ఆలోచిస్తే హైదరాబాదు తెలంగాణ వారికి చెందాలి కదా. ఊళ్లో వాళ్ల స్థలం ఆక్రమించి ఇల్లు కడితె ఎట్లా ఉంటుంది.

– ***కర్రా తిరిపాలు,*** వ్యవసాయ కూలి, ఉదయగిరి

హైదరాబాదును ఉమ్మడిగా వాడుకుంటె మంచిది కదా. వాళ్ల తెలంగాణ వాళ్లకి ఉంటుంది. మనకు హక్కు లేకుండా చేస్తే ఎట్లా విభజించాల్సిందే గాని హైదరాబాద్‌లో మనకు హక్కు ఉండాలి కదా. ఇక కలిసి ఉండలేమంటే ఇస్తేనే పోతుంది.

– ***బకిరు హజరత్తయ్య,*** రైతు, ఉదయగిరి

(సేకరణ **సుబ్బానాచారి,** ఉదయగిరి, నెల్లూరు)

# ప్రాంతీయ సమస్యలపై వీక్షణంలో వ్యాసాలు

**2004 జూన్**

1. తెలంగాణకు ఏం కావాలి? – ఎన్. వేణుగోపాల్
2. తెదేపా ఓటమి తెలంగాణ ప్రజల చైతన్యానికి ప్రమాణం– లియో అగస్టీన్

**2005 ఫిబ్రవరి**

3. ఆ నేల మాఫియాలనెందుకు కంటోంది? అనంతపురం రాజకీయార్థిక చిత్రం– ఎన్. వేణుగోపాల్
4. అనంతపురం అభివృద్ధి వెలుగు నీడలు – ఎన్. వేణుగోపాల్

**మే – జూన్**

5. వై.ఎస్. ఏడాది పాలనలో తెలంగాణ – ఎం. కోదండరాం

**అక్టోబర్**

6. సెప్టెంబర్–17, తెలంగాణ చరిత్రలో కీలక ఘట్టం – ఎం.కోదండరాం
7. తెలంగాణ 'అభివృద్ధి సమస్య' మాత్రమేనా? – నాగోబా

**డిసెంబర్**

8. తెలంగాణ రాజకీయోద్యమ గమనంలో ఒడిదుడుకులు – నాగోబా
9. పోలవరం: ఆదివాసి గ్రామాల అంతార్ధానం–బిర్సు

**2006 జనవరి**

10. ప్రత్యేక రాష్ట్ర సాధనలో చత్తీస్‌గడ్ అనుభవాలు – నాగోబా
11. ప్రత్యేక తెలంగాణ – సమగ్ర సామాజిక విప్లవం – వెన్నెలకంటి రామారావు

**ఫిబ్రవరి**

12. ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ అసమానతలు – డా ఇమ్మానేని సత్యసుందరం

**ఏప్రిల్**

13. పోలవరం : ఉత్తర తెలంగాణ మరో సోమాలియా కానుందా – చిక్కుడు ప్రభాకర్
14. సమైక్య – ప్రాంతీయ వాదాలు – తెలంగాణ – ఎన్. వెంకటేశ్వర్లు
15. యాభై ఏండ్ల నిర్లక్ష్యం తెలంగాణ నీటి సమస్యలు– ఆర్. విద్యాసాగర్ రావు

**మే**

16. తెలంగాణ ప్రాంతీయ సంఘం పునరుద్ధరణ ఇవాళ్టి అవసరం – ఎస్. శ్రీధర స్వామి
17. రంగారెడ్డి జిల్లా – వెలుగు వెనుక చీకట్లు – పి. శ్రీనివాసులు నాయుడు

**జూలై**

18. నైజాం రాజ్యంలో ప్రజా ఉద్యమంపై ప్రభుత్వ దాడి – దేవులపల్లి వెంకటేశ్వర రావు
19. తెలంగాణ సాయుధ పోరాటం – భూమి సమస్య – రాజ్ బహదూర్
20. అమరజీవి కోమరయ్య! అందుకో జోహార్లు – కందిమళ్ల ప్రతాపరెడ్డి
21. తెలంగాణ రైతాంగ పోరాటం – ఇవాళ్టి ప్రశ్నలు – ఎన్. వేణుగోపాల్
22. విమోజనోద్యమ యోధులకు దక్కుతున్న గౌరవం – కొణతం దిలీప్
23. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట పరిశోధన ఒక అసంపూర్ణ సూచి

**సెప్టెంబర్**

24. మళ్లీ చౌరస్తాలో తెలంగాణ – సంపాదకీయం
25. ప్రత్యామ్నాయ ఉద్యమానికి కదులుతున్న తెలంగాణ – నాగోబా

**అక్టోబర్**

26. యాభై ఏళ్లు నిండిన ఆంధ్రప్రదేశ్ భవిత్యం? – సంపాదకీయం
27. ప్రాంతీయ అసమానతలు – కొన్ని సైద్ధాంతిక సమస్యలు – ఎన్. వేణుగోపాల్
28. వెనుకబాటు తనం ప్రజల పాపం కానే కాదు – దుప్పల రవి కుమార్
29. అభివృద్ధికి నోచుకోని పౌరుషాల పలనాడు – సి.ఎచ్. ఎల్.ఎన్. మూర్తి
30. చారిత్రకంగా, రాజకీయంగా మోసపోతున్న రాయలసీమ – ప్రొ. ఎస్. శేషయ్య
31. తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వం – అన్యాయాల చరిత్ర – రాజవరం పార్థసారథి
32. సమైక్య ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ వ్యత్యాసాలు – జె. శివరామ్
33. అభివృద్ధికి భౌగోళిక అవకాశాలు – టి. వివేక్
34. పోరుబాట పట్టిన తెలంగాణ – నాగోబా

**నవంబర్**

35. పాలక వర్గాలకు పట్టని హైదరాబాద్ సుస్థిర పట్టణాభివృద్ధి – ఎం. వేదకుమార్
36. ఔటర్ రింగ్ రోడ్ – ఒక మానవ విధ్వంస రచన – ఎస్. జీవన్‌కుమార్
37. పెరుగుతున్న హైదరాబాద్ మహానగరం – డా. సి. రామచంద్రయ్య
38. చిచ్చం నుంచి సైబరాబాద్ దాకా – ఎన్. వేణుగోపాల్
39. యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ – విజయాలు వైఫల్యాలు – అభిప్రాయ మాలిక
40. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే – దుర్గం రవీందర్
41. ప్రజలు పాల్గొనని ప్రత్యేక తెలంగాణ ఉద్యమం– వి. హనుమంతరావు

**డిసెంబర్**

42. తెలంగాణ చరిత్రంతా ప్రజా పోరాటాల చరిత్రే – చిక్కుడు ప్రభాకర్

---

ఎప్పటినుంచో అడుగుతున్నారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఇవ్వచ్చు. అన్నదమ్ములు విడిపోయినట్లే ఇది కూడా. హైదారాబాద్‌దే సమస్య. హైదారాబాద్ పై అందరికి హక్కుఉంది. ఉద్యోగులకు హైదరాబాద్‌లో రక్షణ ఉండాలి. పనిచేసేవారికి భద్రత కల్పించాలి. ప్రపంచ దేశాల్లో హైదరాబాద్‌కు గుర్తింపు వచ్చేలా తయారు చేశారు మనోరు. కాబట్టి అది అందరికి దక్కేలా చూడాలి. అన్ని విడిచిపెట్టి వెళ్లాలంటే కష్టంగా ఉంటుంది. కె.సి.ఆర్ లాంటి రాజకీయనాయకుల మాటలు సరిగా లేవు. అన్ని పరిశ్రమలు, కంపెనీలు ఒకే దగ్గర పెట్టడంవల్ల ఈ సమస్య వచ్చింది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. సీమాంధ్రలోనైనా పరిశ్రమలు, కంపెనీలు అన్ని జిల్లాలకు విస్తరించేలా చేయాలి. తెలంగాణ రాష్ట్రం ఇస్తే కేంద్రం సీమాంధ్రను చిన్న చూపు చూడకూడదు.

*– **వంగపండు రాజేంద్రప్రసాద్** (40) ఆర్మీ ఉద్యోగి, పెదబొండపల్లి*

రాష్ట్రాన్ని ముక్కలు చేయవద్దు. చిన్న రాష్ట్రాల్లో అభివృద్ధి జరగదు. ప్రగతి కావాలంటే రాష్ట్రం విడిపోకూడదు. హైదరాబాద్ అందరిది. సమైక్యాంధ్ర కోసం ఎన్ని త్యాగాలైనా చేస్తాం. సాదించుకుంటం.

*– **చుక్క తిరుపతి రావు** (38) ప్రభుత్వ ఉద్యోగి, కురుపం*

రాష్ట్రం సమైక్యంగా ఉండాలి. అందుకు ఎంత ఉద్యమమైనా చేయడానికి సిద్ధం. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రానికి నేను వ్యతిరేకం. రాష్ట్రాన్ని ముక్కలు చేస్తే నిరుద్యోగులకు ఉద్యోగాలు రావు. ఒకవేళ విడిపోతే హైదరాబాద్‌పై అందరికి హక్కు ఉంటేలా చేయాలి.

*– **బంకురు రవికుమార్** (21) విద్యార్థి, పెదపెంకి*

తెలంగాణ రాష్ట్రం కేంద్రం ఇచ్చేస్తే హైదరాబాదును మట్టుకు ఉమ్మడి రాజధానిగానే ఉంచాలి. సీమాంధ్ర ప్రజలందరికి హైదరాబాద్‌లో రక్షణ ఉండాలి. అలా చేయకుంటె రాజకీయ నాయకులకు బుద్ధిచెబుతాం.

*– **తవుడు నాగిరెడ్డి** (60) వ్యాపారి, పాల్తేరు*

(సేకరణ **దత్తి సుధాకర్**, బొబ్బిలి, విజయనగరం)

**2007 జనవరి**
43. ప్రత్యేక తెలంగాణ లక్ష్య సాధన దిశలో – జి. ప్రభాకర్
**ఫిబ్రవరి**
44. ప్రత్యేక తెలంగాణ, ప్రజాస్వామ్య తెలంగాణ అయ్యేనా? – అరుణ్
**మార్చ్**
45. ప్రత్యేక తెలంగాణ – వలసాంధ్ర పాలకుల మోసాల చరిత్ర – ఎన్. వెంకటేశ్వర్లు
**ఏప్రిల్**
46. తెలంగాణకు రక్షణలు విస్మరిస్తే సమైక్య ఆంధ్రకు ప్రాతిపదికే లేదు – మండగడ్డ విక్రం కుమార్
**మే**
47. తెలంగాణ – అంబేద్కర్ – నాగం కుమార స్వామి
**జూన్**
48. తెలంగాణ – బాబ్లీ ప్రాజెక్టు – రఘువీర్
**జూలై**
49. నీటి పారుదల పథకాలు – వివాదాలు – చెరుకూరి వీరయ్య
50. కృష్ణా జలాలపై సీమ హక్కులు – కె. రామిరెడ్డి
51. నీళ్లు ఎవరివి? బీళ్లు ఎవరివి – నాగోబా
52. జలయజ్ఞమా? జలజగడమా – ఆర్. విద్యాసాగర్‌రావు
53. జల రాజకీయాలు – ప్రాంతీయ అసమానతలు – కె. బాలగోపాల్
**సెప్టెంబర్**
54. తెలంగాణ సాగునీటికి సూక్ష్మ సేద్యమే పరిష్కారమా? – ఎం. కోదండరాం, కె. సీతారామారావు
**అక్టోబర్**
55. పోలవరం పనులతో నరకం– జి. రమేష్
56. 1948 సెప్టెంబర్ పరిణామాలు– వరవరరావు

**2008 ఫిబ్రవరి**
57. తెలంగాణపై సాంస్కృతిక దాడి – డా. గోపు లింగారెడ్డి
58. తెలంగాణ – ఇటీవలి పరిణామాలు – నాగోబా
59. ఆంధ్రప్రదేశ్‌లో సమ్మిళిత అభివృద్ధి – ఎస్. మహేంద్రదేవ్
**మార్చ్**
60. మళ్లీ తెలంగాణ – సంపాదకీయ వ్యాఖ్య
**ఏప్రిల్**
61. తెలంగాణ కదలిక – సంపాదకీయ వ్యాఖ్య
62. టి.ఆర్.ఎస్. రాజీనామాలు – తదనంతర పరిణామాలు – నాగోబా
**మే**
63. తెలంగాణ: అభివృద్ధి మంత్రం– కమిటీతంత్రం – మాడభూషి శ్రీధర్
**జూన్**
64. ఉప ఎన్నికలు – సంపాదకీయం
65. రాజకీయ ఉద్యమంగా స్థిరపడిన తెలంగాణ – నాగోబా
**సెప్టెంబర్**
66. నగరం మార్పు ఎటు నుంచి ఎటు? – ఎన్. వేణుగోపాల్
**అక్టోబర్**
67. కొత్త దుర్మార్గం కోస్తా కారిడార్–సంపాదకీయం
68. పోటీ రాజకీయాలతో తెలంగాణకే లాభం – ఎం. కోదండరాం
**డిసెంబర్**
69. ఎన్నికల అంశంగా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం– ఆకుల భూమయ్య
70. రాబోయే ఎన్నికల్లో తెలంగాణనే కీలకం–శ్రీధర్ దేశ్‌పాండే
71. తెలంగాణ అనుకూల పరిస్థితి–కోదండరాం
72. బాక్సైట్ కోస్తా కారిడార్ యుద్ధం – ఎం. నాగరత్నం

**2009 జనవరి**
73. కోస్తా ప్రజలకు కారిడార్ చిచ్చు – ఎం. శ్రీనివాసరావు
**ఫిబ్రవరి**
74. జ్యోతిష్యంతో తెలంగాణ వచ్చేనా? – కె. ప్రభాకర్
75. ప్రత్యేక రాయలసీమ ఏర్పాటు – మహమ్మద్ షఫీయొద్దీన్, దేవాత్ సురేశ్
76. వివక్షల గురవుతున్న రాయలసీమ – ఎ. రంగారెడ్డి
**మార్చ్**
77. ఎన్నికల చక్రబంధంలో తెలంగాణ – డా. జి. లచ్చయ్య
78. కోస్తా కారిడార్ – పర్యావరణ సమస్యలు – ఎం. శ్రీనివాసరావు
**మే**
79. ప్రాంతీయ విద్వేషాలు – సంపాదకీయ వ్యాఖ్య
80. నలభై ఏళ్ల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – వరవరరావు
81. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – ఒక పరిశీలన – ఆకుల భూమయ్య
82. తెలంగాణ ఉద్యమాన్ని ఎట్లా చూడాలి – ఎం. కోదండరాం
83. ప్రత్యేక తెలంగాణకు నలభై ఏళ్లు – ఎన్. వేణుగోపాల్
84. అవును, తెలంగాణలో మీరు విదేశీయులే! – పిట్టల రవీందర్
**జూన్**
85. ఓడింది తెలంగాణ కాదు, తెరాస వ్యూహం! – ఎం. కోదండరాం
86. తెలంగాణ రైతు కరెంట్ కష్టాలు – పిట్టల రవీందర్
**నవంబర్**
87. 'జన తెలంగాణ, రాష్ట్రం ఏర్పాటు – టి. శ్రీరామమూర్తి
88. దళితులను దగా చేస్తున్న కాకినాడ సెజ్ – నక్కా హేమావెంకట్రావ్
**డిసెంబర్**
89. కళింగాంధ్రకు విద్యుత్తు విపత్తు – సమత

**2010 జనవరి**
90. కూడలిలో తెలుగు జాతి భవిష్యత్తు – సంపాదకీయం
91. ఈ విద్వేషాలు అవాంఛనీయం – ఎన్. వేణుగోపాల్
92. సమైక్యాంధ్ర ఆందోళన ఎందుకోసం – కె. ప్రభాకర్
93. సీమ నాయకుల సమైక్య పాత్ర – పాణి
94. కాంగ్రెస్‌దంతా మోసాల చరిత్రే – ఎం. రాఘవాచారి
**ఫిబ్రవరి**
95. ఈ సాచివేత ఎంతకాలం? – సంపాదకీయం
96. విధానం వికేంద్రీకరణ, ఆచరణ కేంద్రీకరణ – వి. హనుమంతరావు
97. ఆత్మహత్యలు పరిష్కారాలు కావు – ఎ. అన్నపూర్ణ
98. రాష్ట్రంలో ఆందోళనల దిశ ఎటు – ఎడ్ల పోచయ్య
99. ప్రజా ఉద్యమంగా తెలంగాణ – కె. సుబ్బనాచారి
**మార్చ్**
100. సమస్య పరిష్కారానికేనా శ్రీకృష్ణ? – సంపాదకీయం
101. ఉద్యమంలో ఆత్మహత్యలు – భిన్న పార్శ్వాలు – బి. రామకృష్ణ
102. మానసిక ఐక్యత ముఖ్యం – చలసాని శ్రీనివాస్
103. రాయలసీమ అస్తిత్వాన్ని గుర్తించాలి – పాణి
104. బలమైన కారణం ఉంటే చిన్న రాష్ట్రాలు – డా. ఇమ్మానేని సత్యసుందరం
105. చిన్న రాష్ట్రాలు అభివృద్ధి నిరోధకాలా? – డా. జి. లచ్చయ్య
106. చిన్న రాష్ట్రాలు– అనుకూల, ప్రతికూల వాదనలు – ఎన్. వేణుగోపాల్
107. ఆత్మహత్యలు కావు, మనం చేస్తున్న హత్యలు – ఎడ్ల పోచయ్య
**ఏప్రిల్**
108. రాజకీయ సంకెళ్లలో తెలంగాణ – కె. ప్రభాకర్
109. తెలంగాణ ఉద్యమం – కొత్త సవాళ్లు – ఎడ్ల పోచయ్య
110. ప్రాంతీయ అసమానతలు; ప్రత్యేక రాయలసీమ – అంగడి రంగారెడ్డి
111. రాయల సీమ అస్తిత్వాన్ని గుర్తించాలి – పాణి
**మే**
112. లోలోపల రాజుకుంటున్న రాష్ట్రం – సంపాదకీయం
113. తెలంగాణ ఉద్యమం–ఆలోచించాల్సిన అంశాలు – పులుగుజ్జు సురేష్
114. ప్రజాస్వామిక తెలంగాణ – లంబాడీలు – పోరిక ఉదయసింగ్ నాయక్
115. రాయలసీమ వెనుకబాటు – కొన్ని ప్రశ్నలు – డా. కృష్ణమూర్తి, డా. మాధవ స్వామి
116. రాయలసీమకు తెలంగాణ తేజం ఎప్పుడు – అంగడి రంగారెడ్డి

**జూన్**
117. తెలంగాణపై ఎవరి అభిప్రాయాలు అవసరం? – కడియాల సుబ్బనాచారి
118. రాయలసీమ వెనుకబాటు వెనుక – రాయలసీమ విద్యావంతుల వేదిక

**సెప్టెంబర్**
119. తెలంగాణ – ప్రత్యామ్నాయ రాజకీయాలు – పిట్టల రవీందర్
ఆత్మహత్యలను ఆపలేమా – డా. జి. లచ్చయ్య

**అక్టోబర్**
120. తెలంగాణ ఉద్యమం – సీమాంధ్ర మీడియా – పిట్టల రవీందర్
121. రాష్ట్రం అడిగితే దేశద్రోహమా? – చిక్కుడు ప్రభాకర్

**నవంబర్**
122. ఎన్.టి. ఆర్. పాలన – ప్రజా ద్రోహ చరిత్ర – వరవరరావు
123. యాభై నాలుగేళ్ల ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు – చలసాని శ్రీనివాస్
124. వలస దోపిడి కేంద్రం సింగరేణి – పిట్టల రవీందర్
125. తెలంగాణ ప్రజా ఫ్రంట్ ఆవిర్భావం – ఆకుల భూమయ్య
126. తెలంగాణ సాధనకు మరో ప్రయత్నం – ఆర్. ఎస్. చౌహన్

**డిసెంబర్**
127. పోలవరం ప్రాజెక్టుపై పునరాలోచించాలి – మెరుగు రాజయ్య

**2011 జనవరి**
128. ప్రజల కోసం ప్రత్యేక తెలంగాణ – జంజర్ల రమేష్

**ఫిబ్రవరి (ఫోకస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక)**
129. పరిష్కారానికే శ్రీకృష్ణ కమిటీ – సంపాదకీయం
130. శ్రీకృష్ణ కమిటీ నివేదిక – వి. హనుమంతరావు
131. శ్రీకృష్ణ కమిటీ నివేదిక – పూర్వ పరాలు – ఆర్. ఎస్. చౌహన్
132. శ్రీకృష్ణ కమిటీ కాదు, దుగ్గల్ కమిటీ ఇది – మాడభూషి శ్రీధర్
133. పరిష్కార మార్గాలు ఆలోచించాలి – చలసాని శ్రీనివాస్
134. తప్పుల తడక కమిటీ నివేదిక – శ్రీధర్ రావు దేశ్‌పాండే

**మార్చ్**
135. తెలంగాణకు కావలసింది మిలిటెంట్ పోరాటాలు – ఆత్రం రామారావు
136. తెలంగాణ – సహాయ నిరాకరణ – యాటెల్లి రామచంద్రం
137. మర్ల పోలమ్మ స్ఫూర్తితో ఉత్తరాంధ్ర మహిళ – కె. ఎస్. మల్లీశ్వరి

**ఏప్రిల్**
138. మిలియన్ మార్చ్, విధ్వంసం, ఎనిమిదో అధ్యాయం – సంపాదకీయం
139. మిలియన్ మార్చ్‌కు కోటి వందనాలు – ఎస్. కిశోర్ కుమార్
140. తెలంగాణ ఉద్యోగుల స్ఫూర్తి – కె. ప్రభాకర్
141. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం – ఎం. సర్దార్, మామిడాల శ్యాం సుందర్, మునుకుంట్ల శ్రీనివాస్

**మే**
142. అప్రజాస్వామిక ఉత్తర్వు – జి.ఒ. 177 – లోకే రాజ్‌పవన్
143. బయటపడిన శ్రీకృష్ణ రెండో నాలుక – మాడభూసి శ్రీధర్
144. ఉత్తరాంధ్ర వెలుగు నీడలు – పి. కృష్ణారావు
145. తెలంగాణానంతర దిశలో ఆలోచిద్దాం – సుధా కిరణ్

**జూలై**
146. నా విద్యాలయం – తెలంగాణ ఆకాంక్ష – కొత్తపల్లి జయశంకర్
147. ఉత్తరాంధ్ర ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా – పి. కృష్ణారావు
148. మానుకోట నుండి మిలియన్ మార్చ్ దాకా – పిట్టల రవీందర్
149. విశాలాంధ్రలో ప్రజారాజ్యంలో ఏముంది? ఆర్.జె. రాంపల్లి

**నవంబర్**
150. మేధావులకు సకల జనుల సమ్మె పాఠాలు – సంపాదకీయం
151. సకల జనుల సమ్మె, విజయాలు – వైఫల్యాలు – శ్రీధర్ దేశ్‌పాండే
152. చిత్తశుద్ధిలేని పోరాటం – డా. ప్రబంజన్ యాదవ్
153. సకల జనుల సమ్మె – సామాన్యుల ఇబ్బందులు – చలసాని శ్రీనివాస్
154. సకల జనుల సమ్మెను ఎలా చూడాలి – ఎన్. వేణుగోపాల్
155. తెలంగాణ – సంఘపరివార్ ఎజెండా – వరవరరావు

**డిసెంబర్**
156. తెలంగాణ, కరువు, సిబిఐ, విచారణలు, రచ్చబండ – సంపాదకీయం
157. రెండేళ్ల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – సి. కాశీం
158. కాగల కార్యం తీర్చిన సకల జనుల సమ్మె – గొడితాల వెంకటేశ్వర్లు

**2012 జనవరి**
159. సకల జనుల సమ్మె రూపసారాలు – వరవరరావు
160. సకల జనుల సమ్మెలో సింగరేణి – పిట్టల రవీందర్
161. సకల జనుల సమ్మెలో ఉపాధ్యాయుల పాత్ర – కె. వేణుగోపాల్
162. కళాంధ్ర ఎదుట పెను సవాళ్లు – దుప్పల రవికుమార్
163. చిన్న రాష్ట్రాలకు అంబేద్కర్ అనుకూలమే – లోకే రాజ్‌పవన్

**ఫిబ్రవరి**
164. తెలంగాణ– ఓ మరణక్షేత్రం – జి. లచ్చయ్య
165. భాషా రాష్ట్రాలపై అంబేద్కర్ – ఎం. కృష్ణ ఆదిత్య

**మార్చ్**
166. భాషా రాష్ట్రాలపై అంబేద్కర్ – లోకే రాజ్ పవన్

**ఏప్రిల్**
167. వరంగల్ డిక్లరేషన్ – పొడిగింపులు, చేర్పులు – ఎల్. అరణ్య

**జూన్**
168. ఎన్నికల చుట్టూ పరిభ్రమిస్తున్న తెలంగాణ ఉద్యమం– శ్రీధర్ దేశ్‌పాండే

**జూలై**
169. ఉప ఎన్నికలు ఏం చెపుతున్నాయి – డి.వి. రామకృష్ణారావు

**అక్టోబర్**
170. తెలంగాణ–హింసా హింసలు కాదు, న్యాయాన్యాయాలు –సం.వ్యాఖ్య
171. అంతిమ యుద్ధానికి సిద్ధమైన తెలంగాణ – శ్రీధర్ దేశ్‌పాండే

**నవంబర్**
172. చౌరస్తాలో తెలంగాణ ఇంకెన్నాళ్లు? – ఎన్. వేణుగోపాల్
173. ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర అవశ్యకత – ఆర్. ఎస్. చౌహన్

**డిసెంబర్**
174. చర్చ: తెలంగాణపై – ఎస్. కృష్ణమూర్తి

**2013 ఫిబ్రవరి**
175. తెలంగాణ సాయుధ పోరాటం – నూతన ప్రజాస్వామిక విప్లవం – జి. సత్యనారాయణరెడ్డి

**మార్చ్**
176. సీమ గొంతుకను వినండి ! – సోమశేఖరశర్మ
177. సమైక్యాంధ్ర ఒక ప్రతీఘాతుక ధోరణి – పల్నాటి శ్రీరాములు
178. ఉత్తరాంధ్ర సమస్యలు – సమైక్యవాదుల వైఖరి – పి. కృష్ణారావు

**ఏప్రిల్**
179. తెలంగాణ ఉద్యమం ముందున్న ప్రమాదాలు – ఎడ్ల పోచయ్య
180. చర్చ: తెలంగాణ సాయుధ పోరాటం – వాస్తవాలు – జి. సత్యనారాయణరెడ్డి

**ఆగస్ట్**
181. దిగ్విజయ్ మాయాజాలంలో తెలంగాణ – ఎ. రాజేంద్రబాబు

**సెప్టెంబర్**
182. సిడబ్ల్యుసి తీర్మానం తర్వాత... – సంపాదకీయం
183. 'రాష్ట్ర విభజన' – మూడు ప్రాంతాల ప్రజాభిప్రాయాలు
184. రెండు ప్రాంతాల్లోనూ అసమానతలు – వి. హనుమంతరావు
185. తెలంగాణ రాష్ట్రం : కొన్ని ఆలోచనలు – డా. ఇమ్మానేని సత్యసుందరం
186. విపత్కర విభజన రాజకీయాలు – ఉసా
187. గతి తప్పిన రాజకీయం – విద్యాభూషణ్
188. తెలంగాణ ఉద్యమం – ఒక విశ్లేషణ – డా. ఎం. గంగాధర్
189. ఈ విపరిణామాల అర్థమేమిటి? – ఎన్. వేణుగోపాల్
190. రాష్ట్ర విభజనను ఆహ్వానిద్దాం – రాయలసీమ, ఆంధ్ర, తెలంగాణ ప్రజాసంఘాల సమన్వయ కమిటీ వీ

# ఖైర్లాంజి : కుల-వర్గ అవగాహన

*ఆనంద్ తేల్‌తుంబ్డె రాసిన 'ఖైర్లాంజి' పుస్తకంపై సమీక్షావ్యాసంలో కుల సమస్యపై మార్క్సిస్ట్ దృక్పథాన్ని, అంబేద్కర్ దృక్పథాన్ని, తేల్‌తుంబ్డె వాదనలను పరిశీలిస్తున్నారు* **ఎన్. రవి**

ఆంధ్రప్రదేశ్‌లో దళితవాదం, అంబేద్కర్‌వాదం–మార్క్సిజం; కుల – వర్గ సమస్య గురించి తీవ్రంగా చర్చలు జరుగుతున్న ప్రస్తుత తరుణంలో ప్రముఖ అంబేద్కర్‌వాది ఆనంద్ తేల్‌తుంబ్డె రాసిన 'ఖైర్లాంజి' పుస్తకం తెలుగులో రావడం ఎంతో సమయానుకూలమైనది. 2008లో నవయాన ప్రచురించిన ఈ పుస్తకాన్ని తెలుగులోకి అనువదింపచేసి ప్రచురించిన 'మలుపు బుక్స్'కు అభినందనలు.

తేల్‌తుంబ్డె అంబేద్కర్ వాది మాత్రమే కాదు. మార్క్సిజం గురించి కూడ బాగా అవగాహన ఉన్న ప్రజాస్వామిక హక్కుల కార్యకర్త. అంబేద్కర్‌వాదం పేరు మీద అంబేద్కర్‌వాదం, మార్క్సిజాలకు మధ్య పోటీగా చర్చ చేయడమే కాక దళితోద్యమానికి, విప్లవోద్యమానికి పోటీపెట్టి విప్లవోద్యమమంటే అదేదో మరో ముసుగులో సాగుతున్న బ్రహ్మణవాదం/మనువాదం అన్న రీతిలో చర్చ చేస్తున్న ఒక పెద్ద దళిత (బహుజన) మేధావివర్గం ఆంధ్రప్రదేశ్‌లో తయారై ఉంది. పీడిత కులాల శ్రామికులు, పీడితుల ఐక్యత సాధించడానికి వర్గఐక్యతే ఏకైక సాధనమని మార్క్సిస్టులు, విప్లవకారులు నొక్కి చెప్పడానికి ప్రయత్నించినప్పుడల్లా 'అదిగదిగో చూడండి, నయా బ్రాహ్మణవాదం' అన్న రీతిలో విప్లవ శిబిరంలోని దళిత మేధావులు కూడా విరుచుకపడుతున్న తరుణమిది. బ్రాహ్మణత్వానికి వ్యతిరేక పోరాటం బ్రాహ్మణులకు వ్యతిరేకమైనది కాదనీ, వర్గఐక్యత కూడా అవసరం అని మొక్కుబడిగా మాత్రం చెప్పి సారంలో మాత్రం వర్గఐక్యత ద్వారానే పీడితకుల శ్రామికుల ఐక్యత సాధ్యమని వాదించే వారి వాదనపై చర్చ చేయకుండా, వారు ఏ కులంలో పుట్టిన వారైనందువల్ల ఈ చర్చ చేస్తున్నారనే చందంలో వాళ్ల కులపుట్టుకకు అంతులేని ప్రాధాన్యత నిచ్చి (వాళ్ల సుదీర్ఘ ఆచరణను వదిలేసి) అంబేద్కర్‌వాదం పేరుతో వాస్తవానికి కులవాదపు చర్చలు చేస్తున్న ప్రస్తుత తరుణంలో తేల్‌తుంబ్డె 'ఖైర్లాంజి' పుస్తకం రావడం ఎంతో ప్రాముఖ్యత కలిగిన విషయం.

దళితోద్యమానికి, విప్లవోద్యమానికి మధ్య ఉండాల్సింది పోటీ కాదు ప్రగాఢమైన ఐక్యత; అందుకోసం విప్లవోద్యమం తన అవగాహనలో కొన్ని మార్పులు చేసుకోవాలి. అట్లాగే అంబేద్కర్‌వాదులు తమ అవగాహనను సరిదిద్దుకోవాలి అనే అవగాహన వికసిస్తున్న తరుణంలో ఈ పుస్తకం తెలుగులో రావడం ఆంధ్రప్రదేశ్‌లో విప్లవకారులకు, దళిత మేధావులకు అంబేద్కర్‌వాదులకు మధ్య బలమైన ఐక్యత పెంపొందించడంలో అవసరమైన అవగాహనలలో మార్పులకు ఒక ప్రేరకంగా పనిచేస్తుందని ఆశిస్తున్నాను.

చంద్రభానుప్రసాద్‌లు, మిలింద్ కాంబ్లేలు దళితుల ప్రయోజనాల పేరుతో దళిత పెట్టుబడిదారీ విధానాన్ని పెంపొందించడానికి కృషి చేయాలని, సామ్రాజ్యవాదుల విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను, రిటైల్ వ్యాపారంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని ఆహ్వానించాలని, అదే దళితుల విముక్తికి దోహదపడుతుందనీ, విదేశీ పెట్టుబడులను అకర్షించడంలో పెట్టుబడిదారీ విధానాన్ని మరింత పెంపొందించడంలో అడ్డంకిగా ఉన్న భూపరిమితి చట్టాలను, పర్యావరణ చట్టాలను, అటవీ అధికార చట్టాలను రద్దు చేయాలని మునుపెన్నడూ లేనంత స్పష్టంగా వర్గవిభజన రేఖలు, దళిత ప్రయోజనాలు పేరుతో గీస్తున్న తరణంలో తేల్‌తుంబ్డె రచన తెలుగులో రావడం ఎంతైనా అవసరం.

తేల్‌తుంబ్డె ఈ పుస్తకంలో చేసిన ప్రధాన సూత్రీకరణల గురించి పరిచయం చేసుకొని చర్చిద్దాం. తేల్‌తుంబ్డె సూత్రీకరణలను చాలా సుదీర్ఘంగానే ఇక్కడ పేర్కొనదలిచాను. అందుకు ఒక కారణం ఉంది. రచయిత భావాలను, అవగాహనను అనువాదకులు ఎన్నో చోట్ల సరిగా అనువాదం చేయలేదు. మరికొన్ని చోట్ల రచయిత చెప్పాలనుకున్న విషయాల ప్రాధాన్యత తగ్గిపోయింది. ఎన్నో చోట్ల ముఖ్యమైన విషయాలు వ్యతిరేక అర్థం వచ్చేటట్లు అనువాదం అయ్యాయి. ఈ రోజు అస్తిత్వవాదం, దళితవాదం, అంబేద్కర్‌వాదం పేరుతో చలామణిలో ఉన్న ఎన్నో తప్పుడు సూత్రీకరణలను తేల్‌తుంబ్డె పటాపంచలు చేశాడు. అయితే తేల్‌తుంబ్డె అటువంటి వాదనలు చేయగలడని అనువాదకులు ఊహించకపోవడం వల్ల దిగ్భ్రమకు గురయి ఆంగ్ల మూలాన్ని ప్రస్తుతం దళితవాదం పేరుతో ప్రచారంలో ఉన్న భావాలకు అనుగుణంగానే అర్థం చేసుకొని అనువదించినట్టుంది. మరికొన్ని చోట్ల ఆంగ్లాన్ని సరిగ్గా అర్థం చేసుకోకపోవడం వల్ల తప్పులు దొర్లాయి. ఈ లోపాల వల్ల తేల్‌తుంబ్డె సూత్రీకరణలను కొంత సుదీర్ఘంగానే ఉల్లేఖిస్తున్నాను.

**తేల్‌తుంబ్డె ముఖ్య ప్రతిపాదనలు ఏమిటి?**

కులసమాజం స్వభావంలోనూ, పొందిక (కంపొజిషన్) లోనూ ఎన్నో మార్పులకు గురైంది. ఇవాళ శూద్రులు/ వెనుకబడిన కులాలు (బిసిలు) ఇతర వెనుకబడిన కులాలు (ఒబిసిలు) దళితులపట్ల కులవివక్ష, కుల దాడుల్లో ప్రధాన పాత్ర వహిస్తున్నారు. పైమార్పులకు ప్రధాన కారణం ఆంగ్లేయుల కాలంలో మొదలై గత ఆరు దశాబ్దాలుగా దేశంలోని గ్రామీణ వ్యవస్థలో చోటు చేసుకున్న రాజకీయ ఆర్థిక మార్పులు.

– పై కారణం రీత్యా బహుజనవాదం ఒక మిథ్య; కులభావన ఆధారంగా శూద్రులకు, దళితులకు మధ్య ఐక్యత సాధ్యం కాదు. వర్గ చైతన్యంతోనే అది సాధ్యం.

– కుల వ్యవస్థ వర్తమాన స్థితికి బ్రహ్మణులు / ద్విజులనే నిందిస్తుండడమనేది బౌద్ధిక జడత్వమే.

– వర్తమాన రాజ్య యంత్రాంగంలో దళితుల ప్రాతినిధ్యం పెరిగినంత మాత్రాన రాజ్యస్వభావం మారదు.

ఆర్థిక అభివృద్ధి, ప్రపంచీకరణలతో కులనిర్మూలన జరుగుతుందని అనుకోవడం భ్రమ. అన్ని కుల ఘర్షణలకు మూలాలు భూసమస్యలో ఉన్నాయనుకోవడం వామపక్షవాదుల భ్రమ.

– ఆరు దశాబ్దాల అభివృద్ధి వల్ల ప్రగతిశీల దళితేతరులతో కూడిన 'పౌరసమాజం' ఒకటి ఉందనుకోవడం భ్రమే.

కులభావనపై ఆధారపడిన బహుజనవాదం సమాజంలో పరిణామం తీసుకురాదు. కులభావనను, కుల వైషమ్యాలను అరికట్టడం, నిజమైన వర్గచైతన్యాన్ని పెంపొందించడం, కులాలకు అతీతంగా సమాజంలోని అన్ని కింది తరగతుల ఐక్యతను పెంపొందించడం ద్వారానే కుల దాడులను నిరోధించగలం. కులనిర్మూలన సాధించగలం.

వీటిని కొంచెం వివరంగా చూద్దాం.

**కులవ్యవస్థలో చోటు చేసుకున్న మార్పులు – శూద్రులకు, దళితులకు ప్రస్తుతం నెలకొన్న సంబంధాలు**

కుల సమాజం నిర్మాణ పరంగానూ, స్థూల స్థాయిలోనూ పరిణామ రహితంగా ఉందని అనగలిగినప్పటికీ వాస్తవానికి దాని పొందికలోనూ, లక్షణాల్లోనూ ఎన్నో మార్పులకు గురయింది. కుల వ్యవస్థకు శాస్త్రాలతో ఉన్న సంబంధం పూర్తిగా అప్రాసంగికం కాలేదు. కానీ చాలవరకు బలహీనపడింది. కులాలకు ఉన్న సంప్రదాయానుగతమైన పునాది కూడా చాలా అరుదుగానే వ్యక్తమవుతోంది. మతం లేదా సంప్రదాయపు ప్రాతిపదికన మాత్రమే కులాలను అర్థం చేసుకోలేం. ఈ ప్రాతిపదికన కులాలకు వ్యతిరేకంగా అసలే పోరాడలేం.

వర్తమాన రాజకీయ ఆర్థిక ప్రభావాలవల్ల ఈనాడు కులాలు చాలా సంక్లిష్టమైనాయి. ఇవాళ కులాల మనుగడకు జీవం పోస్తున్నది ఏ శాస్త్రాలో, మనుస్మృతో లేదా అగ్రకుల కులీనుల ప్రవర్తనో కాదు. ఆధునిక రాజ్యం, దాని విధానాలు, సంస్థలు. వీటివల్ల కులాల ప్రాధాన్యత తగ్గే బదులు మరింత పెరిగింది. వలసపాలనా కాలంలోనూ, ముఖ్యంగా వలసపాలనాన తరం గత ఆరు దశాబ్దాల కాలంలో అసమాన సామాజిక పునాదిపైన గణతంత్ర రాజ్యం 'లౌకిక ప్రజాస్వామిక రాజకీయాలు, సోషలిస్టు ఆర్థిక విధానాల' పేరుతో అమలు చేసిన విధానాలవల్ల, వ్యవస్థాపరమైన, అభివృద్ధిపరమైన చలన సూత్రాలవల్ల కులవ్యవస్థకు కొత్త జీవం కలిగింది. అంతేకాక కుల సంబంధాలలో అవి మార్పులకు దారితీశాయి.

వ్యవసాయ ఉత్పాదన నుండి అత్యధిక మిగులును రాబట్టడం కోసం ఆంగ్లేయులు చేపట్టిన జమీందారీ వ్యవస్థ, రైత్వారీ పద్ధతులు వ్యవసాయంలో వ్యక్తిగత కమతాల పద్ధతిని ప్రవేశపెట్టడంతో పాటు కులాల వారీగా గ్రామస్తులు పరస్పరం సేవలందించుకొనే పద్ధతిని కూడా దెబ్బతీశాయి. ఈ నిర్మాణపరమైన మార్పుతోపాటు పెట్టుబడిదారీ ఉత్పత్తి, మౌలిక సదుపాయాల రంగంలో పెట్టుబడులు కలిగించిన అవకాశాలతో గ్రామీణ ప్రాంతంలోని మిగులు శ్రామికులు (వీరిలో అత్యధికులు శూద్ర కులస్థులు, దళితులే) పట్టణాల బాటపట్టారు. వీటి ఫలితంగా పాత కులవ్యవస్థ పునాదులు కదిలిపోయాయి. ఇది కుల సంబంధాలను, కుల ఘర్షణలను కూడా ప్రభావితం చేసింది.

శూద్రకులాల నాయకత్వంలో వచ్చిన బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు, వాటిననుసరించి వచ్చిన దళితుల కులవ్యతిరేక ఉద్యమాలకు కూడా ఈ పరిణామాలతో సంబంధం ఉంది.

ఆధునిక విద్య అందుబాటులోకి రావడం వల్ల, పాశ్చాత్య ఉదారవాద పాలన వల్ల అణగారిన కులాలకు నూతనంగా ఉదయిస్తున్న పెట్టుబడిదారీ రంగంలో అవకాశాలు ఎదురయ్యాయి. అయితే ఈ అవకాశాలను అందుకోవడానికి భూస్వాములు, వడ్డీవ్యాపారుల రూపంలో బ్రాహ్మణ కులాలు గ్రామీణ ప్రాంతంలో వీటికి అడ్డంకిగా మారడంతో బ్రాహ్మణ వ్యతిరేక పోరాటం శూద్రకులాల నాయకత్వంలో వచ్చింది. దీనిననుసరించి, బలమైన దళిత ఉద్యమం కూడా అంబేద్కర్ నాయకత్వంలో రూపుదిద్దుకుంది.

ఈ బ్రాహ్మణ వ్యతిరేక పోరాటం వలన పాత కులీనులు (అగ్రకులాల వాళ్లు) పెట్టుబడిదారీ విధానం ముందుకు తెచ్చిన ఆర్థిక రంగాల్లోకి ప్రధానంగా మారిపోగా, వ్యవసాయం చేసుకొనే శూద్ర కులాలు గ్రామీణ ప్రాంతంలో భూసంపదను చేజిక్కించుకోవడం మొదలయ్యింది. వలస పాలనానంతరం అరకొరగానైనా అమలైన భూసంస్కరణలు, తదనంతరం హరితవిప్లవం వల్ల వ్యవసాయం చేసుకొనే శూద్రకులాలు గణనీయంగా సంపద్వంతమైనాయి. గ్రామాలు ఈ నవధనాఢ్య శూద్రకులాల నియంత్రణలోకి వచ్చాయి. పాత జమీందారీవర్గం స్థానంలోకి ఒక కొత్త సంపన్న భూస్వామ్యవర్గం, స్వంత భూములున్న రైతాంగవర్గం వచ్చాయి. పాత అగ్రకుల భూస్వామ్య వర్గం స్థానంలోకి మార్కెట్ దృక్పథం కలిగిన అగ్రకులాలు, వెనుకబడిన కులాల రైతులతో కూడిన నూతనతరం అవతరించింది. ప్రభుత్వ పాలసీల లాభాలు ప్రధానంగా ఈ అబ్రాహ్మణ, దళితేతర కులాలకు సమకూరాయి.

పైన పేర్కొన్నట్టు అగ్రకులాల వాళ్లు ప్రధానంగా పెట్టుబడిదారీ విధానం, ప్రపంచీకరణ ముందుకు తెచ్చిన ఆర్థిక రంగాల్లోకి మారిపోగా వీరు వదిలేసిన రంగాల్లోకి కొత్తగా అవకాశాలు అంది పుచ్చుకున్న సామాజిక బృందాలు (శూద్రులు, వెనుకబడిన కులాలు – బీసిలు); ఇతర వెనుకబడిన కులాలు (ఒబిసిలు) ప్రవేశించాయి. అయితే ఈ సామాజిక బృందాలు పరంపరాగతమైన సామాజిక చట్రం నుంచి బయటపడని సాంప్రదాయిక రంగాల్లోనే పాదుకొని ఉన్నాయి. దాంతో ఇవాళ దళితుల పట్ల కులవివక్ష, కులదాడుల్లో వీరే ప్రధాన పాత్ర వహిస్తున్నారు. గత నాలుగు దశాబ్దాలుగా జరుగుతున్న దాడుల్లో బ్రాహ్మణ కులాల ప్రత్యక్ష ప్రమేయం లేదు.

శూద్రకులాలు గ్రామీణ ప్రాంతంలో బలపడుతుండగా దళితులు మాత్రం గ్రామీణ ప్రాంతంలో భూమి లేని కూలీలుగా మిగిలిపోయారు. అయితే రాజ్యాంగం ద్వారా సంక్రమించిన అవకాశాలను ఉపయోగించుకొని దళితులు అభివృద్ధి చెంది కులవ్యవస్థ తాలూకు సాంప్రదాయిక అధికార నిర్మాణానికి సవాలుగా మారారు. రిజర్వేషన్లు తదితర పాలసీలవల్ల కలిగిన విద్య, ఉద్యోగ అవకాశాలతో దళితుల్లోని ఒక చిన్న సెక్షన్ ఒక మేరకు అభివృద్ధి చెందింది. ప్రత్యక్షంగా ఒక చిన్న సెక్షన్ ఎదగగా, ఆకాంక్షలు మాత్రం ఎందరిలోనో పెరిగాయి. ఇతరత్రా మాత్రం దళితుల ఆర్థిక స్థితిలో ఎటువంటి మార్పులేదు.

గత ఆరు దశాబ్దాలుగా పెరిగిన పెట్టుబడిదారీ సంబంధాలు, విద్య ఆధునికత వల్ల కులాల సాంప్రదాయిక పునాదులు బలహీన పడినాయి.

కానీ పైన చర్చించిన ఆర్థిక పరిణామాల వల్ల సామాజిక వర్గ – కుల నిర్మాణంలో ఒక గణనీయమైన మార్పు వచ్చింది.

గ్రామీణ ప్రాంతంలో శూద్రకులాల ఆర్థిక మెరుగుదలతో పాటు రాజకీయ మార్పులు కూడా నూతన కుల సమీకరణలను ముందుకు తెచ్చాయి. కుల గుర్తింపు రాజకీయాలు కూడా ప్రబలమయ్యాయి.

శూద్రకులాలు ఆర్థికంగా బలపడడం రాజకీయ ఆకాంక్షలు పెరగడానికి దారితీసింది. సంఖ్యాబలం కారణంగా రాజకీయరంగంలో వేరొక బలమైన శక్తిగా అవతరించారు. శూద్రకులాలలో ఎదిగిన వర్గాల పెరుగుతున్న ఆశలవల్ల రాజకీయాలు అంతకంతకు పోటీ కావడంతో రాజకీయ నాయకులు ఓట్ల కోసం అస్తిత్వాలను వాడుకోవడం మొదలయింది. మరొకవైపు ప్రజా ఉద్యమాలను అణచడానికి రాజ్యం నియంతృత్వ పద్ధతులకు పాల్పడడంతో కింది వర్గాల ప్రజలు గుర్తింపు రాజకీయాలను ఆశ్రయించారు. ఈ గుర్తింపు రాజకీయాలు పెరగడంతో కులాలకు ఒక కొత్త ఉపయోగం మొదలైంది. రాజకీయ లబ్ధికోసం ఒకే రకమైన స్థితిలో ఉన్న కులాలు ఒక్కతాటిపై రాసాగాయి. చిన్న కుల సముదాయాలు కూడా ఎన్నికల ఫలితాలపై తమ దామాషాను మించిన ప్రభావం వేసే అవకాశం కలగడంతో రాజకీయాల్లో కులాల ప్రాధాన్యత పెరిగి కులాలు, కుల సమూహాల ధృవీకరణకు దారి తీసింది. దీంతో కులాలపై ఆధారపడిన ప్రాంతీయ పార్టీలు ఆవిర్భవించాయి.

1970ల వరకు దేశవ్యాప్తంగా ప్రధానంగా బిసి కులాలకు చెందిన స్వంత భూములున్న రైతాంగవర్గం సంఘటితమైంది. ఈ శూద్ర కులాలు ప్రాంతీయ పార్టీలను పెట్టుకొని దాదాపు ప్రతి రాష్ట్రంలో అధికారాన్ని చేపట్టారు. ఉత్తర భారతంలో యాదవులు, కుర్మిలు, కోయరీలు – వాళ్ల సంఖ్యా బలం వల్ల ఒక బలీయమైన రాజకీయశక్తిగా అవతరించారు. అట్లాగే విభిన్న శూద్రకులాలు ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడులలో కూడా బలీయమైన శక్తిగా కూడా ఎదిగి అధికారాన్ని చేపట్టారు. 1977 తర్వాత కేంద్రంలో కూడా సంకీర్ణ పాలన ద్వారా అధికారాన్ని చేపట్టారు.

బిసిలు ఒక కూటమిగా ఎదిగిన దాంతో పోలిస్తే దళితులు గ్రామీణ ప్రాంతాల్లో బలహీనమయ్యారు. అదే సమయంలో వారి ఆకాంక్షలు మాత్రం పెరిగాయి.

ఈ పరిస్థితి నూతనమైన అణచివేతకు, ప్రతిఘటనకు, హింసకు దారితీసింది.

**సవర్ణులు – అవర్ణులకు మధ్య; దళితులు – దళితేతరులకు మధ్య విభజనగా ముందుకొస్తున్న కుల వ్యక్తీకరణ; బహుజనవాద మిథ్య**

1960ల తర్వాత శూద్రకులాలు ఉత్పాదన ప్రక్రియలో ఆధిపత్య స్థితికి వచ్చాక ఆ కులాలు రాజకీయ, సాంస్కృతిక క్షేత్రాల్లోకి కూడా ఆ మార్పును విజయవంతంగా తీసుకువచ్చాయి. దీనివల్ల అనేక వివాదాలు ఘర్షణలు తలెత్తాయి.

పాతకాలంలో బ్రాహ్మణులకు, రైతాంగ కులాలకు మధ్య ఉన్న పోటీ ఇప్పుడు ఎక్కువగా భూమి కలిగిన రైతాంగ కులాలకు, భూమిలేని కూలీలుగా ఉన్న దళితులకు మధ్య పోటీగా మారింది. గతంలో కుల వ్యవస్థలో బ్రాహ్మణీయ కులాలే పీడకులుగా శ్రమజీవులైన శూద్రకులాలు పీడితులుగా ఉండేవి. (దళితులు చాతుర్వర్ణ వ్యవస్థకు కూడా బహిష్కృతులుగా, అంత్యజులుగా ఉండి ఈ సమాజంలో స్థానమే ఉండేది కాదు. అందువల్ల అంబేద్కర్ అసలు అంటరానివాళ్లు హిందువులే కాదని వాదించారు. కంచె ఐలయ్య 'నేను హిందువు నెట్లయిత' పుస్తకంలో శూద్రులు కూడా హిందువులు కాదని వాదించారు. కానీ 'హిందూ' అనే వలసవాద – జాతీయవాద వర్ణన ఏమైనప్పటికీ శూద్రులు వర్ణ, కుల వ్యవస్థలో పూర్తిగా అంతర్భాగమే. దళితులు మాత్రం ఎప్పుడూ కారు.)

ప్రస్తుతం మాత్రం శూద్రకులాలు (బిసిలు, ఒబిసిలు) పీడకులు, దళితులు పీడితులుగా మారారు.

ఇవాళ కులవ్యక్తీకరణ సవర్ణులు, అవర్ణులకు మధ్య అంటే దళితులు, దళితేతరులకు మధ్య విభజనగా ముందుకొస్తోంది. గ్రామీణ ప్రాంతంలో దళితుల – దళితేతరుల మధ్య ఈ వైరుధ్యం హింసాత్మక రూపం తీసుకొంటోంది. దళితులు భూమిలేని వ్యవసాయ కూలీలు, శూద్రుల ఆధిపత్య స్థానంలో ఉన్న భూ యజమానులు కావడం ఈ వైరుధ్యానికి భౌతిక పునాదిని సమకూరుస్తోంది. నూతనంగా ఆధిపత్య వర్గాలుగా ఎదిగిన శూద్రకులాలు శ్రామికవర్గాలు తమ జీవితాల్లో మెరుగుదలకు చేసిన ప్రయత్నాలను వ్యతిరేకించాయి. వ్యవసాయరంగంలో వచ్చిన ఈ మార్పులవల్ల దళితులపై దాడుల ఘటనలు పెరిగాయి. వాళ్ల ఆకాంక్షలను, వారు సంఘటితపడడాన్ని హింసాత్మకంగా అణచివేయడం పెరిగింది. అయితే పూర్తిగా ఆర్థిక కారణాలతోనే దీన్ని అర్థం చేసుకోలేం. అన్నిటి కంటే ప్రధాన కారణం మాత్రం సాంప్రదాయికమైన దొంతరల ప్రాతిపదికగా దళితులకు, శూద్రులకు మధ్య వేళ్లూనుకొని ఉన్న సామాజిక, సాంస్కృతిక వైరుధ్యమే.

దళితులు కొంత ఎదిగి తలఎత్తుకొని నిలబడడం, తమ స్వతంత్ర సాంస్కృతిక చిహ్నంగా అంబేద్కర్‌ను నిలబెట్టడం, చదువుకున్న దళితులు తమ హక్కులకై పోరాడడం; విద్యారంగంలో శూద్రకులాల కంటే ముందుకుపోవడం వంటివన్నీ అగ్రకులాలతో పాటు శూద్ర కులాలకి కంటగింపయ్యాయి. ఎన్నికల రాజకీయాలు కూడా ఇందుకు తోడయ్యాయి. 1970ల తర్వాత పెరుగుతున్న గుర్తింపు రాజకీయాల పోటీవల్ల దళితులు ఓటు హక్కు వినియోగించుకోవడం కోసం నిలబడడం, పంచాయితీ ఎన్నికల్లో పోటీ చేయడం, ఇవన్నీ కూడా దళితుల పట్ల కోపానికి కారణమవుతున్నాయి.

కుల సమస్యను చర్చించే బుద్ధిజీవులు ఈ మార్పులను గుర్తించి నిరాకరించి సాంప్రదాయికమైన కులవ్యవస్థ వర్ణననే పట్టుకొని వేళ్లాడుతున్నారు (ప్రతి కుల సంబంధిత సమస్యను అర్థం చేసుకోవడానికి, వివరించడానికి 'బ్రాహ్మణవాదం'తో సంక్షిప్త వర్ణనతో సరిపెడుతున్నారు). కుల వ్యతిరేక ఉద్యమాలు కూడా శత్రువుల్ని, మిత్రుల్ని పాతబడి పనికి రాకుండా పోయిన వర్ణాల ఆధారంగానే గుర్తిస్తూ వస్తున్నాయి. 'బ్రాహ్మణిజానికి వ్యతిరేకమే కాని బ్రాహ్మణులకు కాదనీ, బ్రాహ్మణిజం అన్నది బ్రాహ్మలకు మాత్రమే పరిమితమైంది కాదనీ, దళితుల్ని సైతం ప్రభావితం చేస్తుందనీ' అన్న అంబేద్కర్ బోధనను కులవ్యతిరేక కార్యకర్తలు చిలుక పలుకుల్లా వల్లిస్తున్నారు తప్ప వాస్తవంలో మాత్రం బ్రాహ్మణులకు, బ్రాహ్మణవాదానికి మధ్యనున్న తేడాను గుర్తించడంలో విఫలమవుతున్నారు. వ్యక్తులను వారి కులాలను బట్టే గుర్తిస్తున్నారు. వర్తమానంలో కులవ్యవస్థ ఉన్న రీతికి బ్రాహ్మణులు, ద్విజులనే నిందిస్తుండడమనేది బౌద్ధిక జడత్వమే.

ఎన్నికల రాజకీయాల అవసరాలవల్ల గ్రామ స్థాయిలో దళితులకు, ఒబిసిలనబడే కులాలకు మధ్య ఉన్న ఎన్నో వైరుధ్యాలను కప్పిపెట్టి వీళ్లందరినీ ఒకే గాటన కట్టి 'బహుజనుల'నే సమూహం ముందుకు వచ్చింది. ఈ కుల సమీకరణలో భూములున్న ఎన్నో శూద్రకులాలు కూడా భాగమయ్యాయి. ఈ కులాలను పక్కన పెట్టినా కొన్ని శూద్రకులాల పరిస్థితి దళితుల కంటే ఏమాత్రం మెరుగ్గా లేకపోయినా సాంప్రదాయికంగా ఈ కులాలకు భూమి కలిగిన కులాలతో ఉన్న సామాజిక ఆర్థిక బంధాలవల్ల వారు సామాజికంగా కొంత మెరుగైన స్థితిలో ఉంటారు. అందువల్ల ఈ కులాలను సామాజికంగా బహిష్కృతమైన దళితులతో ఒకే గాటన కట్టడం సరైంది కాదు.

బహుజనవాదమనేది మౌలికంగా ఎన్నికల రాజకీయాల్లో దళితులు విజయం సాధించడానికి పనికి వచ్చే వ్యూహం మాత్రమే తప్ప సూత్ర బద్ధమైనది కాదు. ఈ వాదం ప్రకారం అధికారం చేజిక్కించుకోవడానికి అన్ని కింది శూద్ర కులాలు, దళితులు ఏకమై ఒక బలమైన నియోజకవర్గాన్ని స్థాపించుకోవచ్చు. వాస్తవానికి, ఈ కులాల భౌతికస్థాయి చూస్తే మాత్రం ఇవన్నీ సమాన స్థాయిలో ఉన్నాయి కాబట్టి తప్పక ఐక్యం కావాలి. కాని బహుజనవాదం ప్రజలను కుల అస్తిత్వాల ఆధారంగా ఐక్యం కావాలని కోరుకుంటున్నప్పుడు మౌలికమైన కుల విభజన సవర్ణులకు, అంటరానివారికి మధ్య అనే వాస్తవాన్ని ఈ వాదం మరిచిపోతున్నది. దళితులు కుల వ్యవస్థకు వెలుపలివారు.

కీలవేన్మణి నుండి ఖైర్లాంజి దాకా మనకు కనిపించేదేమంటే దళితులపై హింసాత్మకదాడులు చేసేది మధ్యమ శూద్రకులాలు. ఖైర్లాంజితో సహా దేశంలోని అన్ని కులపరమైన దాడులు బహుజనవాదం ఒక మార్పు తేగలిగిన వ్యూహమనేదాన్ని తప్పని ఘంటాపథంగా చెపుతున్నాయి.

కులాలకు అతీతంగా సమాజంలోని అన్ని కింది తరగతులను ఐక్యం చేయడంపై ఆధారపడిప్పుడే బహుజనవాదం ఒక పరిణామాత్మక ఎజెండాగా అర్థవంతమవుతంది. అటువంటి ఐక్యతకు కులభావన ప్రాతిపదికగా పనికిరాదు. ఎందుకంటే కులాల మధ్య ఉండే అస్తిత్వ వైరుధ్యాలను అధిగమించడమనేది సాధ్యంకాదు. కులం అంటేనే దొంతరలను కోరుకుంటుంది. అది ఐక్యతా భావానికే విరుద్ధం. బహుజనులనేది ఒక వర్ణనాత్మక తరగతిగా పనికొస్తుందేమో కానీ పోరాట క్షేత్రంగా కాదు.

**ఆధునిక పెట్టుబడిదారీ విధానాల ద్వారానో; రాజ్యజోక్యం వల్లనో ప్రస్తుత రాజ్య యంత్రాంగంలో దళితుల ప్రాతినిధ్యం పెరిగినంత మాత్రానో కుల అణచివేత, దాడులు సమసిపోవు**

నేడు కులాలు, కుల వైరుధ్యాలు రూపుదిద్దుకున్న వైనంలో రాజ్యం పాత్రను తగినంతగా అర్థం చేసుకోవడం లేదు. భారత రాజ్యం చేపట్టిన ఆధునికీకరణ కులాల ప్రాధాన్యం తగ్గించడానికి ఉద్దేశించిందని పేరేకాని అది కులాలను బలోపేతం చేయడమేకాక వాటి దుష్ఫలితాలను మునుపెన్నటికంటే తీవ్రతరం చేసింది.

ఆధునికత, పెట్టుబడిదారీ విధానాలు కులాన్ని దెబ్బతీయలేదు. ఆధునికత అంటే సాంప్రదాయాలను నిర్మూలించి, సంకెళ్లను తెంచేసి దేశాన్ని ప్రగతిపథం వైపు నడిపించడమే కదా ! దీనివల్ల కుల సమస్యకు పరిష్కారం లభిస్తుందని అందరూ ఆశించారు. కులాన్ని భారతదేశానికి చెందిన ప్రత్యేకతగా, భారతదేశానికి కీలకమైన అంశంగా చూసే అంబేద్కరిస్టు దృక్పథం కూడా కుల అణచివేతను తగ్గించడానికి రాజ్యం జోక్యం చేసుకోవడానికే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది.

అయితే ఈ ఆధునిక ప్రక్రియ విఫలం కాకతప్పలేదు. ఎందుకంటే ఆంగ్లేయుల నుండి అధికార మార్పిడి తర్వాత అస్తిత్వంలోకి వచ్చిన బూర్జువా – భూస్వామ్య రాజ్యం బూర్జువా ప్రయోజనాలకు, భూస్వామ్య ప్రయోజనాలకు మధ్య రాజీకి ప్రాతినిధ్యం వహిస్తోంది. ఆధునికీకరణను చేపట్టి బూర్జువాల ప్రయోజనాలు నెరవేర్చడం, గ్రామీణ భారతంపై భూస్వాముల నియంత్రణను యథావిధిగా కొనసాగించి వారి ప్రయోజనాలను కాపాడడమే ఆ రాజీ. ఆధునికీకరణ వల్ల తాము కూడా లబ్ధి పొందుతామని భూస్వామ్య వర్గాలకున్న అంచనాల వల్ల ఆధునికీకరణ ప్రక్రియను రాజ్యం చేపట్టింది. అప్పటికే పెట్టుబడిదారీ విధానం కులంతో, మత సంస్థలతో, ఆదివాసి సంప్రదాయాలతో రాజీ పడిపోయింది. వాటితో తలపడే బదులు నేర్పుగా వాటిని తనకు అనుకూలంగా వినియోగించుకుంది. ఆధునిక విద్య, పట్టణీకరణ, పారిశ్రామీకరణలు ఈ సంస్థలలో కొన్ని మార్పులు మాత్రమే చేశాయి తప్ప వాటిని నిర్మూలించలేదు. అందువల్ల కులం – ఆధునికత రెండూ పక్క పక్కనే ఉనికిలో ఉన్నాయి. పీడిత కులాలకు లాభం చేకూరేలా రాజ్యం రక్షణ పథకాలను, అభివృద్ధి పథకాలను చేపట్టింది. కానీ భూసమస్యతో ముడిపడిన శూద్రకులాల ఆర్థిక పునాది జోలికి మాత్రం పోలేదు.

ఆర్థిక అభివృద్ధి, దానిననుసరించి జరిగే సాంస్కృతిక అభివృద్ధి కులాలను నిర్మూలిస్తాయనే అభిప్రాయం సరికాదని దేశంలో దళితులపై జరిగిన ఎన్నో దాడులను పరిశీలిస్తే తేలుతుంది. అట్లాగే ప్రపంచీకరణ వల్ల కులం బలహీనపడుతుందనేది ఒక భ్రమే. ప్రతి కులఘర్షణ భూసమస్యతో ముడిపడి ఉందనే భ్రమ మార్క్సిస్టు ఆర్థిక నియతివాదం నుండి పుడుతుంది. భూసమస్య నిస్సంశయంగా అత్యాచారాలకు, దాడులకు ఒక ప్రధాన కారణం. భూమితో ముడిపడిన ఎన్నో ఘర్షణలు దళితులపై హింసరూపం తీసుకుంటాయనేది కూడా ఒక వాస్తవం. అయితే దళితేరుల మధ్య ఇటువంటి భూ వివాదాలు దళితుల విషయంలో దారి తీసినట్టు ఘోరమైన దాడులకు ఎందుకు దారితీయవు అనేది ప్రశ్న. లౌకిక కారణాలైన ఆర్థిక లేదా భూవివాదాలు దళితుల పట్ల నిరసన పెంచడానికి కారణం కావచ్చు. కాని, ఒక వివాదం అత్యాచారంగా, దాడిగా పరిణమించడానికి ప్రభావం నెరపే కారణం మాత్రం లౌకికేతర కారణమైన కులం. నిజానికి దేశంలో జరిగిన అత్యంత దారుణమైన అత్యాచారాలేవీ భూ వివాదం వల్లనే జరిగినవి కావు. నరనరాన జీర్ణించుకుపోయిన కుల పూర్వాభిప్రాయం (ప్రిజుడిస్) ఒక వివాదం క్రూరదాడిగా పరిణమించేందుకు కారణమవుతోంది.

ఖైర్లాంజి సందర్భంగా దళితులపై అత్యాచారాల్లో పోలీసుల నేరపూరిత పాత్రను విశ్లేషిస్తే రాజ్యం ఎట్లా దళిత వ్యతిరేకమైందో అర్థం కావడమే కాక, ఈ వ్యవస్థలో భాగంగా దళితులే అధికారంలో ఉన్నా, దళితులకు పెద్దగా ఒరిగేదేం లేదని అర్థమవుతుంది. రాజ్య స్వభావం, వ్యక్తులుగా దళితుల పాత్ర, దళితులు, ఆదివాసిలపై అత్యాచారాలను నిర్నిరోధంగా కొనసాగించడానికి నక్సలైట్ బూచిని వాడుకుంటున్న వైనం కూడా స్పష్టంగా అవగతమవుతుంది.

*(ఇంకా ఉంది)*

*(రచయిత మావోయిస్టు రాజకీయ ఖైదీ)* వీ

# సిరియాపై అమెరికా దమననీతి

*గతంలో ఇరాక్ దగ్గర మానవ హనన రసాయనిక ఆయుధాలున్నాయన్న సాకుతో దాడి చేసిన అమెరికా, ఇప్పుడు అదే నెపంతో సిరియాపై దాడికి కాలుదువ్వుతోందనీ, అది చమురును దోచుకోవడానికే అనీ అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

గత రెండు సంవత్సరాలుగా అంతర్యుద్ధంతో కొట్టుమిట్టాడుతున్న సిరియా చుట్టూ యుద్ధ మేఘాలు కమ్ముకుంటున్నాయి. మధ్యధరా సముద్ర తూర్పు తీర ప్రాంత దేశమైన సిరియా నేడు భౌగోళిక రాజకీయ ప్రకంపనల కేంద్రంగా మారింది. ఈ అంతర్యుద్ధంలో దాదాపు లక్షమంది ప్రాణాలు కోల్పోయారు. 20 లక్షల మంది శరణార్థులై పరాయి దేశాలకు వెళ్ళారు. పెద్ద సంఖ్యలో ప్రజలు నిర్వాసితులయ్యారు. సిరియాలో భీకరమైన హింస కొనసాగుతోంది. సిరియాలో సంక్షోభ మంటలను రాజేసి ఇటు అమెరికా నేతృత్వంలోని పశ్చిమ దేశాలు అటు ఇరాన్, రష్యా, చైనాలు చలికాసుకొంటున్నాయి. దీంతో సిరియా సంక్షోభానికి పరిష్కారం సమీప భవిష్యత్తులో దొరికే అవకాశం కన్పించడం లేదు. జాతీయ, అంతర్జాతీయ శక్తుల రాజకీయార్థిక ప్రయోజనాల నేపథ్యంలో మార్చి 2011 నుంచి కొనసాగుతున్న సిరియా అంతర్యుద్ధం నేడు పరాకాష్టకు చేరుకుంది.

అవినీతి, నిరంకుశత్వాల నుంచి స్వేచ్ఛ కోసం, తమ భవితను తామే నిర్దేశించుకోగలిగే మార్పుకోసం 2011లో అరబ్ ప్రపంచంలో టునీషియాతో మొదలైన జనాందోళన అచిర కాలంలోనే సునామీలా అరబ్ దేశాల్నీ తాకింది. టునీషియా, ఈజిప్ట్, లిబియా, అల్జీరియా , యెమెన్, సిరియా తదితర దేశాలన్నీ జనాగ్రహ జ్వాలాముఖిలా మారి పొగలు సెగలు కక్కడమే కాదు – కొన్నిచోట్ల నిరంకుశ ప్రభువుల మెడలు వంచాయి. సిరియాలో అసద్ ప్రభుత్వమే నేటికీ ఏటికి ఎదురీదుతోంది. నేరాభియోగాలు లేకుండానే ప్రజల్ని నిర్బంధించే అత్యయిక చట్టాన్ని రద్దు చెయ్యాలని, రాజకీయపక్షాలను చట్టబద్ధం చెయ్యాలని, అవినీతిపరులైన స్థానిక అధికారులను తొలగించాలనీ డిమాండ్ చేస్తూ 2011 మార్చ్‌లో దారా పట్టణంలో మొదలైన ఆందోళనలు కార్చిచ్చులా యావద్దేశాన్నీ ఆవరించాయి. అసద్ ప్రభుత్వం మెట్టు దిగివచ్చి అత్యయిక చట్టాన్ని రద్దుచేసి, కొత్త పార్టీల ఏర్పాటుకు చట్టబద్ధంగా సమ్మతి తెలిపింది. అయినా, అసద్ గద్దె దిగి తీరాలంటూ గళమెత్తిన ఆందోళనకారులపై ప్రభుత్వం ఉక్కుపాదం మోపుతోంది. అరబ్ లీగ్, ఐరోపా, అమెరికా, టర్కీ వంటివి అసద్ ప్రభుత్వంపై ఆర్థిక ఆంక్షల కొరడా ఝుళిపిస్తున్నాయి. తిరుగుబాటుదారులకు వెన్నుదన్నుగా నిలుస్తున్నాయి. పశ్చిమాసియాలో సిరియా, ఇరాన్‌లు అంటే అమెరికాకు కంటగింపుగా ఉంది.

సిరియా ప్రజల్లో అధ్యక్షుడు అసద్‌కు వ్యతిరేకంగా తీవ్ర అసంతృప్తి చోటుచేసుకున్న నేపథ్యంలో అక్కడ తమకు అనుకూలమైన ప్రభుత్వాన్ని ఏర్పరిచేందుకు అమెరికా శతవిధాలా ప్రయత్నిస్తోంది. నాటో దేశాల పరోక్ష సహకారంతో అల్‌ఖైదా అనుబంధ సైనిక విభాగం అల్ నుస్రా ఫ్రంట్ ప్రధానంగా ఉత్తర సిరియా ప్రాంతంలో అసద్ ప్రభుత్వ బలగాలకు వ్యతిరేకంగా సాయుధంగా పోరాడుతోంది. న్యూయార్క్‌లోని ప్రపంచ వాణిజ్య కేంద్రంపై 2001 సెప్టెంబర్ 11న జరిగిన దాడికి ఒసామా బిన్ లాడెన్ నేతృత్వంలోని ఉగ్రవాద సంస్థ అల్‌ఖైదా కారణమని పేర్కొంటూ, ఉగ్రవాదంపై యుద్ధం పేరుతో అల్‌ఖైదా సంస్థను మానవాళికే శత్రువుగా ప్రకటించి అఫ్ఘానిస్తాన్‌లో యుద్ధం చేసిన అమెరికా, సిరియాలో తన భౌగోళిక రాజకీయ ప్రయోజనాల కోసం దాని అనుబంధ సైనిక సంస్థను ప్రోత్సహిస్తోంది. రష్యా, చైనా, ఇరాన్ దేశాల మద్దతుతో, కుర్దిష్ మిలిటెంట్ల పోరాటాల సహకారంతో దేశంలోని అనేక ప్రాంతాల్లో తిరుగుబాటుదారులపై అసద్ ప్రభుత్వ బలగాలు విజయం సాధించాయి. అధ్యక్షుడు బషర్ అల్ అసద్ సారథ్యంలోని సైన్యం సిరియా రాజధాని డమాస్కస్ సమీపంలో ద్యూమ, అర్బీన్, మౌట నగరాలపై పెద్దఎత్తున దాడులకు తెగబడింది.

ఇరాక్‌లో వలె సిరియాలో 'ప్రభుత్వ మార్పు' కొరకు ప్రతిపక్షాలను ఎగదోస్తూ, వారికి అన్ని విధాల ఆర్థిక, ఆయుధ సహాయం చేస్తూ అంతర్యుద్ధానికి కారణమైన అమెరికా ఇప్పుడు ప్రత్యక్ష వైమానిక దాడులకు సన్నాహాలు చేస్తోంది. సిరియాపై దురాక్రమణకు తహతహలాడుతున్న అమెరికా ఇంతకుముందు ఇరాక్, లిబియాల్లో అనుసరించిన కుట్రల్నే ఇక్కడా మొదలు పెట్టింది. ఇరాక్‌పై దాడి చేయడానికి ముందు సద్దాం హుస్సేన్ పెద్దయెత్తున రసాయనిక ఆయుధాలు కలిగి ఉన్నాడన్న కట్టుకథలను ప్రచారంలో పెట్టి, తర్వాత ఆ దేశాన్ని అనేక విధాల వేధించి, కబళించి, ఆయనను ఉరితీస్తే గానీ దాని కక్ష చల్లారలేదు. లక్షలాదిమంది వృద్ధులు, బాలలు, ఇతరులు ఆకలి మంటలతో, బాంబుదాడులతో మరణించగా, ఇప్పటికీ చావులు నిత్యకృత్యంగా ఉన్నాయి. అమెరికా దళాలు ఎక్కువభాగం ఉపసంహరించ కున్నప్పటికీ వ్యూహాత్మక కేంద్రాలవద్ద వాటి పహారా కొనసాగుతోంది. దేశ ఆర్థిక వ్యవస్థ సర్వనాశనమైంది. అత్యంత విలువైన ఆయిల్ సంపద అమెరికా బహుళజాతి కంపెనీలపరమైంది. అమెరికా నెలకొల్పిన 'ప్రజాస్వామ్యం' అపహాస్యంగా కొనసాగుతోంది.

మధ్యప్రాచ్యంపై సంపూర్ణ ఆధిపత్యం కొరకు వ్యూహాత్మకంగా పావులు కదుపుతున్న అమెరికా, దాని యూరప్ మిత్రరాజ్యాలు తమకు అనుకూలంగా ఉండే సౌదీఅరేబియా, తదితర పచ్చి మితవాద రాచరిక వ్యవస్థలను బలపరుస్తూ, ఇజ్రాయిల్‌కు ఇబ్బందికరంగా ఉన్న సిరియాలో 'ప్రభుత్వాన్ని మార్చే' పథకం రచించాయి. అధ్యక్షుడు బషర్ – అల్ – అసద్‌ను అధికారం నుండి తొలగించేందుకు ప్రతిపక్షాలకు సహాయం చేస్తున్నారు. పరిమితంగా విమానాలతో బాంబులు వేశారు. డమాస్కస్‌పై

విమానాలు ఎగరకుండా 'నో ఫ్లయిజోన్' విధించారు. ఆర్థిక ఆంక్షలు విధించారు. గత సంవత్సర కాలంగా సిరియాలో అంతర్యుద్ధం కొనసాగుతోంది. తమలక్ష్యం నెరవేరక పోవడంతో ప్రత్యక్షంగా రంగంలోకి దిగాలని అమెరికా తదితర దేశాలు ఉవ్విళ్లూరుతున్నాయి. సున్నీ ఇస్లామిస్టు తీవ్రవాదులతో కలిసి ఇజ్రాయిల్, పశ్చిమదేశాలు, అమెరికా గల్ఫ్ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకుని, అక్కడి ఆయిల్ సంపదను దోచుకోవడానికి కుట్రలు పన్నుతున్నాయని ఇరాన్ బలంగా వాదిస్తోంది.

సిరియాను 'శిక్షించడానికి' వారు చెబుతున్న కారణం అసద్ వద్ద రసాయనిక ఆయుధాలున్నాయి. ఆగస్ట్ 21న డమాస్కస్ శివార్లలో రసాయనిక గ్యాస్ ప్రయోగించగా 1400 మందికిపైగా చనిపోయిన ఘోరకలికి అసద్ బాధ్యుడని నిందిస్తున్నారు. ఆ ఆరోపణతో దాడి చేయాలన్నది ఒబామా ఎత్తుగడ. ఆ ఆరోపణను తీవ్రంగా ఖండించిన అసద్ ఐరాస పర్యవేక్షకుల తనిఖీకి, పరిశీలనకు సుముఖత తెలిపారు. అయితే ఇరాక్‌లో సామూహిక జనసంహారక ఆయుధాలులేవని ఐరాస కమిటీ చెప్పినా, స్వయంగా అమెరికన్ నిపుణులు చెప్పినా వినకుండా సైనికదాడికి దిగి తన రాజకీయ లక్ష్యాన్ని నెరవేర్చుకున్న అమెరికాకు అసద్‌ను దించడం ముఖ్యంకాని అందుకు కారణాలు కాదు. ఈ రసాయనిక దాడి ఫలితంగా ఆన్‌లైన్‌లో ప్రత్యక్షమైన వీడియోలు, చిత్రాలు ఒళ్లు గగుర్పొడిచేలా ఉన్నాయి. అసద్ ప్రభుత్వ అమానుషత్వంగా వీటిని చూపేందుకు అమెరికా, ఐరోపా దేశాలు, వాటి ఆధ్వర్యంలోని ప్రచార బాకాలు నిరంతరంగా ఊదరగొడుతూ 'సత్యం గుమ్మం దాటక ముందే అబద్ధం ప్రపంచాన్ని చుట్టివస్తుందన్న సామెతను' సార్థకం చేస్తున్నాయి. ఈ దాడికి పాల్పడింది అసద్ ప్రభుత్వమేనని ఏ స్వతంత్ర సంస్థ ఇంత వరకూ నిర్ధారించలేదు. ఎలాంటి ఆధారాలూ లేవు. అయినా, అమెరికా విదేశాంగమంత్రి కెర్రీ సిరియా ప్రభుత్వం న్యూరోటాక్సిన్ సరిన్ గ్యాస్ ప్రయోగించిందని గట్టిగా వాదిస్తున్నాడు. అందుకు మీ దగ్గరున్న సాక్ష్యాధారాలు చూపవయ్యా అని రష్యా, ఇరాన్‌లు అడిగితే అది 'రహస్య సమాచారం' అయినందున వెల్లడించలేమని తప్పుకుంటున్నారు.

2003లో అమెరికా ఇరాక్‌పై దాడి చేయడం పట్ల ప్రపంచ వ్యాప్తంగా నిరసన వ్యక్తమైంది. ఆ చేదు అనుభవం రీత్యా అసద్ ప్రభుత్వాన్ని కూలదోసేందుకు అమెరికా దాని మిత్ర దేశాలు సిరియా లోని అంతర్యుద్ధాన్ని తమకు అనుకూలంగా మలచుకునేందుకు ప్రయత్నిస్తున్నాయి. అయితే లిబియాలో వలే స్థానిక తిరుగుబాటు దారులు నాటో దేశాలకు అనుకూలంగా లేరు. ఆ కారణంగా పరోక్ష సైనిక సహకారం కంటే ప్రత్యక్ష సైనిక జోక్యంతో తమకు అనుకూల ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడంతోనే తమ భౌగోళిక రాజకీయ ప్రయోజనం ఇమిడి ఉందని అమెరికా భావిస్తోంది. ఇలాంటి నేపథ్యంలో తిరుగుబాటు దారులే ఇలాంటి అకృత్యానికి తెగబడ్డారన్న అభిప్రాయాలు బలంగా వ్యక్తమవుతున్నాయి.

రసాయన ఆయుధాలు ఉపయోగించారనే సాకుతో సిరియాపై సైనిక దాడికి దిగేందుకు పశ్చిమదేశాలు తమ ప్రయత్నాలను ముమ్మరం చేస్తున్నాయి. అమెరికా, దాని మిత్రదేశాలు ఇందుకు సంసిద్ధం అవుతున్నాయి. బ్రిటన్, ఫ్రాన్స్ వంటి దేశాల సహకారంతో దాడి చేసేందుకు సిరియా తీరం సమీపానికి యుద్ధ సామాగ్రిని తరలించే పనులను అమెరికా కొనసాగిస్తోంది. దీనికి సవాలుగా తమను తాము రక్షించుకోగల సామర్థ్యం ఉందని, దాడికి దిగితే ఓటమి తప్పదని సిరియా ప్రభుత్వం ఇంతకు ముందే ప్రకటించిన విషయం తెలిసిందే. యుద్ధ బెదిరింపులకు భయపడబోమని సిరియా ప్రకటించింది. డెమాస్కస్ లొంగిపోదని, దాడి జరిగితే తనను తాను కాపాడు కుంటుందని సిరియా విదేశాంగ మంత్రి వలీద్ మొల్లేమ్ ప్రకటించారు. ఏ దేశం కూడా తమ దేశ ప్రజలపై రసాయన ఆయుధాలను ఉపయోగించదని ఆయన అన్నారు. మిత్రదేశాలైన రష్యా, చైనా, ఇరాన్‌లు కూడా సిరియాపై సైనిక దాడి ప్రయత్నాలను వ్యతిరేకించాయి. ఇదే జరిగితే తీవ్ర పర్యవసానాలను ఎదుర్కొనవలసి వస్తుందని ఇప్పటికే హెచ్చరించాయి. ఇవేమీ ఖాతరు చేయని అమెరికా తాము దాడికి సిద్ధంగా ఉన్నామని ఆగస్టు 27న ప్రకటించింది. ఇదిలావుండగా, అమెరికా విమాన వాహకనౌక నిమిట్జ్ అరేబియా సముద్రం నుండి ఎర్రసముద్రం వైపు – సిరియాపై దాడిచేయడానికి అనువైన దూరంలో ఉండే నిమిత్తం – ప్రయాణిస్తున్నది. సిరియాపై అమెరికా దాడి యత్నాలను తీవ్రంగా ప్రతిఘటిస్తున్న రష్యా రంగంలోకి దిగింది. రష్యాకు చెందిన మూడు యుద్ధ నౌకలు మధ్యధర సముద్రంలో సిరియా తీరం వైపు కదులుతున్నాయి. తూర్పు మధ్యధరా సముద్రంలో ఇప్పటికే అమెరికా నావికాదళం తిష్టవేసిఉంది. సౌదీఅరేబియా అమెరికా సైనిక దాడిని సమర్థిస్తూ ఉండగా, ఇరాన్ గట్టిగా వ్యతిరేకిస్తున్నది.

అసలే ఆర్థికమాంద్యంతో కొట్టుమిట్టాడుతున్న ఇంగ్లాండ్ అమెరికాతో యుద్ధంలోకి వెళ్లే విషయంలో వెనక్కుతగ్గింది. సిరియాపై సైనిక చర్యకు వ్యతిరేకంగా బ్రిటన్ పార్లమెంటు ఓటు వేసింది. దీంతో ఒబామా వ్యూహాత్మకంగా కాంగ్రెస్ అనుమతికోరారు. తోడ్పాటుకోసం ప్రభుత్వం పెద్ద ఎత్తున లాబీయింగ్ చేస్తోంది. సిరియాపై దాడి చేయాలనుకుంటున్న ఒబామా కుట్రలకు అమెరికా సెనెట్ విదేశీ వ్యవహారాల కమిటీ ఆమోదం తెలిపింది. ఈ తీర్మాణం ప్రకారం అమెరికాకు అసద్ ప్రభుత్వ రసాయన ఆయుధాల తొలగింపుకు 60 రోజుల్లోనే చర్యలు తీసుకోవాలి. ఈ తీర్మాణంపై త్వరలో జరిగే అమెరికా సెనెట్‌లో ఓటింగ్ నిర్వహిస్తారు. అక్కడ కూడా ఆమోదం లభిస్తే సైనిక చర్యకు అన్ని అనుమతులు లభించినట్లవుతుంది. అంతర్జాతీయ మద్ధతు కొరకు అమెరికా విదేశాంగ మంత్రి కెర్రీ 100 దేశాలతో సంప్రదించగా 30 దేశాలు మాత్రమే తమ సమ్మతిని తెలిపాయి. భారత్ మాత్రం ఐక్య రాజ్య సమితి ఆమోదం పొందాలని తెలిపింది. కాగా సైనిక జోక్యానికి ఉత్తర్వు చేయడానికి అధ్యక్షుడికి ఫ్రాన్స్ రాజ్యాంగం ఏలాంటి షరతు విధించనప్పటికీ పార్లమెంటు ఆమోదం పొందాలని ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫ్రాంకోయిస్ హోలాండే మాట్లాడుతున్నాడు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో అత్యధిక ప్రజలు సిరియాపై యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్నారు.

ఈజిప్టులో ఇటీవల అక్కడి సైనిక నిరంకుశ ప్రభుత్వం నిర్ధాక్షిణ్యంగా రెండు వేల మందిని ఊచకోత కోస్తే అందుకు సంబంధించిన దారుణ వీడియోలు కానీ, చిత్రాలు కానీ ఒక్కటంటే ఒక్కటి కూడా బయటకు రాలేదు. కానీ, సిరియాలో ఎవరు జరిపారో, ఎప్పుడు జరిపారో కూడా నిర్ధారణ చేయకుండానే భయానక దృశ్యాలతో కూడిన వీడియోలను ఎలాంటి విచక్షణ లేకుండా ఆన్‌లైన్‌లో పెట్టాయి. ఈజిప్టులో ఉన్న సైనిక నిరంకుశ ప్రభుత్వం అమెరికాకు అనుకూలం కాబట్టి అక్కడి పాపాలు వాటి కంటికి కానరావు. పాశ్చాత్య మీడియా అనుసరిస్తున్న ఈ ద్వంద్వ ప్రమాణాల వల్ల సమాచార విప్లవ యుగంలో సైతం ఏది నిజమో, ఏది అబద్ధమో తెలియని విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది.

చివరికి ఐరాస వంటి సంస్థలను కూడా అమెరికా తన గుప్పెట్లో పెట్టుకునేందుకు ప్రయత్నిస్తోంది. సిరియాలో రసాయనిక ఆయుధ తనిఖీకి పంపిన అధికారుల బృందానికి గతంలో ఇరాక్ వెళ్లిన ఇన్‌స్పెక్టర్ల బృందంలో సభ్యుడైన స్వీడన్ జాతీయుడు అకెసెల్ స్టార్మ్‌ను నాయకునిగా నియమించడం గమనార్హం. అటువంటి తనిఖీ బృందం రేపు ఇచ్చే నివేదిక ఎవరికి అనుకూలంగా ఉంటుందో ఊహించుకోవచ్చు. ఈ తనిఖీ బృందాన్ని దాడి జరిగినట్లుగా చెప్పబడుతున్న ప్రదేశంలో పర్యటించేందుకు అనుమతించాలని అమెరికా, ఐరోపా దేశాలు గట్టిగా డిమాండ్ చేయడంలో ఆంతర్యం తెలియనిదేమీ కాదు.

ఇది రసాయనిక దాడా, కాదా అన్నది ఒక ప్రశ్న. రసాయనిక దాడే అనుకున్నా ఇది అసద్ ప్రభుత్వ పనేనని ఎలా చెబుతారు? పశ్చిమ దేశాల నుంచి ఆయుధాలందుకుంటున్న సాయుధ తిరుగుబాటు మూకల పనేనని ఎందుకు అనుకోకూడదు? దాడి జరిగినట్లుగా చెబుతున్న ప్రాంతం సాయుధ తిరుగుబాటుదారుల నియంత్రణలోనే ఉందన్న విషయం మరిచిపోరాదు. అదీగాక సిరియాకు రసాయనిక ఆయుధ తనిఖీ బృందాన్ని పంపించమని కోరింది అసద్ ప్రభుత్వమే. ఆ బృందం వచ్చిన రెండు రోజులకే ఈ ఘటన జరిగినట్లు చెబుతున్నారు. ఐరాస తనిఖీ బృందం ఉండగానే తెలివితక్కువగా సిరియా ప్రభుత్వం ఇంతటి అమానుషానికి ఒడిగట్టి చిక్కులు కొనితెచ్చుకుంటుందా? కాబట్టి అసద్ ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టేందుకు తిరుగుబాటుదారులే ఆ పని చేసి ఉంటారని ఎందుకు భావించకూడదు? సాయుధ తిరుగుబాటుదారుల్లో పచ్చిమితవాద, మతవాద శక్తుల దగ్గర నుంచి అల్‌ఖైదా అనుబంధ ఉగ్రవాదుల వరకూ ఇలా అనేక రకాలవారున్నారు. వీరిలో కొందరు నాడి మండల వ్యవస్థను దెబ్బతీసే సెరీన్ వంటి ప్రమాదకర రసాయనిక పదార్థాలతో గతంలో అధికారులకు పట్టుబడిన ఉదంతాలు ఉన్నాయి. అయినా, కుట్రలు, కుతంత్రాల్లో రాటుదేలిన అమెరికా గూఢాచారి సంస్థ (సిఐఎ), పెంటగాన్ చెప్పినవే పరమ సత్యాలన్నట్లుగా అమెరికన్ వార్తా సంస్థ ఎబిసి న్యూస్ స్వీకరించి, తదనుగుణంగా కథనాలు గుప్పిస్తుంటే దానినే యథాతథంగా ఇక్కడ మన కార్పొరేట్ మీడియా ప్రచారం సాగిస్తోంది.

'రసాయనిక' దాడి గురించి అదే పనిగా ఊదరగొట్టిన పాశ్చాత్య మీడియా కూడా ఈ దాడికి ఫలానా దళం కారణమని ఎక్కడా చెప్పిన దాఖలాలు లేవు. నిజానిజాలను నిర్ధారించుకోకుండానే అసద్ ప్రభుత్వాన్ని నిందిస్తున్నారు. తద్వారా సిరియాలో సైనిక జోక్యానికి అవసరమైన ప్రాతిపదికను సృష్టిస్తున్నారు. ఈ చర్య ద్వారా అసద్ ప్రభుత్వం అన్ని రకాల హద్దులు మీరిందని టర్కీ వ్యాఖ్యానిస్తే, నిజంగానే ఇది రసాయనిక దాడి అయితే సిరియాలో సైనిక జోక్యానికి ఎంతమాత్రం వెనుకాడబోమని ఒబామా హూంకరించాడు. ఇజ్రాయిల్ సంగతి సరేసరి. ఫ్రాన్స్ కూడా అదే బాటలో పయనిస్తున్నది. సిరియాను మరో ఇరాక్‌గా మార్చాలని ఒబామా ప్రభుత్వంపై అవి ఒత్తిడి పెంచుతున్నవి. దీనికి ఐరోపాలోని దాని మిత్రులు వంతపాడుతున్నారు. అమెరికా పాలకులు బ్రిటన్, ఫ్రాన్స్, ఇజ్రాయిల్, సౌదీఅరేబియా, ఈజిప్టు, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ తదితర దేశాలతో మంతనాలు సాగిస్తున్నారు.

సిరియా సంక్షోభంపై చర్చించేందుకు ఆగస్టు 28న హేగ్‌లో జరగాల్సిన ద్వైపాక్షిక సమావేశాన్ని రద్దు చేయాలని అమెరికా తీసుకున్న నిర్ణయంపై మాస్కో విచారం వ్యక్తం చేసింది. రష్యా, అమెరికా దౌత్యవేత్తల మధ్య జరగాల్సిన సమావేశాన్ని రద్దు చేసినట్లు అమెరికా ప్రకటించిన అనంతరం మాస్కో దీనిపై విచారం వ్యక్తపర్చింది. మరోవైపు అధ్యక్షుడు బరాక్ ఒబామా ఆదేశించినట్లయితే సిరియాపై దాడి చేసేందుకు అమెరికా బలగాలు సిద్ధంగా ఉన్నాయని అమెరికా రక్షణ మంత్రి చుక్ హాగెల్ ప్రకటించారు. అయితే సిరియాపై సైనిక దాడి చేస్తామని అమెరికా బెదిరించడం గత జూన్‌లో లౌఫ్ ఎర్నెలో జరిగిన జి8 సదస్సులో చేసుకున్న ఒప్పందాలను ఉల్లంఘించడమేనని రష్యా విదేశాంగ మంత్రి సెర్జి లవ్రోవ్ అన్నారు.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత పెద్దఎత్తున రసాయనిక ఆయుధాలను తయారు చేసి వినియోగించిన, వినియోగాన్ని ప్రోత్సహించిన దేశం అమెరికాయే. కొరియా, వియత్నాం యుద్ధాలలో సెరీన్ అనె నెర్వ్ గ్యాస్, నాపామ్ వంటి జీవ, రసాయనిక ఆయుధాలను అమెరికా విపరీతంగా వినియోగించడం వల్ల వాటి దుష్ప్రభావాలకు ఆ ప్రాంత ప్రజలు, పర్యావరణం ఘోరంగా దెబ్బతిన్న విషయం విదితమే. 1980-88 మధ్య జరిగిన ఇరాన్ - ఇరాక్ యుద్ధంలో అమెరికా ప్రోద్బలంతో సద్దాం హుస్సేన్ రసాయన ఆయుధాలు వినియోగించాడని సిఐఎ రహస్య పత్రాలు ఆలస్యంగా వెల్లడించాయి. ఇరాన్ యుద్ధంలో ప్రమాధకరమైన రేడియేషన్‌ను కలిగించే డిప్లీటెడ్ యురేనియం (డియు) తో తయారు చేసిన పేలుడు సామాగ్రిని విపరీతంగా అమెరికా వాడింది. దాంతో లక్షలాది మంది ప్రజలు, పిల్లలు తీవ్ర అనారోగ్యానికి గురైన కథనాలు ఎన్నో తర్వాత కాలంలో వెలుగులోకి వచ్చాయి.

సిరియాలో అమెరికా సైనిక చర్యలను అడ్డుకోవాల్సిన అవసరం ఉందని, దీనికి రాజకీయ పరిష్కారాన్ని కనుగొనాలని ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి బాన్‌కీ మూన్ పునరుద్ఘాటించారు. ఐక్యరాజ్యసమితి ఆమోదం లేకుండా సిరియాపై సైనిక చర్యకు దిగడం అంతర్జాతీయ చట్టాలను ఉల్లంఘించడమేనని స్పష్టం చేశారు. సిరియాపై దాడికి ఒబామా అమెరికా పార్లమెంట్ ఆమోదం కోరిన నేపథ్యంలో ఆయన ఈ ప్రకటన చేశారు. అంతర్జాతీయ శాంతిభద్రతలకు భద్రతామండలిదే ప్రాథమిక బాధ్యత అని తాను పదేపదే చెబుతూనే ఉన్నానని న్యూయార్క్‌లో న్యూస్ కాన్ఫరెన్స్‌లో మూన్ చెప్పారు. ఐక్యరాజ్యసమితి ఛార్టర్‌లోని 51వ అధికరణం ప్రకారం స్వీయరక్షణ కోసం మాత్రమే బలప్రయోగానికి దిగడం చట్టబద్ధమని, అలా కాకుంటే ఓ సర్వసత్తాక దేశమైన సిరియాపై ఐరాస భద్రతా మండలి అనుమతి లేకుండా యుద్ధం చేయడం అంతర్జాతీయ నిబంధనలకు వ్యతిరేకమని ఆయన వివరించారు. ఇదే సమయంలో సిరియాపై ఏకపక్ష దాడిని సహించేది లేదని రష్యా హెచ్చరించింది. ఐరాస ద్వారా తప్ప సిరియాపై ఎటువంటి దాడికి పాల్పడినా ఒప్పుకునేది లేదని ఆ దేశ అధ్యక్షుడు పుతిన్ స్పష్టం చేశారు. ఈ మేరకు సిరియాకు పశ్చిమ దేశాల నుంచి రక్షణ కల్పిస్తామని చెప్పారు. అందులో భాగంగా ఎస్ - 300 రకం వైమానిక యుద్ధ క్షిపణులకు సంబంధించిన కొన్ని భాగాలను సరఫరా చేసినట్టు తెలిపారు. భద్రతా మండలి అనుమతి లేకుండా ఆ దేశంపై దాడి జరిపితే మరికొన్ని శక్తివంతమైన క్షిపణులను సైతం అందించేందుకు వెనకాడబోమని పుతిన్ హెచ్చరించారు.

ఇరాక్‌లో వలె అదే అబద్ధాల ఆధారంగా సిరియాపై అమెరికా మరో దురాక్రమణ యుద్ధం చేసేందుకు తలపెట్టింది. అమెరికా తలపెట్టబోయే యుద్ధం అంతత్వరగా ముగిసిపోయే అవకాశం

# మన్మోహన్‌సింగ్ కోరుతున్న ఏకాభిప్రాయం

*విదేశీ సంస్థలకు అనుకూలంగా ప్రభుత్వాలు తెస్తున్న సంస్కరణల అమలుకు ప్రతిపక్షం ఆమోదం తెలపాలని ప్రధాని వ్యక్తం చేసిన అభిప్రాయాన్ని చర్చిస్తున్నారు* **వి. హనుమంతరావు**

ఆర్థిక సంస్కరణలు కొనసాగిస్తామని ప్రధాని మన్మోహన్‌సింగ్ పార్లమెంటులో ఇలా హామీ ఇచ్చారో లేదో తెల్లారేసరికి పెట్రోల్, డీజిల్ ధరలు పెంచేస్తూ ప్రభుత్వ ప్రకటన వెలువడింది. అనగా సంస్కరణలంటే ధరలు పెంచడం అన్న మాట. సంస్కరణలంటే ఏమిటో ఇంత స్పష్టంగా ఆచరణలో తెలియచేసినందుకు థ్యాంక్యూ మన్మోహన్‌జీ. ఆగండాగండీ. గ్యాస్ నిత్యవసరాల ధరల పెరుగుదలలు క్యూలో ఉన్నాయని కూడా సెలవిచ్చారు. గత సంవత్సరం సెప్టెంబర్‌లో కాబోలు రెండవ విడుత సంస్కరణలు ప్రవేశపెట్టి ఇక చూస్కోండన్నారు. సాధించింది రూపాయి పతనం, ఉల్లిపాయల ధర పెరుగుదల, స్థూల జాతీయాదాయం పెరుగుదల ఐదు శాతం కిందకు దిగజారుతూ ప్రధాని బుర్ర తినేస్తున్న ద్రవ్యలోటు, కరెంట్ అకౌంట్ లోటు, రెవెన్యూ లోటు తగ్గకపోవడం సంస్కరణలంటే ఇవే. అయితే ఇలాంటి సంస్కరణలు మాకొద్దు మహాప్రభో అని ప్రజలు ఘోషించాలి. ఎలా? 2014 జనరల్ ఎన్నికలు జరుగక ముందే నాలుగైదు రాష్ట్రాల్లో ఎన్నికలు జరుగనున్నాయి. అప్పుడు ప్రజలు తమ గళాన్ని వినిపించాలి.

దేశ ఆర్థిక పరిస్థితి మూలాలు (ఫండమెంటల్స్) బాగా ఉన్నాయని ప్రధాని బహుశా విదేశీ పెట్టుబడిదారులను దృష్టిలో ఉంచుకొని ప్రకటించారు. ఇదివరలో కూడా ఇలాగే హామీ ఇచ్చారు. మరి దేశ ఆర్థిక పరిస్థితి ఇలా ఎందుకు దిగజారుతుంది? మూలాలంటే ఆర్థిక పరిభాషలో ఏమంటారో గాని, ఏ దేశానికైనా మూలాలు ఆ దేశ ప్రజలు వారు ముక్కుతూ, మూలుగుతుంటే పేదలకు, ధనవంతులకు మధ్య అంతరాలు పెరుగుతుంటే ఆదేం బాగు? చిదంబరం దేశ దేశాలకు పోయి పెట్టుబడులు పెట్టండి అని భిక్షాటన చేసినా స్పందన సున్నా. దేశ ఆర్థిక పరిస్థితి ఎంత ఘోరంగా ఉందో చూసిన తర్వాత, 2014లో కూడా ఈ పరిస్థితి బాగుపడే సూచనలేమీ కానరాని నేపథ్యంలో మెడ మీద తలకాయ ఉన్నవాడెవడూ వాసనైనా చూడడు. అలాంటి నేపథ్యంలో మూలాలు బాగున్నాయని ప్రధానిగా చెప్పడం ఆయన ఎంత దయనీయ పరిస్థితిలో ఉన్నారో తెలుస్తోంది. అలాంటి వ్యక్తిని ప్రధానిగా ఎన్నుకోవడం మనం చేసిన తప్పు. కాదు, కాదు ఆయనను ప్రజలెన్ను కోలేదు. ఆయన పంజాబి అయి ఉండి కూడా పంజాబీలు ఎన్నుకోలేదు. ఎక్కడో అస్సాం శాసన సభ్యులు ఓటు వేస్తే రాజ్యసభలో సభ్యుడై, పరోక్ష ఓటుతో ప్రధాని అయ్యారు. పి.వి. ప్రధాని అయినప్పుడు కూడా దేశ ఆర్థిక పరిస్థితి సంక్లిష్టంగా ఉండడంతో ఆర్థిక శాస్త్రవేత్త కదా అని ఈయనను ఆర్థికశాఖ మంత్రిగా ఎన్నుకొన్నారు. నక్కను తొక్కొచ్చాడేమో ప్రధాని పదవి చేపట్టారు. ప్రజల నెత్తిన బండపెట్టారు.

ఆ బరువును మీరు కూడా ఎత్తుకోనందుకు బిజెపిని తప్పు పడుతున్నారు. ప్రధాన ప్రతిపక్షం ప్రభుత్వంతో ఏకాభిప్రాయంతో ఉండాలట. ఏకాభిప్రాయమంటే అది ప్రతిపక్షం ఎందుకవుతుంది? ప్రభుత్వమేమో అన్ని సమస్యల మీద తన ఇష్టం వచ్చినట్లు నిర్ణయాలు తీసుకొని ప్రతిపక్షం సహకరించాలంటుంది. అప్పుడప్పుడు కొన్ని

---

కనిపించడం లేదు. సిరియాలో అడుగుపెట్టకుండా, గగనతలం నుంచి దాడులు చేయాలని ఒబామా తలపోస్తున్నారు. తిరుగుబాటుదారులు, సిరియాలోని ప్రతిపక్షాలు కూడా అమెరికా జోక్యాన్ని ఎప్పటినుంచో కోరుతున్నాయి. ఈ దాడిని ఎదుర్కొనేందుకు రష్యా, ఇరాన్ సాయంతో అసద్ ప్రభుత్వం కూడా పెద్ద ఎత్తున సన్నాహాలు చేస్తోంది. ఒకవైపు అంతర్యుద్ధం, మరోవైపు యుద్ధభయం నేపథ్యంలో సిరియాలో పరిస్థితులు మరింతగా దిగజారుతాయని, అక్కడి సాధారణ జనజీవనం మరింత అల్లకల్లోలంగా మారే అవకాశముందని నిపుణులు అభిప్రాయ పడుతున్నారు. అసద్‌ను శిక్షిస్తామంటూ అమెరికా చేయబోయే దాడి సిరియా సంక్షోభానికి పరిష్కారం చూపుతుందా? అని వారు ప్రశ్నిస్తున్నారు. అఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లలో యుద్ధాన్ని చేసి చేతులు కాల్చుకున్న అమెరికా ధోరణిలో మార్పు రానట్టు కనిపిస్తోంది. అయితే సిరియాపై దాడికి కాలుదువ్వుతున్న అమెరికాకు మిత్రదేశాల నుంచి మద్దతు కరువైంది. బ్రిటన్‌తో సహా పలు కీలక దేశాలు సిరియాపై దాడిని వ్యతిరేకిస్తున్నాయి.

సిరియా దేశ సార్వభౌమత్వాన్ని కాలరాచే అమెరికా దుర్మార్గపూరిత యుద్ధాన్ని, అసద్ సైనిక దుర్మార్గాలను, అంతర్యుద్ధాన్ని నివారించేందుకు సిరియా ప్రజలు కార్యోన్ముఖులు కావలసి ఉంది. మరోవైపు సిరియా ప్రజల బాధలపట్ల ప్రపంచదేశాల ప్రజలు సానుభూతి చూపాల్సివుంది. ఐరాస చొరవ తీసుకుని రాజకీయ పరిష్కార దిశగా చర్యలకు అమెరికాను ఒప్పించాలి. సైనిక బలాన్ని ఉపయోగించి 'ప్రభుత్వాలను మార్చివేసే' అమెరికా విధానం ఆఫ్ఘనిస్తాన్‌లో, ఇరాక్‌లో ఆ ప్రజలకు మేలు చేయలేదు. సిరియాలో కూడా అంతే! ఈ పరిస్థితుల్లో సిరియాలో హింసకు స్వస్తి చెప్పాలంటే మొదట అక్కడ అమెరికా కుట్రలను అంతమొందించాలి. ఇప్పటికే రష్యా, చైనా వంటి దేశాలు సిరియాలో అమెరికా జోక్యాన్ని అనుమతించేది లేదని తేల్చిచెప్పాయి. అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంగా చెప్పుకునే భారత్ సిరియాకు బాసటగా నిలవాలి. అలాగే మన మీడియా సంస్థలు పాశ్చాత్య ఏజెన్సీల కథనాలను విచక్షణరహితంగా గుప్పించడం మానుకొని సమగ్ర చిత్రం ఇవ్వాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

సమస్యల మీద అఖిల పక్ష సమావేశాలు జరుపుతూ ఉంటుంది. అదొక నాటకం మాత్రమే. ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ విధించి ప్రతిపక్షాలను జైళ్లో పెట్టి ఏకాభిప్రాయం అని ప్రకటించింది. అయినా ఈ రెండు పార్టీల మధ్య తేడా ఏమిటి? అప్పుడు బిజెపి, ఇప్పుడు కాంగ్రెస్ ఇద్దరూ అమెరికాకు దాసోహం చేసినవారే. సరళీకరణను, ప్రపంచీకరణను అమలు పరిచినవారే. ప్రజల మీద భారాలు మోపిన వారే. కొన్ని కొన్ని సమస్యల మీద ఇద్దరూ కూడబలుక్కొని పార్లమెంటులో మెజారిటీతో ప్రజా వ్యతిరేక బిల్లులను ఆమోదింప చేసుకున్నవారే. ఇదొక లాలూచీ కుస్తీ, ఇది కేవలం అధికారపీఠం కోసం కుమ్ములాట. మన రాష్ట్రంలో కాంగ్రెస్ – కెసిఆర్ కుమ్ములాటలాంటిదే. అలాగని ఏకాభిప్రాయం అవసరం లేదని నేనబోవడంలేదు. దేశంలో ప్రజలందరూ ఏకాభిప్రాయం తోనే ఉన్నారు. పేదరికం తొలగిపోవాలి. సమానత్వం సాధించాలి. అందరికీ విద్య, వైద్యం అందుబాటులోకి రావాలి. పారిశుధ్యం నెలకొల్పాలి. స్త్రీలకు సమాన అవకాశాలివ్వాలి. మానభంగం చేసిన వారిని కఠినంగా శిక్షించాలి. ఇలా అనేక విషయాల్లో ప్రభుత్వం, ప్రతిపక్షాలకు మధ్యనే కాదు 121 కోట్ల ప్రజలకు మధ్య ఏకాభిప్రాయం ఉంది. సమస్య ఏమిటంటే అధికారంలో ఉన్న పార్టీ ప్రకటనలకే పరిమితమవుతుంది. మాటల్లో కాదు, చేతల్లో చూపించమని ప్రతిపక్షాలంటున్నాయి.

నెహ్రూ మొదలుకొని మన్మోహన్ వరకూ ప్రజా సంక్షేమమంటూ కొన్ని వందల పథకాలు కాంగ్రెస్ ప్రభుత్వం ప్రకటించింది. అమలు పరుస్తుంది కాని ఫలితాలు ప్రజలకు అందడం లేదు. ఈ విషయాన్ని ప్రతిపక్షం పదే పదే పార్లమెంట్‌లో, బయటా ప్రభుత్వం దృష్టికి తీసుకొని వస్తోంది. అలాంటి నేపథ్యంలో ప్రతిపక్షం పార్లమెంటులో పదే పదే లేవనెత్తకపోతే ప్రజలకు ద్రోహం చేసినట్లవుతుంది. ప్రధాని కోరుకుంటున్న ఏకాభిప్రాయం పై విషయాల్లోనే కాదు, ఆయన ఉద్దేశంలో అవినీతి తరచుగా చర్చల్లోకి రాకూడదు. చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తుంటే వద్దని అనకూడదు. ధరలు చుక్కలు చూస్తుంటే గొడవ చేయకూడదు. రైతుల భూమిని పారిశ్రామిక వేత్తలకు పందారం చేస్తుంటే గప్‌చుప్‌గా ఉండాలి. కార్పొరేట్ బహుళజాతి సంస్థలు వ్యవసాయాభివృద్ధి పేరుతో గ్రామాల్లో ప్రవేశిస్తుంటే చూస్తూ ఊరుకోవాలి. దేశాన్ని రుణగ్రస్తం చేస్తుంటే చూస్తూ ఊరుకోవాలి. పారిశ్రామిక వేత్తలు కార్మికుల శ్రమ దోపిడీ చేస్తుంటే, పర్మనెంట్ కార్మికుల స్థానే కాంట్రాక్టు కార్మికులను స్వల్ప జీతాలతో పనిచేయించుకొంటుంటే మన్నుతిన్న పాములా ఉండాలి. రెవెన్యూలోటు, ద్రవ్యలోటు, కరెంట్ ఎకౌంట్‌లోటు, జిడిపి వృద్ధిలోటు లాంటి విషయాల గురించి తాను ఆందోళన చెందుతున్నా, అదేదో ప్రభుత్వం 'చూస్తుంది' మీరెందుకు పదేపదే ఎత్తిపొడుస్తారు. గమ్మున కూర్చోండి అంటారు.

బ్రిటిష్ పాలనలో నైజాం నవాబ్ పాలనలో కూడా లేని ఆత్మహత్యలు ప్రజలెన్నుకొన్న ప్రభుత్వంలో లక్షలాది మంది చనిపోతుంటే లొల్లి చేయకూడదు. చవక ధరల దుకాణాలు ఎంత అధ్వాన్నంగా నడుస్తున్నా, ఆ కాసిన్ని గింజలైనా లభిస్తున్నాయి. రేపు నగదు రూపంలో బ్యాంకుల్లో జమచేస్తాం తీసుకొమ్మని అంటుంది ప్రభుత్వం. కాని బ్యాంకు నుంచి బయటకు రావడంతోనే వడ్డీ వ్యాపారస్తులు ఆ కాసిన్ని డబ్బులూ గుంజేసుకొంటారన్న విషయం ప్రభుత్వానికి ఎందుకు తట్టలేదు? ఇటు గ్యాస్, అటు బొగ్గు లభించక విద్యుదుత్పాదన కేంద్రాలు నానా తిప్పలు పడుతుంటే, గత మూడు నాలుగు ప్రణాళికల కాలంలో ఎప్పుడూ లక్ష్యాన్ని చేరుకొని నేపథ్యంలో వచ్చే ఐదేళ్లలో దేశంలో ప్రతి ఇంటికి విద్యుత్ అందజేస్తాం అంటే మెడమీద తలకాయ ఉన్నవారెవరు నమ్మరు. తిండిగింజలకు దిక్కులేదు కాని ప్రతి ఇంటికి సెల్ ఇస్తారట? ప్రజలు నవ్వి పోతారనే జ్ఞానం కూడా ప్రభుత్వానికి లేదా? వర్షాభావం వల్లే ధరలు పెరిగాయట. మరి ఇబ్బడి ముబ్బడిగా పంట పండిన సంవత్సరాల్లో కూడా ధరలు పెరుగుతూ వచ్చాయెందుకు?

2008లో అమెరికాతో సహా ప్రపంచ దేశాలన్నీ కనివిని ఎరుగుగని ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోగా మనదేశం కాస్త కుదుపుకు లోనైనా నిలబడగలిగింది. కాని రెండు సంవత్సరాలుగా మనం సంక్షోభంలో ఎందుకు కూరుకుపోయాం? యూరోప్ సంక్షోభాన్ని అడ్డం పెట్టుకొని, తమ చేతకాని తనాన్ని కప్పిపుచ్చుకొనే దుర్గతిలో ప్రభుత్వం పడింది. విదేశీ పెట్టుబడులను మన్మోహన్ ఆహ్వానించినా, ఆహ్వానించికపోయినా వాళ్లు సిద్ధంగానే ఉన్నారు. కార్మికులు తక్కువ వేతనాలకు లభిస్తారు. కాబట్టి మరిన్ని లాభాలు చేసుకోవచ్చునని వారు రావడానికి సిద్ధమే. అయితే మనదేశం ఆర్థిక సంక్షోభంలో పడి, పెట్టుబడుల కోసం నానాగడ్డి కరవడం చూసి, ఇదే అదునుగా మరింత ఒత్తిడి చేస్తే మరిన్ని లాభాలు దండుకోవచ్చునని వేయిట్ అండ్ సీ విధానాన్ని అవలంభిస్తున్నారు. అయితే న్యాయవ్యవస్థ మడి కట్టుకొని కూర్చోలేదు కదా. మన రాష్ట్రంలోనే కోట్ల రూపాయలను బొక్కేదామనుకున్న న్యాయాధిపతులు సిబిఐ బోనులో పడ్డారు. కేంద్రప్రభుత్వంలో అవినీతిపరుల గురించి వేరే చెప్పనవసరం లేదు. కేంద్రం ఎటువంటి దుస్థితిలో ఉందంటే ఇటీవల సుప్రీంకోర్టు ఒక విషయంలో తీర్పు ఇస్తే, ఆ తీర్పును పునఃపరిశీలన చేయమని కేంద్రం అడిగిందంటే, మన్మోహన్‌సింగ్ తన పనేదో తను చేసుకోవాలి. పరిపాలన విషయంలో జోక్యం చేసుకోకూడదని అసహనం వ్యక్తం చేశారంటే అది రాజ్యాంగానికి తూట్లు పొడవడమే అవుతుంది. ఈ నేపథ్యంలో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయాధిపతి ఆగస్టు 15 ఉత్సావాల సందర్భంలో ప్రభుత్వానికి ఒక చురక అంటించారు.

ఇంత సుదీర్ఘంగా చర్చించానుగాని, ప్రధాని అధ్యక్షత వహించే మంత్రిమండలిలో ఏకాభిప్రాయం ఉందా? పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీ కేంద్రమంత్రిగా, ప్రస్తుతం ముఖ్యమంత్రి పదవిలో ఉండగా, భిన్నాభిప్రాయాలను ప్రకటిస్తుండగా, కేంద్ర ఆహారమంత్రి చవాన్ మంత్రిమండలి సమావేశాన్ని బాయ్‌కాట్ చేయడం, డిఎంకె నాయకుడు ప్రభుత్వం ఇరుకున పడడాన్ని అవకాశంగా తీసుకొని, ఒత్తిడితెచ్చి, తన కూతురిని బెయిల్ మీద విడిపించుకోవడం లాంటి పరిణామాలు ఏకాభిప్రాయాన్ని ప్రకటించడమా? ప్రతిపక్షం, ప్రభుత్వ పక్షం పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి గీటురాయి. ఏ దేశంలోనైనా, ప్రధానికి ఆరాధ్య దేశమైన అమెరికాలో కూడా ఏకాభిప్రాయం లేదే? రాజకీయ పార్టీల మాటలు అలా ఉంచితే, ఇటీవల జరిగిన వివిధ రాష్ట్రాల ఎన్నికల్లో ప్రజలు కాంగ్రెస్‌ను చిత్తుగా ఓడించినా కేంద్రంలో చూరుపట్టుకొని వేళ్లాడుతోంది.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# మేం మళ్లీ వస్తాం! - 2

***సోవియట్ యూనియన్, చైనా పతనాలతో మార్క్సిజం అంతం కాలేదని విశ్వసిస్తూ, ఆ రెండు అనుభవాలను తన శైలిలో విశ్లేషించిన తోలేటి జగన్మోహనరావు 'మేం మళ్లీ వస్తాం' పై*** **రంగనాయకమ్మ** ***సమీక్షావ్యాసం***

*(గత సంచిక తరువాయి…)*

**వ్యక్తి పూజల ముచ్చట్లు**

కమ్యూనిస్టు నాయకుల వ్యక్తి పూజల గురించి, ఈ పుస్తకం కాస్సేపు ఇటూ, కాస్సేపు అటూ చెప్పి, చదివే వాళ్లని గందరగోళ పరుస్తుంది. స్టాలిన్ వ్యక్తి పూజని ముద్దుగా సమర్థిస్తూ, మావో వ్యక్తి పూజని ఆగ్రహంగా దుయ్యబట్టింది!

స్టాలిన్ వ్యక్తి పూజ 'అధికారికంగా' కూడా సాగినట్టు చెప్పి, దాన్ని 'సమర్థనీయమే' అంటారు రచయిత (161 పేజీ నించీ). 'స్టాలిన్ ఒక మహా నాయకుడు' అనే విశేషణాలు చాలా సాగాయి. ప్రజలు, 'సమర్థుడైన' నాయకుణ్ణి గుర్తించి గొప్ప ఆరాధనతో అలా పొగిడి గౌరవిస్తారట. నాయకుడి పేరుతో ఉత్తేజితులవుతారట. వ్యక్తి పూజ అనేది, ప్రజలు ప్రేమతో చేసేదట. 'అధికారికంగా' చేయించిన దాన్ని ప్రజలే చేశారనడం! 'పార్టీయే స్టాలిన్, స్టాలినే పార్టీ అన్న భావం ప్రజలలో బలపడింది' అని! స్టాలిన్ అసలు నిరాడంబర వ్యక్తేనట గానీ, 'ఈ నిరాడంబర వ్యక్తి తనని అతిగా పొగడడం ఎందుకు అంగీకరించాడు?' అని ఒక ప్రశ్న వేసి, 'తనని పొగడడం అంటే పార్టీని పొగడడమే' అనుకోవడం వల్ల అలా అంగీకరించి వుంటాడని రచయిత జవాబు! 'అతని అంగీకారం లేకుండా అతని వ్యక్తి పూజ జరిగిందనలేం. అతడు, తన మీద విశ్వాసం పార్టీ మీద విశ్వాసంగా, తన పట్ల గౌరవం పార్టీ పట్ల గౌరవంగా, భావించి వుండవచ్చు' అని తేల్చారు.

స్టాలినే స్వయంగా, 'అలా భావించి పొగిడించుకున్నాను' అని చెప్పడం అయినా కాదు! 'స్టాలిన్ అలా భావించి వుంటాడు' అని రచయిత చెప్పడం! నిజానికి స్టాలినే, 'అలా భావించి పొగిడించుకుంటున్నాను' అని చెప్పి వుంటే, దాన్ని 'బుద్ధి లేని భావించడం'గా చెప్పి గడ్డి పెట్టవలసి వుంటుంది. ఆ భావించడం 'గొప్ప భావించడం' అన్నట్టు, ఈయన దానికి సమర్థన!

తనని పూజించడమే పార్టీని పూజించడంగా స్టాలిన్ భావించాడా? 'పార్టీ' అంటే, లక్షల మంది సభ్యులు వుంటారు. కేంద్ర కమిటీలో, పొలిట్ బ్యూరోలో, స్టాలిన్ లాంటి సభ్యులే వందల మంది వుంటారు. స్టాలిన్ కూడా వారిలో ఒక సభ్యుడు. వ్యక్తి పూజ, పార్టీకి వర్తించేది అయితే, అది, పార్టీలో వున్న లక్షలాది సభ్యులందరికీ వర్తించాలి. ఆ వ్యక్తి పూజలో స్టాలిన్ పేరు ఒక్కటే ఎందుకు వినపడింది? ఆ పేరు తప్ప రెండో సభ్యుడి పేరేదైనా వినపడిందా? స్టాలిన్ విగ్రహాలే, స్టాలిన్ మెడలో దండలే, పార్టీ పూజ ఎలా అయింది?

పార్టీని గౌరవించడం అయితే, పార్టీ చిత్రానికి ఒక దండ వేస్తే అది నాయకుడి పూజ అవదు. 'పార్టీ' అంటే, నాయకుడు ఒక్కడే కాదు; పార్టీ శక్తి, నాయకుడి ఒక్కడి శక్తే కాదు. విప్లవకారులనే వాళ్ళు సిద్ధాంతం నేర్చుకుని దాన్ని ఆచరించడం గాక, పార్టీ కోసం అయినా దండలు పట్టుకుని తిరగడం కాదు.

'స్టాలిన్, వర్గ శత్రువుతో పోరాటంలో తన వ్యక్తి పూజని ఒక ఆయుధంగా' భావించి వుంటాడని కూడా రచయిత చెప్పడం! 'కారణాలు ఏమిటో స్పష్టంగా తెలియకపోయినా, అతని వ్యక్తి పూజ తరుచూ అతిగా సాగిందన్నమాట నిజం' (పే. 362). స్టాలిన్ పూజ అలా ఎందుకు అతిగా సాగిందో కారణాలు రచయితకి తెలియలేదు! అంటే, స్టాలిన్ పూజకి ఏవో గొప్ప కారణాలు వుండి వుంటాయనీ, అవి తెలియలేదనీ! స్టాలిన్ పూజ వల్ల ఏమీ నష్టం లేదని కూడా! 'స్టాలిన్ వ్యక్తి పూజ వలన, సోవియట్ యూనియన్‌కి నష్టం వాటిల్లిందనడం అసత్యం' (పే. 362). స్టాలిన్ పూజ వల్ల నష్టం లేదని వాదన! ప్రజలకు మూఢత్వం బోధిస్తూ, వారిని నాయకుడికి బానిసల్ని చెయ్యడం, వారికి నష్టం కాదా? నష్టం లేదంటే లాభం కనపడాలి. రుజువైందా లాభం?

ఇక, మావో వ్యక్తి పూజ మీద రచయిత వాదన చూడండి! స్టాలిన్ మీద పొగడ్తల్ని తారుమారు చెయ్యండి, చాలు. 'చైనాలో మావో వ్యక్తి పూజ పరాకాష్ఠకు చేరి వెర్రి తలలు వేసింది. …. మావో వ్యక్తి పూజ వలన చైనాలో ఎటువంటి దుష్పరిణామాలు సంభవించాయో మనం చూశాం' (పే. 362). – మావో వ్యక్తి పూజ వల్ల, దుష్పరిణామాలూ, నష్టాలూ! స్టాలిన్ పూజ వల్ల లాభాలూ!

'అన్ని అవధులూ దాటి అత్యంత జుగుప్సాకరంగా సాగిన మావో వ్యక్తి పూజ …… మావో చేతుల్లో ఒక ఆయుధమైంది. ప్రజలను చైతన్యవంతులను చెయ్యడం పోయి, …… మూర్ఖులుగా తయారుచేసే ప్రయత్నం జరిగింది' (పే. 187).

స్టాలిన్ పూజ కూడా ప్రజల్ని మూర్ఖుల్ని చెయ్యడం కాదా? అది నష్టం కాదు, ఇదే నష్టం! స్టాలిన్ పూజని ప్రజలు ఆరాధనతో చేస్తారు, మావో పూజని అలా చెయ్యరు!

మావో పూజని విమర్శించే చోట, చాలా పక్షపాతం లేకుండా చెపుతున్నట్టు, స్టాలిన్ పూజ మీద కూడా చిన్న విమర్శ సాగింది. చెయ్యవలసిన పొగడ్తలన్నీ చేసేశాక! ఆ పూజలు ప్రజలే చేసినట్టు, అసలు చేయించుకున్న వాళ్లని వదిలేసి, ప్రజలు అలా చెయ్యకూడదని ప్రజలకే బోధన!

'సోషలిస్టు ఉద్యమంలో, కమ్యూనిస్టు ఉద్యమంలో, వ్యక్తి పూజ అవాంఛనీయమైనది. స్టాలిన్ గాని, మావో గాని, మరో నాయకుడు గాని, అతను జీవించి వున్న కాలంలో అతని వ్యక్తి పూజని (ప్రజలు) అంగీకరించకూడదు. ……. వ్యక్తి పూజ పేరుతో, జీవించి వున్న ఒక నాయకుడి పట్ల అంధ విశ్వాసం ప్రకటించడం, ఉద్యమానికి తీవ్ర నష్టం కలగజేస్తుంది…….. ముఖ్యంగా మావోయిస్టు ఉద్యమంలో వ్యక్తి పూజ ఒక అవాంఛనీయ ధోరణిగా మారింది' (పే. 362). అవాంఛనీయ ధోరణి, మావోయిస్టు ఉద్యమంలోనే, స్టాలినిస్టు ఉద్యమంలో కాదు. ఇంత పక్షపాతం గల తీర్పు కన్నా అవాంఛనీయ ధోరణి వుంటుందా?

ఒకే పేజీలో, ఒకే చోట స్టాలిన్ పూజ గురించి చెప్పిన దానికీ, మావో పూజ గురించి చెప్పిన దానికీ, ఏమైనా సంబంధం వుందా? ఈ బోధనలో, ప్రజల్ని గాక, నాయకుల్ని విమర్శించింది ఏమైనా వుందా? వ్యక్తి పూజని 'పార్టీ మీద గౌరవం'గా ఒక చోట చెప్పి, మావో మీద విమర్శ మొదలుపెట్టిన తర్వాత మొత్తం వ్యక్తి పూజని దుయ్యబడితే, అది మావో మీద వ్యతిరేకతే గానీ, నిజంగా వ్యక్తి పూజ మీద వ్యతిరేకత అని నమ్మగలమా? వ్యక్తి పూజ విషయంలో, వ్యతిరేకిస్తే ఇద్దర్నీ వ్యతిరేకించాలి; సమర్థిస్తే ఇద్దర్నీ సమర్థించాలి. స్టాలిన్ పూజకి గొప్ప కారణాలు వున్నట్టూ, మావో పూజని ప్రజలు నిష్కారణంగా చేసినట్టూనా చెప్పడం!

ఈ పుస్తకం, అసలు, 'నాయకత్వం' అనే దానికి ఎంత పాత్ర వుంటుందో దానికి అంత స్థానమే ఇచ్చి సరిపెట్టదు. నాయకుణ్ణి 'దేవుడంతటి' వాడిగా నిలబెడుతుంది. నాయకుడికి నీతి నియమాలు లేకపోతే అది సమస్యే కాదంటుంది. అది అతని 'కుటుంబ విషయం' అంటుంది. నాయకుడి వ్యసనాల వల్ల రాజకీయాల్లో దెబ్బ తగలకపోతే, వాటిని పట్టించుకోవద్దంటుంది. ఇదీ సోషలిస్టు నీతి!

నాయకుడిగా ఎదిగిన వాడికి, కొంత సిద్ధాంత జ్ఞానమూ, ఉద్యమాల్లో అనుభవాల వల్ల కొంత సమర్థతా వుంటాయి. అవే లేకపోతే, ఆ వ్యక్తి ప్రజలకి నాయకుడిగా కనపడడమే జరగదు. అయినప్పటికీ, గౌరవాలు పొందే విషయంలో, నాయకుడు కూడా సామాన్య కార్యకర్తతో సమానుడే. ఎవరి డ్యూటీలు వాళ్ళు చేస్తారు. ఎంత చిన్న ఉద్యమానికైనా నాయకుడు ఒక్కడే కారకుడు కాలేడు. రెండో సభ్యుడు లేకుండా నాయకుడు ఒక్కడూ ఎందుకూ పనికి రాడు. పార్టీలో లక్షల మంది సభ్యుల కృషి లేకుండా నాయకుడు ఏమీ చెయ్యలేడు. నాయకుడు ప్రజలతో సమానుడిగా వుండాలి. మార్క్సిస్టు అయితే, కనీసం వుండవలసిన చైతన్యం అది. ఆ దృష్టి నాయకుడికీ, పార్టీకీ, ప్రజలకీ, అందరికీ వుండాలి. పూజ లంతంత గౌరవాల్ని చేసే వాళ్ళు చెయ్యకూడదు; చేయించుకునేవాడు చేయించుకోకూడదు. 'నేను గొప్ప వాడిని' అని తనకి పూజలు చేయించుకునే నాయకుడు, ప్రజలకి మంచి లక్షణాలు ఏం నేర్పుతాడు?

పొగడ్తల కోసం, కీర్తుల కోసం, ఆశపడే అల్పులు, ఆచరణలో సరైన పద్ధతిలో వుంటారని నమ్మక్కర్లేదు. తప్పనిసరై కొన్ని మంచి పనులు చేస్తారు. సోషలిస్టు పీఠం ఎక్కినవాడు భూముల్ని జాతీయం చెయ్యక ఏం చేస్తాడు? అది శ్రామిక ప్రజలకు అనుకూలమైన పని కాబట్టి, వాళ్ల దృష్టిలో అతడు గొప్ప నాయకుడవుతాడు. నాయకు లవడంలో చాలా రహస్యాలు వుంటాయి. కీర్తుల కోసం, వ్యక్తి పూజల కోసం, వెంపర్లాడే వాళ్లని, కమ్యూనిస్టులుగా గుర్తించక పోవడమే కాదు, మానవ మాత్రులుగానే గుర్తించనక్కరలేదు. అది, మానవ సంస్కారం కాదు. మానవ సంస్కారం, తోటి మానవులతో సమానత్వం!

ఇంకో వింత! మావో, తన వ్యక్తి పూజ ముచ్చట్లు ఇంకా ప్రారంభించని కాలంలో, స్టాలిన్ వ్యక్తి పూజ జరుగుతూ వుండడం చూసి, దాన్ని చాలా విమర్శించాడని ఈ రచయిత వ్యాఖ్య! అప్పటికి మావో, వ్యక్తి పూజ రుచి ఎరగడు కదా?

'కృశ్చేవ్ ధోరణిలోనే చైనా పార్టీ కూడా, స్టాలిన్ తన వ్యక్తి పూజని అంగీకరించి, ప్రోత్సహించి' చేయించుకున్నాడని రాసింది (పే. 112). – చైనా పార్టీ, స్టాలిన్ వేపే గానీ, మావో వేపు తల తిప్పలేదు.

'స్టాలిన్ వ్యక్తి పూజ, స్టాలిన్ అధి భౌతిక వాదానికి ఉదాహరణ అని విశ్లేషించిన మావో, తన వ్యక్తి పూజని తాత్వికంగా సమర్థించడం కనిపిస్తుంది' (పే. 199). – మావో, స్టాలిన్ వేపే చూశాడు గానీ, తన వేపు చూసుకోలేదు. ఈ పుస్తకం రచయిత, మావో వేపే గానీ, స్టాలిన్ వేపు చూడరు. – అలా వుంటారు మేధావులు!

ఇరు పక్షాల్లోనూ వ్యక్తి పూజల వింతలు అనేకం వున్నాయి. ఏదైనా ఒక ఉద్యమం చేసినప్పుడు, దానికి 'మహత్తర' అనే విశేషణాలు పెట్టకూడదు. 'మహత్తర సాంస్కృతిక విప్లవం' కొన్నాళ్ళే సాగి, ఆ తర్వాత కొనసాగకపోతే, ఆ పేరే నవ్వుల పాలవుతుంది. నగరాలకీ, బిల్డింగులకీ, రోడ్లకీ, నాయకుల పేర్లు పెట్టడం మాత్రం నాయకుల వ్యక్తి పూజలు కావా? నాయకుల రచనలూ, సిద్ధాంత విషయాలూ, అనేకం వుంటాయి. శ్రామిక ప్రజలకు అవి తెలియాలి. 'సమ సమాజ భవన్' అనో, 'శ్రామిక వర్గ పోరాట భవన్' అనో, 'వర్గ రాహిత్య సదన్' అనో, 'విముక్తి నగర్' అనో, సరైనన పేర్లే ఎంచవచ్చు. విజయవాడలో, ఏలూరు రోడ్డు పేరు చాలా కాలం నించి 'మార్క్సు రోడ్డు'! మార్క్సుకి చేసిన మర్యాద అది!

**పెట్టుబడిదారులు లేని కార్మికులు:**

ఈ పుస్తకంలో చెప్పిన విషయాల్లో ప్రధానమైనది, స్టాలిన్ కాలం అంతా సోషలిజంగా గడుస్తోంటే, దాన్ని కృశ్చేవ్ పాడుచేసి, దాన్ని ప్రైవేటు పెట్టుబడిదారీగా మార్చాడు అని. స్టాలిన్ కాలపు సోషలిజం కోసం ఈ పుస్తకం చూపించిన సాక్ష్యాలు, అర్థం చేసుకోవడానికి తగినవిగా లేవు.

స్టాలిన్ కాలాన్ని చెపుతూ ఈ రచయిత, 'కేపిటలిస్టు అనే పరాన్నభుక్కు లేకుండా కార్మిక వర్గం వుండగలదు. అలా వుండగలదని సోవియట్ యూనియన్ చరిత్ర రుజువు చేసింది' అంటారు (పే. 286). – అంటే, స్టాలిన్ కాలంలో కేపిటలిజం లేదని చెప్పడం ఇది.

అలా చెప్పిన స్టాలిన్ మాటల్ని కూడా ఇలా చూపించారు: స్టాలిన్: 'సోవియట్ సమాజంలో, కార్మికులు, కర్షకులు, మేధావులు, కలిసి మెలిసి జీవిస్తున్నారు. .... దోపిడీ నించి విముక్తి చెందిన సోవియట్ యూనియన్‌లో వైరుధ్యాలు లేవు, వర్గ సంఘర్షణలు లేవు' (పే. 331).

'కర్షకులు' అంటే రైతులు, సరే. 'కార్మికులు' ఎవరు? పెట్టుబడిదారులు లేనప్పుడు 'కార్మికులు' ఏమిటి? 'మేధావులు' అన్నారు. వాళ్ళెవరు? వాళ్ళు కూడా శ్రమలు చేసే వాళ్ళే అయితే, వాళ్ళు కూడా 'కార్మికుల్లోకి' రారా? వర్గాలు లేని, వైరుధ్యాలు లేని సోషలిజంలో, 'కార్మికులు' అనే తేడా వుందంటే, వాళ్లకి యజమానులెవరో వున్నారని అర్థమే కదా? డైరెక్టర్లే, మేనేజర్లే యజమానులు కదా? యజమానీ శ్రామిక సంబంధాలు గత సమాజాల్లో లాగే వుండి, 'కార్మికులు' అనే తేడా ఇంకా నిలబడి వుంటే, వైరుధ్యాలు లేకపోవడం ఏమిటి? 'సోషలిజం' ఏమిటి?

సోషలిజంలో అందరూ శ్రమలు చెయ్యాలనేది, మొట్ట మొదటి షరతు. అలా జరుగుతోంటే, అందరూ ఒకే రకంగా 'ఉత్పత్తి దారులే'. వారిలో, యజమానులూ – కార్మికులూ అనే విభజన వుండదు. అలా వుంటే, అది సోషలిజం అవదు. దోపిడీ సంబంధాల్లో ఏర్పడిన వర్గ పదాలు, దోపిడీ లేకపోవడం నిజమైతే, మారాలి. వర్గాలు లేనే లేవు – అంటారు. కానీ జనాల్ని, కార్మికులూ – డైరెక్టర్లూ అన్న తేడాలతో వుంచుతారు.

దోపిడీ సమాజాల్లో, ప్రభుత్వం అనేది, శ్రామిక ప్రజల్ని అణిచే స్వభావం కలది కాబట్టి, ఆ పాలనతో ప్రజలకు అవసరం లేదు కాబట్టి, ఆ ప్రభుత్వపు ఖర్చుల్ని తమ శ్రమల ద్వారా భరించవలసిన బాధ్యత శ్రామిక వర్గానికి వుండదు. అందుకే, దోపిడీ సమాజాల్లో, ప్రభుత్వానికి దోపిడీదారులు చెల్లించే పన్నులు కూడా 'శ్రామిక వర్గ అదనపు విలువ'లో భాగమే అవుతాయి. కానీ, సోషలిజంలో వుండే ప్రభుత్వం, దోపిడీని వ్యతిరేకించే లక్ష్యం గల ప్రభుత్వం కాబట్టి, దాని ఖర్చులన్నిటినీ తమ శ్రమల ద్వారా పెట్టుకోవలసిన బాధ్యత, ఆ సమాజపు ప్రజలకు వుంటుంది. ప్రజల శ్రమ విలువలో కొంత భాగం, 'సోషల్ ఫండ్'గా ('సమాజ నిధి'గా) ప్రభుత్వపు ఖర్చుల కోసం వెళ్లవలసి వుంటుంది. కానీ, అలా వెళ్ళిన సోషల్ ఫండు, ఎలా ఖర్చవుతుందనేది మళ్ళీ ప్రశ్న. దాన్ని డైరెక్టర్లూ అధికారులూ, తమ పదవుల పేర్లతో తినేస్తూ వుంటే, ఇక సోషలిజం పని అయినట్టే.

ఉత్పత్తులు తయారయ్యే సంస్థల్లోనూ, ప్రభుత్వ సంస్థల్లోనూ, డైరెక్టర్లు, మేనేజర్లు, చేసే పనులు కూడా సమాజానికి అవసరమే. కానీ, వారికి అత్యధిక జీతాలూ, ప్రత్యేక సౌకర్యాల ఏర్పాట్లూ, ఆడుతూ పాడుతూ చేసే అతి తక్కువ పని కాలాలూ, అలా ఆ పరిస్థితులన్నీ, శారీరక శ్రమల కార్మికుల పరిస్థితుల నించీ అత్యధికమైన తేడాలతో వుంటే, అది కొత్త సమాజం కాదు, పాత సమాజమే.

'స్టాలిన్ కాలంలో వర్గాలు పోయాయి' అని, ఈ పుస్తకం ఎంత చెప్పినా, మళ్ళీ ఈ పుస్తకమే ఇచ్చే సమాచారం చూస్తే, మొదటి మాట రద్దయిపోతుంది. 'స్టాలిన్ కాలంలో కూడా వేతనాల్లో అంతరాలు కొనసాగాయి' (పే. 328) అని చెప్పి, 'విలువ సూత్రాన్ని బట్టి అలా జరుగుతుంది' అంటారు. మేధా శ్రమకి ఎక్కువ విలువా, శారీరక శ్రమకి తక్కువ విలువా వుండడం సహజమే, అత్యవసరమే కాబట్టి, ఆ తేడాలు న్యాయమైన స్థాయిలో వుంటే, సోషలిజం ప్రారంభమైన కాలంలో అది ప్రశ్న కాదు. కానీ, ఆ తేడాలు, న్యాయమైన స్థానంలోనే వున్నా, మనుషులు ఆ తేడాలతో వుండవలసిందేనా? ఒక మనిషి ఎప్పుడూ రోడ్లు ఊడ్చేవాడూ, ఇంకో మనిషి ఎప్పుడూ డాక్టరూ! అలాంటి తేడాల్ని మార్క్సు గమనించ లేదా? – గమనించాడు. ఆ మనుషుల స్థితుల్ని సమానం చేసే మార్గాన్ని మార్క్సు చెప్పలేదా? – చెప్పాడు. ప్రతీ మనిషీ, మేధా శ్రమలూ, శారీరక శ్రమలూ కూడా చెయ్యాలి అని చెప్పాడు.

ఆ మార్పు, 'మారకం విలువ' కోణంలోనూ, 'ఉపయోగపు విలువ' కోణంలోనూ కూడా మానవ సంబంధాల్ని సమానం చేస్తుందని చెప్పాడు. దీన్ని ఇక్కడ చూడలేము.

చైనాలో, సాంస్కృతిక విప్లవ కాలంలో, పాత శ్రమ విభజనని మార్చే ప్రయత్నాలు కొన్ని ప్రారంభమయ్యాయి. రష్యాలో అది ఎన్నడూ లేదు. స్టాలిన్ కాలం 30 ఏళ్ల పాటు సాగింది. ఆ కాలంలో, శారీరక శ్రమకూ – మేధా శ్రమకూ వుండే వైరుధ్యాన్ని తగ్గించే, తీసివేసే విధంగా పాత శ్రమ విభజనని మార్చే ప్రయత్నాలు ఎక్కడా కనపడవు. పైగా, లెనిన్ కాలంలో, అత్యవసర పరిస్థితుల్లో ప్రారంభమైన 'నూతన ఆర్థిక విధానం' నియమాలు, స్టాలిన్ కాలంలో కూడా సాగుతూనే వున్నాయని ఈ రచయిత చెప్పారు. అంటే, సమాజంలో ఇంకా అనేక రకాల వైరుధ్యాలు ఎప్పటిలాగే వుండగా, అది సోషలిజం ఎలా అయింది?

**'విలువ'ని తెలియని సోషలిజం చర్చ**

'విలువ' గురించి వివరించేటప్పుడు ఈ రచయిత, 'వస్తువు విలువ, దానిలో వున్న శ్రమ శక్తి విలువని బట్టి నిర్ణయించబడు తుంది; వేతనాలు కూడా అలాగే నిర్ణయించబడతాయి' అన్నారు (పే. 329).

'శ్రమ శక్తి విలువ'ని బట్టి నిర్ణయమయ్యేది 'వేతనాలు' మాత్రమే. 'వస్తువు విలువ' కాదు. వస్తువు విలువ నిర్ణయమయ్యేది, వస్తువు తయారీకి అవసరమైన శ్రమ విలువని బట్టే; శ్రమ శక్తి విలువని బట్టి కాదు. (ఆ వాక్యాల్లో, ఒక చోట 'శ్రమ విలువ' అని పడడానికి బదులు, 'శ్రమ శక్తి విలువ' అని పడి అచ్చు తప్పు జరిగిందని సర్దడానికి వీలు వుండదు. 'వేతనాల' విషయంలో జరిగేటట్టే, 'వస్తువు' విషయంలో కూడా జరుగుతున్నట్టు రెంటికీ ఒకే విధంగా చెప్పారు. కాబట్టి, అక్కడ అచ్చు తప్పు వ్యవహారం ఏమీ లేదు.) వేతనాల విలువా, వస్తువు విలువలో సజీవ శ్రమ భాగమూ, ఒకటే అయితే, 'అదనపు విలువ' అనే భాగానికి అర్థమే వుండదు. మార్క్సిజాన్ని నేర్చుకోవడంలో ఇది మొట్ట మొదటి పాఠం. ఒకటో క్లాసు పాఠం. దీన్ని నేర్చుకోడానికి మళ్ళీ ఒక సారి 'కాపిటల్' దగ్గిరికి వెళ్ళాలి. ఈ పుస్తకంలో, ఉత్పత్తి సంబంధాల్ని 'ఆస్తి సంబం ధాలు'గా చెప్పడం; వస్తువు విలువని, 'శ్రమ శక్తి విలువ'గా చెప్పడం; ఇటువంటి అతి చిన్న విషయాల్లో కూడా పెద్ద పొరపాట్లు అక్కడక్కడా కనపడుతున్నాయి.

'కృశ్చేవ్, సోషలిజం స్థానంలో, పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరణకు అడుగులు వేశాడు' (పే. 360) అన్నారు. అంటే, అప్పటి దాకా వున్నదంతా సోషలిజం అనీ, స్టాలిన్ కాలంలో పెట్టుబడిదారీ విధానం అంతా అంతరించిందనీ, కృశ్చేవ్ కొత్తగా అది ప్రారంభించాడనీ, పదే పదే చెప్పారు.

కానీ, స్టాలిన్ కాలంలో కూడా అట్టడుగు ప్రజలకూ, ఉన్నత స్థానాల వారికీ మధ్య, అంతరాలు పెరిగిపోవడం మీద కొన్ని ఆరోపణలు వున్నాయని కూడా ఈ రచయితే చెప్పారు. కానీ, ఆ ఆరోపణల గురించి చెప్పి, వాటిని తిరస్కరించడానికే, జనాల్లో వున్న అంతరాల్ని సమర్థించడానికే ప్రయత్నించారు. స్టాలిన్ కాలంలో, ఉత్పత్తి సంస్థల్లో టైమ్ వర్కు (అందరికీ ఒకే టైము) పద్ధతి గాక, పీస్ వర్కు (పని కాలంలో, చేసిన పనిని కొలిచే) పద్ధతీ, బోనస్‌ల పద్ధతీ వంటి పెట్టుబడిదారీ వ్యక్తిగత ప్రోత్సాహకాల పద్ధతులే వున్నాయని ఈ రచయితే చెపుతారు (పే. 394). ఆ పద్ధతులే అవసరం – అంటారు. ఆ నాటి 'సామాజిక వాస్తవాన్ని' బట్టే స్టాలిన్ భౌతిక వాద దృష్టితో అలా సరిగా చేసినట్టు (మావో అయితే, అలా సరిగా చెయ్యనట్టు) చెపుతారు. కార్మికులు, తమ సంపాదనని పెంచుకునే పద్ధతులనే ఇష్టపడతారు గానీ సోషలిజం కావాలనే ఆదర్శం కోసం పనిచెయ్యరు – అంటారు ఈ రచయిత. 'కార్మికుల విస్తరాకుల్లో ఆదర్శాలు వడ్డించి తినమంటే, కార్మిక వర్గం సోషలిజం పట్ల విముఖత చూపుతుంది' అని (పే. 395) రచయిత వాదిస్తారు.

శ్రమ దోపిడీ నించి బైట పడాలి – అనేది, 'విముక్తి'. అది, ఆత్మ రక్షణ. దాన్ని ఏదో 'ఆదర్శం'గా కమ్యూనిస్టు పార్టీ చెప్పదు. కార్మికుల విస్తరాకుల్లోకి ఏ పదార్థం వచ్చినా, ఏ ఆదర్శం వచ్చినా, కార్మికులు తమ శ్రమతో, తమ ప్రయత్నంతో తెచ్చుకునేదే వస్తుంది. తెచ్చుకోకపోతే ఏదీ రాదు. కార్మికుల కోసం ఆదర్శాలు ఎవరో తెచ్చి వడ్డించరు. కార్మికుల ప్రయత్నమే లేకపోతే, వారికి నిండు భోజ నాలూ వుండవు, ఆదర్శాలూ వుండవు. ఏళ్ల తరబడీ నిరుద్యోగాలతో బికారి తనాలతో, అలాగే వుంటారు.

అయితే, కార్మికులు పెట్టుబడిదారీ ప్రోత్సాహక పద్ధతుల్ని ఎప్పుడు వదిలేస్తారని ఈ రచయిత చెపుతారంటే, సమాజంలో అన్ని రంగాలూ మారినప్పుడే కార్మికులు మారతారనీ, అంత దాకా పీసు వర్కునే ఇష్టపడతారు గానీ మారరనీ, ఆ సామాజిక వాస్తవాన్నిబట్టే స్టాలిన్ నడిచాడనీ, ఆ పద్ధతుల్ని వుంచాడనీ, – అలా, స్టాలిన్ మీద ఆరోపణల ఈగల్ని తోలే వాదనలు చేస్తారు ఈ రచయిత.

మచ్చుకి, రచయిత వాదం: 'సోషలిస్టు వ్యవస్థలో, సామాన్య ప్రజానీకం, సోషలిజం నిర్మాణానికి నడుం కట్టి పని చేస్తారా, లేక తాము సుఖంగా బతకడానికి పనిచేస్తారా?' (పే. 394).

'సోషలిస్టు వ్యవస్థలో' అన్నారు మొదట. శ్రామిక జనం, పాత రకంగానే యజమానులకు దాస్యం చేసే పద్ధతులనే సుఖం అని భావిస్తూ వుంటే, అది అసలు 'సోషలిస్టు వ్యవస్థ' ఎలా అయింది? భూముల్ని ప్రభుత్వ ఆస్తిగా, ఆ ఆస్తికి లీగల్ హక్కు మార్చేసి, భూస్వామిని డైరెక్టర్‌ని చేసేస్తే, అది సోషలిస్టు వ్యవస్థ అయిపోయిందా?

ఇంకా చూడండి: 'సోషలిస్టు ఆదర్శాలతో ప్రభావితులైన అల్ప వర్గంగా కొందరు వుంటే వుంటారు గానీ, మొత్తం కార్మికులు అలా వుంటారా?' అని వాదం! రచయిత: 'సోషలిస్టు వ్యవస్థ దిగువ దశలో, అల్ప సంఖ్యాక వర్గం తప్ప, కార్మికులు గానీ, కర్షకులు గానీ, ఇతర శ్రమ జీవులు గానీ, ప్రజల మొత్తం గానీ, తాము సుఖంగా జీవించడానికే పని చేస్తారు గానీ, కమ్యూనిస్టు సమాజం నిర్మించడానికి పని చెయ్యరు' (పే. 394). – పెట్టుబడిదారీ పద్ధతులే 'సుఖంగా జీవించే' పద్ధతులు అయితే, ఆ జనం, అసలు పెట్టుబడిదారీ పాలనని ఎందుకు వదులుకున్నారు?

*(ఇంకా ఉంది)*

*(రచయిత బహు గ్రంథకర్త, మార్క్సు 'పెట్టుబడి' పరిచయకర్త)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన-19

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్.సరళా వందనం**

*(గత సంచిక తరువాయి...)*

**భూ సంస్కరణల అమలులో సమస్యలు**

10. భూస్వాములు చాలా చోట్ల విలాసవంతమైన జీవితం గడుపుతూ తమ ఆధీనంలోని భూములను తనఖా పెట్టడం, వ్యాపారులకు స్యూరిటీగా పెట్టి అప్పులు తీసుకోవడం, భూమి శిస్తు కట్టకపోవడం, వీరికున్న ఇతర ఆస్తులపై పన్ను బకాయిలు చెల్లించకపోవడం లాంటి పలు చిక్కులు, తగాదాలు, వ్యాజ్యాలలో భూములు ఉండడం వలన సాగుచేసుకొనే అసలు వ్యవసాయదారులు భూములపై హక్కులు పొందలేక పోయారు.

11. ఇనాందారులు, బంజరు దారులు, కౌలుదారులకు భూమి శిస్తు తగ్గింపు ఉండడం, ప్రభుత్వ నీటి పారుదల వ్యవస్థల నుండి నీరుపారించుకొనే హక్కులు ఉండడంతో పాటు వీరికి 30 సంవత్సరాల లీజుతో మొదలు పెట్టి భూములపై శాశ్వత శిస్తు వసూలు హక్కులు ఉన్న సందర్భంలో వాటిని తొలగించే నిబంధనలు లేకపోవడం వలన వందల వేల ఎకరాలు వీరి స్వాధీనంలో ప్రభుత్వ భూసంస్కరణ చట్టాల పరిధిలోకి రాకుండా ఉంది. వీరి నుండి ప్రభుత్వానికి భూమి శిస్తు పూర్తిగా రాకపోగా వీరి స్వాధీనంలో ఉన్న భూములను సాగుచేసుకొనే వారికి ఆ భూములపై హక్కులు కల్పించడం కుదరలేదు.

12. వాస్తవ వారసులు లేని భూములు వారి పేరునే రికార్డులలో నమోదు చేసి ఉండడం వలన చాలా భూములు సాగులో లేకుండా పడావుగా ఉన్నాయి. వాటిని పంపిణీ చేయడానికి అవి జి రాయితీ లేదా పట్టా భూములవడం వలన ప్రభుత్వానికి అవకాశం లేకుండా పోయింది.

13. దేశాన్ని విడిచిపెట్టి, ఇక్కడ భూములను కూడా విడిచి పెట్టి వెళ్లిన వాళ్లకు సంబంధించి వారి ఆధీనంలోనే భూములున్నట్లుగా రికార్డులు ఉండడంతో ఆ భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడానికి, లేదా పంపిణీ చేయడానికి అవకాశం లేకుండా పోయింది.

14. కౌలుదారుల చట్టం ద్వారా భూమిపై హక్కు పొందడానికి 10 సంవత్సరాలలో 6 సంవత్సరాలు వ్యవసాయం చేయాలనే నిబంధన కింద ఒక వ్యక్తి 3 సంవత్సరాలు కౌలు చేసి తరువాత వేరే వ్యక్తి ఇంకో 4 సంవత్సరాలు కౌలు చేయడం పై వ్యాజ్యాలు చాలా చోట్ల పెండింగ్‌లో ఉండి కౌలుదారులకు భూమిపై హక్కులు కల్పించడంకుదరకపోగా భూస్వాములకు హక్కులు పొందే అవకాశం దక్కింది.

15. హైదరాబాద్ టెనెన్సీ చట్టం 1950 సెక్షన్ 47, 48ల ద్వారా తహసిల్దార్ వద్ద అనుమతి (ఈ అనుమతిని కలెక్టర్ ధృవీకరించాలి) పొంది భూ బదిలీ చేసుకోవచ్చు. ఈ నిబంధన ద్వారా వందల ఎకరాలను భూస్వాములు అమ్ముకున్నారు. ఈ అమ్మకాలకు నాజిమ్‌జమాబంది (సెటిల్ అధికారి) తహసిల్దారు వద్ద ఉత్తర్వులకు సంబంధించిన అనుమతులు మంజూరు చేయించుకొని భూస్వాములు లబ్ధి పొందారు.

16. వందల వేల ఎకరాల భూములున్న జాగీర్దారులు, జమీందారులు, దేశ్‌ముఖ్, దేశ్‌పాండేల వారసులు, హిందూ వారసత్వ చట్టం, ముస్లిం పర్సనల్ లా చట్టం కింద వతన్ దారులుగా భూమిపై హక్కుల కోసం రకరకాల రెవెన్యూ, సివిల్, హైకోర్టులలో తమ పేరుమీద భూమిని పొందడానికి వ్యాజ్యాలు నడిపించారు. ఇంకొంతమంది కౌలుదారులకు, ఇనాందారులకు దక్కకుండా ఉండడానికి వ్యాజ్యాలు వేసి, భూపంపిణీ జరగకుండా అడ్డుకున్నారు.

17. భూస్వాములు భూమి శిస్తు, పేష్‌కాష్, పన్నులు, స్థానిక సుంకాలు, రుసుంలు, లీజులు, తక్కావి రుణాలు, స్యూరిటీల ద్వారా రావలసిన బకాయిలు చెల్లించకుండా ఉన్న పక్షంలో, వీరి హక్కులో ఉన్న భూములను ల్యాండ్ రెవెన్యూ చట్టం 1317 ఫసలీ సెక్షన్ 130 నుంచి 144 వరకు ఉన్న నిబంధనల ద్వారా, రెంట్ రికవరీ చట్టం 1865, రెవెన్యూ రికవరీ చట్టం 1864 ద్వారా స్వాధీనం చేసుకొని ప్రభుత్వం వేలం వేసింది. ఈ వేలం ద్వారా పేదలకు, ఆ భూములలో సాగు చేసుకొనే రైతులకు హక్కులు కలుగకపోగా, తిరిగి వేలంలో ధనికులే ఈ భూములను కొనుక్కున్నారు.

18. భూ పంపిణీ ద్వారా భూములు పొందినవారు, లావుని పట్టాలు పొందినవారు, కౌలుదారులు, సేవా ఇనాందారుల పేర్ల మీద హక్కులు మార్పు చేస్తూ ఉత్తర్వులు జారీ చేసినా వాస్తవ హక్కులు కల్పించే గ్రామ రికార్డులు, సెటిల్‌మెంట్ రికార్డులలో మార్పులకు సంబంధించిన సప్లిమెంటరీ సేత్‌వార్‌లు జారీ చేయకపోవడం, సర్వే సెటిల్‌మెంట్ అధికారులు రికార్డులలో పేర్లు మార్పు కోసం ఉత్తర్వులు జారీ చేయకుండా సాగుదారులను వేధించారు.

19. వివిధ స్థాయిల్లోని అధికారులైన ఎస్టేట్ సెటిల్‌మెంట్ అధికారులు ఇనాం సెటిల్‌మెంట్ అధికారులు జాగీరు అడ్మినిస్ట్రేటర్‌లు, అతియత్ అధికారుల వద్ద, వందల, వేల కేసులు విచారణలో ఉండడంతో ఒక అధికారి దగ్గర నుంచి ఇంకో అధికారి దగ్గరకు, బోర్డ్ ఆఫ్ రెవెన్యూ దగ్గర వివిధ స్థాయిల్లో వ్యాజ్యాలు నడుపుతూ, ఈ భూములలో సాగు చేసుకునే వారికి హక్కులు రాకుండా చేశారు.

20. అడవులలో నివసించే కొండ జాతి ప్రజలకు కౌలుదారుల చట్టాలు, ఇనాందారుల రద్దు చట్టాలు వర్తించవు. కేవలం మద్రాసు రాష్ట్రంలోని ఏజెన్సీ ప్రాంతాల భూ బదిలీ చట్టం 1917 ద్వారా ప్రభుత్వం నియమించిన కలెక్టర్ లేదా ఏజెన్సీ డివిజన్ అధికారికి సివిల్, క్రిమినల్ దావాలు తీర్చే అధికారంతో పాటు, గిరిజన ప్రాంతాలుగా నిర్ణయించిన అటవీ ప్రాంతాల ప్రజలను ముఠాలుగా ఏర్పరచడం, లేదా గిరిజన సముదాయాలకు అటవీ ఉత్పత్తులపై అధికారాన్ని వేలాల ద్వారా అప్పగించడం జరిగింది. ఈ ముఠా నాయకులు తమకు అప్పగించిన

వందల వేల ఎకరాల విస్తీర్ణంలో నివసించే గిరిజనులకు రుణాలిచ్చి అవి తీర్చ లేని పక్షంలో వాళ్లు సాగు చేసుకొనే భూములను స్వాధీన పర్చుకోవడమే కాకుండా వాళ్లతో వంశపారంపర్యంగా నౌకరి (గొత్తి నౌకరి) చేయించుకునేవారు. 1937–38 నుంచి మొదలైన గిరిజనోద్యమంతో 1940 జూలై 14 సంవత్సరంలో గొత్తి నౌకరి రద్దు చట్టం చేశారు. మద్రాసు రాష్ట్ర భూభాగానికి సంబంధించి చేసిన ఈ ఒక్క చట్టం తప్ప గిరిజనుల భూసంస్కరణలకు సంబంధించి ఎలాంటి చట్టం లేదు. నిజాం పాలనకు సంబంధించిన భూభాగంలో నోటిఫికేషన్–2 ద్వారా 1949 నవంబర్ 16 తేదీన 'మద్రాసు రాష్ట్ర ఏజెన్సీ భూముల బదిలీ చట్టం' 1917ను యథాతథంగా ఈ ప్రాంతానికి ప్రభుత్వం వర్తింపచేసింది. కాని ఈ ముఠాలు, రెవెన్యూ అధికారుల దౌర్జన్యాల వలన కమ్యూనిస్టులలో తీవ్రవాద భావజాలం ఉన్న వాళ్లు గిరిజనులకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రతిఘటించడానికి తమ ప్రయత్నాలు ఈ ఏజెన్సీ ప్రాంతాలలో ముమ్మరం చేశారు. దానితో రాష్ట్రం మొత్తంలో ఉన్న ఈ ఏజన్సీ ప్రాంతాలకు కూడా భూ సంస్కరణలు చేపట్టాల్సిన అవసరం ఏర్పడింది.

21. భూమిపై హక్కులకు గరిష్ట పరిమితి లేక పోవడంతో చట్టాలలో ఉన్న నిబంధనల ఆధారంగా సాగు చేసుకొనే రైతులకు భూములను దక్కనీయకుండా భూస్వాములు రెవెన్యూ యంత్రాంగం దగ్గర వివిధ స్థాయిల్లో వచ్చిన ఉత్తర్వులపై అప్పీలుకు పోవడం, సివిల్ కోర్టులలో బినామీలతో తామే వ్యాజ్యాలు నడిపించడం చేశారు. జారీచేసిన ఉత్తర్వులలో ఉన్న చిన్న చిన్న లోపాలకు గాను వివిధ స్థాయి రెవెన్యూ అధికారులు మొదటి స్థాయి అధికారి దగ్గరకు పునఃపరిశీలనకు పంపడం, ఒక్కొక్క కేసులో సంవత్సరాల తరబడి కాలయాపన కావడం, చాలా చోట్ల రెవెన్యూ యంత్రాంగం భూస్వాములకు పూర్తి స్థాయిలో సహకారం అందించడంతో వాస్తవంగా సాగుచేసుకొనే హక్కు దారులకు భూమిపై అధికారం దక్కలేదు.

22. ప్రభుత్వం 1948లో జమిందారీ రద్దు చట్టం తరువాత ఎస్టేట్ భూములన్నింటిలో సర్వే జరిపింది. ఈ సర్వే 1958 సంవత్సరానికి పూర్తి చేశారు. 1960 సంవత్సరానికి ఈ సర్వే జరిగిన భూములలో సెటిల్‌మెంట్ రికార్డులు తయారీ పూర్తయి ఎవరి ఆధీనంలో ఎంత భూమి ఉందనే లెక్క తేలడంతో వందల వేల ఎకరాలు చాల చోట్ల ఒక కుటుంబ కమతం కింద ఉన్నట్టుగా తేలింది.

సర్వే సెటిల్‌మెంట్ వేసి ఆకమిటీ, భూ సంస్కరణ అమలు తీరుపై భారత ప్రభుత్వం గుల్జారీ లాల్ నందా కమిటీ సూచనల మేరకు భూమిపై వాస్తవ సాగుదారులకు హక్కులు రావాలన్నా, పేదవానికి భూ పంపిణీ సక్రమంగా జరగాలన్నా, భూ సంస్కరణ చట్టాల లక్ష్యం నెరవేరాలన్నా వ్యక్తిగత భూమి హక్కులపై గరిష్ఠ పరిమితి ఉండాలని నిర్ణయించింది. 1960 సంవత్సరంలో హైదరాబాద్ వ్యవసాయ సంస్కరణల కమిటీని వేశారు. ఆ కమిటీ సూచనలను అనుసరించి ఒక కుటుంబానికి ఉండాల్సిన భూమిపై గరిష్ఠ పరిమితిని విధించే చట్టం చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది.

భారత ప్రభుత్వ రాష్ట్రాల పునఃవ్యవస్థీకరణ చట్టం 1956 (స్టేట్ రి ఆర్గనైజేషన్ 1956) ద్వారా నిజాం పాలనలోని భూ భాగంలోని మరాఠీ భాష మాట్లాడే వారిని, మద్రాసు రాష్ట్ర భూభాగంలో కన్నడ భాష మాట్లాడే వారిని, ఒరియా భాష మాట్లాడే వారిని మహారాష్ట్ర, ఒరిస్సా, కర్ణాటక రాష్ట్రాలలో కలిపారు. కేవలం తెలుగు మాట్లాడే వారితో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం 1956 నవంబర్ 1న ఆవతరించింది. రాష్ట్రం ఏర్పడిన తరువాత మద్రాసు రాష్ట్ర భూభాగంలోని చట్టాలను స్టేట్ రిఆర్గనైజేషన్ చట్టం 1956, సెక్షన్ 3 ద్వారా కొత్తగా బదలాయించిన హైదరాబాదు ప్రాంత రాష్ట్ర భూ భాగాలకు మద్రాసు రాష్ట్ర రెవెన్యూ చట్టాలను భూ సంబంధ పాలనకోసం పొడిగించారు. ముందుగా హైదరాబాద్ బోర్డు ఆఫ్ రెవెన్యూను ఆంధ్ర బోర్డు ఆఫ్ రెవెన్యూలో విలీనం చేశారు.

హైదరాబాద్ రాష్ట్ర భూ భాగానికి వర్తింప చేసి సవరణ చేసిన చట్టాలలో ముఖ్యమైనవి

**ఆంధ్రప్రదేశ్ భూ ఆక్రమణ (విస్తరణ, సవరణ) చట్టం 1958**

మద్రాసు రాష్ట్ర భూ ఆక్రమణ చట్టం 1905లోని నిబంధనల ద్వారా ప్రభుత్వ భూములను దురాక్రమణ చేసుకున్నా, ప్రభుత్వానికి రావలసిన బకాయిలను వసూలు చేసుకోవాలన్నా, చట్ట పరంగా భూములున్న పట్టా దారులు, పోట్ పట్టా దారులు, జిరాయితీ భూములలో ఉన్నవారి భూములు దురాక్రమణ జరిగినా, ఉండవలసిన భూ విస్తీర్ణం కన్నా ఎక్కువ విస్తీర్ణంలో ఆక్రమణలున్నా, నిబంధనల మేరకు నోటీసు ఇచ్చి భూ ఆక్రమణ నుంచి ఆక్రమణదారుని తొలగిస్తారు. ఈ చట్టానికి హైదరాబాద్ రాష్ట్ర ల్యాండ్ రెవెన్యూ చట్టం 1317 ఫసలీ నిబంధనలు యథాతథంగా అతిక్రమించకుండా అమలు చేస్తూ, మిగిలిన నిబంధలను వర్తింపచేశారు.

**ఆంధ్రప్రదేశ్ సర్వే, బౌండరీల (విస్తరణ, సవరణ) చట్టం 1958**

మద్రాసు రాష్ట్ర సర్వే, బౌండరీల చట్టం 1923లోని సెక్షన్ 5 ద్వారా ఏదేని సర్వే ప్రారంభించినపుడు ముందుగా భూ యజమానికి, ఆసక్తి కలిగిన వారికి నిర్దేశిత ప్రదేశానికి రావడానికి నోటీసులివ్వడం, సెక్షన్ 9(1) ప్రకటన ద్వారా (వివాదాలు, అభ్యంతరాలు, ఆక్షేపణలు, సూచనలు, సవరణల) సర్వేజరిపిన భూమి గురించి ప్రకటన జారీ చేయాలి. ప్రకటన జారీ అయిన 90 రోజులలో తెలుసుకోవాలి. సెక్షను 10 ద్వారా వివాదాస్పదమని రికార్డులలో సర్వే అధికారి నమోదు చేసిన దానిపై పై అధికారికి అప్పీలు చేకునే హక్కు ఉంటుంది. సెక్షను 13 ద్వారా సర్వే చేసిన నికర వివరాలు జిల్లా గజిట్‌లో ప్రచురించాలి. ప్రచురించిన మూడు సంవత్సరాలలో సెటిల్‌మెంట్ అధికారి వద్ద, లేదా సివిల్ కోర్టులో అప్పీలు దాఖలు చేసుకొనే అధికారం నష్టపోయిన వ్యక్తికి ఉండడంలాంటి నిబంధనలు హైదరాబాద్ ప్రాంత రాష్ట్ర భూ భాగానికి ఈ చట్టం ద్వారా వర్తింప చేశారు.

భూమి కొలతలకు సంబంధించి మాత్రం పూర్వ హైదరాబాద్ రాష్ట్ర భూ భాగంలోని గ్రామీణ ప్రాంతాలకు సంబంధించిన సర్వే సెటిల్‌మెంట్ రికార్డులన్నీ గంటర్ చెయిన్‌తో కొలిచి (ఒక చెయిన్‌కు వంద లింకులుండి 33 అడుగులు ఉంటుంది) తయారు చేశారు కాబట్టి భూమి కొలతలకు అదే వర్తింప చేశారు. పూర్వ మద్రాసు రాష్ట్ర భూభాగానికి మెట్రిక్ గొలుసుతో కొలిచి (ఒక చెయిన్‌కు 66 అడుగులు) రికార్డులు తయారు చేశారు కాబట్టి కొలతలకు అదే ఉంచారు. హైదరాబాద్ ప్రాంత ల్యాండ్ రెవెన్యూ చట్టం 1317 ఫసలీ ఉద్దేశం భూములపై రెవెన్యూ సర్వే సెటిల్‌మెంట్, ఇతర ఖాళీ భూముల సర్వే, భూ ఆక్రమణల క్రమ బద్ధీకరణ, భూ కేటాయింపుల కొరకు కాబట్టి ఈ చట్టంలోని నిబంధనలకు యథాతథంగా వర్తింపచేసి, 1905 చట్టంలోని మిగతా నిబంధనలను రాష్ట్రాల పునఃవ్యవస్థీకరణ చట్టం సెక్షన్ 3 ద్వారా విస్తరింప చేశారు.

(ఇంకా ఉంది)

(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)
saralareddy007@gmail.com

వీ

# సీమాంధ్ర మేధావులారా న్యాయం వైపు నిలబడండి!

**- ఎ. రాజేంద్రబాబు**

తెలంగాణ ప్రకటనకు స్పందనగా 2013 సెప్టెంబర్ వీక్షణంలో ప్రచురితమైన వ్యాసాలన్నింటిలోను 'రెండు ప్రాంతాల్లోనూ అసమానతలు' అన్న వ్యాసం నాకు ఒకింత ఆశ్చర్యం కలిగించింది. నాలో రేగిన ఈ అసంకల్పిత భావ ప్రకంపనలకు కారణం అందులో పేర్కొన్న విషయాలు మాత్రమే కాదు. ఆ వ్యాస రచయిత ఒక సీనియర్ జర్నలిస్ట్ కావడం, అందునా 'వీక్షణం' లాంటి ప్రజాస్వామ్య భావాల గవాక్షానికి వ్యవస్థాపక సంపాదకుడు అయిన ఈయన కూడా తెలంగాణ ఉద్యమాన్ని ఇంత సంకుచిత దృష్టితో పరికించడం నా ఆశ్చర్యానికి కారణం.

ఆ వ్యాసంలో ఉటంకించిన కొన్ని విషయాలపై నా నిరసనను కెసిఆర్‌పై హనుమంతరావు చేసిన ఒక ఆధారంలేని ఆరోపణను ఖండించడంతో ప్రారంభిస్తాను. కెసిఆర్ అడిగిన 'రొట్టె ముక్క' మంత్రి పదవి 'కాస్త పారేసి' ఉంటే ఇంత గొడవ జరిగేది కాదట! ఇది సీమాంధ్ర అహంకారమా! చారిత్రక అజ్ఞానమా! చరిత్రలో సంభవించే పరిణామాలకు కారణం వ్యక్తులేనా? సామాజిక శక్తుల ప్రభావం ఏమి ఉండదా? వ్యక్తుల చుట్టూ చరిత్ర పరిభ్రమిస్తుందని సుద్దులు చెప్పే చరిత్రకారులకు చురకలు పెడుతూ 'క్లియోపాత్రా ముక్కు ఓ అంగుళం పొడవు ఎక్కువ ఉంటే, ఇప్పుడు ప్రపంచం ఇలా ఉండి ఉండేది కాదా' అని ఓ విమర్శకుడు ఎద్దేవా చేశాడు. క్లియోపాత్రా కథ చెప్పడానికి ఇది సందర్భం కాదు కాని, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన రెండు సంవత్సరాలకే వందేమాతరం రామచందర్‌రావు తెలంగాణ హక్కులు హరించ బడుతున్నాయని పెద్ద సభ ఒకటి నిర్వహించిన సంగతి హనుమంతరావుకు తెలిసే ఉంటుంది. తెలంగాణ నుండి వసూలైన రెవెన్యూ అంతా సీమాంధ్రకే ఖర్చు పెడు తున్నారని, కలయిక సమయంలో తెలంగాణలోని మిగులు ధనం ప్రకాశం బారేజ్ రిఫేర్లకు ఖర్చుపెట్టారని ఇది పెద్ద మనుషుల ఒప్పందానికి విరుద్ధమని తెలంగాణ స్పృహ కలిగిన రాజకీయ నాయకులు గొంతు చించుకొని అరుస్తూనే ఉన్నారు.

తెలంగాణ ఎన్‌జిఒల ఉద్యమం వల్లనే కదా అప్పటి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి అన్యాక్రాంతమవుతున్న తెలంగాణకు చెందిన వేలవేల ఉద్యోగాల విషయం తేల్చడానికి ఓ కమిషన్ వేసింది. 1969లో ఉవ్వెత్తున ఎగిసిపడ్డ ఉద్యమం గురించి చెప్పనక్కరలేదు. ఆ తర్వాత జై ఆంధ్ర ఉద్యమం, దేశంలో ఆత్యయక పరిస్థితి, రాజకీయ అనిశ్చితితో నివురుగప్పిన నిప్పులాగా ఉన్న తెలంగాణ మళ్లీ రాజుకోగా ఉలిక్కి పడిన ఎన్‌టిఆర్ ప్రభుత్వం 610 జివో వెలువరించింది. ఇంద్రారెడ్డి తెలంగాణ కోసం ప్రత్యేకంగా ఒక రాజకీయ పార్టీని ఏర్పాటు చేశాడు. బిజెపి 'ఒక వోటు రెండు రాష్ట్రాలు' అని కాకినాడ సదస్సులో తీర్మానం చేసింది. కాంగ్రెస్ ఎంఎల్‌ఎలు తెలంగాణ రాష్ట్రం కావాలని సోనియాగాంధీకి మహాజరు సమర్పించారు. వాజ్‌పేయి నాయకత్వంలో బిజెపి కేంద్రంలో అధికారంలో ఉండగా తెలంగాణ రాష్ట్రం ఇవ్వబోతే తానే అడ్డుకున్నానని చంద్రబాబునాయుడు బహిరంగంగానే ప్రకటించాడు. 1960వ దశకం నుండి ఉస్మానియా, (ఇప్పటి) కాకతీయ విశ్వవిద్యాలయాలకు చెందిన మేధావివర్గం నిరంతరంగా తెలంగాణకు సమైక్య రాష్ట్రంలో జరుగుతున్న అన్యాయాలను నిరసిస్తూ గళ మెత్తుతూనే ఉంది. 1969 ఉద్యమం కంటే ముందు గుంటూరుకు చెందిన నరసింహరావు అనే ఒక వ్యక్తిని ఉస్మానియా యూనివర్సిటీ వైస్‌చాన్సలర్‌గా కాసు బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వం నియమిస్తే రావాడ సత్యనారాయణ నేతృత్వంలో ఉస్మానియా అధ్యాపకవర్గం ఆయనను విశ్వవిద్యాలయంలో అడుగుపెట్టనివ్వలేదు. రాజ్‌భవన్‌లో ప్రమాణ స్వీకారం చేసిన ఆ సీమాంధ్ర ఉపకులపతి యూనివర్సిటీ గెస్ట్‌హౌస్‌లో కూడా రూం ఇవ్వకపోతే బయట ఒక లాడ్జ్‌లో వారం రోజులు ఉండి చేసేదేమీలేక గుంటూరుకు తిరుగుముఖం పట్టిన సంగతి సీనియర్ జర్నలిస్ట్ అయిన హనుమంతరావుకు గుర్తుండే ఉంటుంది.

వివక్షకు, అణిచివేతకు, అప్రజాస్వామిక వ్యవహారశైలికి వ్యతిరేకంగా నాలుగున్నర దశాబ్దాలుగా రూపుదిద్దుకొన్న ఈలాంటి అనేక పరిణామాలకు ఒక సంపూర్ణ రాజకీయ స్వరూపం కెసిఆర్ నాయకత్వంలోని 'తెలంగాణ రాష్ట్ర సమితి' రూపంలో ఏర్పడింది. ఈ తెలంగాణ ఉద్యమ నేపథ్యం అవగాహన లేని ఒక సామాన్య సీమాంధ్రుడు కెసిఆర్‌కు ఆనాడు మంత్రి పదవి ఇచ్చి ఉంటే గొడవే ఉండేది కాదు కదా అని అనుకుంటే అర్థం చేసుకోవచ్చు. కాని ఒక సీనియర్ జర్నలిస్ట్ ఇలాంటి అభిప్రాయం వ్యక్తపరిచారంటే విస్మయం కలుగుతుంది.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే ఫలానా సౌకర్యాలు, మేలు జరుగుతాయని ఉద్యమనాయకులు చెప్పిన గుర్తేలేదట హన్మంతరావుగారికి. పూర్ మెమరీ అనుకోవాలా లేక చదువరులను తప్పుదారి పట్టించి ఉద్యమం పట్ల తేలిక అభిప్రాయం కలిగించే ప్రయత్నం అనుకోవాలా? తెలంగాణ రాష్ట్రంలో కెజి నుండి పిజి దాకా ఉచిత విద్య, కుల, మత ప్రసక్తి లేకుండా అందరు విద్యార్థులకు ప్రభుత్వ ధనంతో హాస్టల్ సౌకర్యం, ఉద్యోగులందరికీ కేంద్ర ప్రభుత్వ వేతనాలు, కాంట్రాక్ట్ ఉద్యోగ వ్యవస్థ రద్దు, దళితుల, ఆదివాసిలలోని ఒక్కో కుటుంబానికి మూడు ఎకరాల సాగు భూమి ఇలాంటివి కొన్ని మానిఫెస్టో రూపంలో రాకపోవచ్చు. కెసిఆర్ పలుమార్లు చెప్పిన విషయాలు ఇవి. తెలంగాణ రాష్ట్రం వచ్చి, టిఆర్ఎస్ అధికారంలోకి వస్తే ఇవన్నీ అమలుపరచడం సాధ్య మవుతుందా, అమలుపరిచే చిత్తశుద్ధి ఉందా అన్నది వేరే ప్రశ్న. రాబోయే తెలంగాణ రాష్ట్రంలో ప్రజల సంక్షేమం కోసం అసలు కార్యక్రమం గాని, విజన్ గాని లేదనడం వాస్తవాలను మరుగుపరచి తెలంగాణ రాజకీయ నాయకత్వం పట్ల చులకనభావం కలిగేట్లు వ్యాఖ్యలు చేయడం సమక్యాంధ్ర మేధావులు చేసే కుట్రగానే అర్థం చేసుకోవాలి.

ఈ మధ్య ఏ రాజకీయపార్టీ అయినా ఎన్నికలు రాకుండా మ్యానిఫెస్టోలు ప్రకటిస్తున్నాయా? తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే ముఖ్యమంత్రిగా దళితున్ని, ఉపముఖ్యమంత్రిగా ముస్లింను ప్రతిపాదిస్తామని చెప్పడం అభ్యుదయకరమైన రాజకీయ కార్యక్రమం కాదా?

తెలంగాణ ఉద్యమం ఉద్యమమే కాదని, అధికారం కోసం రాజకీయ నాయకులు రెచ్చగొట్టిన ఉద్యమమని హనుమంతరావు ఒక కాస్ట్‌లీ కామెంట్ పాస్ చేశారు. రైతుల, వ్యవసాయ కూలీల, పల్లె జనం భాగస్వామ్యం అసలు లేదని నమ్మబలికారు. వారికి ఒక వాస్తవ సంఘటన గుర్తు చేస్తాను. అది 2004 ఎన్నికల సమయం. చంద్రబాబునాయుడు ప్రచారయాత్రలో భాగంగా వరంగల్ జిల్లాలో తిరుగుతున్నాడు. పోతూ పోతూ మార్గమధ్యలో రోడ్డు పక్క పొలంలో దుక్కి దున్నుకుంటున్న ఒక రైతును చూసి తన వాహనం ఆపి, ఆయన దగ్గరికి వెళ్లాడు. 'పంచపై కెగ్గట్టి, నెత్తిన తలపాగా చుట్టిన రైతుకు' తెలంగాణ విషయం ఏం తెలుస్తుందన్న ధీమాతో ఆయనతో మాటలు

కలిపిన చంద్రబాబునాయుడుకు గూబ గుయ్యుమనేలా తెలంగాణ వస్తేనే గాని మా జీవితాలు బాగుపడవని నిర్మోహమాటంగా సమాధానం చెప్పాడు మల్లయ్య. ఈ సంఘటన ఆనాడు దిన పత్రికలలో ప్రముఖంగా వచ్చింది. ఒకప్పుడు 'తెలంగాణ ప్రాంతీయ బోర్డ్' ఒకటి ఉండేది. తెలంగాణలోని భూములను తెలంగాణేతరులు ఈ బోర్డ్ అనుమతి లేకుండా కొనరాదు అన్న పెద్ద మనుషుల ఒప్పందం లోని ఒక నిబంధనను సీమాంధ్ర పెద్దలు లెక్కలేనన్ని సార్లు ఉల్లంఘించారన్న విషయం, ఆ తర్వాత ఆ బోర్డ్ రద్దు కావడంతో యథేచ్ఛగా భూమిని కైంకర్యం చేసుకుంటూ ఉన్నారని ఈ ప్రాంతంలోని రైతులకు, వ్యవసాయ కూలీలకు కూడా తెలిసేంతగా ఉద్యమ వ్యాప్తి జరిగిందని హనుమంతరావు గమనించాలి. కొన్ని లెక్కలు చెప్పి తెలంగాణ జిల్లాల్లో అభివృద్ధి బాగా జరిగిందని, ఆంధ్రా జిల్లాలన్నీ ముందుకేమీ పోలేదని రుజువు చేయడానికి బాగా ప్రయాసపడ్డారు హనుమంతరావు. లెక్కలు పక్కన పెట్టి, ప్రజల జీవన పరిస్థితులు ఒకసారి పరికించండి. అభివృద్ధి సూచికలను పాలకుల కోణం నుంచి కాకుండా ప్రజల కోణం నుంచి చూస్తే అభివృద్ధి అనే మేడిపండులో పురుగులెన్నో అర్థమవుతుంది.

తెలంగాణ రాష్ట్ర ప్రకటనను అమలు కానీయకుండా ఎలాగైనా అడ్డుకొని తీరుతామన్న సీమాంధ్ర పెట్టుబడిదారుల ఆధిపత్య అహంకారం, ధీమా హనుమంత రావు వ్యాసంలో తొణికిసలాడింది. ఈ నిర్ణయం తీసుకుంది కేంద్ర ప్రభుత్వం కానేకాదట! కాంగ్రెస్‌పార్టీ మాత్రమేనట. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రకటనతో కంపరం పుట్టి అలజడికి, కంగారుకు లోనయిన హన్మంతరావు కాంగ్రెస్‌పార్టీయే అధికారంలో ఉన్నదన్న సంగతే మర్చిపోయినట్టున్నారు. యుపిఎ ప్రభుత్వం తరపుననే కదా 2009 డిసెంబర్ 9 నాడు కేంద్ర హోంమంత్రి పార్లమెంటులో ప్రకటన చేశాడు. ఈ యుపిఎ ప్రభుత్వమే కదా అఖిల పక్ష సమావేశాలు నిర్వహించి, అన్ని రాజకీయ పార్టీలను ఆహ్వానించి వాటి అభిప్రాయాలను రికార్డ్ చేసింది. కేంద్ర ప్రభుత్వమే కదా శ్రీకృష్ణ కమిటీ వేసింది. ఈ కేంద్ర ప్రభుత్వమే వేసిన అధికారిక శ్రీకృష్ణ కమిటీ సూచించిన ఆరు పరిష్కార మార్గాల్లో ఒక దాన్ని కేంద్రం అమలు చేస్తోంది. 2013 జూలై 31 నాడు కూడా కేంద్ర ప్రభుత్వం తరపున విత్తమంత్రి చిదంబరం రాజ్యసభలో మళ్లీ ప్రకటన చేశాడు. అది అధికార ప్రకటన కాదా? అధికార పక్షమైన యుపిఎలో మెజారిటీ రాజకీయ పార్టీలు ఉన్నాయి. ప్రధాన ప్రతిపక్షమైన బిజెపి తాము అధికారంలోకి వస్తే వంద రోజుల్లో తెలంగాణ ఏర్పాటు చేస్తామని ప్రకటించింది. ఇంత జరిగినా వారు తలకాయ ఉండి మాట్లాడు తున్నారా' అని అసహనం ప్రదర్శిస్తున్నారు సీనియర్ జర్నలిస్ట్ గారు. ఆహా ఏమి రాజ్యాంగ పరిజ్ఞానం! ఇది సీమాంధ్ర పెట్టుబడిదారుల నుండి అరువు తెచ్చుకున్న దురహంకార, అప్రజాస్వామిక భావజాల ప్రభావం కాక మరేమిటి.

సీమాంధ్ర ప్రజలను గురించి రాస్తూ 'ఆ ప్రాంత ప్రజలు ఎంతకైనా తెగిస్తారు. ఏమైనా చేస్తారు' అన్న మాట వాడారు. ఇంత రెచ్చగొట్టే మాట ఒక పెద్దమనిషి ఎందుకు మాట్లాడుతున్నాడబ్బా! మొన్న హైదరాబాద్‌లో జరిగిన 'సేవ్ ఆంధ్రప్రదేశ్ సభ'లో కూడా ఈ ధోరణే కన్పించింది.

సీమాంధ్ర మేధావి వర్గానికి నా సవినయ విజ్ఞప్తి. కొన్నిసార్లు న్యాయం లేకపోయినా ప్రజలు ఉద్యమాల్లో పాల్గొంటారు. మేధావివర్గం, ముఖ్యంగా పాత్రికేయులు న్యాయంవైపు, న్యాయంకోసం పోరాడుతున్న ప్రజలవైపు ఉండాలి. అలా ఉంటారని ప్రజాస్వామ్య ప్రియులు ఆశిస్తారు. వీ

(...4వ పేజీ తరువాయి)

రంగనాయకమ్మ కాపిటల్ రెండో భాగంలో 448, 509 పేజీల్లో అలా చెప్పారని రాశారు. వ్యాసంలోని విషయం మీద అయితే ఉత్తరాలూ, దాని మీద మళ్లీ వ్యాసాలూ ఎంతో ఉపయోగకరంగా ఉంటాయి. కానీ జవాబుగా ఈ ఉత్తరం రాయకుండా ఉంటే జనార్దన్ రాసినవే నిజాలై కూర్చుంటాయి. కాపిటల్ పరిచయం రెండో భాగంలో 448వ పేజీలో శ్రమ విభజనలో మార్పు గురించి మార్క్స్ మాటలు చెబుతూ 'కమ్యూనిస్టు సమాజం – ఎక్కడైతే ఎవ్వరికీ ఏదో ఒక్క పని మాత్రమే ప్రత్యేకించి ఉండదో, అయినా ప్రతీ వారూ తమకు ఇష్టమైన పనిలో ఎక్కువ శక్తిని సాధించవచ్చునో (కెన్ బికమ్ ఎకంప్లిష్డ్), అటువంటి సమాజం, సాధారణ ఉత్పత్తి క్రమాన్ని నియంత్రించి, నేను ఇవాళ ఒక పనీ, రేపు ఇంకో పనీ చేసేలా, అవకాశం కలిగిస్తుంది. పొద్దున్నే వేటాడ్డానికీ, మధ్యాన్నం చేపలు పట్టడానికీ, ఈ రకంగా చేయడానికి...' మార్క్స్ ఈ మాటల మీద రంగనాయకమ్మ మాటలు ఇవీ – 'మొదటి కొటేషన్‌లో ఉన్న మాటల్లో, వేటాడ్డం, చేపల్ని పట్టడం – కూడా ఉన్నాయి. ఈ ఆహారాలు ఎప్పుడూ ఉండవలసిందేనా? ఆ ఆహారాలకు ఇప్పటికే అలవాటై ఉన్న వారిని తప్పు పట్టడం కుదరదు. చిన్న పిల్లలకు, చిన్న తనం నించీ ఇవి నేర్పకుండా ఉండడమే మంచిది. కమ్యూనిస్టు సమాజంలో, జంతు హింస లేకపోవడమే న్యాయం.' 509వ పేజీలో కాపిటల్‌ని చదవడానికి తాము ఎంత కష్టపడిందీ వివరిస్తూ 'మార్క్స్ – కాపిటల్‌ని చదవడం ప్రారంభించినప్పుడు, దాదాపు 20 ఏళ్ల కిందట, అది ఎంత గందరగోళంగా అనిపించేదంటే, ఆ బాధ చెప్పడానికి వీలులేదు. ఎక్కువ సార్లు విసిగెత్తి పోతూ ఉండేది. మార్క్స్ మీద కోపం కూడా వస్తూ ఉండేది.' అబ్బా, ఏమిటిది! ఏం శైలి! ఏం మనిషి! ఆ గడ్డం ఎందుకూ అసలు? అంత గడ్డం పెట్టుకుంటే ఆ చికాకు తోటే సరిపోతుంది. ఏం తేలిగ్గా రాయగలడూ? 'అని, ఏమీ తోచక ఆ గడ్డాన్ని కాసేపు తిట్టి, మళ్లీ ఎలాగో మూలుక్కుంటూ మళ్లీ చదవడం ప్రారంభించడం !.....' ఈ రెండు పేజీల్లోని ఈ మాటలకి జనార్దన్ తర్జుమా సారాంశం 'గడ్డం పెంచుకున్నాడు, చేపలు తినవచ్చన్నాడు గనుక మార్క్స్ కు మార్క్సిజం తెలియదు' అని రంగనాయకమ్మ రాశారని. అలాంటి అర్థం ప్రత్యక్షంగానైనా, పరోక్షంగానైనా ధ్వనిస్తోందా ఎక్కడైనా? అలాగానీ రాసి ఉంటే ఇన్నేళ్లలో ఆమె మీద వచ్చిన విమర్శల్లో ఒక్క సారైనా ఆ సంగతి ఎవరైనా ప్రస్తావించిఉండరా?

**– జె.ఆర్.నాగభూషణం,** *హోసూరు, తమిళనాడు*

వీక్షణం సెప్టెంబర్ సంచికలో ఎస్. జనార్దన్ – జూలై సంచికలోని తన ఉత్తరాన్ని సమర్థించుకుంటూ – జె.ఆర్. నాగభూషణం, వి. వెంకట్రావు నా ప్రతిస్పందనల్ని విమర్శిస్తూ, మరొక ఉత్తరం రాశారు. తాను రంగనాయకమ్మ మార్క్స్ మీద చేసిన వ్యంగ్య వ్యాఖ్యలు చూపానని, లోకసంచారి మీద ఆమె వ్యాఖ్యల మధ్య 'కన్సిస్టెన్సీ' లేదని విమర్శించాననీ మేము ముగ్గురం మరొక దారిలో వచ్చామని వాపోయారు. రంగనాయకమ్మ మార్క్స్ మీద చేసిన 'వ్యంగ్య వ్యాఖ్యల'కి రుజువుగా, ఆమె రాసిన 'కాపిటల్ పరిచయం, రెండో సంపుటం'లోని 448, 509 పేజీలని చూడమన్నారు. 448వ పేజీలో, కమ్యూనిష్టు సమాజంలో శ్రమవిభజన ఎలా ఉండాలో వివరిస్తూ, మార్క్స్ ఒక ఉదాహరణ చెప్పాడు. ఒక మనిషి, తన జీవితమంతా ఒకే శ్రమ చేసే, గత కాలపు శ్రమ విభజన పద్ధతిని తీసివేసి, ప్రతి మనిషి కొన్ని శారీరక శ్రమలు, కొన్ని మేధోశ్రమలు చేసే పద్ధతి పెట్టాలని చెపుతూ, దానికి సంబంధించి ఒక శ్రమ క్రమాన్ని ఉదాహరణగా చెప్పాడు. ఆ ఉదాహరణలో 1) పొద్దున్నే వేటాడడం, 2) మధ్యాహ్నం చేపలు పట్టడం, 3) సాయంత్రం పశుపోషణ చేయడం, 4) రాత్రికి సాహిత్య విమర్శ – అనే శ్రమలని ప్రస్తావించాడు. వేటాడడం, చేపలు పట్టడం అనే రెండు శారీరక శ్రమలూ మాంసాహారం కోసమే కదా. శాఖాహారం కోసం చేసే శారీరక శ్రమల్ని కూడా ఉదాహరణగా చూపించితే, బాగుండేదని రంగనాయకమ్మ అభిప్రాయపడ్డారు. ఇంత స్పష్టమైన విషయాన్ని వంకరగా అర్థం చేసుకుని 'గడ్డం పెంచాడు. చేపలు తినమన్నాడు' అని రంగనాయకమ్మ మార్క్స్‌ని హేళన చేసిందనే బురదచల్లడం తప్ప, జనార్దన్ తన ఉత్తరంలో రంగనాయకమ్మ 'రచనా పద్ధతి' మీద విమర్శగా రాసిందేమీ లేదు.

ఇక ఆయన ప్రస్తావించిన 509వ పేజీలోని విషయాలను కూడా చర్చించుకుందాం. ఆ పేజీలో, రంగనాయకమ్మ – తాను మొదట్లో కాపిటల్ ఒరిజినల్ చదవడానికి, ఎంత కష్టపడింది. ఎంత చికాకు పడింది – వివరిస్తూ, తనకి మార్క్స్ మీద అప్పుడప్పుడు కోపం వచ్చేదని 'అబ్బా, ఏమిటిది! ఏం శైలి! ఏం మనిషి! ఆ

గడ్డం ఎందుకూ అసలు? అంత గడ్డం పెట్టుకుంటే, ఆ చికాకు తోటే సరిపోతుంది. ఏం తేలిగ్గ రాయగలడు?' అని అనుకునే దానినని, కొంచెం అర్థమవ్వగానే 'ఇంకా ఎప్పుడూ కోపం తెచ్చుకోకూడదు. ఓపిగ్గా చదువుకోవాలి. అంతే మరీ, ఆయనకి బోలెడు సమస్యలూ, ఆర్థిక బాధలు, అనారోగ్యమూ! పైగా గడ్డమూ! అయినా ఆరోజుల్లో శైలి అది!' అనుకుని, పాత కోపాన్ని వదిలించుకొని, మళ్లీ చదవడం ప్రారంభించేదానినని చెప్పుకొచ్చింది. చదవడం పూర్తి చేశాక, 'ఇంత తేలిగ్గా ఉందే! దీన్నేనా అప్పుడు అంత విసుక్కున్నదీ!' అని ఆవిడ అనుకున్న సంగతి కూడా అదే పేజీలో ఉంది. ఆపేజీ మొత్తం చదివితే, ఆవిడకి మార్క్స్ మీద ఎంత గౌరవమో, ప్రేమో తెలుస్తుంది. కఠినమైన పాఠాలు బోధించే ఉపాధ్యాయుడి పట్ల, ఆ పాఠాలు అర్థం చేసుకోవడానికి ప్రయాసపడే ఒక విద్యార్థికి కలిగే సహజమైన స్పందన అది. 'ఆర్థిక విషయాలకి సంబంధించి తాను అనుసరించిన విశ్లేషణా పద్ధతి, ఇంతకు ముందు ఎవరూ అనుసరించినది కాదనీ, అందువలన కాపిటల్‌లోని ప్రారంభపు చాప్టర్లు చదవడం కొంచెం కష్టంగానే ఉంటుందని' మార్క్సే స్వయంగా అన్న సంగతి జనార్ధన్ తెలుసుకుంటే మంచిది. 509వ పేజీలో నుంచి 'గడ్డం' అనేమాటనీ, 448వ పేజీలో నుంచి 'చేపలు పట్టడం' అనే మాటనీ విడదీసి, 'గడ్డం పెంచుకున్నాడు. చేపలు తినమన్నాడు మార్క్స్' అని రంగనాయకమ్మ మార్క్స్‌ని హేళన చేసిందనే ఆరోపణాస్త్రం సంధించారు జనార్ధన్. మీ మనస్సులో రంగనాయకమ్మ పట్లా ఎంత వ్యతిరేకత ఉందో తెలుసుకోవడానికి, ఇంతకంటే నిదర్శనమేముంది? మీకు, మేమేదో తీవ్ర వ్యతిరేకతను, ద్వేషాన్ని అంటగట్టామని వాపోవడమెందుకు?

'నూటయాభై ఏళ్లుగా ఏ బూర్జువా ఆర్థికావేత్తకీ తట్టని గొప్ప వాదన, మార్క్సిస్టులెవరూ జవాబు చెప్పలేని పొరపాటు మార్క్స్ రచనలో ఉందని రంగనాయకమ్మకి తట్టిందట.' – అనే మాట ఒకటి చాలా వెటకారం దట్టించి – ఉత్తరంలో జనార్ధన్ రాశారు. మార్క్స్‌కి ముందు సామాజిక ఆర్థిక శాస్త్రవేత్తలు లేరా? వాళ్లేవరికి 'తట్టని' శ్రమ 'దోపిడి' మార్క్స్‌కి మాత్రమే తట్టిందా అనడంలాంటి మాటేయిది. ఏ సిద్ధాంతమైనా, వాదమైనా, విమర్శకీ, చర్చకీ అతీతంకాదు. శ్రమ దోపిడి రహస్యాన్ని ప్రపంచానికి శాస్త్రీయంగా తెలియజేసి, దోపిడి, పీడనల విముక్తికి మార్గం చూపిన మార్క్సిజాన్ని శ్రద్ధగా అధ్యయనం చేసి, నిజాయితీతోనూ, నిబద్ధతతోనూ దానికి సంబంధించి చేసే ఏ చర్చ అయినా, ఆ సిద్ధాంతాన్ని బలోపేతం చేయడానికి, మరింత పరిపుష్టం చేయడానికి దోహదపడుతుంది. అటువంటి చర్చ చేసేపాటిదా రంగనాయకమ్మ! అని, వెటకారంగా ప్రశ్నించడం, ఆమె చేసిన చర్చని 'మార్క్స్' మీద దాడిగా భావించడం పిడివాదం అవుతుంది తప్ప మరొకటి కాదు. లోకసంచారి మీద రంగనాయకమ్మ చేసిన వ్యాఖ్యల మధ్య 'కన్సిస్టెన్సి' లేదనే మరొకటి జనార్ధన్ రాశారు. ఆమె వ్యాఖ్యల మధ్యన ఉన్న 'ఇన్‌కన్సిస్టెన్సీ' గురించి ఆయన, తన ఉత్తరంలో ఎక్కడా వివరించలేదు. అలాంటి ప్రయత్నమే చేయకుండా 'కన్సిస్టెన్సీ' లేదనే ఒక ఊడ్చివేత వ్యాఖ్యానం చేస్తే, అది 'కంద్రీవాదం' అవుతుంది తప్ప, 'విమర్శ' కాదు. ఒక రచయిత మీద విమర్శ – ఆ రచయిత రాసిన – విషయానికే పరిమితమవ్వాలి. విమర్శకి ఉపయోగించే భాషలో సంస్కారం ఉండాలి. అక్షరంలో ఒకటి రాసి, దాని అంతర్యం మరొకటని బుకాయించే రచయితల్ని (ఉత్తరాల రచయితల్ని కూడా) నమ్మేందుకు పాఠకులేమీ మూర్ఖులు కారు. రంగనాయకమ్మ విమర్శకి, సరైన, సిద్ధాంతపరమైన జవాబు చెప్పలేని పలాయన వాదులు 'అందరూ' కలిసి చేసే బృందగానమే – 'ఆమె నోట్లో ఎవరు నోరు పెడతారు?' అనే ఆరోపణ. వికారమైన ఆ బృందగానానికి వంతపాడడం మినహా, జనార్దన్ తన ఉత్తరంలో చేసిన చర్చంటూ ఏమీలేదు. మార్క్స్ కాపిటల్‌ని అత్యంత సరళంగా, సులభంగా పరిచయం చేయడానికి, ఆమె చేసిన అద్భుతమైన కృషిగానీ, ఆమె రచనల్లోని మార్క్సిస్టు వెలుగునిగానీ చూసెందుకు అవసరమైన, సరైన 'దృష్టి' లోపించిన జనార్దన్‌లాంటి వాళ్లు 'గడ్డం పెంచుకున్నాడు, చేపలు తినమన్నాడు మార్క్స్' అని రాసిందనే చిల్లర ఆరోపణల ద్వారా చేసేదేమిటంటే 'చంద్రుణ్ణి చూపిస్తూంటే, చంద్రున్ని కాకా, చూపించే వేలును చూడడమే.'

**– పి. వర్మ,** బాపట్ల

*(కె. నరేంద్రమోహన్ తెలంగాణ మీద రాసిన వ్యాసం, లేఖ, వీక్షణం బ్లాగ్ మీద రాసిన వ్యాఖ్యలు వచ్చే సంచికలో)*

వీ

**www.veekshanam.wordpress.com మీద రాసిన వ్యాఖ్యలు**

*ఇంటర్నెట్‌లో బ్లాగ్ మీద జరిగే చర్చలలో వ్యాఖ్యాతల వివరాలు, స్థలాలు ఉండవు. దాదాపుగా అజ్ఞాత రచయితల వ్యాఖ్యల లాగ ఉంటాయి. ఆ అజ్ఞాతత్వం వల్ల మర్యాద పరిధులు దాటిన వ్యాఖ్యలు కూడా ఉంటాయి. వీక్షణం బ్లాగ్ మీద ఆ వ్యాఖ్యలు రాసినవి రాసినట్టుగా పోస్ట్ అవుతాయి గనుక అవి యథాతథంగానే ఇస్తున్నాం.*

*ఇది ఒక భయంకరమైన వన్‌సైడెడ్ వ్యూస్, హైలీ బయాస్డ్ మాగజైన్. యుఎస్ఎస్ఆర్, చైనా టైపులో జరిగే ఇండాక్ట్రినేషన్‌లా ఉంది. పచ్చి అబద్దాలు, సెలెక్టివ్ కోటింగ్. సిమీ లాంటి దేశద్రోహ మత సంస్థ మీద సింపతీ చూపిస్తున్నారంటే వీళ్ల మానసిక స్థితి, మైండ్ సెట్ అర్థమవుతున్నది.*

**– శ్రీరామ**

*ఓకె, శ్రీ శ్రీరామగారు, నీ ఉత్తరం చదవడం ద్వారా కుండ పోతే పోయింది, కాని కుక్క గుణం తెలిసిందన్నట్లుగా నీ మానసిక స్థితి, మైండ్ సెట్ ఎలాంటిదో అర్థమయింది. థాంక్యూ వెరిమచ్.*

**– నటాష**

*సెప్టెంబర్ సంచికలో తోలేటి జగన్మోహన్ గారి పుస్తకం పై రంగనాయకమ్మ విమర్శ చదివాను. తోలేటి గారి పుస్తకం నాకు దొరకలేదు. కాబట్టి చదవలేదు. అయితే రంగనాయమ్మ గారు రాసిన విషయాలు చదివితే నాకు కూడా తోలేటి రాసిన విషయాలపై అభ్యంతరాలు ఉన్నాయి. కాని నాయకమ్మ గారి విమర్శ తీరు అభ్యంతకరంగా ఉంది. ఇంటి పేర్లను పట్టుకొని బనాయించడం, పుస్తక శీర్షిక మీద ఈకలు పీకడం బాగాలేదు. నేనే ప్రపంచానికంతా నాయకమ్మను, దేనిమీదైనా, ఎలాగైనా ఈకలు పీకగలను. నన్ను ఎవరు ఏమీ అనొద్దు అన్నట్లు ఉంది. వరస. నేను కూడా ఇలా అనడం బాగా అనిపించకపోయినా అంటున్నాను. ఎందుకంటే విమర్శకూ, వ్యంగ్యానికీ కూడా ఒక పద్ధతి, హద్దు ఉండాలని ఆమెకు అర్థం కావాలనే అంటున్నాను.*

*తోలేటి పుస్తకంపై రంగనాయకమ్మగారి సమీక్ష చదువుతుంటే ఈవిడ గారు నిజంగానే మార్క్సిజాన్ని శాస్త్రీయ సోషలిజాన్ని నమ్మే రచయితేనా అని అనుమానం వస్తుంది. మొదట ఆమె రచనలు చదివే నేను మార్క్సిస్టును అయ్యాను గాని, మళ్లీ సోషలిజం వస్తుందనే దానిపై ఆమె వ్యంగ్యం, కామెంట్స్ చూస్తుంటే అలా అనిపిస్తుంది.*

**– నటాష**

*రంగనాయకమ్మ గారి సమీక్ష నాకు మొత్తం అర్థం కాలేదు. అర్థమయిన భాగంలో గతితర్కం కంటే శుద్ధ తర్కం, మెటాఫిజికల్ ధోరణి కనిపించింది. మార్క్సిజం ప్రాథమికంగా ఆచరణ శాస్త్రం. కాని, రంగనాయకమ్మ గారి సమీక్షకి ఆచరణలో జరుగుతున్నదానితో సంబంధం లేదు. కేవలం ఊహల నుండి పుట్టించిన విమర్శలు ఉన్నాయి. 69 పార్టీలు ఉంటే, 69 సామ్యవాదాలు ఉంటాయని రాశారు. రష్యా విప్లవంలో మూడు పార్టీలు ఉన్నాయి. మూడు సామ్యవాదాలు లేవు. పార్టీలు దేనిపాటికవే పనిచేయవు. వాటి మధ్య ఐక్యత, పోరాటాలు విభిన్న రూపాలలో జరిగి ఏదో ఒక మార్గం విజయం సాధిస్తుంది. లేదా, మొత్తం విప్లవం నాశనమవుతుంది. ఆంధ్రదేశంలో మార్క్సిజం ప్రచారానికి కృషి చేసిన వారు ఇలా రాయడం విచారకరం.*

**– నరేంద్రమోహన్**

వీ

## వరకట్న హత్యలు

దేశంలో జరుగుతున్న వరకట్న హత్యల గురించి నేషనల్ క్రైం రికార్డ్స్ బ్యూరో వెల్లడించిన వివరాలు దేశంలో వరకట్న దూరాచార తీవ్రతను తెలుపుతున్నాయి. 2012లో దేశవ్యాప్తంగా 8233 వరకట్న హత్యలు నమోదయ్యాయి. వరకట్న వేదింపుల కేసుల్లో 32 శాతం నిందితులకు మాత్రమే శిక్షలు పడుతున్నట్లు గణాంకాలు తెలుపుతున్నాయి. 1961లో వరకట్న నిషేధ చట్టం అమల్లోకి వచ్చింది. ఈ చట్టం అమలు లోపభూయిష్టంగా ఉందని జాతీయ మహిళా కమిషన్ చైర్‌పర్సన్ మమత శర్మ తెలిపారు. 'వరకట్న' కేసుల విచారణలో పోలీసులు అలసత్వం ప్రదర్శించడం వల్ల నిందితులు శిక్ష నుంచి తప్పించుకోవడానికి వీలుకలుగుతుందని సుప్రీంకోర్టు న్యాయవాది కామిని జైస్వాల్ తెలిపారు.

## నిర్భయ కేసులో దోషులకు ఉరి శిక్ష

ఢిల్లీలో డిసెంబర్ 16, 2012న 23 ఏళ్ల యువతిపై జరిగిన అత్యాచారం కేసులో ఢిల్లీలోని సాకేత్ కోర్టు అదనపు సెషన్స్ న్యాయమూర్తి యోగేశ్ ఖన్నా సెప్టెంబర్ 13 న తీర్పు వెల్లడించారు. ఐపిసి సెక్షన్ 376(2)(జి) – సామూహిక అత్యాచారం, 302 (హత్య), సెక్షన్ 120బి (నేరపూరిత కుట్ర) కింద నిందితులను దోషులుగా తేల్చారు. ఈ కేసులో ప్రధాన నిందితుడైన రాంసింగ్ జైలులో ఆత్మహత్య చేసుకోగా మిగతా నలుగురికి ఉరిశిక్ష విధించారు. హత్యానేరానికి ఉరి శిక్ష, అత్యాచారానికి యావజ్జీవ శిక్ష విధించారు. దోషులకు రు. 55 వేల చొప్పున జరిమానా కూడా విధించారు. మరణ శిక్షలతో మహిళలపై నేరాలు ఆగవని అమ్నెస్టీ ఇంటర్నేషనల్ స్పష్టం చేసింది. భారతదేశంలో మహిళలపై నేరాలను నిరోధించాలంటే మరణ శిక్షలకు బదులు సంస్కరణలు అమలు చేయాలంది.

## పిల్లి పురుషోత్తం మృతి

సామాజిక ఉద్యమకారుడు పిల్లి పురుషోత్తం (78) కలకత్తాలో ఇంటిపై నుండి పడడం వల్ల తలకు గాయమై ఆస్పత్రిలో చికిత్స పొందుతూ సెప్టెంబర్ 13న మృతిచెందారు. పురుషోత్తం డిసెంబర్ 27, 1935లో పాలకొండలో జన్మించారు. కలకత్తాకు వలస వచ్చి స్థిరపడ్డారు. జూట్ మిల్ కార్మికుడిగా పనిచేసి జూట్ మిల్లుల్లో జరుగుతున్న దోపిడికి వ్యతిరేకంగా పనిచేస్తున్న 'కనోరియా జూట్ మిల్లు సంఘం'లో పనిచేశారు. ఆయన పశ్చిమ బెంగాల్‌లో జరిగిన అనేక ఉద్యమాల్లో పాల్గొని కళాకారుడిగా, గాయకుడిగా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేశారు.

## ఒడిశాలో 13 మంది మావోయిస్టుల మృతి

ఒడిశాలోని మల్కన్‌గిరి జిల్లా సిలాకోట అటవీ ప్రాంతానికి సెప్టెంబర్ 14న కూంబింగ్ కోసం వెళ్లిన పోలీసులకు మావోయిస్టులకు మధ్య కాల్పులు జరిగాయి. ఈ కాల్పుల్లో 13 మంది మావోయిస్టులు మృతిచెందారు. పోడియా గ్రామ సమీపంలో మావోయిస్టులు ఉన్నట్లు సమాచారం అందడంతో ఆ ప్రాంతాన్ని ఎస్‌పి అఖిలేశ్వర్ సింగ్ ఆధ్వర్యంలో పోలీసులు చుట్టుముట్టి కాల్పులు జరపడంతో 13 మంది నక్సల్స్ మృతిచెందారని ఒడిశా డిజిపి మీడియాకు తెలిపారు.

## ఢిల్లీ హైకోర్టు న్యాయమూర్తిగా రమణ

ఢిల్లీ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా జస్టిస్ నూతలపాటి వెంకట రమణను నియమించారు. సెప్టెంబర్ 2న ఢిల్లీలోని రాజ్‌నివాస్‌లో లెఫ్టినెంట్ గవర్నర్ నజీబ్ జంగ్ వెంకటరమణతో ప్రమాణ స్వీకారం చేయించారు. ఈ కార్యక్రమానికి ఢిల్లీ ముఖ్యమంత్రి షీలాదీక్షిత్, సుప్రీం కోర్టు సీనియర్ న్యాయవాదులు, ఢిల్లీ హైకోర్టు న్యాయమూర్తులు, న్యాయనిపుణులు హాజరయ్యారు. ఢిల్లీ తాత్కాలిక చీఫ్ జస్టిస్‌గా ఉన్న బదర్ స్థానంలో వెంకటరమణను నియమించారు.

## వంజారా లేఖ

పలు బూటకపు ఎన్‌కౌంటర్ల కేసుల్లో ఆరేళ్లుగా జైల్లో ఉన్న ఐపిఎస్ అధికారి డి.జి వంజారా గుజరాత్ హోంశాఖ అదనపు ప్రధాన కార్యదర్శికి సెప్టెంబర్ 1న రాజీనామా లేఖ పంపారు. బూటకపు ఎన్‌కౌంటర్ల కేసుల్లో జైల్లో ఉన్న అధికారులందరూ ప్రభుత్వ విధానాలనే అమలు పరిచారన్నారు. ఈ ఎన్‌కౌంటర్లు బూటకంగా పరిగనించిన పక్షంలో అలాంటి విధానాలను రూపొందించిన ప్రభుత్వానిదే ప్రధాన బాధ్యత అని, అందుకు అధికారంలో ఉన్న ప్రభుత్వానికి శిక్ష విధించాలని అన్నారు. నకిలీ ఎన్‌కౌంటర్లకు పాల్పడిన ఆరోపణలపై గుజరాత్‌లో ఇప్పటికి 32 మంది ప్రభుత్వ అధికారులు జైలులో ఉన్నారు.

## ముజఫర్‌నగర్‌లో మత హింస

ఉత్తరప్రదేశ్‌లోని ముజఫర్‌నగర్‌లో జరిగిన మతకలహాల కారణంగా 40 మంది ప్రాణాలు కోల్పోయారు. ముస్లిం, హిందువుల మధ్య మత విద్వేషాలను రెచ్చగొట్టడానికి బిజెపికి చెందిన శాసనసభ్యుడు, ఇద్దరు హిందూ యువకులను ముస్లింలు చంపుతున్నట్లుగా ఉన్న నకిలీ వీడియో టేపును ఫేస్‌బుక్ ద్వారా వ్యాప్తి చేస్తున్నారనే కారణంపై పోలీసులు అరెస్ట్ చేశారు. ఈ కేసులో 229 మందిని అరెస్టు చేసి, ఎఫ్.ఐ.ఆర్‌లు నమోదు చేశారు.

## ఆర్‌బిఐ గవర్నర్‌గా రఘురామ్ రాజన్

భారత రిజర్వు బ్యాంకు (ఆర్‌బిఐ) 23వ గవర్నర్‌గా రఘురామ్ రాజన్ సెప్టెంబర్ 4న బాధ్యతలు చేపట్టారు. రఘురామ్ రాజన్ విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ స్వల్పకాల పరిమితిలో తన లక్ష్యాలను, ప్రణాళికను ప్రకటించారు. వృద్ధికి ఊతం ఇవ్వడానికి, సమ్మిళిత వృద్ధి సాధనకు తాను ప్రాధాన్యత ఇస్తానని తెలిపారు.

## భూసేకరణ బిల్లు

భూసేకరణ బిల్లుకు ఆగస్టు 29న పార్లమెంట్ ఆమోదం తెలిపింది. బలవంతపు భూసేకరణను అరికట్టి, భూమి కోల్పోయేవారికి న్యాయమైన పరిహారం లభించేలా చేయడం ఈ బిల్లు ముఖ్య ఉద్దేశం. బ్రిటిష్ హయాంలో 120 ఏళ్ల కిందటి (1894) చట్టం స్థానంలో ఇది అమలులోకి రానుంది. ఈ బిల్లును గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి జైరాం రమేశ్ 'భూ సేకరణ, పునరావాస-పునపరిష్కార బిల్లు-2012'ను సభలో ప్రవేశపెట్టారు. బిల్లుకు అనుకూలంగా 216 మంది ఓటువేయగా, 19 మంది వ్యతిరేకించారు. వీ

## మలాలాకు ఆమ్నెస్టీ అవార్డు

ఆమ్నెస్టీకి చెందిన అంబాసిడర్ అఫ్ కన్‌సైన్స్ (ఆత్మ వివేచన దూత) అవార్డును 2013 సంవత్సరానికి గాను పాకిస్తాన్ విద్యాహక్కుల ప్రచారకర్త మలాలా యూసుఫ్‌జాయ్, మానవ, సామాజిక హక్కుల కార్యకర్త హేరీ బెలాఫాంటేతో కలిసి పంచుకున్నారు. తమ జీవితాంతం మానవ హక్కుల కోసం పోరాడే వ్యక్తులను గుర్తించి మానవ హక్కుల గ్రూపు ఇచ్చే అత్యున్నత గౌరవ పురస్కారం ఇది. ఐర్లాండ్‌లోని డబ్లిన్‌లో సెప్టెంబర్ 17న వారికి ఈ అవార్డును అందజేశారు.

## ఖాదర్ మొల్లాకు ఉరిశిక్ష

1971లో బంగ్లాదేశ్ విముక్తి పోరాటంలో జరిపిన యుద్ధ నేరాలకు, ఘోరాలకు, దారుణాలకు గానూ జమాత్–ఇ–ఇస్లామి నేత అబ్దుల్ ఖాదర్ మొల్లాకు మరణశిక్ష విధిస్తూ బంగ్లాదేశ్ సుప్రీంకోర్టు సెప్టెంబర్ 17న తీర్పునిచ్చింది. గత ఫిబ్రవరి 5న యుద్ధ నేరాల ట్రిబ్యునల్ మొల్లాకు యావజ్జీవ శిక్ష విధించింది. దానిపై సుప్రీంకోర్టుకు వెళ్లగా తనను నిర్దోషిగా విడిచిపెట్టాల్సిందిగా మొల్లా చేసిన విజ్ఞప్తిని సుప్రీంకోర్టు కొట్టివేస్తూ, అనేక ఘోరాలకు, అకృత్యాలకు పాల్పడిన యుద్ధ నేరస్తుడికి మరణశిక్ష సరైన శిక్ష అంటూ ప్రధాన న్యాయమూర్తి మొజమ్మల్ హుస్సేన్ నేతృత్వంలోని ఐదుగురు సభ్యుల ధర్మాసనం తీర్పు ఇచ్చింది.

## గ్రీస్‌లో సార్వత్రిక సమ్మె

గ్రీస్‌లో ఆర్థిక సంస్కరణల పేరుతో ఉద్యోగాల్లో కోతలు విధిస్తున్నారని నిరసిస్తూ ఉద్యోగులు సెప్టెంబర్ 20, 21 తేదీల్లో రెండు రోజుల పాటు సార్వత్రిక సమ్మె చేశారు. రాజధాని ఏథెన్స్, రెండవ పెద్ద నగరమైన థెస్సాలోంకి నగరాల్లో వేలాది మంది ఉద్యోగులు ప్రదర్శనలు నిర్వహించారు. జర్నలిస్టులు కూడా సంఘీభావంగా ఈ సమ్మెలో పాల్గొన్నారు. ఆరు లక్షల మంది ఉన్న ఉద్యోగులను కుదించేందుకు జరుగుతున్న యత్నాలను కార్మిక సంఘాలు ప్రతిఘటిస్తున్నాయి. ఇప్పటికే ఆర్థిక మాంద్యంతో ఛిద్రమైన బతుకులు ఈ చర్యల వల్ల మరింత దిగజారుతాయని పేర్కొన్నారు.

## మదురో చైనా పర్యటన

వెనిజులా అధ్యక్షుడు నికొలస్ మదురో చైనాకు వెళ్లేందుకు గానూ ప్యూర్టోరికా మీదుగా ప్రయాణించడానికి అమెరికా అనుమతించింది. ఈ ఉదంతంలో అమెరికా వైఖరిని ప్యూర్టోరికా కమ్యూనిస్టు పార్టీతో సహా మూడు పార్టీలు తీవ్రంగా ఖండించాయి. మదురో సెప్టెంబర్ 21, 22 తేదీల్లో చైనాలో పర్యటించనున్నారు. ముందుగా ప్యూర్టోరికా గగనతలం నుంచి వెళ్లడానికి మదురోకు అనుమతి నిరాకరించిన అమెరికా, తీవ్ర నిరసన వ్యక్తం కావడంతో హడావిడిగా అనుమతి ఇచ్చింది. ఈ వైఖరిపై ప్యూర్టోరికా తీవ్ర నిరసన తెలిపింది. చైనా పర్యటన సందర్భంగా ఆ దేశంతో ఇరుదేశాల మధ్య ద్వైపాక్షిక సహకారానికి సంబంధించిన వివిధ రంగాలను, అంశాలను పరిశీలించారు.

## కెన్యా షాపింగ్‌మాల్‌లో కాల్పులు

కెన్యా రాజధాని సెప్టెంబర్ నైరోబీలోని ఓ షాపింగ్ మాల్‌లో21న ప్రవేశించిన సాయుధ ఉన్మాదులు దాదాపు నాలుగు రోజుల పాటు మాల్‌లో విధ్వంసం సృష్టించారు. ఈ క్రమంలో 61 మంది పౌరులను, ఆరుగురు సైనికులను కాల్చి చంపారు. వెస్ట్‌ల్యాండ్స్ సమీపంలోని వెస్ట్‌గేట్ షాపింగ్‌మాల్‌లో ప్రవేశించి అక్కడ ఉన్న పౌరులను నిర్బంధించారు. సైనికులతో జరిగిన పోరులో ఐదుగురు ఉగ్రవాదులు మరణించారనీ, మరో పదకొండు మంది అనుమానితులను అదుపులోకి తీసుకున్నారని భద్రత బలగాలు తెలిపాయి. ఈ దాడిలో 175 మందికి పైగా గాయపడ్డారు. ఈ దాడిని ఖండిస్తూ కెన్యా అధ్యక్షులు ఉహులు కెన్యాట్ట సెప్టెంబర్ 25 నుంచి మూడు రోజుల పాటు జాతీయ సంతాప దినాలుగా ప్రకటించారు.

## బోసిలాయ్‌కి యావజ్జీవ ఖైదు

చైనా కమ్యూనిస్టు పార్టీ పొలిట్‌బ్యూరో మాజీ సభ్యుడు, మాజీ రైల్వే మంత్రి బోసిలాయ్‌కి ఈశాన్య చైనాలోని షాన్‌డాంగ్ ప్రావిన్స్‌కు చెందిన ప్రత్యేక కోర్టు యావజ్జీవ ఖైదు శిక్ష విధించింది. పదవిలో ఉండగా అవినీతికి పాల్పడినట్లు వచ్చిన ఆరోపణలపై సుదీర్ఘ విచారణ జరిపిన న్యాయస్థానం ఆయన్ను అన్ని నేరాల్లోనూ దోషిగా నిర్ధారించింది. తన పదవీ కాలంలో బోసిలాయ్ రెండు కోట్ల యువాన్లు (దాదాపు ఇరవై కోట్ల రూపాయలు) పైగా లంచాల రూపంలో స్వీకరించినట్లు విచారణలో నిర్ధారించింది. లంచం అంగీకరించిన నేరానికి యావజ్జీవిత ఖైదు, మోసగించిన నేరానికి 15 ఏళ్ల జైలు శిక్షను విధిస్తూ రెండింటినీ ఏకకాలంలో అనుభవించాలని ఆదేశించింది. ఈ తీర్పుపై షాన్‌డాంగ్ ఉన్నత న్యాయస్థానంలో అప్పీలు చేసుకునేందుకు న్యాయమూర్తి బోకు పదిరోజుల గడువిచ్చారు.

## జర్మనీలో మెర్కెల్ విజయం

జర్మనీ పార్లమెంట్ (బుండెస్టాగ్)కు సెప్టెంబర్ 22న జరిగిన ఎన్నికల్లో ప్రస్తుత అధ్యక్షురాలు ఏంజెలా మెర్కెల్ విజయం సాధించారు. ఎన్నికల్లో దాదాపు 6.1 కోట్ల మంది ఓటు హక్కును వినియోగించుకున్నారు. మొత్తం 34 పార్టీలు పోటీలో నిలిచాయి. మొత్తం 630 సీట్లకు గానూ 316 రావాల్సి ఉండగా మెర్కెల్ నేతృత్వంలోని క్రిస్టియన్ డెమోక్రటిక్ యూనియన్ లేదా క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీకి 311 సీట్లు రాగా సోషల్ డెమోక్రటిక్ పార్టీకి 192 సీట్లు లభించాయి. వామపక్షాలకు 64 సీట్లు, గ్రీస్ పార్టీకి 63 సీట్లు వచ్చాయి. మెర్కెల్‌కి చెందిన కన్జర్వేటివ్‌లు గెలుపొందినట్లు అధికార వర్గాలు ప్రకటించాయి. అయితే సంపూర్ణ మెజారిటీ మాత్రం లభించలేదు.

## బంగ్లాదేశ్‌లో నిరసనలు

బంగ్లాదేశ్ రాజధాని ఢాకాలో సెప్టెంబర్ 21న యాభై వేల మందికి పైగా దుస్తుల తయారీ కార్మికులు నిరసన ప్రదర్శన నిర్వహించారు. ప్రపంచంలో ఎక్కడా లేనంత తక్కువ వేతనాలు, ప్రమాదకరమైన పని పరిస్థితులను నిరసిస్తూ వారు ప్రదర్శలు చేశారు. ప్రదర్శనపై పోలీసులు రబ్బర్ బుల్లెట్లు, బాష్పవాయుగోళాలు ప్రయోగించడంతో ఎంతో మంది కార్మికులు గాయపడ్డారు. బంగ్లాదేశ్ దుస్తుల పరిశ్రమ ప్రపంచంలోనే రెండవ స్థానంలో ఉంది. దాదాపు 80 శాతం వార్షిక ఉత్పత్తులు ప్రపంచ దేశాలకు ఎగుమతి అవుతాయి. దాదాపు నలభై లక్షల మంది కార్మికులు పనిచేస్తున్నారు. వారిలో 80 శాతం మంది గ్రామీణ మహిళలే. వీరికి నెలకు 38 డాలర్లు వేతనంగా ఇస్తున్నారు. కార్మికులు తమ వేతనాన్ని వంద డాలర్లకు పెంచాలని సుదీర్ఘ కాలంగా డిమాండ్ చేస్తున్నారు.

## పాకిస్తాన్‌లో భూకంపం

పాకిస్తాన్‌లోని బెలూచిస్తాన్ ప్రావిన్స్‌లో సెప్టెంబర్ 24న భూకంపం వచ్చింది. దీని తీవ్రత రిక్టర్ స్కేల్‌పై 7.7గా నమోదైంది. ఈ భూకంపం ధాటికి దాదాపు నాలుగు వందల మంది చనిపోయారు. వేలాదిగా గాయపడ్డారు. భారీ ఆస్తినష్టం సంభవించింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 ఆగస్ట్ నుండి 31 ఆగస్ట్ 2013 వరకు 11 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య - 1394)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 8 | - | 23 | 22 | 16 | 12 | 8 | - | - | - | - | 1 | 2 | 20 | 31 | - | - | - | 3 | 8 |
| మహబూబ్‌నగర్ | - | 4 | 2 | 13 | 17 | 4 | 9 | - | - | 4 | 14 | 16 | 24 | 15 | 52 | 3 | - | - | - | - | - |
| హైదరాబాద్ | - | - | - | 5 | 17 | - | - | - | - | 1 | 4 | 8 | - | - | 22 | 15 | - | - | - | 16 | - |
| మెదక్ | - | 2 | - | 11 | 13 | 3 | 7 | 2 | 1 | 2 | 1 | 5 | 1 | 6 | 32 | 37 | - | - | - | - | - |
| నిజామాబాద్ | - | - | - | 6 | 13 | - | - | 4 | - | 6 | - | 5 | 4 | 8 | 17 | 13 | - | - | - | - | - |
| కరీంనగర్ | 1 | 9 | 10 | 12 | 21 | 8 | 7 | 4 | 5 | 7 | 3 | 5 | 4 | 5 | 40 | 17 | - | - | - | - | 10 |
| రంగారెడ్డి | 1 | 6 | - | 10 | 16 | 7 | 22 | 4 | 8 | 7 | 5 | 7 | 1 | 5 | 40 | 15 | - | - | - | - | - |
| వరంగల్ | - | 6 | 0 | 3 | 4 | 7 | 6 | 8 | - | - | - | - | - | 8 | 20 | 5 | - | - | - | - | 7 |
| ఖమ్మం | - | - | - | 11 | 10 | 7 | 20 | 4 | - | 2 | 3 | 3 | 1 | - | 19 | 16 | - | - | - | - | 1 |
| కర్నూలు | - | 2 | 1 | 6 | 8 | 5 | 3 | 9 | 4 | 6 | 2 | 1 | 7 | 5 | 12 | 14 | - | - | - | - | 2 |
| విజయనగరం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| శ్రీకాకుళం | - | - | 1 | - | 9 | 3 | 8 | - | 1 | 2 | - | - | 2 | 7 | 35 | 11 | - | - | - | - | 3 |
| నెల్లూరు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | 1 | - | - | 7 | 11 | - | - | - | 2 | 12 | 1 | 1 | 20 | 6 | 28 | 18 | - | - | - | 6 | - |
| **మొత్తం** | **4** | **37** | **14** | **107** | **161** | **60** | **94** | **43** | **21** | **49** | **33** | **51** | **65** | **67** | **337** | **195** | **-** | **-** | **-** | **25** | **31** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 50 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తమాపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య - ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని | | |
| పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| రాజ్యం - సంక్షేమం | కె. బాలగోపాల్ | 100 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం-మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు - రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు - అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు - మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దళిత | కె. బాలగోపాల్ | 120 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

## సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి మిత్రులు | 150 |

## చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | రు. 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| హక్కుల బాటసారి | బుర్ర రాములు రచనలు | 50 |
| నిగాహ్ | కె. బాలగోపాల్ వ్యాస సంకలనం | 200 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| టాల్‌స్టాయ్ పరిచయ వ్యాసాలు | యన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు | 30 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

## కథ - నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| రుదాలి | మహాశ్వేతాదేవి | 45 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగాయి | 100 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| అజేయుడు | అలెగ్జాండర్ ద్యుమా | 160 |
| ఘంటారావం | విక్టర్ హ్యూగో | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh** | **(1956-2006)** | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunuri Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunuri Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunuri Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunuri Bharathi | 150 |
| **On Education** | Mudunuri Bharathi, R.S. Rao | 100 |
| **Understanding Maoists** | N. Venugopal | 300 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 147 - October 2013 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 29/9/2013 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao